## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050019184

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.
A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name
A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year
1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject
Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language
Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ ర స్తు.

శ్రీపరబ్రహ్మణేనమః.

శ్రీమత్పరమేశ్వర లీలావిచిత్ర ప్రపంచసేవా పాత్ర
శ్రీమద్ద్వారపురెడ్డి పాపినాయకపుత్ర
నిఖిలబుధజనవిధేయ
యప్పలనాయక నామధేయ ప్రణీతంబైన

# శ్రీమదాంధ్ర మను ధర్మశాస్త్రము.



ఇది,

కృష్ణామండల ప్రసిద్ధ సత్యవోలు గ్రామనివాసులును
శ్రీమద్గొప్ప వెలమకుల పవిత్రులునగు

ఘంటా అప్పలనాయుడు, యీ సన్యాసినాయుడు, యీ సీతా
నాయుడు, యీ చినఅప్పలనాయుడు, యీ పెదసన్యాసి
నాయుడు, కోట అప్పలనాయుడు, వేగురెడ్డి జోగి
నాయుడు, వంగపండు నరసింహనాయుడు,
రెంభ్వాంగ పాపనాయుడు, కరణము
తమ్మయనాయుడు, నరసిపల్లి
అప్పలనాయుడు,

మొదలగు నాంధ్రప్రముఖుల ధనసాహాయ్యంబున
ఏలూరు, రామా ముద్రాక్షరశాలయందచ్చొత్తింపఁబడియె.

మొదటికూర్పు 800 ప్రతులు



రామా ముద్రాక్షరశాల, ఏలూరు.

1917

*Copyright.*] [వెల రు 2—0—0.

# విషయసూచిక.

:o:



MADRAS

## ఏకాదశోఽధ్యాయము.

పుట.



## ద్వాదశోఽధ్యాయము.



## త్రయోదశోఽధ్యాయము.



## చతుర్దశోఽధ్యాయము.



## పంచదశోఽధ్యాయము.

# అభిప్రాయములు.

:o:

మ॥రా॥రా॥ శ్రీయుత దుప్పూరి అన్నయకవిగారు.

ఉ. శ్రీయుతమూర్తియో సుకవి సింహ మహాకవితావిలాస వి
ద్యాయుతనీమహాస్మృతి ముదంబలరారఁగ బొచ్చ కూర్మరావ్
నాయుడుగారు గౌరవమునన్ ననుజూడఁగనిచ్చినారు నే
డాయకదానిజూచి బహుభంగుల చర్చయొనర్చినట్టి దా
హా యిపుడబ్బెమాకు సకలాంధ్ర మహాకవి చక్రవర్తి నే
డాయనఘుండువల్కిన మహాకృతులన్ బఠియించు భాగ్యమం
చేయెడలేక నీజగమునెల్లవరించినయట్లు పొంగి నే
జేయఁగఁబూనితిన్ నతులుజెచ్చెరఁగైకొని సంతసింపు నీ
తోయమువారలెల్ల పరితోషముతో నవతారపూరుషుం
డీయనయంచు నిన్ను గణియించుచుబెంపుగనున్నవారు నీ
వేయెడనుంటివైరొ యెరుగ మింతయునైనను "పోని"దాన నే
మాయెనుగౌరవింతు మిపుడాంధ్రులమెల్లర మొక్కుమ్రోలఁగా
నీయశమిట్టి సంస్తవము నెమ్మిగ్రహించి మమున్ కృతార్థతా
న్యాయపథంబునందు ననయంబునునడ్పుము వేఁడయెన్న దున్
సేయకుమన్నయాఖ్య కవిచిత్తము నింపుగవ్రాసెనిప్పుడీ
గేయతరార్థపద్యమును కేలుమొగిడ్చి వినమ్రశీలుడై.

మ॥రా॥రా॥ బ్రహ్మశ్రీ నశిష్టశాస్త్రిగారు.

చ. సుమహితబుద్ధిసాగర యశోధన సత్కవిసార్వభౌమ పే
ర్మిమెయిమహాకవిత్వవిధి మీరురచించినయాంధ్ర ధర్మశా
స్త్రము ముదమారజూచితి పదంబులపొందికయర్థగౌరవం
బుమరియులక్షణంబును నమోఘ మహారచనావిలాస మా
ర్గమును విశిష్టసౌష్ఠవము గౌరవమేమని మెచ్చువాడ వ
ర్ణముసెడి దుఃఖితాత్మయగు నాంధ్రసరస్వతి జేసికొన్న పు

ణ్యముకోలదిక మహాబుధజనంబులకెల్లను నీడగాగ త
థ్యము కవిశిష్టజాతి నవతారము బొందితి వెవ్వరెన్ని దూ
ష్యములు వసూయతోడ ననునాడిన నాడగనిమ్ము గాని నే
మిము సభలందు మాటికిని మిక్కిలి జాటకమాన "నాంధ్రలో
కము వికసింపజేయగ నగణ్యచరిత్రుడు శూద్రవర్యు డా
ర్యమత విశిష్టుడొక్కడు కరంబెసగ న్నవతారమొందె న
య్యమల గుణాతిరేకు మనమందర మర్థులమై భజింతు మం
చు" మహితమూర్తినే నిచట జుల్కగనాడిన మాటలెల్ల దో
షములుగజూడకేమనిన సొంపుగ సత్కవిచక్రవర్తివై
తమరుదయించినట్టికి సదైర్యము మాకత డెల్ల శాస్త్రముల్
విమలపురాణముల్ కథలు వేగరచించియొసంగునన్న గ
ర్వమున వశిష్ఠశాస్త్రియను బ్రాహ్మణవర్యుడ రాజరాట్ప్రబం
ధము విరచించి మెచ్చిసిన ధన్యుడ నప్పల నాయకాగ్రణీ
మిము వినుతింపబూనిన సమ్మతితరాద్యభిమానశీలుడన్.

మ॥రా॥రా॥ బ్రహ్మశ్రీ శ్రీ. వి. గురుమూర్తి, నే. కృష్ణశాస్త్రి,
వే. నలమహర్షి కవి, కొ. తిమ్మనశాస్త్రిగార్లు.

చ. అసమచరిత్ర సత్కవిజనాగ్రణి యప్పలనాయకోత్తమా
"వినయము జూపి మిమ్ము తగ వేడెద వాదము సేయనొల్ల లో
కనుతుడు మద్గురుండొకడు కాదనినంతన నేమినాయె వా
నినెదిరి వాదమాడి కలహింపక మాయుని నొక్కిచెప్పగా
వున దయజూడగా వలయు భూనుతులారి" యటంచు నీవు వ్రా
సిన యొకలేఖయందు గని జెందితి మెంతయు గౌరవంబు నీ
వినయ విశిష్టగౌరవ పవిత్ర చరిత్రము వ్రాసి కెక్క నే
మని వినుతించువారము మహాత్మ భవత్కృతిసామ్యలక్షణం
బును రచనావిలాసమును భూరితరార్థగరిష్ఠ చాతురీ
ఘనతయు నాంధ్రవాణి తనగర్భము చల్లగ నిన్ను గాంచి మున్

జనినవిలాససంపదయు సౌష్ఠవముం బరిపూర్ణవర్ణశో
భనమును వాసియుం బరమపాత్రత నేడు ధరింపగాగలా
దనినను వింతగాదు సుగుణాకర మాయొకవిన్నపంబు గై
కొని మన రామకృష్ణగురు గొల్చుచు వేగరచింపుమాంధ్ర భా
షనఖిలసత్పురాణములు శాస్త్రములుం గుణమూర్తి కృష్ణశా
స్త్రినలమహర్షిసత్కవియు తిమ్మనశాస్త్రియు నల్వురాంధ్ర శా
స్త్రసికరవేదులుత్తమమతంబున దేవుడు బ్రోచుగాక మా
యనఘు మహాకవిత్వనిధి యప్పలనాయకుఁడంచు బ్రో దీ
వనలిడుచున్నవార లనివార్యకుతూహల ముప్పతిల్లగా
సునిశిత బుద్ధిసాగర యశోధనపండిత లోకసన్నుతా.

మ॥రా॥రా॥ బ్రహ్మశ్రీ వేదము లక్ష్మణశాస్త్రిగారు.

చ. "వినుత చరిత్రులార పృథివీసురసత్తములార లేనిపో
నినెరసులెన్ని నన్ను కరుణించుమని చేయకు డయ్యలార దా
సునిగ్రహించి మీరలనసూయత బాత్రము పెంపుజేసి దీ
వనలిడు డేనుకానన నివాసుడనై కరము న్ముదేశసే
వనమొనరింపబూనితి నవశ్యము నిర్మలభక్తిలోకపా
వనుడగు రామకృష్ణ గురువర్య పదాబ్జములాశ్రయించి నే
చినకొలదిం గృతుల్ దగరచింపుచునం" చొకలేఖ మీరువ్రా
సిన వినయార్ద్రసంభృత విశిష్టవచస్సరణిన్ ముదంబునన్
గనకవిసార్వభౌమ త్రిజగన్నుత పుణ్యచరిత్ర నిస్సమం
బెనసెడినిన్నుబోలు మహనీయునిగన్ జెడనాడనెట్లొకో హీ
నునకును నోరువచ్చునె మనోహర సత్కవితావిలాస భూ
తినెగడి భవ్యమైన మనతిక్కనపెంపును నూత్నమై లియున్
మనువు సధర్మమార్గములు మాకు దయామతిజూపినాడ వీం
కను బహుసత్పురాణములు గాథలు శాస్త్రము లిత్తునంచు కం
కణముధరించినావు బలుకష్టము లోర్చి నిరంతరంబు కా

ననమువసింపుచుండి భువనంబుహితంబుగ నిన్నువంటి ధ
న్యునిగని యాంధ్రవాణి తననూత్నవిలాసము పెంపుజేసి
యని వికసింపుచున్నదదె యప్పలనాయక పండితేంద్ర నే
వినతులుజేతు నైగానుము వేదము లక్ష్మణశాస్త్రి నాకరం
బెనసిన బ్రాహ్మణుండ సుకవీంద్రవిధేయుడ పాత్రభూతుడన్

నైవప్రార్థనము.

క. మతముసెడి దొరగిన మను
స్మృతిపూర్వమతప్రసిద్ధిజెందించిన యు
న్నతవిద్యాసాగరు సా
యతమతిరక్షింపుమీశ యప్పలనాయున్.

క. అభినవసుకవిబ్రహ్మన్
త్రిభువనవిదితున్ కవిత్వ దీక్షితుననఘున్
శుభచరితపరాత్పరమా
కభిమతముగ నెపుడుబ్రోవు మప్పలనాయున్.

క. త్రిజగద్ధితముఁగసుకవి
ప్రజములు వినుతింప సత్పురాణంబులు పెం
పుజెలంగించెడిఘను నాం
ధ్రజుబ్రోవుముదేవ యప్పనాయకపర్యున్.

క. ఏయెడరును జేయకమా
నాయకకవిసార్వభౌము నకుసత్కృప దీ
ర్ఘాయువు తేజము పెంపును
శాయక దయచేసిబ్రోవు పరమేశహరీ.

క. భువినాంధ్రకవిత్వము పెం
పువెలయ కేయంగ నేను బుట్టించితి నీ
వెవనినతనినప్పల నా
యువరిష్ఠత్రోవుదేవ యోగ్యత వెలయన్.

క. ఏఘనుకవితామృతము న
మోఘంబుగ చెవులనాని బుధసంఘంబుల్
శ్లాఘింతురతని బ్రోవు మ
హాఘహరణ దేవదేవ యప్పలనాయుఁ.

క. శ్రీ గామకృష్ణకురుసే
వారంభము జేసి లోకమునిశెంబుదగఁ
నారాధించెడిసుకవి మ
హారచయితుఁ బ్రోవుదేవ యప్పలనాయుఁ.

క. వేదములక్ష్మణశాస్త్రి స
మాదరము దగఁ రచించె సప్తకముకవి
తోన్నదయు నప్పలనాయుఁ
మోదంబుననీశ్వరుండు ప్రోవుతయనుచుఁ.

మ. రా. రా. బ్రహ్మశ్రీ-వే శ్రీమహాపాదశాస్త్రిగారు.

ఉ. వేదమతంబునై భువనవిశ్రుతమైన మహామనుస్మృతిన్
మోదముతోడ దెల్గున సమోఘగరిష్ఠతనిచ్చినావు మా
కాదిమహాకవీంద్రుల మహాపథమున్ వెలయించి భవ్యకీ
ర్త్యోదయభంగి నీమతము యోగ్యము నీకవితావిలాసమున్
సాదుతరంబు లక్షణ ప్రశస్తము శుభ్రము శబ్దభాసురం
బాదరణీయ ముజ్జ్వలతరార్థము జెప్పగనేల నీమనం
బేదిఘటింపఁబోవు నది యెంతయు పావనమంచు నిత్య మా
హ్లాదము పేర్మి సద్బుధజనంబులు వల్కఁగ విందు మిట్టిచో
నీదెసనిచ్చ సేయని విహీనుడుగల్గునె యెందునైన వి
ద్యాదయితాగచింపుము పదంపడి వాసిగలట్టి శాస్త్రముల్
ద్వాదశ సత్పురాణములు నారక వేములపాటి శ్రీమహా
పాదముశాస్త్రి నామకుడ పండిత యప్పలనాయమెచ్చితిన్.

మ. రా. రా. బ్రహ్మశ్రీ నల్లమా-నాచనశాస్త్రిగారు.

ఉ. చూచితి నీమహాస్మృతిని సొంపుగ సత్కవిసార్వభౌమ వి
ద్యా చతురాననా సకలశాస్త్రరహస్యంబులు జెప్పగాబడెన్
దాచక దానియందధికమంతంబుగ మించినవారికెల్ల జే
చాచిన పండితుల్ కనను సామ్యము జేయక మానదిట్టిచో
నీచుడ నెట్లు నిన్ను మహనీయుని వాంఛల హోనగాని నే
నేచినయంతకున్ నిను గణించెద బల్కురతోడ జెప్పెదన్
జూచెడివారి నెల్ల పరితోషిత జేసెడివాడ నల్లమా
నాచనశాస్త్రినామకుడ సప్పలనాయక నీకు మిత్రుడన్.

మ. రా. రా. శ్రీయుత [illegible]. శివరామయ్యగారు.

మ. కవిచూడామణి నీమహాస్మృతి జగత్కల్యాణసంపద్ధర్మ మా
ర్గవిశిష్టంబుగ నొప్పు మున్నయది బంగారంబు ప్రోవట్లు నీ
కవితామాధురి సెప్పగా తరమె ప్రాజ్ఞస్తవ్యమాత్రంబు సా
ష్టవసద్భార విజృంభితంబు బహుళలక్ష్యంబుల్లసల్లక్షణం
బువినూత్నాయతి సద్రసోచితము సంపూర్ణస్ఫురద్వాసనా
ప్రవిలాసంబున యట్టులుంటె ధయదాక్ష్యంబున నిల్చి బం
ధువియోగంబున నోర్చి దేశహితముల్ బొంగారుచున్ మెచ్చితిన్
శివరామాహ్వయ నామధేయుడ భవచ్ఛ్రేయో విశిష్టాత్ముడన్.

మ. రా. రా. బ్ర. యో. పార్వతీకాంతముగారు.

ఉ. అంతటి రామకృష్ణగురు నాశ్రయమొంది మహోగ్రశాసనా
భ్యంతరమందు నిల్చి భువనైకహితంబు నిరంతరంబు సు
స్వాంతమునందు గోర్కి నిలిపి సారెకు యోగము పెంపుజెంది యే
కాంతము సత్కృతుల్ ప్రవిమలాంధ్రమున న్విరచింపబూనితే
శాంతసముద్ర నీదు మనుశాస్త్రము మేము గ్రహించినారమో
సంతతయోగనిష్ఠతర చాలను నీయశంబు పెంపు శ్రీ
కాంతుడు నిన్ను బ్రోచెడిని గావుత యాంధ్ర జనంబులందరున్

సంతసమారయో విబుధసత్తమ యోకవిసార్వభౌమ యే
వింతలు లేవు నీచరిత వినుతులు పండువుగాగవిందు మ
శ్రాంతము నప్పనాయకవరా భవదీయసఖుండ పార్వతీ
కాంత సమాహ్వయుండ మృదుగానకథా రచనావిలాసుడన్.

మ. రా. రా. శ్రీ. మ. శృంగారపుకోట రాయుడు,
కా. బుచ్చినృసింహరాయుడుగార్లు.

ఉ. సారవిచారయో విబుధసత్తమ యోకవిచక్రవర్తి సిం
గారిన వేడ్కనీదగు మహాస్మృతిచూచితి మిష్టసర్వసా
ధారణమార్గముల్ వెదకు తత్కవికోటికినెల్లభాత్యల
కారముగాదె నీకవిత గానని వారికినైన సత్పథం
బారయజూపనెంతయు సమర్థముగాదగు నీసమూల్లస
ద్గోరసి యేమిచెప్పనగు ముగ్ధవయోంతరంగ మల్లికా
సారము శబ్దలక్షణము సాత్త్వికమూర్తి గుణాఢ్యవైతివే
పారగ నూత్నసత్కవులకందరికిన్ సదియుక్తులుండె సం
సారభరంబువాపుకొని సత్పథమున్ దిలకించి యోగివై
చారువినూత్నప్రాయమున సాహసమారసరిత్స్వసీమ సం
చారము సేయుచున్ విగతసంగతి నాకలముల్ భుజింపుచున్
ఘోరుసనాంధ్రలోకము సమోహుదయామతి వెల్గజేసెదే
సారపథప్రకాశమగు జ్ఞానమొసంగి విభాసుయోసుధా
హారిసుభాషిత ప్రచుర యప్పలనాయక నిన్నుగోరుచు
న్నారము సత్పురాణములు నాంధ్రముసన్ దయమల్లి శృం
గారపుకోట రాయుడును కాశిమ బుచ్చినృసింహరాయుడన్
వారలమేము నీచరణ వారిజముల్ స్మరియింపుచున్ దగన్
పారముబుట్ట నాంధ్రమున బల్కెద వెప్పుడు సత్పురాణముల్
భూరిముదంబుతోనపుడు పొంగుమనాంధ్రసధూటికి తోంటి సం
చారవిలాస గౌరవము సంశయమొందెడిసొంపు పెంపుగన్.

మ. రా. రా. శ్రీ. సుబ్బరాయుడు, తె-గురువర్యుడుగార్లు.

ఉ. సారము నీమహాకవిత సత్కవికోటికి నెల్లనుల్ల స
ద్ధారము శబ్దలక్షణపథప్రచురంబున కెంతయున్ సదా
గారము సద్రసజ్ఞ జనసాదరగంధవిశిష్టదివ్య క
ర్పూరము శుశ్రుతప్రచురసూక్తి జెలంగినవారికిన్ సుధా
పూరము శుద్ధసంస్కరణపూత విశిష్టతరప్రసత్కథా
ధారము గాన నిన్ను సుమతంబున బ్రస్తుతిసేయ బూనుదు
న్నారము నీకు సౌఖ్యము లనారతమున్ నొసగూడఁగోరు నీ
వారము సుబ్బరాయ గురువర్యుల మిర్వురి మేము శ్రీవరా.

మ. రా. రా. శ్రీ వ. కోటరాయుడుగారు.

ఉ. తిక్కనసోమయాజి గురు దీక్ష వహించినవాఁడవెవ్వు నీ
చక్కని శైలి తిక్కకవి సంస్మరియింపగ జేయుచున్న దిం
పెక్క మహాకవీంద్ర నిను నేమని నేఁ నుతియించువాఁడ నా
కక్కజమయ్యె నీదు రచనాతిశయం [illegible]యంగి గావునన్
ద్రొక్కెడ [illegible]గింపుము సమోహదయానిధి నీదుశిష్యుఁడన్
వక్కల కోటరాయుడను వాఁడను సర్వసుధీవిధేయుఁడన్
నక్కనరాయనందనుఁడ నప్పలనాయకివర్యు నీకు నే
దక్కినవాఁడనంచు సుమతింబున దీవనలిచ్చుచుండుమీ.

మ. రా. రా. శ్రీ. లక్ష్మినారాయణశాస్త్రి కవీశ్వరులుగారు.

క. భూనుతమహాకవిత్వాని
ధీసీమను శాస్త్రమధికదీక్ష[illegible] సల్పన్
మానవులనెల్లనదియ స
మానంబుగ శుద్ధధర్మమార్గుల జేయున్
గాననది నీవు బల్కిన
దానమనుజులెల్ల సేయు ధర్మము పాలున్
మానక గొనువాడ నయితి
నానుడువులు మిథ్యగావు నమ్ముము నిను స

న్మానింతుము పూజింతుము
పూనికమేనెల్లనీదు పుస్తకమెపుడ
చ్చైనెలకొను దేశంబున
భూనుతుడన పరమధర్మమూర్తియనుడనం
గానగుదీనవస్తుహారిన
దానిరక్షించుగావుత మహాశయ ల
క్ష్మీనారాయణ సత్కవి
నానుతిపెంపుగనుట్టి నావచనమునన్.

మ. రా. రా. అ. నరసింహకవిగారు.

చ. విలసితదివ్యకీర్తియుత విశ్రుతసర్వకవీంద్రరత్న యు
జ్జ్వలచరితా త్వదీయ మనుశాస్త్రము పూజ్యతమంబు నీయన
ర్గళకవితావిలాసము జగన్నుతమేమనువాడ నిచ్చకం
బులగును మద్వచస్సరణి మోఘములైన నిను భట్టుబోలె ని
ష్కలుషితబుద్ధితో పొగడ గానిభవాదృశులైన గొప్ప వా
రలవినుతింప జంకుగొనరాదని బల్వురు సెప్పుచుంట నా
కలమునుద్రిప్పి నీహితముగా నొకపద్యము వ్రాసినాఁడ త
ప్పులుగలవేని దిద్దుశమభూషణ యప్పలనాయకాగ్రణీ
యలుగులపాటిరామకవి యాత్మజుఁడన్ నరసింహనాముడన్
బలువుర సత్కవీశ్వరుల పాదరజంబు శిరంబునందు బొం
పలరగదాల్చి నేర్చినటులాంధ్రమునన్ బోలుపైన పుస్తకం
బులు విరచించువాఁడను విభూతిధరార్యగురుప్రసిద్ధుడన్.

మ. రా. రా. బ్ర. హుతాశనశాస్త్రిగారు.

మ. మనుశాస్త్రంబుఖిలంబునై జగతి సామాన్యంబుగానుండ దా
నిని తొల్లింటి సగౌరవస్ఫురణతో బొంపారగా దెచ్చి పె
ట్టినపుణ్యాత్మ మహాకవీశ్వరుని పాటింపందగున్ నాంధ్రులె
ల్లను శ్రీయప్పలనాయకాగ్రణి సముల్లాసంబు రంజిల్ల ది

కృతికర్తల్ తుల్యుడటంచు నేఘనుని బ్రజ్ఞాశాలురింపారగా
వినుతింత్రాతని సంస్మరింపవలదే విశ్వాసపాత్రంబుగన్
ననఘుల్ పూజ్యులటంచు జెప్పె నొకపద్యంబాంధ్రభాషన్ వాలతా
శనశాస్త్రిప్రవరుండు వానికి నమస్కారంబు లర్పింపుచున్.

మ॥రా॥రా॥ బ్ర. వే. భీమశాస్త్రిగారు.

చ. వెలసెద వాంధ్రమాత కవివిశ్రుతభంగినితొంటియట్ల యు
జ్జ్వలమృదువాక్యవిస్ఫురిత సౌష్ఠవలక్షణయుక్తవైవిని
ర్మలముగ నేడు నీకడుపుచల్లగ బుట్టె ఘనుండొకండు కీ
ర్తిలసితుడాతడెల్లెడల దిమ్మరివిద్యలునభ్యసించి బెం
పలరుచునూత్నప్రాయమున నాత్మతిరంబుగ జక్కవట్టి ని
శ్చలపథమొాలిమెట్టి గురుసత్తము పాదముమ్ముట్టి మేటి కొం
డలనక తుప్పరాళ్ళనకడంబుచెలంగు మహోగ్రకాననం
బుల జరియింపుచున్ కరమమోఘుసునిష్ఠవహించి యాకలం
బులు దినుచున్ నినున్ విమలభూషితజేయ ప్రతిజ్ఞపట్టి నా
డలఘుడతండు జాల ఖిలమైన మనుస్మృతి సంగ్రహించి త
త్కలుషము దీసితొంటి బహుధర్మవిశిష్టము జేసె నీకొసం
గెలలితవాగ్విశేషముగ కేవలమింక పురాణవర్గముల్
బలుకగలండు శాస్త్రములు పాటిగనీవలరారగా నన
ర్గళకవితావిలాసము రమ్యతరార్థ విజృంభణంబునన్
విలసితసౌష్ఠవంబునను విశ్రుతుడౌ మనతొంటిసోమయా
జులకును దీసిపోవక నసూయత నాతని పెంపుజూచు వా
రలకిది యెంతయేని సుకరంబగునిట్టి మహానుభావు డా
కలములుదించు శాసనమునందు వసించుట కష్టమంచెదన్
దలచుచుగుందబోవకుము దైవము రక్షయొనర్చునాతనిన్
వలనుగ భీమశాస్త్రి యనువాడను వేడెదనమ్మ నిన్నదన్.

మ॥రా॥రా॥ పు. మహేశ్వరంగారు.

ఉ. నీకవితావిలాసము గణింపగశక్యముగాదు సంతత
వ్యాకులబుద్ధినీచుడు సనందగునాకు మహాకవీంద్ర వి
ద్యాకరదివ్యగోష్ఠిరత యప్పలనాయక చూచినాడ నీ
ప్రాకటధర్మశాస్త్రము పురందరవల్లి మహేశ్వరాఖ్యుడన్.

మ॥రా॥రా॥ కూ. పేరయ్యగారు.

ఉ. చేసితినీపదాంబురుహ సేవనమెంతయు నెమ్మిబొల్చుచున్
దాసుడనై త్వదీయ కరుణారససౌమ్యకటాక్షదృష్టిచే
వాసితి పాపసంఘములువల్కితి నాంధ్రమునన్ మహాజనో
ల్లాసతరంగనామక కళంకవిహీన మహాప్రబంధమున్
డాసితి నార్యసంఘమువిడంబముగాక మహేశ్వరుండు గౌ
రీసహితుండు నిన్నతిప్రవృద్ధ కళామయు జేసి యాయువున్
వాసిగనిచ్చుగావుతనివార్యతనంచు భజించెదన్ సదా
కూసనపాటి బుచ్చికవి కూర్మికుమారుడ పేరయాఖ్యుడన్.

ఉ. ఓసియసూయ వేగ చనుమూరక నోడక జాలచుల్కగా
గూసెద వేమిలే దొరుల గొప్పతనంబు సహించలేవు ని
న్బాసినగాని సత్కవులు పాత్రులుగారు మహాపిశాచమై
వాసికినెక్కువారి బలవంతముగా మెడబట్టి గొబ్బునన్
ద్రోసెదవంధకూపమున దూరము పొమ్ము మహాకవిత్వ వి
ద్యాసహితున్ సదా వినయతత్పరు నప్పల నాయకాగ్రణిన్
దాసుడనై భజింపగ సదా దలపోసెడి నన్ను నేటికిన్
డాసెదవెంతమాటయదె డాగుముసంద్రములోన మాటికిన్
జేసెద వందనంబులు విశిష్టజనాళికి సంతసంబుతో
మాసెనరామనార్యుని కుమారుడ సూరపరాయనాముడన్
భూసురవర్య సేవకుడ మూర్ఖులసంగతి వీడి నిత్య ము
ల్లాసముతోడ నీశ్వరకళన్ విలసిల్లినవాడధన్యుడన్.

## ( పరమేశ్వర ప్రార్థనము. )

గీ. శ్రీపరాత్పర నిత్య విశిష్ట చరిత
దివ్యమూర్తి నిరామయ దేవదేవ
యాదరంబునరక్షింపు మాంధ్రకవివి
భూషునప్పలనాయకు పురుషవర్య. ౧

గీ. ఏమహాత్ముడులోకసేవామతంబు
దిరముగానెల్లకవులునుతింపుచుండ
బూనుకొనియె మహాగ్రంథములు రచింప
వానినప్పలనాయకు వరదబ్రోవు. ౨

గీ. పరమశాంతకళానంద భరితమూర్తి
దివ్యసచ్ఛరితోద్యత్ప్రతీతకీర్తి
ననఘునప్పలనాయున కాయురర్థ
ములొసగి దేవరక్షింపుముపరమాత్మ. 3

గీ. అభినవమహాకవీంద్రుడు శుభచరితుడు
పూజ్యుడాంధ్రులకెల్లను భూనుతుండు
వాని దారపురెడ్డి సద్వంశభవుని
దేవయప్పలనాయకు బ్రోవవలయు. ౪

గీ. శాశ్వతజ్ఞానసాధన శాస్త్రములు పు
రాణములును మహాదీక్షరచన సేయ
గడగియున్నాడు పర్వతకాననముల
వానినప్పలనాయకు వరదబ్రోవు. ౫

గీ అమృతధారలుజిల్కు మహాకవిత్వ
విధి మహాకష్టధరకోర్చి వృత్తగరిమ
నున్నవాడామహాత్మునియోగ్యచరితు
ననఘు నప్పలనాయకునయ్యబ్రోవు ౬

గీ. పాపినాయకుడున్నతి బరగసాధ్వి
గోపమాంబకడుపుచల్లగాపరాత్ప
రాభవత్కళ వర్ధిల్లు రమ్యమూర్తి
దేవయప్పలనాయకు బ్రోవవలయు.

గీ. అష్టకముజెప్పె నిర్మలమైనభక్తి
తోడ రేచూరిదీనుడర్ణవాడుపరమ
విబుధజనముల సన్నిధి విమలమూర్తి
అప్పనాయకసత్కృపి నాత్మదలచి.

:o:





శ్రీ ర స్తు.

శ్రీమద్రామకృష్ణపరమహంసగురుస్వామినేనమః.

# శ్రీమదాంధ్ర మనుధర్మశాస్త్రము.

## ప్రథమోధ్యాయము.

ఉ. శ్రీరమణీయ భవ్యమతచిహ్నలు పెక్కులు దాల్చి తత్త్వవి। ద్యారతులైనవారలకు తన్మయతత్త్వమనంగ నిశ్చలా । కారుడనంగ దోచుచు జగన్మయుడవ్యయుడాఖ్యుడీశ్వరుం । డై రుచిమాత్రుడై వెలయు నాదిమపూరుషు నాశ్రయించెదన్॥ ఉ. కాయమతీతశుద్ధము జగన్మహితప్రతిభాసమాన తే । జోయుతమై జెలంగ పరిశుద్ధమనస్కుల కర్చనీయుడై । వాయక మూడుమూర్తులకు పాశ్రయభంగి జెలంగు సూర్యనా । రాయణమూర్తి సంతతముపాసనజేసెద జిత్తశుద్ధికిన్॥ ఉ. ఆయతశబ్దగౌరవ మనర్ఘళధోరణియున్ సుధారస । ప్రాయవచో విలాసమును పాటిజెలంగగ శ్రీమదాది రా । మాయణముం రచించి మహిమంబలరార ఋషీంద్రుడై యుపా । ధ్యాయపదాప్తిబొల్చిన మహాత్ము భజించెద నాకు సంభవన్॥ ఉ. ఆగమసంవిభాగ మహిమాతిశయంబు పురాణసృష్టి దీ । ప్తాగరిమంబు పెంపెసయగా పరమేశ్వర సూక్ష్మవర్తనో । ద్యోగవిలాసముల్ దగ గనుంగొన నేర్పరియై ఋషీశ్వర । శ్రీగురుమూర్తి నాయశముజెందిన సాత్యవతేయుగొల్చెదన్॥ గీ. కాళిదాస మయూరమాఘప్రముఖుల । సంస్కృత కవీశ్వరుల సరస్వతీవినూత । నావతారులలోక సంభావనీయ । కీర్తిశాలుర బేర్కొని కేలు మోడ్తు॥ ఉ. గౌరవనీయవృత్త మధికంబుగ దెల్గున మూడుపర్వముల్। భారతమందు నెత్తి మృదుఫక్కి రచించి జగద్ధితంబుగా । సారకవిత్వ

మార్గ మనుశాసన మాచరణంబు జేసి వి । ద్యారమణుండనన్ యశము
నందిన నన్నయభట్టు నెంచెదన్॥ ఉ. అక్కజమైన భారతమునందు దొ
డంగి పదేనుపర్వముల్ । జక్కని శైలియున్ లలితశబ్దవిలాసము గౌర
వంబు బెం । పెక్కగ నాంధ్రభాష రచియించిన భవ్యకళా విశార
దున్ । తిక్కనసోమయాజి వినుతింతు మహాకవి సార్వభౌమునిన్॥
క. తగనేమహనీయుండు తె । లుగునన్ గ్రంథములు బెక్కులు రచించె
విశి । ష్టగరిమ నాతని నెఱ్ఱా । ప్రగడ భజించెద ప్రబంధ పరమేశ్వరు
నిన్॥ క. ఉత్తరహరివంశము న । త్యుత్తమగతి నాంధ్రభాష నుడివి
యశ స్సం । పత్తత్పరత జెలంగిన స । హ త్తము భావింతు నాత్మ నాచన
సోమున్॥ ఉ. రాగము లేక నార్యులు నిరంతరమున్ తనశిష్యులై
మహా । యోగపథంబు తెలంగి నియతోచితవృత్తి జరింప బెంపునై ।
భాగవతంబు నాంధ్రమున బల్కిన బమ్మెర పోతరాజు స । ద్భాగవ
తోత్తమున్ దలచి భక్తి జెలంగ నమస్కరించెదన్॥ క. తక్కిన యాం
ధ్రకవీంద్రుల । జక్క నిమార్గములు సరస చాతుర్యముల్ । మిక్కిలి
గొనియాడుచు నతు । లొక్కొక్కరికాచరింతు నొనరగనూనుల్॥
క. విమలమతి రామకృష్ణ ప । రమహంససమాఖ్య గురుచరణపంకే
జా । తములు నిలిపి యుత్తమగతి । నమస్కరణశతములు నొనర్తు సతం
బున్॥ గీ. మహితచరితు లోకమాన్యు భవ్యకళావి । శారదున్ యశోవి
శాలుతత్వ । పరువిశిష్టు ఘంట బంగారునాయకు । ననుదినంబు నిచ్చ
లాదరింతు॥ ఉ. పాయక సంతతంబును నృపాలురనేకులు మాన్యదాన
ముల్ । సేయగ సప్తసంతతి విశిష్టమహత్వపదవిన్ రహించి నా । రాయణ
పాదసేవనపరాయణవృత్తి జెలంగినట్టి నా । రాయణనాయకున్ మన
సు రంజిల మత్కులకర్త వేడెదన్.

## ఆధునిక కవి హితవాదనము.

చ. వినుడు మహాత్ములార మిము వేడెద సత్కవులార సన్ను బో ।
లిన యధమాధముండొకడు లేడరయంగధరిత్రియందు నెం । దునయిన

గాన నాకృతిని దోషముసుండిన దిద్దుఁడేల మా । కనజనదృష్టులైన జను
లందఱు దేమిటి పుస్తకంబనుర్॥ క. సైచియొరులదోషంబులు । తోచిన
యంతకును దిద్దుమరుసత్కృతులే । లాచెప్పెనిట్లనుచునవి । దోచక తు
ష్కృవులు బల్కుదురు బలుసభలఁ॥ ఉ. వాగనుశాసనుండు బుధ
వర్యుఁడు తిక్కనసోమయాజి నా । నాగమవేది యాప్రగడనాచనసోముఁ
డు నల్వు రాంధ్రభా । షాగుణమూర్తులింపెనయ జక్కటిశేసిరి వారి
పద్ధతుల్ । బాగుగజూచి గద్యములుపద్యములుఁ విరచించుటొప్పగుఁ॥
క. అయమహితాత్ములగు కవి । త్రయమురచించిరిల భారతం
బుతదీయా । శ్రయులగు కవివర్యులకా । రయుగలుగవె సత్పదార్థ
రచనాదికళల్॥ గీ. భారతంబునిత్యంబును పరిచయంబు । సేయగల్గు
ట తత్పరిశీలనాప్తి । నభ్యసించుట దగురచనానుకూల । సౌష్ఠవాదు
లుగోరిన చతురమతులు॥ క. లలితపదంబులు జొన్పుట । దెలిసివృ
త్తాగాక గణ యతి ప్రాసంబుల్ । వలయునెడలనిల్పుచుదగ । బలుక
వలయుకృతులు తేటపడ నెల్లరకుఁ॥ గీ. గ్రామ్యపదములువాడుట
గాదు తెలిసి । నంతకును గ్రాంధికపదంబు లదుకవలయు । నాంధ్రభా
షకనేక మార్గానుసరణి । కూడదట్లైన దెలియగల్గుటయ యరిది॥
క. అనియిష్టదేవతాప్రా । ర్థనమును కాలత్రయో న్నతకవీశ్వర వం ।
దనన్రమభావహిత వా । దనములుగావించి సమ్మతం బలరారఁ॥
క. నాయాంధ్ర సోదరులకను । వై యేకృతి జేయునిత్య మానందము
శ్రీ । ప్రాయతధర్మపథ బహు ళ । మైయని యేపరియుచుంటి నతిదీక్ష మె
యిర్ ॥ వ॥ అంత॥ క॥ శ్రీమంతంబై దగుకృ । ష్ణామండలమందు శాస్త్ర
సాంజ్ఞసుధీ । భూమంబు సత్యవ్రోలను । గ్రామముగల దొకటి విబుధ
గణసేవ్యంబై॥ వ॥ ఆగ్రామంబునందు॥ క॥ ప్రవిమలతరవిజ్ఞానప । ధ
విశిష్టుండాంధ్ర సంస్కృత కళాసద్భావభవపాత్రతముసుశ్రీరె । డ్డి వేంకట
నాయకుడకుటిలదీక్షు మెయిఁ॥ వ॥ ఒక్క దినంబున పురాణగోష్ఠి సేయు
చుండి బహుశ్రుతులును శుద్ధ వేదాంతమార్గ ప్రవర్తనులు నుదారస్వ
భావులును ఘంట వంశపవిత్రులునగు నప్పలనాయకుండును సన్న్యాస

నాయకుండును చినప్పలనాయకుండును వెండియు సన్యాసనాయకుండు, సీతానాయకుండు, కోట యప్పలనాయకుండు, వేగురెడ్డి జోగినాయకుండు, శంభ్వంగ పాపనాయకుండు, వంగపండు నరసింహనాయకుండు, నరసిపల్లి యప్పలనాయకుండు, కరణము తమ్మానాయకుండు మొదలగు సజ్జనంబులతో పరమధర్మశాస్త్రోత్కృష్టతఁ గూర్చి యొక్క కొంతయుపన్యసించి తత్సభాశిరోరత్నంబగు ఘంటా యప్పలనాయకుఁ జూచి సగౌరవంబుననిట్లనియె॥ క॥ అనఘచరితనీవ్రౌఢక। జనియప్పలనాయక కవిసత్తము శుభ వ। ర్తనుదర్శించిమను స్మృతి। తెనుగింపుమను మతడది విదితముఁ జేయుఁ॥ క॥ నావ్రదుమేలనివిమల సు। ధీవిస్తారుండు కొన్ని దినములువేడ్కఁ। త్రోవనడచి వచ్చిజగ। త్సేవారతునన్నుఁ జూచి చిత్తంబలరన్॥ వ॥ తన వచ్చిన కార్యంబు దేటపరచె నిదియట్లుండె నీయార్యుండు సకలజన సంస్తవనీయ నిత్యసత్యరతుండు సుగుణభూషితుండు గావున నీతని యన్వయాదులఁ గూర్చి పాఠక మహాశయులకు కొంత దెలియ వ్రాయువాఁడనైతి నదియెట్లనిన॥

## భారతవర్ష ప్రశంసా.

సీ॥ శ్రీపరమేశ్వర సృష్టిపించిత్రిభూమంబగునట్టి భూమండలంబు। నవఖండమండితంబువిశాలభూతల సప్తద్వీపసాగరపర్వతాభి। రామంబు సచరాచర ప్రాణికోటిసంఘ ప్రతిష్ఠాద్య ప్రకాశితమును। నైమొప్పనందు దివ్యక్షేత్రభూరినదీనదపర్వతకాననోన్న। తంబుబహుసస్యకులసంకులంబుత్రిజగ। తిపరిస్ఫుటదోషౌషధీవిలాస। బంధురంబుమహాఋనిభావిజతంబు। బొలచు భారతవర్షంబు పొగడనొప్పు॥ క॥ పరమేశ్వరావతార। స్వాహాపవిమలకథాప్రశస్తసుధాభూ। రిరసాపాన మహాజన। భరితము శ్రీభరతభూమిభావింపంగన్॥ క॥ భవ్యచరిత్రాస్పదమును। దివ్యక్షేత్ర ప్రభావదీపితము బుధ। స్తవ్యము భారతవర్షము। కావ్యకళాపండిత ప్రకాండమయమిలన్॥ సీ॥ వేదశాస్త్రపురాణ వేదులై తపోజీవితము దేశసేవకై ధారపోయు। పండితోత్తములును ఫల

మునాసింపక జ్ఞానోపదేశంబుగారవమున । జేయుచుమూఢుల నేగి వాయగదేశదేశముల్ద్రిమ్మరు దీనిధులును । దారుజలంబులుదాప్రు చునన్నంబు దీనులకిడుచుసుదానకర్ణ । లభినవవ్యాప్తశుద్ధకళానుభూ తి । దేజరిల్లెనీఘనులును రాజవరులు । గలరుభారతభూమి బంగారము మరి । మంటిగడ్డయు సరిజూచుమాన్యతములు॥ సీ॥ నవరత్నదీప్తమాన విలాస తరరమాకారణములయిన గనులుగలవు । నదిపండునిదిపండ దనుమాటలేని సకలసస్యసమృద్ధిగరిమ గలదు । కాదదియునదిగా యనరాకస ద్విజ్ఞానమయ మగువిద్యగలదు। లేదదిగలదనగాదగ కెలమి నుల్లాసంబొసగు రాజ్యలక్ష్మిగలదు। గోవులును గుఱ్ఱములు నేనుగులు నుదినది । నాభివృద్ధిరహించు మాన్యప్రదేశ । ములును నిర్మలతరమత ములును గలవు । హర్షమయమైన భారతవర్షమందు॥ గీ॥ ఇమ్మహాపు ణ్యభూమియందెలమి సొంపు । గనినధన్యులు బ్రాహ్మణుల్ క్షత్రియు లును । వైశ్యులును శూద్రులను నట్టివారునాల్గు । వర్ణములవారుబొ ల్తురు వసిగలిగి॥ గీ॥ అందునాల్గవ కులమన నయిన శూద్ర । జాతి యందున శాఖోపశాఖములుగ । పెక్కుతెగలవారలు గలరక్కడక్క। డాంధ్రకర్ణాటకాది దేశాంతరముల॥ వ॥ గొప్పవెలమలు, నాదివెలమ లు, పద్మనాయకవెలమలు, బలిజవారు, కాపులు, రెడ్లు, తెలగవారు మొదలగు తెగలవారలు శూద్రవర్ణంబు నందుప్రసిద్ధులు॥

సీ॥ వర్ణితబహుశాస్త్ర వాసనాభరితులై దేశసంసేవన దీక్ష దవిలి । వీరుమావారలు వారుగారనుభేద మెన్నండు బాటింపకెల్లయె డల । దిరుగుచునజ్ఞాన దీనమానసులగు వారలకతిశయుగౌరవమున । విమలతరజ్ఞాన విత్తంబొసంగుచు నవిజెలంగని సదానందమహిత । మాననీయులజేయు మహానుభావు । లాదరంబుగలసరసులాగమాం త । మార్గసంశోధితాభిరామప్రశిద్ధ। విశ్రుతకళాధికులు గొప్పవెలమ వారు॥ సీ॥ పరసేవనంబనాదరముగా గనిజేచ్ఛ బాడిపర్తించెడిపౌరు షంబు । స్వార్థపరిత్యాగ సంభృతదానశూరత్వసమృద్ధపరాయణత యు । సర్వజంతుగణపోషక మహాదీక్షాప్రకార సత్కృషికర్మగౌరవంబు।

త్రిజగతీపావనాధిక మహాత్మ్యమయగోపూజా ప్రసిద్ధవిపులమతంబు ।
తమకుసహజగుణంబులై దనరుచుండ । పరమశాంతకళానంద భరిత
మూర్తు । లైజగంబెల్లసేవించునఖిలశాస్త్ర । విదితసద్వర్తనులు గొప్ప
వెలమవారు॥ సీ॥ మీసంబులకువెన్న మిసిమిబెట్టకవృథా నైరంబుగొ
నునట్టివారుగారు । సోమరపోతులై యేమఱియధికగర్వమున బ్రవర్తించు
వారుగారు। యుద్ధవచ్చినజూచి యూవలిపెరటింటి ద్వారంబుసేరెడివారు
గారు । శ్రీగల్గియొరులదూషించుచు మఱియునకారణంబున రోయువా
రుగారు । చూచిచూడకనొకపెద్దసోకుబెట్టి । బాసనేరిచియన్యుల
మోసపుచ్చి । గౌరవముసెడి మినుజూచువారుగారు । తులగలుగువా
రు శ్రీగొప్పవెలమవారు॥ సీ॥ పాడిపంటలుగల్గి వాడుదేరినపేదవార
లపోషించు వారువారు । పరమశాంతస్వభావముగల్గి యన్యుల గౌర
వింపగనేర్చు వారువారు । న్యాయపథంబుమాన్యంబుగా రాజులవలన
మెప్పొగనెడివారువారు । సంతతదైవనిష్ఠాగరిష్ఠాతిశయారాధనముగల
వారువారు । మారుపేరుతెరుంగని వారువారు । పేరుపెంపునహించిన
వారువారు । సారవంతంబుజెలగెడివారువారు । చెలిమిగలవారు శ్రీ
గొప్పవెలమవారు॥ సీ॥ మర్యాదయునుమహాకార్యదీక్షాప్రియు వారల
జూచినేర్వవలెనొరులు । దానశూరత్వంబు భూనుతతత్త్వంబు వారలజూ
చినేర్వవలెనొరులు । శాంతకళానందసౌరభస్ఫురణంబు వారలజూచినే
ర్వవలెనొరులు । జీవదయాప్రతిష్ఠావిధిమర్మంబు వారలజూచినేర్వవలె
నొరులు । విబుధజనులందుజూపెడివినయవిద్య వారలంజూచినేర్వగా
వలయునొరులు । ననుచుకవులెన్వరినుతింతురట్టిలోక । విశ్రుతకళామ
యులు గొప్పవెలమవారు॥ గీ॥ చేయి సాచిరొయొరులసేవించువారలు ।
గారుసేయిసాచువారినెల్ల । నోపిబ్రోవజూచును తమశీలురు । గొప్ప
వెలమవారు గొప్పవారు॥ సీ॥ మందారకుందేందు చందనతారహీ
రమణీవిలాసరుగ్విమలయశులు । కార్యనిర్వహణతాధుర్యగాంభీర్యసద్ధై
ర్యమహావార్య శౌర్యధనులు । చిత్రపవిత్రచరిత్రసుధీస్తోత్ర పాత్రత్ర
యీపథమాత్రవిదులు । సకలంకసకలాఫలకృపామయూయతా త్మక

సదాపూజా విధకృతరతులు । శుద్ధబోధామృతానందబద్ధనిరుప । మా
నసౌఖ్య విలీలాప్రమాదమతులు । ఘనులులక్ష్మీకటాక్ష వీక్షాసమా
ర్హ । వృత్తిగలవారు శ్రీగొప్పవెలమవారు॥ క॥ ఆవర్ణమందువెలసె మ।
హావిద్యాసాగరులు సమార్హరతులు ఘనం । టావారనువారు జగ ।
త్పావనగోత్రప్రసిద్ధిదగువారుఘనుల్॥ క॥ శ్రీమద్ఘంటాకుల జుడు ।
రామానాయకుడు విబుధరాజినుతింపం। గాముస్నవెలసెభవ్య క । ధా
మహితుడు రాజపూజితకళాధికుడై॥ క॥ఆతనికుమారుడు వెలసె । నీ
తిగలుగు వాడు కార్యనిపుణుడు దీన । ప్రాతావనరతుడు ఘనుడు ।
పోతన నాయకుడు విబుధపూజాపరుడై॥ క॥ ఆయనపుత్రుడు సంగ ।
న్నాయకుడను ధీరవరుడు నానావిద్య । ద్యేయ యశోధనుడు బాలచె ।
భూయిష్ఠ పవిత్రధర్మమూలంబనగన్॥ క॥ ఆయనపుత్రుండప్పల । నా
యకుడను ఘనుడు సద్గుణములు గలిగి భ। వ్యాయతబుద్ధిరహించున్ ।
న్యాయపథము సెడకసజ్జనవిధేయుండై ॥ ఉ॥ దానము ధర్మమున్ వి
నియతింబును సత్యమునార్యలోక స । న్మానితవైభవంబునసమానయ
శోల్లసనంబు భవ్య సం । తానము కల్మి యూర్జితమతంబును గల్గి జెలం
గుచుండు గో। ప్తీనిగిలిన్ యథేచ్ఛమెయి జెందకనప్పలనాయకుండిలన్॥
క॥ శ్రీచంద్రాంకితుడుమరియ । నీచతముండైన యీతని కులంబు విశి ।
ష్టాచారభూనుతంబై । యాచంద్రార్కముగ వృద్ధియగుగాక మ
హిన్॥ వ॥ ప్రశంసా వశంబున విశిష్టుండగునీతనిన్ గొంతవరకు నిచ్చ
టన్ బేర్కొనంబడియె నిట్లు మాననీయప్రవర్తన శాలియగు నీదీనబాం
ధవుండు నన్నుంగని సంతసించి గౌరవంబుననిట్లనియె॥

---

సూచన—(క॥ శ్రీమంతబైదగుకృష్ణామండలమందు)నను కందంబు మొ
దలుకొని (వ॥ ప్రసంశావశంబున విశిష్టుండగు నీతనిన్ గూర్చికొంత
వరకు నిచ్చటన్ బేర్కొనన్ బడియె) నను వచనాంతంబు వరకు గల
ముప్పది గద్య పద్యంబు లేతద్గ్రంథకర్త ప్రియశిష్యుండగు గొట్టా
పు బాల కృష్ణమూర్తి నాయుకునిచే రచింపంబడియె. పాఠకమహా
శయు లివిగ్రహింపప్రార్థితులరు.

—పూర్వమనుస్మృతి ప్రకారము—

క॥ అనఘ మహాధర్మపథం। బునెగడు పుణ్యాత్మకులు విబుధ
గణసేవా। ఘనతపహింపందగు వా। రనివిందుము వేదముల మహా
శాస్త్రములన్॥ క॥ కష్టంబులు వోరసియును। త్కృష్టమతులు పరమధ
ర్మకీర్తనలీలా। తుష్టిజెలంగుదు రేమిట। నష్టము వారల ప్రవర్తనంబూ
హింపన్॥ క॥ తగసూర్యుడు చంద్రుడు దే। వగణంబులుఋషులునె
ల్లవారును శ్రుతులున్। జగములుధర్మము పేరిమి। నెగడునిజావా
ప్తిమెయనిరి తొంటి బుధుల్॥ క॥ ఆర్యులనేకులు కార్యా। కార్యవి
దులు పరమధర్మ ఘటనప్రజ్ఞా। ధుర్యులు మృతజీవులయిరి। సూర్య
కిరణభాసితసుయశోద్భృతకాయుల్॥ చ॥ అమృతఫలప్రదానముమహా
స్థిరభాగ్యము గల్గజేయు ధ। ర్మమదిభజించువారు సురమాన్యులు వా
రలుగారె సర్వలో। కమయము శాశ్వతంబగు ప్రకాశము పెంపుజెలంగు
శిద్ధులు। త్తములు జగంబులన్నిటికి ధర్మువుదక్క నొకండు గల్గునే॥
గీ॥ మనుజులందరు పరమధర్మ మయుడగుప। రాత్పరునిదివ్యశక్తిబరగిన
వార। లయ్యునాతని బొరయ వేరరయనెల్ల। వారు ధర్మాత్ములగునట్టి
వారుగాక॥ క॥ జ్ఞానాధారము యోగము। జ్ఞానముధర్మమయుమది ప్రకా
శాశతదగునె। వ్వానిహృదయమ్ముననతడు। భూనుతుడీశ్వరకళావి
భూతుండయగున్॥ క॥ బోధానందమయంబు మ। హాధర్మము మోక్ష
హేతువదియీశ్వర తే। జోధికులగు ఘనులకనుస। దాధారము వేద
చోదితార్థంబు మహిన్॥ క॥ విపులమతుల నేకులుధ। ర్మపథమున నడ
చిజననమరణభయరహితం। బు పరమమున్నతమగుది। వ్యపదప్రాప్తిన్
సుఖించువారలగుతుదిన్॥ చ॥ అనఘచరితులిలార్యులు మహర్షులనేకులు
ధర్మమార్గవ। ర్తనముసమించిలోకము హితంబుగ పెక్కులు ధర్మశా
స్త్రముల్। మనకొఱకై రచించిరి సమగ్రదయామయులర్థిసార భా। వన
వియగావెయిప్పుడతి సన్నుతికెక్కుచునున్న వెల్లెడన్॥ గీ॥ ధర్మపథమున
నడచునుత్తములకెల్ల। ధర్మశాస్త్రంబులుప్రపూజితములువాని। లో
నమనుధర్మశాస్త్రంబు భూనుతంబు। పరమధర్మాస్పదంబుగా బరిణ

మించెః క॥ మనుధర్మశాస్త్రముఁ బో । లినశాస్త్రంబొండుధరణిలే
దనిరి మహా । మునులును పెద్దలుపూర్వం । బనేకులదియజగన్మయుం
బనఁగ దగఁ॥ క॥ వేదవ్యాసమహాముని । యాదిగఁ దొల్లింటి పెద్దలందరు
మనుశా । స్త్రాదరమునఁ బాలించిరదియ । వేదమతము సర్వధర్మ విస్తర
మనుచుఁ॥ వ॥ అయినను॥ క॥ ఆయుతమగునీశాస్త్ర మ। నూయాపరు
లయినబాలిసులుకొందరు బెం । పేయది జెఱచిరిదిమహా । న్యాయమొ
హో యనక తిక్కనకు మున్నె గడుఁ॥ క. కాదనక పెక్కుచోట్ల । న్వేద
విరుద్ధాంశములు జొనిపి విజ్ఞాన । శ్రీదాధ్యాయత్రయమురు । వేదిగుది
య జేసి చెఱచిరీశాస్త్రంబుఁ॥ గీ. ఏమిలాభంబుగోరి వారిట్లు జేసి ।
రో యెఱుఁగరాదు మనకు పూర్వులగు బుధులు । కొందరీశాస్త్రము విధ
ముగూర్చి చర్చ । జేసియును గాన లేకది జెప్పరైరి॥ వ. అది యెట్లనిన॥
గీ. పరమధర్మజ్ఞుడను శేష భారతాది । గ్రంథకర్తయునైనదిక్కన మ
నీషి। తోడకొందరుపెద్దలుతొల్లియీ మ। నుస్మృతిఁ దెలుగింపుమనుట
యునతఁడు॥ క. పదియైనాధ్యాయములు గ । లదియైనమనుస్మృతినీ
వెలయనీయక నీ । తిదారగికొందరుకుమతులు ! గుదియించిరి కేమి సెప్ప
గూడుననుటయున్॥ క. వారలునిరాశఁ జెంది స । దాహోయుచునుండిరా
ప్తిదవిలి విశుద్ధం। బై రూపరునీస్మృతికోఽ । కై రేఁయింబగలు దేశమం
దెల్లెడలఁ॥ వ. ఇట్లరసియరసి వారిలో నొక్కఁడగు చంద్రవర్మ తిక్కని
శిష్యుండై కేతన యనేకస్మృతులు సంగ్రహించియుండుటం దెలిసి చని
యతనిన్ దర్శించి మనుస్మృతి నాంధ్రీకరింప వేయనుటయు నతండు॥
క. మతముజెడినశ్లోకావళి । యతికియతికిమఱియుఁగొన్ని యధ్యాయం
బుల్ । క్షితిగలిపికొందరు మను । స్మృతిసంక్షేపించి రేమి జెప్పెదు
ననఘా॥ క. అని చెప్పినాఁడు మొదలీ । మనుస్మృతినిలచియున్న మా
త్రముతోఁ ఖ్యా । తి నెగడుచుండెనిదియగ్గై । కొని రెల్లరు తొంటివారి
కుటిలమెఱుఁగకఁ॥ వ॥ అయినను॥ గీ ఎందునైనజిక్కదే పూర్వశుద్ధ
మ । నుస్మృతియిపుడదిఘనులు జగద్ధి । తంబుగోరియున్నధన్యులు కొం
దరు । వెదకికూర్చినట్లు వింటి నేను॥ క॥ ప్రచురింపబడనిశాస్త్ర । ప్రచ

యంబులు కొన్నిపుడు దొరకుచున్నవి కొం । డచరియలగు హాలనడ
వుల । శుభపూర్వమతముల గుళ్ళచూరులనిండ్లన్॥ క॥ గంజాముమండ
లములో౯ । రంజితమగు గాడియాఖ్య గ్రామనివాసుం । డంజయ్యయను
ద్విజుండు ధృ । తింజేకూరిచె మనుస్మృతియనుచు వింటిన్॥ క. తనపూ
ర్వులు సంపాదిం । చిన పుస్తకములతడతివిశిష్టజనుల కి । చ్చునట
మనమరిగియతనిన్ । మనుస్మృతియడుగుదుమె సమంజసముడగన్॥
చ. అనుటయునట్లకాకయని యాతడు నేనునుకొన్నినాళ్ళ దో౯। వనడ
చిపోయి యా ద్విజునివాసము జేరిన జూచియా । తడోయనియిటురం
డురండని ప్రియంబులువల్కగనూగుచుండి నో । ష్ఠినెరపిపందనంబులు
ఘటించి వినమ్రతసొంపు పెంపుగన్॥వ. ఇట్లంటిమి॥ క. అనఘుమతుల్లై
నమీాద । గ్నినమున ధన్యులమయితి మరయలోకహితం । బునెగడుమి
ముబోలు ఘనుల । వినయంబున గొల్చువారు విత్తనములుగదా ॥
చ. అనుటయు నాతడిట్లను ప్రియంబులు మీారలు వల్కనంతవా ।
డనెయదియట్లులుండెనొకటన్ బనిబూనినవారు ఫాలెగా । ననగుచును
న్నవారు వినయంబునబల్కెద మీారలెవ్వరే । లనిచటికేగుదెంచితిరి
లాతివిధంబులుగాక జెప్పుడీ॥ వ. అనుటయు మేముమరలనిట్లంటిమి॥
క. ప్రచురింపబడని శాస్త్ర । ప్రచయంబులు సంగ్రహించి ప్రచురింప
గని । చ్చుచునున్నవారుమీారలని చెప్పిరి కొందరదివినిముదంబారన్॥
ఉ. వచ్చితిమాదరంబు చెలువంబుగమానవధర్మశాస్త్రముల్ । బుచ్చి
కొనంగనాపుడును భూసురుడల్కయు నీర్ష్యయున్ గ్రమం । బచ్చుప
డంగదయ్యాము క్రియన్వడిలేచుచు బిట్టునప్పుడున్ । జెచ్చెరపుస్తకం
బొకటి జేకొనియిట్లనుమోటుమాటలన్॥

క. ఏమిటిస్మృతులామీాకే । నా మేల్ మేలద్దిరామహాశాస్త్రం
బుల్ । భూమిసురలొసగ శూద్రులు । ప్రేముడిగ్గ కొనగ గదసిరియుక
జెడుశ్రుతుల్॥ క॥ రుద్రునితో సరియగుని । గ్న్రదమహాత్మ్యమున బాల
చునిపుణులు విప్రుల్ । భద్రగులు గాకఛీఛీ । శూద్రులు జూడదగువా

ౘోయుచునుండిరి = వెదకుచుండిరి.

రె శ్రుతులుఁ స్మృతులున్॥ గీ॥ బ్రాహ్మణులవలన వేద[illegible]యుశూ
ద్రు । లరుగుదెంచిరి శివశివాయనుచు జెవ్రులు । మూసికొనికొంతసే
పుండిమోరచాచి । కోపమున బలికెమరియునాబాపనయ్య॥ గీ॥ శా
స్త్రి సేయుంగగగిన రాజన్యవరుడు । లేమిచెలరేగి శూద్రులు భూమిసుర
ల । నడచిపుచ్చుచునున్నవారయ్య దేవ! దేవదీనుల మగుమమ్ము బ్రోవు
మనిన॥ వ॥ అనియాతనిలువక॥ క॥ ఈసారిశాస్త్రమనిమీ। రాసపడితి రేని
న్యాయమట్లుండనినా । చేసత్వము జూపింతును । డీ సమయంబెరిగి పొం
డి వేమిటిమాటల్॥ క॥ నాయొద్ద సకలవిద్య । ద్గేయంబై దగుమనుస్మృ
తిగలదదివిశి । ష్టాయతమును పంచదశో । ధ్యాయసమాప్తంబు దాళ
దళలిఖితంబున్॥ గీ॥ వేయిమూప్యంబులొసగి సద్విప్రవర్యు । లీమహా
స్మృతి గొనునారలెన్ని వేలు । శూద్రులిచ్చిననీయ నీచులకు ధర్మ । శా
స్త్రిమనుమాట లేటికి జనుడుమీరు॥ వ. ఇట్లు॥ క॥ పాటిసెడి బలుకు
విప్రుని । మాటలకుఁ గోసి మేము మార్వాలుకక న । చ్చోటు విడచిధృ
తిమైదే । శాటనముఁ జేయువేష్ట సమకూరంగన్॥ క॥ ఏవెరవు లేక
భారము । దేవునిపైనిడి యనేక దినములుగడకఁ । ద్రోవనడచు
చుండగనొక । చోవిదితుండొక్కఁడుబొడచూపెదగంగఁ॥ సీ॥ యోగ
సమాధి నిష్ఠాగతినొడలెఱుంగక విశ్వ మంతయుగనెడివాడు । ప్రణవా
త్మకజ్యోతిపరమైన తత్వంబు నూదియొక్కడలేకనుండువాడు। కెంజివు
రులచాయరంజిల్లికను దీర్ఘములుగ బొల్చినజడల్ గలుగువాడు । తనది
వ్యపాదపద్మములు సేవించు శిష్యులకరుణావృష్టి జూచువాడు । నాం
ధ్రగీర్వాణహిందూస్థానంగాద్యనేక । మహితభాషాధికుండు శ్రీమద్ద్వితీ
య । రామకృష్ణపరమహంసనామధేయు । డొక్కసద్గురుమూర్తిమా
యొరవచ్చె॥ క॥ ఈవిధమునసాతడుశివ । దేవునిబలెనెదురగుటయు
దీపితన్రము । త్వావేశకళానంద । శ్రీవెలయగమేమునతులు జేసినిలచి
వఁ॥ క॥ దీవించియుమ్మహాత్ముం । డేవారలుమీగ లిప్పుడెందరిగెదరి ।
చ్చావిధి నేమివిశేషము । నావుడుమేమిర్వ్యారము మనములలరంగఁ॥
క॥ మావచ్చినవృత్తాంతము । జీవనమును కులమునెటుగ జెప్పట

యునుమో । దావహామనినాతలపై । పావనకరమైన సవ్యపాణియిడిద
గదా॥ క॥ నీచరితంబు నెఱింగితి । నీచుండవుగావు సన్ననిన విప్రుడసూ ।
యాచిహ్నితుండునీవిక । నేచికొనుము విద్య శిష్యునిగ జేకొందున్॥ గీ.
పదియురెండు పురాణముల్ విదితములగు । మూడు వేదాంత శాస్త్ర
ముల్ మూడువేల । యైదునూరుల పదియుల రెండబ్దములకు । మున్న
విరచించెనొకయోగి ముఖ్యుడెలమి॥ గీ॥ అభినవవ్యాసుడను పేరనలరు
నట్టి । యమ్మహాత్ముండు వ్రాసిన యాపురాణ । ములును శాస్త్రం
బులును నిన్న మొన్న నొక్క । కొండగుహాలో నజూచితి పండితవర॥ క॥
ఆరూఢిమనుపరాశర । నారదదక్షస్మృతులు వహామనునొక మహా ।
సూరిచరిత్రము నేనొడ । గూర్చితివి యెల్ల నీవు గొనుముకుమారా॥ క॥
యామళలకదివ్యఋషి । గ్రామణి పేరనొకమఠము గట్టించితదీ । యా
మలతరకృతులన్నియు । నామూలాగ్రముగ బల్కు మాంధ్రమునకవీ॥
క॥ నీచుడ నినిన్ను బ్రాహ్మణు । వేచిన నే చంగ నిమ్మహితవాదనదు ।
ర్వ్యాచారక్రమంబు బూనక । జూచియు జూడకుము వారిజుల్కదనమ
గుర్॥ క॥ ఏవారి లేమి పల్కిన । గావించిన వారితోడ కలహింపక నీ ।
జీవనము ధారవోయుము । కోవిదవర దేశసేవకొఱకై సతముస్॥ చ॥ ని
నుసభలందు బ్రాహ్మణులు నీచుడితండని పల్కనైన వా । రినెదిరినీ
వునాడకుము వ్రేలుచు నెవ్వరితోడ శుష్కవా । దనములు సేయబూన
కు వృథాచెడు బుద్ధిబలంబు లేనిపో । నినెరసులెన్న బోవకుము నింద్య
ములిన్నియు నీకు పుత్రకా॥ క॥ ఏవాదు వృథావాదము । గావించుర్ సభ
లవానిగౌరవరహితుం । గా విద్వాంసులరయుదురు । గావున నాచదు
వునీకు గాదెన్నండున్॥ క॥ నానియమంబులు దప్పక । మానితమతిచుం
డు దేని మతముడగంగా । నేనిన్ను శిష్యవర్యుని । గానిప్పుడ జేకొనుదు జగం
బెఱుగంగన్॥ క॥ ఏయదియు శాశ్వతముగా । దాయు ప్రచలనంబు దేనియ
ర్థమెరిగినీ । చేయగల యంతపట్టును । సేయుము శ్రద్ధగొని దేశసేవనమన
ఘా॥ గీ॥ వ్యాసుడురచించిన పురాణవర్గములు మ । హా స్మృతులుకొ
న్ని కొందరనర్థమతులు । జెఱచిగలచిరివాని నిశ్చితముసేయు । వారు

లేరై రిమనతోంటి వారి లోన. క॥ ఆధునిక పండితులువి । ద్యాధురీణు లు కొందరయ్యె నర్థంబులు సం । బోధించికొనుచు నేమిటి । గాథలను చు దొంటికథలు గడగిరరయగన్. క॥ పేరెన్ని విధంబుల దగ । నార యగల్గినను దెలియరాక పటము వి । ద్యారమణుని యామళలకు । చా రిత్రము బయలబడగ జాలకనున్నన్. క. పరగగనయ్యా మళలక । వి రచిత గ్రంథంబులతి పవిత్రంబులుగా । నరహా స్వార్థ విశిష్టత, పరిగ్రహణంబు సేయు ఫలమగు పిదపన్. క॥ నాచెప్పినట్లునడవుము । నీచదువు ఫలంబునేను నిన్ను సుమతిగా । జూచికొనుచుందునయవి । ద్యాచతురుడవగుముదివిరి యప్పలనాయా॥ క॥ నాచరితంబును పిమ్మ ట।నీచరితమునొక్కటిగగణింపుదురతి వి । ద్యాచతురులు హితమెనయ గ । నాచెప్పినయట్లు నీవునడచితివేనిన్॥ వ॥ అంత॥ క॥ ఆసారస్వత భ వ్యక । ళాసహితుని తేటమాటలకు బ్రియమెసగం । గా సాష్టాంగ మెఱగితవ । దాసోహ మనుచునుతత్పదంబులు బట్టన్॥ చ. ప్రియము నలేవనెత్తినను బేర్కొనికొన్ని హితోక్తులాడి త । ద్దయుతనకూర్మి పు త్రుని విధంబుగమచ్చికజేసి ద్రోవవా । సి యొడలు సంస్పృసించి నిజ శిష్యగణంబులజేర్చి దివ్య మం। త్రయుతపదార్థముల్ దెలిపె రమ్యతరం బగు నొక్కకొండపై॥ వ॥ మఱియునన్నున్ జూచి॥ గీ॥ పుత్రమనుధర్మ శాస్త్రంబు పాత్రతమము । ధర్మబహుళంబదియ విదితంబు సేయు మాంధ్రమున మున్న పిదప నయ్యామళలకు । సత్కృతులు బల్కుదువు గాక సారఫణితి॥ క॥ ధీసహితయిమ్మహాస్మృతి । నాసన్నిధిరచన జేయు నమ్రత యోగా । భ్యాసము జేయుచుననుటయు । నాసీనుడనై సభక్తి యాత్మ నెలకొనన్.

## షష్ట్యంతములు.

క॥ ఓంకారరూపునకు నక । ళంకజ్ఞానమయచిత్కళాఘనునకు ని । శ్శంకాస్పదముక్తత్వ ద । శాంకితమాయానిరసన శక్తియుతున

కుఁ॥ క॥ వేదాంత వేద్యునకు సము। పాదితవిజ్ఞానమార్గ భవ్యకళా ఘం।
పాదితి తేజోమయునకు । నాదిమపూరుషున కవ్యయానందునకుఁ॥
క॥ మానసపరిపక్వమహా । జ్ఞానకళామయబహుప్రకాశితునకు న, జ్ఞా
నతమస్సూర్యునకు జి । దానందరసైక వైభవాయత మతికిఁ॥ క॥ పరి
శుద్ధతత్వవిద్యా । భరితాంతఃకరణ భక్తపాలన లీలా, దరభవ్యమహా
త్మునకు । పరమోపాయులకు లోక భారవహునకుఁ॥ క॥ మాయా
మయపరచిత తే । జోయుతునకతీంద్రియునకు సూక్ష్మఘనత్వా । త్యా
యుత నిజమార్గునకన । పాయచరిత్రునకు నిత్య పరిశుద్ధునకుఁ॥ క॥
సత్వాశ్రయునకునధిక మ । హత్వాభాసకునకింద్రియజితసదాత్మ । స్థి
త్వాంతర్యామికి పర । తత్వజ్ఞమహాజనస్తుతపరోన్నతికిఁ॥ వ॥ సమ
ర్పితంబుగా నాయొనర్పంబూనిన మనుస్మృతియను ధర్మశాస్త్రప్రకా
రం బెట్టిదనిన॥

—నానా ఋషిగణంబులు మనువుఁ దర్శించి సంభాషించుట—

చ॥ మనువొకనాఁడునిశ్చల సమాధివశస్థితి నిర్మలాసనం ।
బున సుఖలీలనుండుతరి పూర్ణ తపోధనులేగి యమ్మహా । త్ముని
గనిసన్మునీశ్వరులు మ్రొక్కివినమ్రతనిల్వఁజూచి యా । సనములొసంగి
యర్చనలు సమ్మతి జేసియతండు ప్రీతుఁడై॥ గీ॥ మీరలార్యులరున
పారవిశిష్టత । పోధనులరుశుద్ధబోధనావి । శారదులరునేమిగోరిమత్స
న్నిధి । కరుగుదెంచితిరిమహాత్ములార॥ చ॥ అనవుడు వారలిట్టుల
మనయ్యు సమస్తచరాచరప్రచే । తన బహుళంబుజాతిమత ధర్మవిశి
ష్టమునైన యీజగం । బనయమునెట్లుగల్గె నది యానతియీవె
యనంగనాత డా । త్మనియతి దేర్చి సుస్థిర మతంబవలంబనజేసి న
మ్రుఁడై॥ క॥ పరమేశ్వరునిశ్చల సం । భరితాంతఃకరణమందు
బాటించి సమా । దరగతిబొల్చిసుపుష్ట । స్వరమునబ్రార్థించె వేద సార
ఘనితులఁ॥ గీ॥ పరమహంసుడనగ పరతత్వమనగ ని । రంజనుండునా
ద్యు డవ్యయుండు, నాత్ముఁడనగ వెలయు ననఘుడు రాత్పరు । నర్థశిద్ధిగోరి

యాశ్రయింతు॥ ఉ॥ మానసఫక్వతత్త్వము సమంజసముగ వెలయంగ నిర్మల। జ్ఞానకళాస్వరూపమున గానగవచ్చుచు నింద్రియార్థ స। న్మానితమైన భావమున మానుచునిశ్చలతత్త్వమై యభి। ధ్యానవశంబునన్ సముచితంబుగ బొల్చెడివాని గొల్చెదన్॥ క. వేదవిదులు నుత్తము లును। వేదాంతులు నేమహాత్ము వృత్తాంతము బెం। పేదియరయంగ జాలక। నాదిమతత్త్వమనువాని నాత్మభజింతున్॥ గీ. విశ్వములయం దు దానును విశ్వములు స। మస్తమును దనయందును మహిమగను ట। విశ్వమయుడనియు విశ్వసంవేద్యుడనియు। వేదములబల్క బడు నట్టి విమలుగొలుతు॥ గీ. ఇంద్రియార్థములగ్రహింపకనిశ్చల। తత్త్వమై సదాపరత్వభూత। హేతువై జెలంగు నెయ్యదియాపరం। జ్యోతి నా శ్రయింతు శుద్ధగరిమ॥ క॥ సకలార్థ శిద్ధిగా ఆకున। నిక్రృష్టవివేకమార్గ నిశ్చలతత్త్వా। ధికునాశ్రయింతుమోక్ష। త్వకారణునాదిపురుషు త న్మయరూపున్॥ క. అనియిట్లనేకవిధముల। మనువు జగన్మయుననంత మహిమునియతుడై। వినుతించి ఋషిసమాజము। గనుగొనియిట్లని యె కౌతుకము వెలయంగన్॥

—జగదుత్పత్తిక్రమము.—

గీ॥ అప్రతర్క్యమలక్షణమవిదితము త। మోవిలీనంబునై సర్వ మునుసదాప్రసుప్తమగుచందమున శక్తిగుప్తమై వి। రాజితముదక్క యుండె మున్నిజగంబు॥ క. తదనంతరము స్వయంభవు। డుదితంబగు పరమశక్తి నూదిమహాభూ। తదిదృక్షువ్యంజయమ। త్యుదాత్తగతి జె లగనుండె నూర్జిత భంగిన్॥ వ. అప్పుడు॥ క॥ ఎనయంగానవ్యక్తము। సనాతనమచింత్యమును నిజంబునఖలచే। తనమయమెయ్యది యదియు। త్యనూనవిధంబునై స్వయముగా దోచెన్॥ క. ఆతత్త్వముపరమాత్మన। మేతంబై భవ్యతర సమృద్ధంబై వి। ద్యాతీతంబై ఘనమా। యాతంత్రప్రభవ కారణాప్తిగ వెలసెన్॥ క॥ ఆపరమాత్ముడుసృష్టి। వ్యాపార ము నాచరింప నాత్మదలచి శు। ద్ధాపంబులపై విత్తా। రోపించెన్ దివ్యశక్తిరూపంబు దగన్. వ॥ అంతనది. క॥ పరమాత్మునిచ్చవలనన్।

పరిణామముఁబొంది బీజభావ మెడలి భా । స్కరతేజోపమమైకన । కరు
చిస్ఫారముగ గ్రుడ్డొకటుగా దోఁచెన్. క॥ జగముల కెల్లఁ బితామహుఁ, డగు
చతురాననుఁడు వెలయు నయ్యండమునన్ । దగ నుద్భవించె పటుకాం ।
తి గురుత్వము తనువునందు దీపింపంగన్. క॥ నరనాముండగు పరమే శ్వ
రుని కపత్యంబులగుట జలములు తొలుతన్ । నరములనం బరగియనం ।
తరమవినాశంబులనగ దగెదీర్ఘఖ్యాప్తిన్. క॥ నారము లాశ్రయభూతము
లై రాజిల్లుట ననంతుఁడాద్యుఁడు విష్ణుం । డారూఢి వెలసె జగముల, నా
రాయణుఁడనఁగ నద్వయస్థాపకుఁడై॥ క. కారణభూతము నవ్య, క్తారూ
ఢము నిత్యసదసదాత్మకమె వడే, పార సృజించు జగంబత । డారయ
బ్రహ్మయని శ్రుతులయందు వినబడున్. వ॥ దివ్యశక్తిరూపంబగు బీ
జంబు జలంబులం దారోపించుటం జేసి పరిణమించినట్టి. క. ఆయం
డంబునఁ దగ నొక, హాయనము వశించి బ్రహ్మయమలాత్మనభి, ధ్యా
యుండై ఖండముగం । బాయుతగతి జేసెనుత మహాతపమొనయన్.
గీ. నాకమొకశకలమునను భూలోకమొక్క, ఖండమునను దన్మధ్యంబు
గగనమంత, రాళమును దిక్కులును జలరాశులును ద, గంగ సృజియిం
చె బ్రహ్మలోకమయమూర్తి. గీ॥ అవ్యయాధిష్టమగు పరమాత్మవలన,
సదసదాత్మకమగు మానసంబు మనసు । వలన నేనీపనులకు నీశ్వరుడనను
న । హంకృతియు నుద్భవించె మహాత్ములార॥ చ. తగ మహదాదిరూప
ముచితంబగు మానసమందు మెల్లనన్, త్రిగుణము లింద్రియంబులును
ధీయుతులార తదింద్రియాప్తిమై, యొగచి దనర్చుచుందు బహిరింద్రియ
ములు దదుపాయభూతి భా, తిగలుగు సాధనంబులును దీర్ణతదోఁచె వికార
హేతువుల్॥ గీ. ఇంద్రియము లేనహంకృతి నెనసియారు। సావయవముల
తో నాత్మయందు సన్ని, వేశమై యుండుటను జగదీశుఁడఖిల, భూతకో
టుల సృష్టించె భూరిమహిమ॥ చ. అయమతులార యిట్లవయవాన్విత
భూతి జెలంగుచున్ షడిం, ద్రియములు నాశ్రయించుట శరీరమనన్
నుతికెక్కె నాయుమిం, ద్రియ విజయాత్ములై నెలయు ధీరవరేణ్యులచేత
నిట్లు శం। శయముగ దేహతత్వ మనిశంబు నెఱుంగుడు మీరలందరున్॥

క. పంచేంద్రియ కూటములకు । పంచమహాభూతము లెడపక సహ
కర్మో । దంచితముగ మనసున నివ । సించునహంకార ముల్లసిలునం
దాకన్॥ సీ. మహదహంకారతన్మాత్రంబు లేదును పురుషుని మానస
భూతభవ్య । కారణంబులు నిజకర్తవశ్యంబులవ్యయము లై దగువాని
వలన నశ్వ । రంబగుమూర్తిమాత్రంబు చరించు నశించు నెన్నడును
నశించవని స । నాతనంబులు త్రయములౌగు గుణము లొక్కొక్కటి
కొక్కడు మిక్కిలియగు । నిట్లుసర్వంబుమాయా మహితముగ నుట ।
నామములు కర్మములు సమున్నతముగాగ । కల్పనము జేసె నాదినాగ
మములరసి । యాదిదేవుండు సర్వభూతాత్మలకును॥ గీ. అదితేయులు
సాధ్యగణాదులయిన । ప్రాణిసంఘంబులను హేమపర్వతాదు । లైన
కర్తాత్మజీవచయంబులను సృ । జించె యజ్ఞంబులను నవ్విరించి మొదట॥
గీ. ఋగ్యజుస్సామ వేదప్రయోగ్యములగు । నగ్ని వాయురవిత్రయంబజు
డు సృష్టి । జేసెతన్మహితార్థముల్ జెలగ యజ్ఞ । శిద్ధికొఱకు నితాంత
ప్రశిద్ధి వెలయ॥ మ॥ తగమాసర్వయనాబ్దరూపముగ నిత్యంబైన కాలంబు
బు । ఋగణంబుల్ గ్రహపంక్తిసాగరములన్ శైలంబులన్ నేరులన్ ।
జగతీభాగమునన్ సమానవిషమస్థానంబులన్ జేసె భా । గగుణాకర్షణ
శక్తిభూతముగ సర్గ స్ఫూర్తిరంజిల్లగన్॥ క. తపమును వాక్కియు రతియు
ను । కుపితంబునుకామమును మిగులు టాదిగనే । రుపు వెలయగాసృ
జించె త । దుపరిమనుష్యులసృజించు నుద్దేశముతోన్॥ క. ధర్మాధర్మ
ద్వంద్వము । కర్మవివేకార్థమై సుఖము దుఃఖంబున్ । బేర్మిననుభవ
మొసగున । ట్లర్మిలిసృజయించె తద్గుణాదుల తోడన్॥ క. ఏయేకర్మ
ములందన । పాయస్థితి వెలసె తొల్లి పాటిసెలగ న । త్యాయతతత్ఫల
ములకను । వైయొప్పగ జంతుకోట్ల నట్లుసృజించెన్॥ క. నృతమృదు
ధర్మాహింస । వ్రతములకనృతంబునిష్ఠురమధర్మము హిం । సితకృత్యం
బులు కారయ । జతనంబుగ సృష్టిజేసె జంతుగణములన్॥ క. ఋతు
కాలాసన్నంబున । ఋతుచిహ్నాలవెట్లుదోచు వృతులంబులకు । న్నతిన
ట్లు కర్మపుంజము । వితథంబుగ జంతుకోట్ల విడువకదోచున్॥ గీ. వదన

బాహూరుపదములవలన విప్ర । రాజవైశ్య శూద్రాఖ్యవర్ణములు
వాల్గు । సృష్టిగావించెలోకంబు వృద్ధిబొరయ । కనకగర్భుండు నిర్జరగణ
మువొగడ॥ క. పూరుషగణములనై జశ । రీరార్ధంబునగడ మశరీరార్ధ
మునన్ । నారీజనముసృజించెన । పారంబగులోకభూతి బాటిల్లంగన్॥
క. తపమాచరించియెవ్వని । నిపుణతసృష్టించెనాతనిన్ ననుసర్వం ।
బపరిమితముగ సృజింపన్ । నుపాయవిదునిగజేసె నుదితప్రతిభన్॥
క. నేనునుసృష్టింపంగా । బూనితపంబాచరించి బుట్టించితి బ్ర । జ్ఞాని
ధుల ప్రజాపతులన । మానస్థితి పదుప్రురన్ మనోధృతియుతులన్ ॥
వ. మరీచియు మతియు నంగిరసుండును, పులస్త్యుండును, బులహాలుం
డును, క్రతువును, బ్రచేతనుండును, వశిష్ఠుండును, భృగువును నారదుం
డునన్ బరగు నీపదుగురు మహర్షి పుంగవులు జగత్సృష్టికారదక్షులై
నానాస్థావరజంగమంబుల సృజించి రవ్విధం బెట్లనిన॥ సీ. యక్షరక్షః
పిశాచాప్సరసనుర గంధర్వనాగపితృ పృథగ్గణములు। సౌదామినీశక్రచా
పనిర్ఘాత గర్జనమహోల్కాది యూష్మముల మరియు । కిన్నరమానవ
కీశమత్స్యవిహంగ పశుమృగవ్యాళాద్యుభయరదముల । క్రిమికీటకఖగ
మక్షిక మత్కుణాదిగజంగమ ప్రతతులస్థావరంబు । లైన పాషాణశైల
వృక్షాదులను సృ । జించిరుచితవిధానముల్ సెలగవార । లీజగముదే
వతాలయుభ్రాజితము త । రంగిణులు కొలకులును సముద్రములుగూ
డ॥ ఉ॥ మానవులాదిగా మృగసమాజములెల్ల జరాయుజంబులై । మీ
నములున్ ఖగాదులు సమేతముగాదగినండజంబులై । మానుగదంశకా
దులగు మక్షికజాతులు స్వేదజంబులై । గానగవచ్చునుద్భవ ప్రకారమె
రింగినవారి కారయన్॥ గీ॥ బీజకాండ ప్రరోహితాప్తిజెలంగి । స్థావర
ములగు పాదపసస్యజాతు । లనయముద్భిజ్జములసంగ దనరుచుండు ।
పుష్పపల్లవ సంకీర్ణభూతులుదగ॥ వ॥ పుష్పంబులుగానరాక ఫలించెడి
వృక్షంబులు, వనస్పతులనియు పుష్పించి ఫలించెడి మహీజంబులు వా
నస్పత్యంబులనియు జెట్లుద్వివిధంబులై యుండు మఱియుగుచ్ఛగుల్మాద్య
నేక విశేషంబుల తృణజాతులు వృద్ధిబొరయుచుండు నిట్లు చరాచరచేత

నాచేతనంబులు పుట్టువిధంబులుజెప్పితి వెండియు॥ క॥ జగమిట్లుసృజింపం
గనె। సగుణశ క్తిజెలంగు మానసంబున నన్నుఁ। దగనంతర్ధానముజే। సెగు
ణాతీతుండజుడు వశీకృత భంగిఁ॥ క॥ ఆదేవుడు జాగర్తిస। మాదర
గతినుండునంత కలఁడుజగము శాం। తోదయమగు నిద్రారతి। నూది
నయపుడణగునది। మహాత్ములారా॥ మ॥ అతినిద్రారతిబ్రహ్మయుం
డు నెడకర్మాధిష్ఠితప్రాణి సం। తతులాత్మీయములైన కర్మములునిత్యం
బున్ విసర్జించి సం। యుత సర్వేంద్రియమానసస్ఫురణముల్ యో
గ్యప్రకారంబుగా। నతనిఁ జేతన వల్లభుఁ ప్రభువునందావేశ మొందుఁ
తుదిఁ॥ గీ. ఇంద్రియములెల్లగూడి రహించిగుప్త। మైనకరణతమో
గుణమాశ్రయించి। గడపుచిరకాలమమ్మహాకాలమూర్తి। మాన
సంబునదొడరి విలీనములయి॥ గీ. మృదితపుర్యష్టకాది సమేతభంగి।
జీవుడుమెలంగుచుండి సృజింపజేయు। వెలయుశాంతోదయస్థితి విడచి
బ్రహ్మ। మానసంబునజగము సన్మాన్యులార॥ గీ. ఈతెఱంగుననప్పర
మేశు జాగ్ర। దాప్తివెలయుచునుండు చరాచరాది। చేతనంబులత
దు నిద్రజెందునప్పు। డడగుసర్వంబు తమము జేద్వాడినపగిది॥ క. ఆది
విరచించిపరమ స। మాదరమునజెప్పె నిమ్మహాశాస్త్రము నా। కాదే
వుండేనుమరీ। చ్యాదులకెఱిగించితి తదనంతరముదగఁ॥ క. ఏనెఱిగిం
చిన యీశా। స్త్రానుష్ఠానములు భృగుమహర్షీంద్రుడు స। న్మానమతి
జెప్పునితడస। మాకకళావిదుడు బుద్ధిమంతుండరయఁ॥ వ. అనిచెప్పి
నంత॥ క. మానవుని వాక్యములకు మ। హానందముబొంది భృగు
మహర్షీంద్రుడు గో। ష్ఠినింతి పెంపు వెలయం। గానిట్లనియెఁ మునీం
ద్రగణములతోడఁ॥ క. మనువునకు పిదపనార్వురు। మనువులుదయ
మైరి తత్క్రమంబునను తపో। ధనులగు నమ్మహానీయులు। పనివడి
సృష్టించిరుచిత భంగిజగంబుఁ॥ వ. స్వారోచిషోత్తము తామసరైవత
చాక్షుషవివస్వత్సుత స్వాయంభువులను నీయేడ్వురు మనువులొక్కరి
పిదప నొక్కరుగా నీజగంబుసృష్టింపుచు వచ్చిరని పలికి వెండియు నిట్ల
నియె. పదునెనిమిది నిమిషంబులచేత నొక్కకాష్ఠంబు నట్టి కాష్ఠంబులు

ముప్పదియైన నొక్కకళయు, నట్టికళలు ముప్పదియైన నొక్కముహూ
ర్తమును, నట్టిముహూర్తములు ముప్పదియైన నొక్కయహోరాత్రంబు
ను జెల్లుచుండు॥ గీ. అయ్యహోరాత్రమున బగలనగ రాత్రి । యనగ
విభజించె సూర్యుడనంతమూర్తి । భూతకోటులు నిజకర్మభూతినుండు।
దివసమున రాత్రియందు నిద్రించియుండు॥ సీ. మానవులకునొక్క మాసం
బుచని నహోరాత్రిమగు దనరారుపిత్రు । దేవతలకు నందుదినమగు
శుక్లపక్షంబు రాత్రియగు గృష్ణంబు పూర్వ । పక్షంబుననుకర్మభరము
ననుండు వారపరపక్షమున నిద్రాప్తినుంద్రు । దేవతలకునొక్కదినమును
రాత్రియుచన మనుష్యులకు వత్సరమొకడగు । దక్షిణోత్తరాయణ
ములు నాగదనరియందు । నుత్తరాయణమగు దినమొనరదక్షి। ణాయ
నంబగు రాత్రిదివ్యతరమైన । మానగరిమంబు దగబుద్ధి మంతులార॥
గీ. బ్రహ్మదేవునిదివసంబు రాత్రియును యు । గంబును యుగాంతర
మునగు గానవుణ్యా । కాలమానములగు తద్విధాఖ్యాతములుగ్ర । మంబు
నవధింతుమీ మానసంబులలర॥ గీ. హాయనంబులు నాల్గువేలన్ని
సంధ్య । లును తదంశంబులునుగూడ నెనయుకృతయు । గంబు
దక్కనమూడుయుగంబులట్ల । వెలయు వేయేసివత్సరంబులునుదరుగ॥
వ. ఇది దేవమానప్రకారంబు మఱియును॥ క. మనుజులచతుర్యుగం
బులు । వినుడుగ్రమతఃదియు రెండు వేలయుగంగా । జనుసురులకొక్క
యుగమై । సనాతనదేవమాన సరణివెలయగన్॥ గీ. విబుధులయుగం
బులొకరెండువేలుచనిన । బ్రహ్మదేవునికొక యహోరాత్రమరుగు।
వేయియుగములు పవలును వేయియుగము। లరయరాత్రియునైనుమహా
త్ములార॥ క. వినుడిట్టు లహోరాత్రము । చనినన్ మేలుకొనిభవ్య
సరణివెలయుచున్ । మనసు సదసదాధికమై । యనుపమమైజెలగ
బూను నజుడుసృజింపన్॥ క. తగమనసుచేతసృష్టిం । పగనుద్యోగం
బుపెంపు వడపతదుదయా । ప్తిగగనముదోచె బహుశ । బ్దగుణ
విశిష్టంబు నున్నతమున్యయమై॥ గీ. గగనమునబుట్టె లలిసర్వగంధ
వహము । శుచియు బలవంతమగువాయువు చలనంబు । స్పర్శగుణము

ను శీఘ్రుంబు సర్వభూత । వాసయోగ్యత వెలసి సర్వజ్ఞులార॥ క. వా
యువువలనజనించె స । దాయతరోచిష్ణునుతమోనుదము మహా ।
స్థాయమునై జ్యోతిగ తా । పాయసుభాస్వద్గుణంబు పాటిసెలంగన్॥
క. జ్యోతివలనపము సము । ద్భూతంబయ్యెన్ గుణంబుపూతంబు
రసా । శీతమ్మునై పృథివిగం । థాతిగుణముగలిగియపమునందునదో
చెన్॥ వ. పంచమహాభూతంబుల ప్రకారంబు జెప్పితి నట్లు మనుష్యుల
చతుర్యుగంబులు పండ్రెండువేలుచన్నైన దేవతలయుగంబొక్క డేకస
ప్తతిగుణింప నెన్నివత్సరంబులగునంత కాలంబు మన్వంతరంబనంబరగు
మఱియును॥ క. తగమన్వంతరములు పె। క్కగుసర్గప్రళయములునగు
నక్కాలం । బగణితమయ్యు విధాతృడు । జగములుసృష్టింపుచుండు
సంతతలీనన్॥ క. కృతయుగమునందుధర్మము । చతుష్పదభూతి వెల
యు సత్యశమసమ । న్వితముగ నధర్మరతులు గు । మ తు లు మ
దోద్ధతులులేక మహిమంబుదగన్॥ క. తక్కినమూడుయుగంబుల ।
నొక్కకపాదంబుదరుగు నూర్జితధర్మం । బెక్కుడగునపాయంబులు । రు
క్కులహాదులు జగతినరులబుుషులారా॥ క. రోగభయరహితు లత్యు ।
ద్యోగాప్తులు వర్షశతచతుష్కాయుఃపూ । ర్ణాగతులు కృతయుగంబు
న । భోగపరాయణులునరులు బొల్తురుసుఖమున్॥ క. త్రేతాద్వాపర
కలిసం । భూతులుపాదక్రమమున పూర్ణాయువొకం । డైలరుగనరులు
బొల్తు రె । తీతంబగు ధర్మపథమదియునట్లజనన్॥ క. వేదార్థంబులలో
నుపపా । దించిన యాయుర్థపరిమాణంబుల్ । బ్రోదిగ వెలయునశిం
చు కృ । తాదియుగములందు తత్క్రియామూలములై॥ క. నాలుగు
యుగములధర్మవు । పాలొకడుగదరుగ నేక పరిమాణంబున్ । దూలి
పలుమార్గములుగా । నాలోకింపగబడున్ మహామునులారా॥ గీ. త
పముజ్ఞానంబుయాగముల్ దానములన । బరగునీనాల్గుధర్మముల్ ప
రిణమించి । నాల్గుయుగములయందు జేయంగదగిన । కర్మములగు నొ
క్కొక్కటి పేర్మిమెరయ॥ క. వదనబాహూరుపదముల వలననాల్గు।
వర్ణములను బుట్టించి యావర్ణములకు । దగవిభాగించె ప్రత్యేకధర్మ

సరసి। బ్రహ్మదేవుండు యోగ్యమార్గంబు వెలయ॥ వ. అది యెట్లనిన॥ గీ. అవనినాధ్యాపనము నధ్యయనము యజన। యాజనంబులు పాత్ర దానప్రతిగ్ర। హంబులనబరగు నాఱుకర్మంబు లర్థి। బ్రాహ్మణులకు విధించెనా బ్రహ్మమొదట॥ క. మానవులనురక్షించుట। దానము నధ్యయనసప్తతంబులు భవ్య। జ్ఞానమువిధించె నిత్యము। భూనుతము గక్షత్రియులకు పూర్వంబుదగన్॥ క. గోరక్షణమధ్యయన మ। పార వణిక్పథ మఖకృషిభవ్యత్వము దా। నారూఢియువైశ్యులకు స। మారాధితధర్మపథము లర్హాతమంబుల్॥ క. పాదజులకగ్రజన్ము లు। పాదించినకృత్యములను బాటించుట యు। త్యాదరముననర్హాతమము। లై దగుదానములుసేయు టగునిత్యంబున్॥

—బ్రాహ్మణప్రభావము.—

గీ. వెలయమంత్రాధికులు బ్రాహ్మణులగుటను స। మస్తధర్మప్రధానకర్మముల కెల్ల। వారలధికారులుచిత సంస్కారపరులు। పాత్రతములగునేనియు భవ్యులార॥ గీ. వదనమునహవ్యకవ్యాది వాహనార్థ। మణువుకొఱతయు లేకబ్రాహ్మణుల మొదట। బ్రహ్మదేవుండు బుట్టించె రాజవైశ్య పాదజాదివర్ణములకు ప్రభువులగను॥ గీ. విప్రముఖమునహవ్యముల్ విబుధులకును। కవ్యములుపేర్మిమై పితృగణములకును। భుక్తమానంబులగుట దపోవిశిష్టు। లైనవారలకన్న మేలైనదెద్ది॥ వ. మఱియు సమస్తచేతనంబులయందును సప్రాణంబులగు కీటకాదులును వానికన్న బుద్ధిమంతులగు మృగాదులును వానికన్న మనుష్యులందు జాతిమాత్రబ్రాహ్మణులును వారికన్న విద్వాంసులును వారికన్న బ్రహ్మవేత్తలు నుత్తములనంబరగు నట్లుగాన బ్రహ్మవేత్తయగు బ్రాహ్మణుండు సర్వజనమాన్యతముండగు నంతియగాక॥ సీ. ధర్మమూర్తియనంగ ధర్మార్థముదయించు పావనస్ఫూర్తిమై బ్రాహ్మణుండు। భూతకోటులధర్మ మూలంబులుగజేయ ప్రభువునై విలసిల్లు బ్రాహ్మణుండు। జగతిసమస్తంబు శాశ్వతంబుగదాన బాలింపనర్హుండు బ్రాహ్మణుండు। స్వయమఱదాసమస్తము భుజించియు సంగ పరితుష్టి

గలవాడు బ్రాహ్మణుండు। భవ్యతముకు విశిష్టుండు బ్రాహ్మణుండు। బ్రహ్మవిజ్ఞాననిరతుండు బ్రాహ్మణుండు। బ్రహ్మసముడు మహాత్ముండు బ్రాహ్మణుండు। గాన బ్రాహ్మణునకు సాటి గాఁడొరుండు॥ క. మనునీశాస్త్రంబుతపో। ధనులగు బ్రాహ్మణులు భవ్యతాత్పర్యసమ। గ్ర నిరూఢి జగతివెలయిం। పననూనతసృష్టి జేసె వారలమొదటన్॥ క. విమవకనీశాస్త్రము। దొడరిదృఢవ్రతుడు సమ్మతుడునాదగు వి। ప్రుడు ఘోర పాపపుంజము। వెడలనణచి ముక్తుడునుపవిత్రుండునగున్॥ క. విదితాత్ముండగు విప్రుం। డిదివిడువక జదివిశిష్యబృందంబులచే। జది వించిజెప్పవిననగు। తదితరు లెన్నడును జదువ దగదా స్మృతిమెయిన్॥ క. ఈశాస్త్రము షంక్వాదివి। శాశోద్గతమార్గమెడల గానీకమనీ। షాశక్తిమెయిపఠింపం। గా శుభములు వొరయు ధర్మకర్తలకెల్లన్॥ క. ఇది మంగళకర ముత్తమ। మిది బుద్ధివివర్ధనము మహితతరకీర్త్యా। స్పదమాయుస్సౌభాగ్య ప్రదమార్జవమైన తెఱవు భవ్యము జగతిన్॥ క. కర్మముల తెరవుధర్మా। ధర్మపథంబులును వర్ణధర్మములు వధూ। ధర్మాదులెల్లనీస్మృతి। బేర్మిన్ విరచింపబడియె పృథుతంత్రములన్॥ క. నీచగతిగాక స్మృత్యు। క్తాచారముగొనుట ధర్మమదిగావున ని। త్యోచితరతులగు విప్రుల। కాచరణీయంబు లీమహాశాస్త్రవిధుల్॥ క. లేదాచారము దొరగిన। వేదమువలనన్ ఫలంబు విప్రులకు ఫలో। త్పాదనమగు నాచారం। బాదరమున నడపుజనుల కతిసేమమునన్॥ గీ. పరమధర్మంబునకు నాటపట్టుగాన। విడువకాచారముప దపోవృత్తి నడపి రెల్లఋషులు తమంతనయిచ్ఛజెలగి। గానయాచారమధిక యోగ్యతమమగు॥ సీ. జగదుద్భవప్రకాశ ప్రకారంబును సంస్కారనియమ ప్రశస్తవిధియు। దారాధిగమన ముత్తమ వివాహాది లక్షణములు శ్రాద్ధసంకల్పములును। వృత్తిలక్షణములు వివిధభక్ష్యాభక్ష్య విధులును శుద్ధత్వ విశదములును। స్త్రీధర్మములు ధరిత్రీపతిధర్మంబు లాశ్రమకర్మవర్ణాదికార। ణంబులును భవ్యవిజ్ఞాన నైష్ఠికములు। దానవుల తెరవు బ్రాహ్మణాతాగరిష్ఠ। మార్గములుదరుగు హేతువుల్ మాన్య

లార| సర్వమును జెప్పబడియె నీశాస్త్రమందు॥ క. ఏనమగ జెప్పెమనువు ద| యానిధియై పూర్వమిమ్మహాశాస్త్రము దా| మౌనివరులార వినుడ వ | ధానంబున నర్థిజెప్పెదను సర్వంబుల్॥ వ. అని చెప్పెనని.

చ. యమనియమాదియోగ వివిధార్థపరిస్ఫుటదివ్యబోధనా
శమితదురింద్రియప్రకట సారఫలానుభవప్రదీప త
త్త్వమయసమత్వమార్గబుధ వందితపాద సరోజ వేద వా
క్యమహిత సూక్ష్మవర్తన నిరంజన శాశ్వత మోక్షదాయకా.

క. శాంతోదయ భవ్యతమ
స్వాంతసరోజాతసద్మసత్యాశ్రయ వే
దాంతమయ నిర్ద్వయస్థిత
హాంతకహానప్రకారశాన్యాప్తగతీ.

మాలిని. స్మృతిమహితతరార్థ శ్రీకరవ్యాప్తభావ
స్థితచిదుదయమానోద్దీపసత్త్వప్రథానా
గతకలుషవికారాక్రాంతరాహిత్యబోధా
మృతసదుపమానా మృత్యుదూరాభిధానా.

గద్యము.

ఇది శ్రీమత్పరమేశ్వర లీలా విచిత్ర ప్రపంచ సేవాపాత్ర శ్రీమద్వ్యాగపురెడ్డి
పాపినాయక పుత్ర నిఖిల బుధజన విధేయ యప్పలనాయక
నామధేయ ప్రణీతంబైన శ్రీమదాంధ్రమనుస్మృతియను
మహాధర్మశాస్త్రమునందు ప్రథమోధ్యాయమ్
సంపూర్ణమ్.





శ్రీ ర స్తు.

శ్రీమద్ద్వితీయరామకృష్ణపరమహంససద్గురుస్వామినేనమః.

# శ్రీమదాంధ్ర మనుధర్మశాస్త్రము.

:o:

## ద్వి తీ యా ధ్యా య ము.

శ్రీసత్కారసమయో । ద్భాసిత సర్వప్రపంచ పరిపాలన వి । న్యాసబహుకరణ నిత్య వి । లాసనిరంజనజగన్నిలయ పరమేశా॥ వ॥ దేవాయవధరింపు మమ్మహర్షి సమాజంబులతో భృగుమహర్షీంద్రుం డిట్లనియె॥

### —* వేదప్రశంస *—

క. రాగరహితులయునుత్తమ । యోగానందమయమానసోన్న తులయునా । జ్ఞాగరిమవడసియెయ్యది । పూగంబగు ధర్మమది ప్రబోధిం తుదగక॥ క॥ వేదాధిగమనభంగియు । వైదికధర్మములు సర్వవర్ణంబు లకా । మోదములగుకర్మములు స । దాదరణీయమగు కామమందర హించుక॥ గీ. కామమునకు మూలంబు సంకల్పమరయ । యాగము లును సంకల్పంబునందవోడము । వ్రతనియమధర్మములును సర్వంబుగ లుగు । నుచితసంకల్పమునగాని దొండులేదు॥ గీ. కామముననుగాని కార్యమొక్కటియును । లేదు లౌకికమున వైదికమున । నెదియొనర్పబడి యె నదికామచేష్టితం । బింతనిజము సన్మునీంద్రులార॥ గీ. కామము చితభంగిగాప్రవర్తించిన । బడయునిహపరములపరమసుఖము । సర్వ

కామములును సంకల్పమూలంబు । లిష్టులగుట బుధప్రవరయువలయు.
క. వేదములు ధర్మమూలము । లాదరణీయంబులును తదంగములగు
స్మృ । త్యాదులు నాచార్యాద్యుప । పాదితములు సాధువులకు పరిమా
ణంబుల్॥ క॥ అనుపమముగ నేధర్మము । మనువు ప్రబోధించె వేదమత
మది విజ్ఞా। ననిరూఢము భవ్యతమము । వినుడాచరణీయము బుధవిశ్రు
తులారా॥ గీ జ్ఞాననేత్రమునను సర్వంబు వేదసా । మాన్యవర్తనక్ర
మంబుజూచి । విబుధుడాత్మధర్మవృత్తిదొలంగక । నుచితగోష్ఠి వెలసి
యుండుటొప్పు॥ క. శ్రుతులందుఁ స్మృతులందువి । దితమగు ధర్మ
ములునడపి దివిరిమనుష్యుల్ । సతతముభయలోకసుఖ । స్థితులువడ
యుదురుసదా విశిష్టచరితులై॥ గీ. శ్రుతులు వేదంబులనియును స్మృతు
లు ధర్మ । శాస్త్రములనియుదెలసి తత్సమ్యగుక్త । ధర్మపథములయంద
లి తర్కబుద్ధి । మెలగునదియట్లు నడచిన మేలుగలుగు॥ గీ॥ వేదములు
నుస్మృతులు వెలయబల్కు సధర్మ । పథములందు తర్కభంగిదొడరి ।
హేతుశాస్త్రవిధుల నేద్విజుండనరించు । నతడు నాస్తికుండయనిరిబు
ధులు॥ క॥ వేదస్మృత్యాచార స। మాదరములుదుష్టియునుప్రియమునను
నాల్గిం । పైదగుసధర్మమూల । త్వాదశనెమనువువినియత వ్రతులారా॥
గీ. అర్థకామంబులందు సదాదరంబు । గాని వానికి ధర్మజిజ్ఞాసపరుని ।
కరయుకర్మపరిజ్ఞానమధిదమింప । వేదముప్రమాణమును లోకవిశ్రుతం
బు॥ క॥ వేదంబురెండుతెరవులు । పాదించుఁ నెచట ధర్మపథమొకటికి
నై । రాదృతినచ్చట స్మృతివా । క్యాదరవేదాంశము గొనదగు నొక
టిదగఁ॥ గీ వైదికస్మృతివెలయు సూర్యోదయాస్త । మయములన
ఋతునిచయ సమయములందు । యాగవిఖ్యాతపరమమంత్రార్థభరిత ।
స్తోసమస్తక్రియామాత్రమైధరిత్రి॥ వ॥ నిషేకంబుమొదలుశ్మశాన పర్యం
తంబు నిత్యశుద్ధ కర్మరతుండగువానికిఁ దక్క నన్యులకు వేదంబునందు
నీశాస్త్రంబునందును చొరవుసేయుట కీడుమూడగు॥ గీ. క్షితిసరస్వతీ
దృషద్వతులనంగ । వెలయునదుల మధ్యంబగు విపుల దేశ । మనఘు
తరము బ్రహ్మావర్తమనగ వెలయు । నిర్మలంబది దేవతానిర్మితంబు॥

——*పుణ్య దేశ వివరణము.*——

క॥ ఆరయ నేయాచారము। పారంపర్యముగ నందు బరగునదిసదా।
చారం బాచరణీయము। గా రెండు తెరంగులఁ జగంబునుతింపఁ॥
వ॥ మరియు బ్రహ్మావర్తాంతరంబులగు కురుక్షేత్రంబును మత్స్యపాం
చాల శూరసేన దేశంబులును బ్రహ్మర్షి దేశంబులనంబరగు॥ గీ॥ ద్విజవ
రేణ్యులు బ్రహ్మర్షి దేశభవులు। కర్మతంత్రాదులుచితంబు గఁబవిశిక్ష।
సేయునప్పలు నిత్యార్చనీయులునగు। తదితర సమస్త జనులకు విదిత
మతులు॥ సీ॥ వాటంబుగాహిమ వద్వింధ్యపర్వత రాజమధ్యమము పూ
ర్వదిశవినశ। నంబునుదీచి బ్రయాగయుమొదలుగా వెలయు దేశంబుపవి
త్రమది య। మధ్య దేశంబు నాబరగు వెండియుపూర్వపశ్చిమార్ణవము
లు పారములుగ। హిమవంతమునకు వింధ్యమునకు నడుమ భాతిద
గియార్యావర్త దేశమమరు। కృష్ణసారమృగంబు నిజేచ్ఛ జెలగి। యెచ్చ
టచరించు చుండు యజ్ఞీయమందు। రాజ్యలా దేశమింక నన్యంబులైన।
దేశములు దెలయునదిమ్లేచ్ఛ దేశములుగ॥ క॥ ఏ దేశము పావనము మ।
హీదేవతలచటికరుగు కెల్ల శుభము సు। శ్రీవారగి వృత్తి కర్శితు। లైద
గుశూద్రులునుబోవ నగుననిరిబుధుల్॥ గీ॥ ధర్మయోనివిధంబు చితంబు
సంగ్ర। హంబుగా జెప్పితిని సమస్తంబులైన। వర్ణధర్మంబులింక నవశ్య
మెఱుగ। బలుకుదువినుండు మీరలు ప్రాజ్ఞులార.

——*నామధేయవిధులు*——

ఉ॥ వైదికపుణ్యకర్మము లవశ్యముపాటి పెలంగగా నిషే।కా
దులుజిత్తశుద్ధియు సమంచితయాగవిధానముల్ గ్రమం। బైదగువిప్రు
జాతి కుచితార్థముభవ్యపదంబు శుద్ధ మం। త్రాదిబలంబునిత్యము మ
తానుభవ ప్రచురంబు లిమ్మహిఁ॥ గీ॥ గార్భహోమజాత కర్మమూం
జీని బం। ధనమునుచితభంగి దగుటజేసి। గార్భికంబువైజికంబు బ్రా
హ్మణులకు। ముఖ్యమైనకర్మములు ధరిత్రి॥ ఉ॥ ఆయతమైనవృత్తి వెల
యంగమహీసుర కోటికెల్ల స్వా। ధ్యాయ విధి ప్రశస్త వ్రతంబులు
విద్యలు మూడు దానముల్। శ్రీయునుపంచయజ్ఞములు సేయుట ని

త్యపవిత్రభూత బ్రా । హ్మాయతనుత్వశిద్ధులు రహించునతీంద్రియ వి
స్ఫుటంబుగ౯॥ గీ॥ బొడ్డుకోయుటకును పూర్వంబు జాతక । ర్మాదివిధు
లు పురుషునందుజేసి । తేనెయునుఘృతంబుదియ్యని రసములు । బసగ
నేయువలయు ప్రాశనంబు॥ గీ॥ దశమియందునైన ద్వాదశియందైన । పు
ణ్యతిథిముహూర్త పూతగుణము । లైనతారకంబు లందైననామ ధే ।
యమువిధింపవలయు నమరునట్లు॥ గీ॥ బ్రాహ్మణునికిమాంగళ్యంబును
పార్థివునకు। బలసమేతంబువైశ్యునికలఘుపుష్టి । కరముశూద్రులకుసే
వ కత్వసంయు । తములగునామధేయముల్ దగునిడంగ॥ గీ॥ పొస
గుశర్మవర్మ భూతిదాసయను ని । వ్వాచకములు నాల్గు వర్ణములకు ।
వరుణ శర్మ కృష్ణవర్మ మహాభూతి । దైవదాసయను నుదాహరణము॥
క॥ ఆదిసుఖోద్యమమాశీ। ర్వాదపరంబును మనోహరము విస్పష్టా। ర్థో
దయమగు నామంబిడ । గాదగునంగనకు లోకకల్యాణముగ౯॥ వ॥
ఇది సర్వవర్ణంబులయందును సామాన్యధర్మంబైయుండు మఱియును॥
గీ॥ నాలుగవనెలను ఘనంబు గాజన్మగృ । హంబునుండి శిశువునర్క
దర్శ । నాదులకును దీయనగు నారుమాసముల్ । చనినప్రాశన విధి
సలుపవచ్చు॥ క॥ కాదేనివంశధర్మం। బాదియగుట జేసి జేయనగునిచ్ఛమె
యి౯ । శ్రీదనరారెడి నెల న । త్యాదరణీయులగు విబుధులనుకూ
లింప౯॥ గీ॥ వేదచోదితముగ వెలయుచూడాకర్మ । మన్నిజాతులకు
మహాత్ములార । దొయొక్కయేటనైన నొనరంగ మూడేండ్ల । నైననధి
కవిధులు మానినైన ॥గీ॥ గర్భవత్సరాష్ట కంబునద్విజులకు । క్షత్రియు
లకు పదునొకంట పదియు । రెంటవైశ్యులకు వరిష్ఠంబుగాను ప । న
యనకర్మములు వలయుధరిత్రి॥ గీ॥ బ్రహ్మవర్చసంబు బడయగోరినబ్రా
హ్మ । ణునకుపంచమాబ్దమునను బలము । మనసుగోరుక్షత్రియునకు
నారవయేట । వలయునుపనయన విధులుదగంగ॥ వ॥ ధనంబుగోరిన వై
శ్యునకు నష్టమాబ్దంబునవలయు॥ గీ॥ పదియునారును మఱియిరువది
యురెండు । నిరువదియునాల్గు వర్షంబులేగుటయును । విమలసావిత్రివ
చనంబు వెలయజేయు । టొప్పుద్విజవర్ణములమాట నుజ్జలరసి॥ క॥ ఈ

నియమకాలమునఁ బెం । పైనెరిసావిత్రి వడయనట్టిద్విజాతుల్ । హీనులు
సావిత్రీమం । త్రానుష్ఠానపతితులును నగుబుధులారా॥ క॥ సావిత్రీ
పతితుండగు । నేవానిమహాద్విజులు హసించుచు వానిఁ । జీవన్మృతు
డందురు విబు । ధావలిదగదట్టివానినంటఁగ బలుకన్॥ గీ॥ బ్రహ్మచారి
కొప్పు పైచీరగాఁ గృష్ణ । సారరుసుచాగచర్మములిల । బ్రాహ్మణాదులకు
ను బరగు శణక్షుమ । రోమవస్త్రములు నిరూఢిదాల్పు॥ గీ. ముంజిమ
యము త్రిగుణరంజితమగుమేఖ । లంబువిప్రునకువలయుధనుర్గు । ణంబు
గలిగి రాజునకు వైశ్యునకు శణ । సూత్రగుణముగలిగి శాత్రములుగ॥
గీ॥ ముంజిపలనగార్యము లేమి మూడుగుణము । లైనయమూడేసి యైననై
దేసియైన । గ్రంధులొనరుకుశాశ్మాంతకములు బొలచు । సూత్రములుబా
త్రములగు వర్ణత్రయికిని॥ గీ. బ్రాహ్మణక్షత్రియావైశ్యవర్ణత్రయికిని ।
సూటియగు గార్పాసముశణసూత్రమావి । కంబుచితభంగి మూడు
గుణంబులొనర । పరమవిజ్ఞానమార్గసంభరితులార॥ గీ. బ్రాహ్మణునకు
బైల్వపాలాశకంబులు । క్షత్రియులకు వాట ఖాదిరములు । నార్యులకు
ను పైలవౌదుంబరంబులు । దండములుగఁగొనుటదగుధరిత్రి॥ గీ॥ బ్రాహ్మ
ణులకు కేశాంతికమును రాజులకు ల । లాట సమ్మితమును వైశ్యులకు
స మాన । నాసికాంతికమునుగానునంబులలర । దండపరిమాణములు
గూర్చు ధర్మమొప్పు॥ క॥ ఆదండములవ్రణముల , నాదములు త్తమము
లు నయనలభీతిదముల్ । గాదగుననియెమనువు విబు , ధాదరణీయుడు
జగద్ధితోన్నాప్తిమెయిన్॥ గీ॥ దండముగ్రహించి యభిమతార్థంబుబలికి ।
సూర్యునకు నెదురుదానిల్చి శుచితబొలచి । హవ్యమిడియగ్నికి బ్రదక్షి
ణాప్తిజేసి । యాచరింపఁగవలయు భిక్షాటనంబు॥ వ॥ భవతిభిక్షాందేహి
యని బ్రాహ్మణుండును, భిక్షాంభవతి దేహియని క్షత్రియుండును, భి
క్షామ్ దేహిభవతియని వైశ్యుండును పలుకుట పరమ ధర్మంబు మఱిగు
ను॥ గీ. తల్లినైన తత్సోదరినైన తనదు భగిని । నైనయాచింపమొదట
దానరుగవలయు । బ్రహ్మచర్యవ్రతంబు భవ్యగతినడుప । బూనినయ
తండు నిరుపేదవానివోలి॥ గీ. అట్టిబైక్షికాన్నమ్ము గ్రహించియా । చా

ర్ణ్యనకు నొసంగియాతడుదిన । మిగిలియున్న కూడుదగుదాను గుడుచు । శుచియును బ్రాహ్మణుడు విశిష్టుడునయి॥ క॥ ఆయువుకీర్తియు తేజము । శ్రీయును బుత్రమర్ది నిచ్చ సేయు జనంబుల్ । బాయక శుచిత్వ తాదరి । తో యన్నము గుడువవలయు తూర్పుమొగంబై॥ గీ॥ శౌచభంగిబాలచి

*అన్న మహిమ*

యాచమనము జేసి । తుష్టియాదరంబునిష్టమును స । మార్జవంబు సెల గసన్నంబుగుడువగా । వలయు బ్రాహ్మణుండకలుషరతుడు॥ క॥ పూజింప వలయునన్నము , పూజార్హములగు పదార్థములలోనది బెం , పైజనుమఱియుమహేశ్వరు। తేజోమయమగుటనరులు దృఢనియతిమెయిన్. క॥ పూజించువానికన్నము। రాజితబలమాయువును బొరయగా జేయున్। పూజింపకుండు దుర్మదు , తేజోయుర్విత్తములుగతియు వెలవాపున్॥ గీ॥ ఎవనికైన నెంగిలికూడు నీగుటయును । దొడరియుదయాస్తమయములగుడుచుటయును। వెడవెడగదినుటయునుగాదు నడువవలవ। దెంగిళుల నంటశుచిగాక నిండ్లయందు॥ క॥ ఆరోగ్యాయుస్స్వర్గవి । హారాదిగ సౌఖ్యగతుల కదిభంగకరం , బారయ నతిభోజనము దు । రారాధనపరులకైననయమతులారా॥ గీ॥ బ్రాహ్మ్యతీర్థంబుచేసబాబ్రాహ్మణుండు । దగనుపస్పర్శనము సేయుదైవపిత్రు స । మాఖ్యలగు తీర్థములమాని యార్జవంబు , శుద్ధియునుగలిగి యనిర్విప్రబుద్ధమతులు॥ గీ॥ లాలితాంగుష్ఠమూలతలంబు బ్రాహ్మ్య । తీర్థమనియునంగుష్ఠమూలాగ్ర దేశమంత । రంబుపైవ పిత్రుముఖ తీర్థంబులనియు । దెలియవలయు విప్రాదులు తెల్లముగను॥ గీ॥ వెలయనీమూడు తీర్థంబులవిశదభంగి । నాచమనము పూర్వంబుననాచరించి । పిదపరెంటముఖంబు నాప్తిదగిశిరము ।మఱియు పస్పర్శనము సేయు తెఱగువలయు॥ గీ. వేడియును గాక ఫేనంబు విరియకుండు । తీర్థములనేకాంతగంబుదివుట పూర్వ । ముఖముగానైన యుత్తరముఖముగాగ । నైనసేయంగవలయు సదాచమనము॥ గీ. బ్రాహ్మణుండుహృదయగామియుపార్థివుండు । కంఠగామియుబ్రాశితగామివైశ్యు। డామెయిని శూద్రుడంతరగామియునయి । యాచమనము సేయగనగు

ననిరి బుధులు॥ గీ॥ చెలగికుడిచేత జందెంబు దోలగ ద్రోచి । దక్షిణాసన్ధమందు పిదపధరించి । వామభాగంబునందపూర్వముగ బుచ్చి । కంఠమ్మున మాలెయు జేర్చుటకరము వెలయు॥ క॥ మొలనూలును చర్మంబును । వెలయంగా దండమును పవీతంబుగ మం । డలువును దరిగిన నన్యము । లల్లరధరింపన గుజలములంటిని యతద్దై॥ గీ॥ దండమును మేఖలమునుగమండలువును । జన్నిదంబును జర్మంబు ఛిన్నభిన్న । ములయిన ధరింపనగు నన్యములు జలంబు । లందుమంత్రంబు పరిపూతమగుడునంత॥ గీ॥ బ్రాహ్మణుడు షోడశవత్సరంబునందు । క్షత్రియుండిరువదియు రెంటజన్మనిరువది । నాలుగింటను వైశ్యుండు నవిజెలంగి । కేశసంస్కారవిధుల నంగీకరింప॥ క॥ ఆరయవివాహ విధులును । నారీజనములకుసద్గుణంబులుబతులన్ । నారాధించుటయును సం । స్కారక్రమమనగ వెలయు నడు పెంపుమెయిన్॥ గీ॥ వైదికుల కౌశ్వనుపనయనాది విధులు । దగనెఱింగించితింక నుత్పత్తి పుణ్య । కర్మయోగంబులెల్ల సంగ్రహము గాగ । దెలియబలికెదవినుడు బుద్ధినిధులార॥ గీ॥ గురుడుశిష్యునకునిగూ

## —గురుసేవాప్రకారము—

ఢంబుగానగ్ని । కార్యవిధులు నియతియాగ్యవృత్తి । హింసయుడుగుట యున నేకవిధంబులు । జెప్పవలయు మొదటశిక్ష జేసి॥ గీ॥ నిర్మలాంబరుడును ఘనోనిశ్చయుండు । దాత్తబ్రహ్మాంజలి కృతుండు దఙ్ముఖుండు । నగుచు గురునిసమీపంబునందు శిష్యు । డధ్యయనము సేయుటర్హత మము॥ గీ॥ వేదము పఠించుటకు మున్ను విడచునపుడు । గురుపదగ్రహణంబునిగూఢతమము । నగునభిధ్యాన మొనరించుటది జెలంగు । పరమబ్రహ్మాంజలియనంగ భవ్యులార॥ క॥ వ్యత్యస్తపాణియగుచున । వత్యతగురుపాదయుగళ మమలినభక్తిన్ । నిత్యము నంటగవలయు । వత్యంతము శిష్యుడాత్మ నాదరముదగన్॥ వ॥ వేదంబుజదువ ప్రారంభించునప్పుడధీష్వభోయనియు విడచునప్పుడు విరామోస్త్వితినియు గురుండత్యాదరంబున శిష్యునిం బలుకవలయు మఱియును॥ క॥ వేదముపఠింపబూనుట । కాదినిధిరమమ్ము నన్ మహాప్రణవం బ । త్యాదరమ్మునను .

దువనియ । వేదజ్ఞతసత్క్రియలును విఫలంబయగుర్॥ క. ఆయతకృ
ష్ణాజినముపై । దాయుత్తరముఖముగాగ తనువు నిలిపి ప్రా । ణాయామ
త్రయమునసదా । సేయుచుశుద్ధుడయిదగు వచింపప్రణవముర్॥ గీ॥ ప్రణ
వమునకవయవములనగఁబుతియగు న। కారమును కారము మఱిమకారము
భువి । నిమ్మహాక్షరకూటంబు నెనసిమూడు । వేదములు కల్పనము జేసె
నాది బ్రహ్మ॥ క. వేదత్రయమాధారము । గాదగ సర్వభువనములు
గల్పించెనుదా । నాదివిధాతృడు సర్వో । త్పాదన లీలారతుండు పం
డితులారా॥ క॥ వేదత్రయమున నొక్కొక । పాదము పాదమును బర
గపాదత్రయమై । యాదివెలసె సావిత్రిహ । రాదులకును వర్ణనీయమై
ఋషులారా॥ క॥ ఆయక్షరకూటంబు న। పాయముగల్గక సదాయుభయ
సంధ్యల బెం। పై యెవ్వండు జపించు చి। రాయుస్తేజోధికంబులాతడు
బడయుర్॥ వ॥ మఱియును॥ క. వేదములు జదివియర్థము । లాదరణీయ
ముగజెప్పు నాతనికన్నర్॥ దాదగునుత్తమ ఫల సం। పాదకుడన ప్రణ
వనిష్ఠ బరగుఘనుడిలర్॥ గీ. వెలయబాహ్యస్థలంబున వేయి మారు ।
లామహాక్షరకూటంబు భూమిసురుడు । జపము సేయుటపాప పుంజము
లువాయు । పాముచర్మంబువిడచిన పగిదినిజము॥ గీ॥ బ్రాహ్మణక్షత్రి
యార్యవర్గంబులుభయ । సంధ్యలందుచితకర్మముల్ సలుపకున్న । గర్హి
తులగుదురార్యసంఘంబులందు । బతితులగువారి చాఃస్పనభవ్యులార॥
క॥ వారలకన్నను శూద్రుం । డారయనత్యుత్తముండయన బరగుగరి ।
ష్ఠారతిశాస్త్రీయసదా । చారఘనుండైన యోగిసత్తములారా॥ గీ॥ పా
రగావాప్తి వెలయ నోంకారపూర్వ । కత్రయవ్యాహృతంబులక్షరపదం
బు । నలరు సావిత్రిపాదత్రయంబు బ్రహ్మ। వదన సదనప్రకారభవ్య
త్వగరిమ॥ క॥ దినముదినంబును కడు పా। వనమగుసావిత్రిమూడు వర్ష
ములు జపిం । చినవాడు బ్రహ్మపదవికి । జనుబ్రహ్మత్ముండగుచునె
సగు భవ్యగతిర్॥ వ॥ ఓంకారంబుకన్న కేవలబ్రహ్మంబును ప్రాణాయా
మంబులకన్నతపంబును సావిత్రికన్న పరమపదంబును విశేషంబులుగా
వు మరియును॥ గీ. వేదవిహితంబులైనహోమాదిశుద్ధ । కర్మముల్

క్షరంబులగు నోంకారరూప। మక్షరంబు పరబ్రహ్మమాదితత్త్వ। మవ్యయా
నందమయము మహాత్ములార॥ క॥ వినుడు విధియజ్ఞమునకం । న్ననుజపు
యజ్ఞంబుదశగుణములుశతగుణా । ప్తినెగడునుపాంశు వాత్మ । త్వనియ
తియు సహస్రగుణవిధము లధికమగుఁ॥ క॥ పాకమఖంబులు విధియ।
జ్ఞాకలనస్ఫూర్తి జేయునాతడుజపయ । జ్ఞైకకలాఫలభాగ। వ్యాకృతుల
బొరయఁగాసవస్తాండఁ డగుఁ॥ క॥ జపమున సంశిద్ధిఁబొరయు । నపరమి
తావాప్తివిప్రుడత్యంతముభ । వ్యపదంబన్యక్రియలు ని। రపాయమతిసే
యుఁవిడచునైన ఘనుండై॥ క॥ సారథిరథ్యంబుల వెర । వారగ శిక్షించు

—*ఇంద్రియతత్వము*—

పగిది నార్యుఁడు నియత। స్ఫారస్థితినింద్రియవ । ర్గారూఢిననంచునది మహా
శయులారా॥ గీ॥ పూర్వపండితులు విపులపరిజ్ఞానాత్ము । లరసిచూచి
యింద్రియంబులెల్ల । పదియునొకడటంచు బలికిరివినుడు త । న్మహిత
విధము బుద్ధిమంతులార॥ వ॥ శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబులను నివి
యైదును వాయూపస్థహస్తపాదవాక్కులను నివియైదునుంగూడ దశేం
ద్రియంబులనంబరఁగు నందుశ్రోత్రాదులైదు బుద్ధీంద్రియము లనియు
వాయ్వాదులయిదు కర్మేంద్రియములనియు పెద్దలుజెప్పుదురు మరియు
ను॥ గీ॥ అంతరేంద్రియమగు మనసదియుగూడ । పదునొకం డింద్రియ
ములని బలుకబడియె। నరయ నమ్మనసేంద్రియమాద శేంద్రి। యముల
వెలయించు నిత్యంబునార్యులార॥ గీ॥ ఇంద్రియంబులసగతినెనసి దోష।
పరిచితంబగు నియమంబు పరిహరించి। శిద్ధిఁబొరయు మనంబు విశిష్టభంగి।
గానియమంబు నూదుట కార్యమర్వి॥ గీ॥ ఇంద్రియార్థంబులందురహిం
చునెవ్వడ। ధముడాతండు దుఃఖంబు లనుభవించు। నింద్రియార్థంబులందు
నుపేక్షసేయు । నెవ్వడాతండు ఘనుడగు నిందునందు॥ గీ॥ విషయసం
సక్తములగుచు వెలయునింద్రి । యములతద్విషయాప్తిమై యణచువల
ను । గాదుగాపున నిర్మల జ్ఞానసరణి । నెరిగియునువునవాని జయింపవ
లయు॥ క॥ వేదజ్ఞుండైశుద్ధమ । ఖాదుల నేకములుచేసి యజమానియ
నం । గాదగునైనను దుష్టు । డాదృతుడగు విప్రుడధము డనబడును

ర్వ్॥. గీ॥ వినుటయంటుట జూచుటదినుటదావి । గొనటయుగు నింద్రియేచ్ఛలందనవరతము । హర్షమును దుఃఖమును తుల్యమగుచు వెలయు । నెవ్వనికి నాఘనుండు జితేంద్రియుండు॥ గీ. ఒనరసర్వేంద్రియములందు నొక్కడింద్రి । యంబుదరిగిన ప్రజ్ఞాబలంబుదరుగు । నుదకపాత్రంబునకు బిలమొకడుదోప । జలములన్నియు జారినచందమునను. గీ. ఇంద్రియగ్రామమును దగహృదయమంద । సంయమముచేసి యోగప్రశస్తివెలయు , కాయమభిరామముగజేయ గడగుటొప్పు । సంతతంబది సకలార్థసాధనంబు॥ గీ. పూర్వసంధ్యయందు బొలచి సూర్యోదయం । బైనదనుకమరియు నపరసంధ్య । తారకములకాంతి దనరునంతకును సా । విత్రిజపముసేత పాత్రతమము॥ గీ. పూర్వసంధ్యయందు బొలచిన జపమున । రేయినొదవుపాపబృందమణగు । బాయుపగటివేళ బరగించు బహుకల్మ । షంబు లపరసంధ్యాజపమువలన॥ క॥ వెలయగ పూర్వాపరసం । ధ్యలనెవ్వడుపాసకుండు నాదగడతడు । జ్వలతర బ్రాహ్మణకర్మం । బులనుబహిష్కృతుడగుర్ తపోధనులారా॥ క. అడవివసించుచునియతం । బడరంగ జెలంగినిర్మలాంబుసమీప । స్థుడయిసదాసావిత్రి నె । గడినుడువుచు నొప్పునైత్యకవిధులు సేయర్.

—*గురుసేవాదివిధులు*—

క. వేదోపకరణస్వాధ్యా । యాదులసద్ధోమమంత్రహర్షంబులలే । దాదిననాధ్యాయంబున । కాదరము సమస్తవిధములగు కర్మములర్॥ గీ. నైత్యకమునందు లేదనధ్యాయగరిమ । బ్రహ్మసత్ర బ్రహ్మహుతిహుతత్రయకలాప్తి । బొరసియగునారు గూడసత్పుణ్యఫలమ । హుత్వసంశిద్ధికిని హేతువగుచుమరియు॥ ఉ॥ హాయనమొక్క డెవ్వడనయంబుదగర్ నడపుర్ యథాప్తిస్వా । ధ్యాయము శౌచము న్నియతంబు జెలంగగవాని దుగ్ధమర్ । నేయియుదక్రమర్ మధువునిర్మలతర్ క్షీరభంగి బొల్చున । త్యాయతభూతిదేవ పితృతర్పణ కర్మగరిష్ఠశిద్ధులర్. గీ. గురుహితమునగ్ని కార్యముల్ పరమ భైక్ష్య । చర్యమునధశ్శయనము శౌచంబువ్రతము । లాచరించునదినుఘనయనాధివిధులు । పాటివెల

యంగ బొలచిన బ్రాహ్మణుండు॥ క. గురుపుత్రుఁడర్థదుఁడుశుచి। పరిచా
రకుఁడాప్తుఁడెఱుకపరచునతఁడు ను। ర్వారశక్తసాధులును శ్రుతి। పరతకు
బాత్రతములనుచు బలికిరి ప్రాజ్ఞుల్॥ క. అడుగనివానికి జెప్పఁ। దొ
డరుటయును ధర్మసరణి దొడరకనన్యం। బడిగినవానికి జెప్పఁ। దడ
వుటయునుగాదు పరమధర్మజ్ఞులకున్॥ గీ. ధర్మమార్గంబుగాని యధ
ర్మమార్గ మెవ్వఁడువచించు నెవ్వండుహితముగాన। ధర్మమార్గంబు
నడుగు నింద్యతములగుచు। వారలిరువురుజగతికి వైరులెయగు॥
గీ ఎచట ధర్మార్థమునకు గాకెచ్చమెుయ। శిష్యుడవనీతి శుశ్రూష
జేయుచుండు। నచట సద్విద్య వెలయ దనర్థమయగు। జవిటినేలనిడిన
సుబీజంబు న్వ్రాలె॥ గీ॥ విద్యతోఁగూడ వెలసిన వేదపాఠ। కలనమత్యుత్త
మంబగుగాదువిద్య। లేకనుస్వభావుడై లింగికుడగు। వానిశిష్యుని గా
గొను వడువుదగదు॥ గీ॥ తేనధ స్తేస్మి రక్షమాం దేవియనుచు। మాం
వదేసర్వదాడయామహిత యనుచు। బ్రాహ్మణుండు గరిష్ఠతబలుక
వలయు। మొదటవిద్యావిశేషముల్ మూలములుగ॥ క. నియతేం
ద్రియుశుచివిద్యా। దయితుఁడు సద్వ్రిస్మాచారి దగవిద్యార। క్షయొ
నర్చుటకై మూమని। నయగతిబలుకవలయు నియతమానసుడై॥
గీ. పరమగురుని యనుమతిబడయ కెవ్వ। డాతఁడాయిమ్మై వేదం
బులనంటిపుచ్చు। నతడుభువి వేదతస్కరుడనగబరగి। ఘోరనరక
శతంబులఁగూలు నిజము॥ గీ. లౌకికజ్ఞానమైన నుల్లాస మొదవు। నట్లు
వైదికజ్ఞానంబునైన రెండు। నైన యెరిగించినట్టి మహానుభావు। నభి
నుతింపంగ దగుపూర్వ మధికభక్తి॥ క. పాత్రతముడు సావిత్రీ। మా
త్రజ్ఞుండయ్యు భవ్యమతినిత్యము వే। దత్రయ సమర్థుడయ్యున। పా
త్రతముడునీచకర్మ పాటితుడరయన్॥ గీ. పానుపునకాసనమునకు భ
వ్యుడయ్యు। గురుడు తనయిచ్చమై రాకకొదువసేయ। పూజసేయం
గ దగదిచ్చుపుట్టివచ్చె। నేనిశిష్యుడుపూజించు టెల్లశుభము॥ గీ. స్థిర
సమాధిగరిష్ఠుడై దేహతత్వ। మెఱిగి ప్రాణంబునరచేత నిరుపకొలు
ప। జాలుయువకుండు వృద్ధుండుపదనమునకు। వచ్చిన తదుక్తముగసే

యువలయుపూజ॥ ఏ॥ అదియెట్లనిన॥ గీ. జ్ఞానవృద్ధుడైనవానినిగా దెపూ। జింతురెల్ల ఋషులు శిష్టజనము । లోపిగాన భువివయోవృద్ధభావంబు। గౌరవార్హతమముగాదఁజూడ॥ గీ. వేయివత్సరములపాయంబు లేక జీ। వించుగూబలెట్లు వెలయుపాత్ర । తమములనగ నవ్విధముగాదె యజ్ఞా ని । వృద్ధభావమాత్మ శిష్టులార॥ క. జ్ఞానాస్పదంబుకన్న । జ్ఞానుత్వాను భవమై యెసగువృద్ధదశకా । మానవుడు పాత్రతముడన । గానెగడుననిరి సమస్తకర్మవిజ్ఞుల్॥ వ. కావున క॥ ఆయువు విద్యయుయశము । నపా యంబులు లేక వెలయుబలమును బొరయుం । దాయోపివృద్ధసంసే । వాయోగ్యతనడుచునరుడవారితభంగిన్॥ క॥ ఆదరణీయతదగు వృ । ద్ధాదులయభివాద నాదులలవరచునతం । డాదట వారల నామము లాది వలుకవలయు మొదటనుజ్వాలభక్తిన్॥ క. అభివాదనంబుసేయుగ । నభి ముఖుడగు నతడు తనసమాఖ్యయువలుకం । గభరింబులేము మహింకని, రుభయజ్ఞానాన్వితులగు నుత్తమజనముల్॥ గీ. అరయునభివాదనము బొందునతని నామ ధేయమును వర్తనంబును దెలియదేని । మనసు బాటించి ప్రాజ్ఞోహ మనుచుబలుకి । వలయు నభివాదనముసేయవచ్చు నతడు॥ క. తననామము నభివాదన । మొనరించెడి వానిపేరు నాది వలికి భో । యనవలయు పరమభావా । ధ్యనిమాంఘయు ఘనము శ్రద్ధధానమునుదగన్॥ గీ. అర్థనాయుష్మాన్ భవసౌమ్య యనుచు

——*అభివాదనవిధి*——

బ్రాహ్మణాభివాదనమున బల్కుటకు పాత్ర మతని నామమకా రాంతమైననట్లు । దనరు పూర్వాక్షరంబుప్లుతంబుగాగ॥ క॥ అభివాదనం బునకుబ్ర । త్యభివాదనమెవ్వడెరుగడవ్విప్రుడదా । నభివాదమునన వర్హుడ । సభాసముడనగ వెలయు సన్మునులారా॥ గీ. బ్రాహ్మణుని కుశలమును నిరామయము రాజు । నాస్య సేమంబు నారోగ్య మంఘ్రిభవుని । ప్రశ్నలొనరింపవలయునపారపరమ । ధర్మశాస్త్ర ప్రవీణత దగునతండు॥ క. తగుపరయత్నిన సంబం । ధగరిమమును పాత్రతముదాత్తసయము బెం । పుగబల్కరింప భవతి సు । భగే

భగినీయుటంచు బ్రాహ్మణవర్యులో॥ గీ. మాతులుండు పితృవ్యుండు మామబుత్వ । జుండు గురుడునురాకనిష్ఠుండ నావ । హమ్మనిభక్తి బలుకుచు నాసనార్చ । నాదివిధులను పూజసేయంగవలయు॥ క. మాతృష్వసను బితృష్వస, మాతులుభార్యను వెలయుసమస్తాదుల సం, ప్రీతి మెయిన త్తనిజగురు । నాతి విధంబున సమార్చనంబులు సేయన్ ॥ గీ. తివిరిసద్భక్తిమెయి సజాతీయమైన । యన్నపెండ్లాము నభివాద నాదివిధుల । దినముపూజింపవలయు నట్లనుచితంబు । జ్ఞాతిసంబంధ యోషిజనమ్ములందు॥ క. జననీజనకుల భగనీ । జనముల తనభగినినగ్ధ జనుపూజింపన్ । జననివిధంబున మాతా । ద్యనుమతములువడసి సముచితము వెలయంగన్॥ గీ. ఏకపురవాసులకు బదియేడునధిక । వయసుగలవారిసంఖ్యంబు వలయుపంచ । వత్సరములు కళాభిజ్ఞవతుల కేండ్లు । మూడుశ్రోత్రియుల కల్పము బుధముఖ్యులకును॥ గీ. వయసు పదియేడులరిగినవాడు బ్రాహ్మ । ణుండు పూజ్యతముండగు నూరు వత్స । రములు చనినన్నృపాలుని కమలబుద్ధి । జనకసముడు యోగ్యుం డునైసాఘిలారు॥ గీ. అర్థమును బాంధవ్యలును ప్రాయంబు కర్మ । మహావిద్యయు వెలయు మాన్యత్వకారి । ణములు నిహాపర సౌఖ్యభూతములు భవ్య । కీర్తికాస్పదములును నై కేవలంబు॥ గీ. అరియసీయై మువర్ణత్రయంబునందు । నొక్కొకటికి నధికమై యొప్పమిగులు । వీనినెరుగక నుండుదానై నపూజ్యు । డంఘ్రిజుడునవతివర్షంబులరుగనేసి॥ గీ. వృద్ధునకురోగికిని రథమెక్కినచ్చు, నతనికినశౌచునకురేనికధికభారి, నియగుకాంతకు పెండ్లికెనయువరునకు। నడకువసెలంగమార్గంబువిడువ వలయు॥. గీ॥ అడరియొకవేళ మిళితులై నడచుద్రోవ । స్నాతకనృపా

——*ఆచార్యాది పూజావిధులు*——

లురవ్యోడ స్నాతకుండు । పూజనీయుడ నంబడురాజుచేత । ధర్మశాస్త్రమతంబు నిత్యంబు వెలయు॥ క॥ వేదముకల్పరహస్యము । తాదిసమన్వితముగాన యతజెప్పినవా । డా దరణీయుడు ఘనుడన । గాదగునాచార్యుడెల్ల కర్మంబులలోన్॥ క॥ ఆదరమున వృత్త్యర్థము । వేదాంగ

ము లెవ్వడాత్మ వెలయించు హితం । బూది యుపాధ్యాయుడనం । గా
దగునాతని సదాజగన్నుతులారా॥ క॥ వైదికసంసరణినిష్ఠే। కాదుగ క
ర్మంబు లెవ్వడనయముసేయున్ । మేదిని నాతని గురుడన । గాదగు
సత్కర్మరతినెగడుభవ్యమతున్ ॥ క॥ అమరంగానగ్న్యాధే । యము
లున్ పాకాధ్వరములు నగ్నిష్టోమా । దిమఖంబు లెవడుసేయిం । చు
మహాత్ముండతడు ఋత్విజుండన బరుగున్॥ గీ॥ ఎవడు కర్ణద్వయము న
ననేకమంత్ర । పూర్వకంబుగ వేదంబు బూరయజేయు । నతనిదల్లియు
దండ్రియునవగ వలయు । వేదముపంచుటకు పూర్వమాదరమున ॥
వ॥ మరియును పదుపురుపాధ్యాయులకన్న నొక్కయాచార్యుండునునూ
రుపు రాచార్యులకన్న నొక్క జనకుండును జనకశతంబుకన్న నొక్క జన
నియు గౌరవాతిశయంబునకు పాత్రతములగు వెండియు॥ గీ॥ జన్మకా
రణ భూతుండు జనకుడగుట । జన్మపావసఫలము శాశ్వతముబొరయు ।
నట్లుజేసెడి యాతడాచార్యుడగుట । వందనీయుడాచార్యుండెల్ల వారి
లోన॥ గీ॥ కామమున తల్లియును దండ్రిగలయుటతన । యుదయకార
ణులై రిగా కొండుగలదె । నందనునికట్లు పశ్వాదులందు జూడ । వచ్చు
గావున వారను వారవలదు॥ క॥ వేదజ్ఞుండాచార్యుడు । నైదిక సంసర
ణిమాణవకు జాతివిశేషాదులరసి విజ్ఞానో । త్పాదకుగాజేసి బనుచు ప
రమపదవికిన్॥ గీ॥ అల్పమైన నత్యధికంబైన సరయునెవ్వ । డాదరంబు
న నొసగించు వేదమంత్ర । నిచయమాతని గురునిగా నెరియెరింగి । శి
ష్యుడా రూఢిమైపూజ సేయవలయు ॥ గీ॥ ఆగమార్థంబులుపనయనా
దిధర్మ। ములు గ్రమంబున శిక్షించి నెలయజేయ। గలడు శిష్యునియందు
నిక్కముగ బాలు । డయ్యు నాచార్యుడమల బ్రాహ్మ్యమయమూర్తి॥
గీ॥ బాలుడయ్యును విజ్ఞానభరితమూర్తి। తన్నుశిష్యత్వవృత్తినిత్యంబుగొ
లుచు । వారలసమత్వమతి బుత్రులారయనుచు, బిలువవలయు సంభా
షింప వలయునపుడు ॥ గీ॥ వారలును నర్థమడుగంగవలయు వేళ । న
మ్మహాత్ముని దేవాయటంచు బలుక । నగునొకప్పుడు బలుకరాదన్య
శబ్ద । జృంభితములగు వాక్యవిశేషములను॥ క॥ వేదోపలక్షణార్థం ।

శైదగుమంత్రంబు జెప్పునాతడు జనకుం । డాదరణీయుండజ్ఞుడు, పాద విరహితుండు వెలయు బాలుండనగ॥ క॥ ధనమున బాంధవ్యంబున । వినుడుసదావృద్ధదశను విద్యవలనరా । దనఘాత్ములార పూజ్యత । జనసుతసద్ధర్మపథము జనకున్న యెడ॥ గీ॥ బ్రాహ్మణులకు విజ్ఞానంబున రాజులకును, దగ్రవీర్యత్వమునధనధాన్యవృద్ధి । వలన వైశ్యులకును గౌరవమునపాద, భవులకును గల్గుపూజ్యతభవ్యులార॥ క॥ పలితశిరో జుండయ్యును । వెలయుండజ్ఞుండు బ్రహ్మవేత్తయగుచు బెం । పలరిన బాలుండయ్యును, వెలయుగ దేవతలు తన్నువృద్ధుండనగ॥ గీ॥ కాష్ఠసంఘటితంబగు గజముచర్మ । నిర్మితంబగు సత్వంబునెట్లునామ, మాత్ర ధారణము లగునపాత్రుడట్లు, బరగువేదంబెఱుంగని బ్రాహ్మణుండు॥ గీ. లలనలందుషండునికైఫలంబు భూరి, దానముల మూఢతపసునకునైనమేలు, ప్రాలెవిజ్ఞానిగాక దివుటననేక, కర్మములుసేయు విప్రునికార్యఫలము॥ వ॥ వృథాయగునని చెప్పిమరియు నట్లనియె॥ గీ॥ హింససేయక నిత్యంబు నెల్లభూత । ములను శాసించు విజ్ఞానమూర్తిప్రోలె । గురుడు శిష్యునిమొగమోడి కోపపడక, తీయనగు వాక్యముల శిక్షసేయవలయు॥ గీ॥ వాఙ్మనశ్శుద్ధివెలయు నెవ్వానియందు, సత్యవిస్ఫూర్తినాతండు నిత్యసౌఖ్య, భరితములగు పదంబులు బడయుననిరి । మనువును మహామహులు తొల్లియనఘులార॥ వ॥ మరియును కొన్ని విధులు వినుండని యిట్లనియె॥ గీ॥ ఎవ్వనికినైన గీడుసేయింతుననుట, సేయుదనుటయు బరుల కపాయమైన । తెరవులూహించుటయుగాదు గరపునన్యు, డైన నవివినియు విననియట్లాగుటొప్పు॥ గీ॥ బ్రాహ్మణుండు సన్మానంబపారవిషస । మేతభోజనమట్ల సంప్రీతినమృత । పానమట్లసదాయవమాన మాత్మ । దలచునది యదియ నిర్భయత్వంబుపాను॥ క॥ అవమానము బొందినవా । డవిరళనిద్రాతిజాగ్రదాప్త వినోద, వ్యవహారంబుల సుఖియగు । నవమానపరుండు దాన నణగుగృశతమై॥ క॥ ఉపనయ నాదులసంస్కా, రపరుండగుద్విజుడుగురు చరణసన్నిధి భ । వ్యపదంబు బొందదగువే, దపాఠకలనంబు న

ర్హతపమును వెలయఁగ॥ క॥ మేదిన తపోవిశేషము । తాదుల విధిబోధి తవ్రతానుష్ఠాన । శ్రీదైవతార్చనంబుల । వేదంబు పఠింప బడియె విప్రులచేతఁ॥ క॥ వేదాభ్యాసంబై నత । దాదితపము సేయవలయున తినియతుండై । యాదరణీయుడు విప్రుడు । వేదంబు తపోర్థమనుట విశదముగాదే॥ గీ. పాదనఖపర్యంతంబు దప్తంబుగాఁగ । నేద్విజుండు తపంబు సహించిజేయు । నాతడుదోడరి వేదంబునభ్యసింప । వలయు నుత్తమగురుని సేవనముజేసి॥ క॥ వేదంబు మానిశాస్త్రస । మాదరమతియైన బ్రాహ్మణాధముడుస వ । ర్ణాదులతోఁగను శూద్ర । త్వాదశ జీవించియుండు దత్కాలముగఁ॥ గీ॥ పురుషుండై తల్లికడుపున బుట్టుటందు । మౌంజిబంధన మగునియమంబునందు । శిక్షితావాప్తిద గు యజ్ఞదీక్షయందు । బ్రాహ్మణునికి వేదము సదాపాత్రతమము॥ గీ॥ మౌంజిబంధన చిహ్నానురంజితుడగు । మాణవకునకు సావిత్రిమాతయును మ । హాత్తముండగు నాచార్యుడు త్తమాప్తి । జనకుడు నగుట నొప్పు తజ్జన్మఫలము॥ గీ. మౌంజిబంధనానురంజనత్వము లేని । మాణవకుడపాత్రమైన భంగి । కర్మతంత్రములు దగంగ నొనర్పను । ద్యోగసానుభూతులుడుగుటొప్పు॥ క. వేదంబుపనయనంబున । కాదిపఠింపంగఁగూడదర యుస్వధావా । చ్యాదులుదగు శూద్రసముడు । వేదార్థంబెఱుఁగరాని విప్రుండరయఁ॥ క॥ వేదము బహుపుణ్యతమ । శ్రీదముస ద్బ్రాహ్మణ ప్రసిద్ధముమంత్రో । త్పాదకరముగాపుర వి । ప్రాదులకదిపూజనీయమర్హముగాదే॥ క. ఉపనయనాదిగ సంస్కా । రపరుండగు విప్రునకువిరాగంబును వే । దపరాయణాప్తియును భ । వ్యపదము మంత్రంబుజపమువలయుఁ వ్రతముల్॥ క. గురుసన్నిధినుపనయనము । బొరసినవిప్రునకు సూత్రమును మేఖలముఁ । వరదండముకాషాయాం । బరముకమండలువువలయు పాత్రగతులకుఁ ॥ క॥ నియతేంద్రియుడై కల్మష । చయములు ధూలించి బ్రహ్మచారి గురుపదా । శ్రయుడై తపంబు వృద్ధిబొ । రయ సేవలొనర్పునది బరాయణముడగఁ॥ సీ॥ పావనమూర్తియై దేవర్షి పితృతర్పణాదులు పరమేశ్వరార్చనములు । నుభయసంధ్యల

## —*బ్రహ్మచర్యవ్రత విధులు.*—

యంమహామముల్ సేయుచు మధుమాంసములు గంధమాల్యము
లును, రసము లంగనలు గర్వంబును హింసలు నభ్యంగనము నఖ
ర్వాంబుపాదు । కములుఛత్రంబును కామంబు కోపంబు లోభంబునట
నంబులోలగీత । వాదనంబులు నన్నృతంబుజూదముపరి । వాదజనవాద
ములు సంగమాదులును వి । నోదములునోరులవంచించు భేదములు
ను । బ్రహ్మచారి పరిత్యజింపంగవలయు॥ గీ॥ ఏకశయనుండు నిత్యజితేం
ద్రియుండు । గావలయు శుక్రమెన్నండు కామనగత । విడచుటొప్పదో
టమిగాక విడచునేని। వ్రతములాతంతునదుపగావలయు నియతి॥వ. మరి
యు బ్రహ్మచారి కామవశంబున స్వప్నావస్థ రేతస్ఖలనంబగునేని పరిశు
ద్ధుండై యాదిత్యమంత్రంబు నుడువుచు బదిదినంబులు జలంబులందు
వసింపవలయు॥ క॥ జలకలశంబును పుష్పం । బులు గోమయమృత్కు
శములు పూజార్ధముబెం । పవలడనిత్యంబునుగొన । వలయుఁ సద్బ్ర
హ్మచారివహ్నియు గడకఁ॥ క॥ వేదాధ్వరములచేతస । దాదరణీయం
బులగు గృహంబుల శుద్ధం । బైదగుభిక్షాన్నముగొన । గాదగునాతం
డు విగతకామార్ధంబుల్॥ క॥ గురుకులబంధుజ్ఞాతిని । కరగృహముల
భిక్షసేయగారాదుసమా । దరభావముధర్మంబును । పరిశుద్ధములేని
యిండ్లబరగ దొకప్పుడుఁ॥ క. వేదాధ్వరముల యోగ్యము । లైదగుగ్రా
మములపట్టణాదులసేయం। గాదగుభైక్ష్యంబభిశ । స్తాదులువర్జించిదృఢ
నియమవిస్ఫూర్తిఁ॥ ఉ. ఆయతభంగి భైక్ష్యచరణాప్తిసమిద్ధనలంబులిం
పుమై । జేయక రాత్రులేదుపవసింపక వెంగలియైనవాడు సం। క్షీయము
గాక నొప్పునవకీర్ణవ్రతంబు జితేంద్రియుండుబో । ధాయుతుడార్యసేవ
నుడుదాత్తుడునై యొనరింపగాదగుఁ॥ క॥ ఎన్నకనిరంతరముభై । క్ష్యాన్న
ములు భుజించునది నియతినొకయింటఁ । నన్నము గొనగాదిలభై ।
క్ష్యాన్నంబుపవాసతుల్యమనిరి మహాత్ముల్॥ క ॥వ్రతముల యందు
ను దైవత । పితృకార్యములందు దాతపిలువగజని స । మ్మతిగుడువం
గాదగు విర । హితమధు మాంసాన్నమధికనియమంబు దగఁ॥ క ॥

ఉపదిష్టకర్మములు బొ। హ్మ్యపదావాప్తిదగు బ్రాహ్మణ ప్రవరుల
కున్ । విపులములగు గావెందును । నృపవైశ్యుల కనిరి సన్మనీషి జ
నంబుల్॥ గీ॥ గురునిబోధ నైనపరగిన్తనబుద్ధి । నైననధ్యయనమునం
దాయత్న । మాచరింప వలయు నాచార్యునకు సమ్మ । తంబుతుష్టియ
గువిధంబు వలయు॥ క॥ తనువునుబుద్ధీంద్రియములు । మనసునువాక్యంబు
లును సమాహితములుగా। జన్మప్రాంజలి యైనిలచి గు । రునివదనము
జూడవినయ రుచిశిష్యునకున్॥ గీ॥ ఉత్తరీయంబు వెడలి బాహువా
కడుదగ । సాధ్యమగు నాచారంబును సంయుతంబు । నమరిగురునిక
భిముఖుండై యాస్యతామ । టంచునాసీనుడగుట యర్హమగు తెరవు॥
క॥ హీనాన్న వస్త్ర వేషుం । డై నిత్యము గురుసమీపమందుండి గర్ ।
ష్ఠాసితి శిష్యుడతడు శ । యానుండగు డోత్థానోప్వసంక్రమియుగం
బున్॥ చ॥ గురుడు శయానుడై నతరి కూర్చొని యుండిన వేళభోజ
నా । దరితి నుండునప్పుడుచితంబులు మానిపరాఙ్ముఖుండునై । బరగి
నయప్పుశిష్యునకు పాత్రముగా దొగిమాటలాడగా । త్వరపడనాజ్ఞగై కొ
ననవశ్య ప్రతిశ్రవణంబు సేయగన్॥ ఉ॥ ఆసనమందు నుండుతరి
నాజ్ఞయొసంగిన యప్పునంచితో । ల్లాసముబొందు వేళ నుపలాలన
వృత్తి జెలంగునప్పుడ । భ్యాసము సేయుచున్న పుడు బల్కుట శిష్యునికొ
ప్పు నింతలున్ । గ్రాసము లేని చక్కటిగురుండు సమాదరభంగిజూడగన్.
క. దూరస్థుండు సమీపగు । డారయ నభిముఖపరాఙ్ముఖాతిష్ఠగతి ।
స్ఫారుడు శయానుడగుగురు । యోరవసించునది శిష్యుడుజ్వలభక్తిన్.
క. అతినింద్యము గురుసన్నిధి । సతతనికి శయ్యాసనాదులాదర మగు న ।
ట్టితెరంగైనను దన్నయ । నతిగంధముబూసికొన జనదు గీతంబున్॥
మ॥ గురునామంబు పరోక్షమందయిన సంకోచించియైనన్ నుదా । హ
రణ సూర్తిసచింపగాదతని వేషాయామభాషాగతి। స్ఫురణంబుల్ తన
కొప్పవర్ధమెయ్యి శిష్యుండాత్మబోధాసమా । దరభావంబున పూజసే
యునది నిత్యంబున్ కృతార్థుండునై॥ క. పరివాదంబునునిందయు ।
గురునకు నేదేశమున మిగులనగు నాప్తిన్ । జరుగునది శిష్యుడచ్చట ।

దొరసి చెప్పులుమూసికొనుచు దూరంబెలమిన్॥ క. పరివాదము గాఁడిద
యగు । పరిభోక్తయగు పురువగున్ నుపాలంభుఁడు గు । క్కురమగు కీటక
మగు మ । త్సరిగా ప్రునగురుసిదొడరజనదాగతులన్॥ గీ పూజ సేయవ
లదు పొలతితో గురువుండు । నవ్పుడు గుపితుఁడైనయప్పుడు శిష్యు । డాస
నంబు యానమాస్తి నధిష్ఠించి । కాదుడిగి యొనర్ప గలుగు గొప్ప॥
క॥ ప్రతివాయువు నను వాయువు । కుతుకము వెలయించుచున్నప్పు గురు
నిసరినధి । స్థితభంగినుండ గా .గా । దతము వినని కీర్తనాదులాగగవల
యున్॥ చ॥ శకటరథాములందుకటసౌధతలంబులనావలందు సా । లక
ములయందు నున్నతశిలాఫలకంబుల గూరుచుండుటో। న్నికరణిఁనొప్ప
శిష్యుఁడు గురుండును నొక్కటకాదు వెన్నువా । యకతనువంట యాస
నములందు వశింపక నొట్టిచోటులన్ ॥ క॥ గురుని గురుండరుదెంచిన ।
గురు వ్రాలెనొనర్ప గానగున్ పరిచర్యల్ । గురునను మతి శిష్యుండు గా ।
దరయగ తనగురుని కీర్తనాదులు నచటన్॥ క॥ వాగాదిరహితముగవి ।
ద్యాగురుపిత్రాదులను సముచితపూజా । శ్రీగరి మదన్వగుగా । దా
గమము త్రాధ్దాతయగు నతనిబలెన్॥ క॥ గురుపుత్ర బాంధవులకును ।
వరవిద్యాకీర్తినై భవసమేతులకున్ । పురుషోత్తములకునిత్యము । గు
రునిబలెన్ పూజ సేయగూడుసతంబున్॥ క॥ తనకన్న పిన్న యైనను। తన
కుసమానముగు వయసుదనరెవవాఁడ । య్యును పూజార్హుండతికల్।
వనుడ గురుసుతుఁడు గురునిబలెయాగములన్॥ క॥ గురునిన్ బలెశి
ష్యుండా । దరమతి గురుపుత్రకుని పదములొత్తుచు సం । భరితముగ నతని
మెంగిలి । బరగుగు నవసద్వినయము భవ్యంబుదగన్॥ క॥ గురునిన్
బలెపూజింపన్ । బరగు సవర్ణయగు గురునిపత్నినతిదృఢ । స్ఫురితంబ
గుచిత్తముసం । భరితంబుగ గౌరవంబు పాటిజెలంగన్॥ క॥ కాదభ్యంగ
నస్నానో । త్సాదనములు కేశ సంప్రసాదనమును బెం । పైదగు
విధులును శిష్యుని । కాదరణీయయగు గురుని యంగనకునిడన్ ॥
గీ॥ తరుణియగు గురుని పత్ని పాదంబులంటు । టాదిగా గలశుశ్రూ
షలాచరింప । వలవదెన్నఁడు నిర్వాదివత్సరములు । వయసు గలయావ

కుఁడది గౌరవంబుగాదు॥ క॥ పురుషుల దూషించెడి పెం । పరయంగ
స్వాభావ శిద్ధమగుట నెలతలం । దురు విజ్ఞాన మనస్కులు । బరగింప
రు పరమతత్వార్థవ్యాఖ్యంబుల్॥ క॥ నియితేంద్రియుఁడైన మఱియు నియ
తేంద్రియుఁడైనకామినీ జనములు బెం । పయి కామ క్రోధవశులు ।
గ రౌనర్ప సమర్థులగు జగన్నుతులారా॥ గీ॥ అక్కయైన తల్లియైన
మాహిత్రయు । నైననొంటినుండు నట్టిచోట । నాసనమున బొలచున
ట్టి విద్వాంసుని । నైన గలచునింద్రియములు జెలగి॥ క॥ యుక్తియగు
గురునిపత్నికి! సవినయ విధివందనములు సలుపగనగు భ। క్తివెలయనసా
వహమ్మను । ప్రవిమలవాక్యంబు పరమభద్రార్థముగఁ॥ క॥ ఆదరమున
నిజధర్మము । పాదించుచు గురునిపత్ని పాదగ్రహణం। బాదిగనభివాద
నములు । సాదువయిన విప్రుడర్థిసలుపగవచ్చుఁ॥ క॥ నరుడు ఖనిత్రము
తోను । ర్వరద్రచ్చి జలంబువడయు వడుపున విద్యా । కనుడగు సద్గురుసే
వా। దరమతిశిష్యుండు బొరయదగు సద్విద్యఁ॥ గీ॥ బోడియైనజడలుబొల
చినవాడైన । జడలు సిగయుదగు నతడును నైన । నూరనిద్ర పోవ్వుటా
ప్పుడు సూర్యోద । యాస్తమయ సమయములైన దనుక॥ క॥ అతిని
ద్రావశమున దూ । మతుబలె సూర్యోదయాస్తమయములరుగనే । కి
తముపవాసంబొక దిన । నుతను గఃనుపవలయు నిశ్చలాత్ముండగు
చుఁ॥ క॥ ఆయతమగు విధమునసీ । ప్రాయశ్చిత్తవిధినెవడు బాటింప
డువా । డాయువు దఱిగి యశౌచము । వాయక నిత్యంబు నరకపంక
మున బడుఁ॥ ఉ॥ ఆచమనంబుచేసి నియతాత్ముడుపాసన వేదినైత
గఁ । శౌచసమాప్తినై యుభయ సంధ్యలయందు జపంబుజేసి ని ।
త్యోచిత పుణ్యకర్మ రతినుండుట పావనమైన ధర్మమా । ర్యాచరణీ
య మూర్జితము నర్హము నారయబ్రహ్మచారికిఁ॥ క॥ స్త్రీశూద్రులై
న పుణ్యం । బాశించుచు నిచ్చజేయ నగుచారికి చే । తోశక్తులెందు
బొరయు వి । కాశించుచు నవిసదా జగన్నుతులారా॥ గీ॥ ధర్మమర్థం

—*జననీ జనకాచార్య పూజాది విధులు*—

బు శ్రేయఃప్రధానములగు । కామ మర్థంబు ధర్మసంకలితములగు ।

ధర్మమర్థంబు కామంబుదాత్తభవ్య । పదమునకు కారణములగు ప్రా
జ్ఞులారా॥ గీ॥ బ్రహ్మమూర్తి యాచార్యుండుభవ్యతముడు । జనకుడు
ను ప్రజాపతి మూర్తి జనని పృథివి । మూర్తి సోదరుడును తనమూర్తి
యగుట । పూజసేయు నదివారల భూనుతముగ॥ క॥ జననీజనకులు సో
దరు । డును నాచార్యుండును గురుడును పూజార్హుల్ ।ఘనులది గావన
గౌరవ । మునజూడగ జనదు విప్రముఖ్యుడువారిన్॥ గీ॥ అత్యధిక కష్ట
ములకోర్చి యాప్తిదన్ను । గాంచి పెంచిన భవ్యుల ఘనులతల్లి । దం
డ్రుల ఋణంబు పుత్రుడుత్తముడు బాపి । కొనవశక్తుడు నూరేండ్లు చ
నిననైన॥ క॥ జననీజనకుల కాచా । ర్యునకున్ బ్రియమైనయొప్పరుసు
లొనరింపక । జనువారలు సంతోషిం , చినసర్వంబైన తపము సేయు
ఫలమగున్॥ క॥ మాతాపితృాచార్యుల । కాతతశుశ్రూష సేయుట
ది తపమగుసం । ప్రీతిమెయి వారలొల్లని । సేతలశాస్త్రీయములు ని
షిద్ధములరయన్॥ గీ॥ మూడులోకంబులాశ్రమములును మూడు । వే
దంబు లగ్నులు మూడువార । లట్టిగావున నిత్యభవ్యత్వశిద్ధి । గోరి
పూజింపవలయు కుమారకుండు॥ వ॥ జనకుండు గార్హపత్యాగ్నియని
యు, జనని దక్షిణాగ్ని యనియు నాచార్యుండావహనీయాగ్ని యనియు
నెరుంగ వలయును॥ క॥ ఆయగ్నిత్రయమధిక వి , ధేయము భక్తియు
ను సమ్మతియు వెలయంగా । ధీయుడుపాసన విధులు । సేయందగు
కొడుకు మతము శిద్ధింపంగన్॥ క॥ అయమహితాత్ముండై వా , రియె
డల విహితాప్తిదగు గరిష్టుడు జగతీ । త్రయ విజయశాలియై కాం । తి
యుతంబగు మేనుతోడ దివి కేగుతుదిన్॥ గీ॥ ఇహసుఖము వడయు జ
ననికి హితముచేసి । పరసుఖము వడయు జనకుని భక్తిగొలచి । బ్ర
హ్మలోక మహూన్నత పదముబొందు । నిత్యమాచార్యునర్చించి నిర్మ
లుండు॥ క॥ ఏకర్మంబులు కడునం , గీకరమగు వారికవినిఖిల సౌఖ్యం
బుల్ । జేకూర్పజాలువారలు । గైకొనకుండు నవిలోక గర్హితముల
గున్॥ గీ॥ పావనస్థితి వెలయ సజీవులగుచు । వారలిలనుండు కాలంబు
వారికహితె । మాచరింపక భక్తి సేయంగవలయు । పరమశుశ్రూష

లాదర భరితుడగుచు॥ క॥ ఏయువితనకిష్టంబుగ । జేయ దలచువాని
విధము సెప్పగవలయుఁ । ధీయుతుడు సుతుండువారల । తో యదియు
త్రికరణ శుద్ధిమిరితాపహముఁ॥ క॥ ఆదరము ప జననీజన । కాదుల
పూజించు విధమునగు తత్ఫలముఁ । వేదవిదులార జెప్పితి । మోదం
బును హితముజ త్తమునవికసింపఁ॥ వ॥ మఱియునొక్క ధర్మపథంబు
జెప్పెదవినుండని యిట్లనియె॥ గీ॥ శ్రద్ధధానుడగుచు సద్విద్యజేకొను ।
టొప్ప శూద్రునలన యోగ్యతముడు । గానివాని వలననైనను వి
ప్రుండు । కులము పెంపు జూడనలనదపుడు॥ గీ॥ మాన్యశీలయు గౌరవ
మహితయును ను । హా వ్రతపరాయణము సగున్స్త్రీకాంత । పెండ్లిజే
సికొనగ జాల ప్రియమగునది । హీనవర్ణయుయ్యునునుమానపడక॥
క॥ అమృతంబు విషమునసమే । ధ్యమున సువర్ణంబువస్త్రనంబరి వల
నఁ । క్రమమున బాలునివలన మ । తమగు సుభాషితము బొరయుద
గు నెల్లరకుఁ॥ క॥ వనితలు నవరత్నంబులు । ధనమును విద్యయు సు
భాషితంబును ధర్మం । బును శౌచము శాత్రత్వము । జనునెసులకునీ
గనుచితసమయంబులంఁ॥ గీ॥ బ్రహ్మచారి కొప్పు బ్రాహ్మణేతరుల
గు । వారివలననైన సారవేద । పాఠకలన మర్ధబడయంగ ననిరి మ ।
హాత్ములైన వారలార్యులారా॥ గీ॥ బ్రాహ్మణేతరులగువారు భవ్యత
ములు । తన గురువులైనవలదు నిత్యంబు వారి । నంటివేదంబులు పఠంపనన
ఘుడైన । బ్రహ్మచారికి లోకసంభావ్యమతికి॥ క॥ గురుదేవ్వండగు
నాతని । పరిచర్యలు సేయకెట్లు బ్రహ్మపదంబుఁ । బొరయనగు గాన
విప్రే । తరులనయిన బ్రహ్మచారి తగుగొలువంగఁ॥ సీ॥ ఓపిసద్గురుని
సమీప వాసముసేయ సభిరుచిగల దేని యమ్మహాత్ము । శుశ్రూషలా
నరింప జొప్పగు ప్రాణముల్ తనమేననున్నంత దనుకనియతి । భవ్యం
బుగా తనప్రాణంబు లెందాక తనువుననుండు నందాకనెవ్వ । డతిభక్తి
శుశ్రూషలాచరించుచు గురుపాదాశ్రయుండవ బగునతడు । శాశ్వ
తబ్రహ్మసదనంబు శశ్వదాత్మ । మూర్తియైజొచ్చినిత్యంబుముక్తుడగుమ
హాత్ముడగు గురునికర్హదానాదు లీగ । కెవ్వడును నైష్ఠికములు సే

యింప దగదు॥ సీ॥ గురునికి పరితుష్టి గూరయించి పిదప నైష్ఠిక కర్మ
తంత్రముల్ సేగాటొప్పు । క్షేత్రంబు కనకంబు పాత్రతిమంబగు గోవు
నశ్వంబునుగొడుగుపాదు । కములాసనంబు ధాన్యమును శాకంబులు
నిఖిలార్థములు గురునికి నొసంగి । యతడు సంప్రీతాత్ముడగుసటి పిదు
ల సమార్చనంబులు సేయుటగుసభక్తి । గురుసతీ సుత బాంధవకోటి
యందు । గురునియందు వెలయుభక్తి గూఢముగ స । మార్చనంబులు
చేసి భోయనగవలయు । వారలను బ్రహ్మచారి సగౌరవముగ॥
గీ. పరగు నాచార్యగురుగురు భార్యయాది । నాగలుగు వారి నర్చింప
గలుగుటుభయ । సంధ్యల సదాగ్నిహోత్రముల్ సలుపుట నియ । తం
బు వెలయుట మోక్షసాధనములనగ॥ గీ. బ్రహ్మచర్యవ్రతంబిట్లు పర
మునియతి । నేద్విజుండొనరించు గీడెనయునిగతి । నుత్తమస్థానమునసత
ముండు జన్మ । మరణభయరహితుడగుచు మంతులారి॥ వ॥ అనిచెప్పె
నని॥ ఉ. యోగసమాధిరూఢనియమోన్నతభక్తి జనాభినందన । శ్రీ
గురుమూర్తిరూపమయ చిన్మయతత్త్వపరిస్ఫుటార్థస । ద్యాగమసారని
ర్ణయకళాధికసర్వ జగన్నియామకో । ద్యోగపరాయణస్థిరవినోద పరా
త్పర భవ్యబోధకా॥ క. విమలాత్మ రామకృష్ణప । రమహంసమహాగు
రు స్థిరసమాధిపర । త్వమహిత సాక్షాద్బ్రహ్మే । మచిన్మయ తత్త్వ
మతి పరాయణభూతీ.

మాలినీ. గురుపదయుగసేవా కుంఠితోద్దాత్తవిఘ్నా
నరతజనమనస్సానంద తత్త్వప్రకల్పా
దరసుమహితబోధా ధ్వాంతభాస్వత్ప్రకారా
పరమపురుషలింగోత్పన్న నిత్యాభిధానా.

గద్యము.

ఇది శ్రీమత్పరమేశ్వర లీలా విచిత్ర ప్రపంచసేవాపాత్ర శ్రీమద్వారపురెడ్డి పాపినాయక
పుత్ర నిఖిలబుధజనవిధేయ యప్పలనాయక ప్రణీతంబైన శ్రీమదాంధ్ర
మనుస్మృతియను మహాధర్మశాస్త్రమునందు
ద్వితీయోధ్యాయమ్ సంపూర్ణమ్.



శ్రీ ర స్తు.

శ్రీమద్రామకృష్ణపరమహంసగురుస్వామినే నమః.

# శ్రీమదాంధ్ర మనుధర్మశాస్త్రము.

## తృ తీ యా ధ్యా య ము.

శ్రీనిర్గుణైకమార్గ । జ్ఞానమయోదిత సమస్తకారణ విబుధ । ధ్యానానందరసప్రతి । మాననిరాకరణ సర్వమయపరమేశా॥ వ॥ దేవా యవధరింపు మమ్మహర్షిసమాజంబులతో భృగుమహర్షీంద్రుండిట్లనియె.

### —*కన్యా పరిగ్రహ విధులు.*—

గీ. కరము వెలయంగ త్రైవేదిక వ్రతంబు । ముప్పదియు నారు వత్సరములు వినియతి । గురుసమీపంబుననుపగూడుమరిత । దర్ధమైన పాదంబైన ననిరి బుధులు॥ క. వేదార్థ సారమెరిగి స । మాదరగతి బ్రహ్మచర్యమలవరచి తదీ । యోదయమార్గానుసరణి । నాది గృహస్థాశ్రమంబు నొనరింపదగున్॥ క. వేదాదిదాయభాగం । బాది జనకు వలనగొనుట యావును మధుప। ర్కాదులొసగియుద్వాహమున। కాది పితాదులదనుపుటయగు బాత్రములై॥ క॥ గురుననుమతిబడసి నియతి । బరగికృతస్నాతకుడయి బ్రాహ్మణుడుసమా । దరమునసవర్ణయనుగుణ । వరయునునగు కన్యదగు వివాహంబాడన్॥ క. జననికి సపిండగాకయు । జనకునికి సగోత్రగాక సౌమ్యతిదగు క । న్యనరసి పరిగ్రహించుట । యనుకూలముదారకర్మమనిరి మహాత్మల్॥ క. సతి సంబంధములగు గో । తతులునుమేకలు ధనములు ధనధాన్యంబుల్ । సతతము పాత్రములయ్యును । పతిగొనరాదరయ పేదవడుతరినైనన్.

చ. క్రియరహితాత్మ నిష్పురుష కేవల వేదవిహీనసంతతా । మయబ
హుదీర్ఘ రోమ జడిమస్థిత కుష్ఠుశరీరగంత సం । చయకుటిలాంగభ్రూతపరి
సర్పిత వక్రశిరోజలోచన । క్షయవరియింపగాదుకడు సౌమ్యుడనందగు
వానికెన్నడుఁ॥ గీ. పింగళేక్షణ వక్రకపిలశిరోజ । కన్యనధికాంగ తీవ్ర
రోగమయ రోమ । రహితబహురోమహీనాయరాగపరుష । భామిని
పరిగ్రహింపగా బరగదెందు॥ క. తరుగిరిఋక్షనదీదా । సరహితనామాం
కితంబు జనుదానిభయం । కరనామున్గొనదానిఁ । పరిగ్రహింపంగ కాద
భవ్యత్వమగుఁ॥ క. జనునై వాహికవిఘ్నగాన । తనురోమశిరోజదశన
తత్పరతనుభా । మినిసుఖనామసుహసచిరగ । మన లక్షణలక్షిత మృదు
మహిత శరీరఁ॥ క. ఏయమకు సోదరులులే । రేయమ జనకుని సమా
ఖ్యయెరుగ బడను ము । న్నాయమయెవ్వరి సుతయని । ప్రాయమ
తుల్ దలచి పెండ్లిపాటింపరిలఁ॥ గీ. బ్రాహ్మణుండు వివాహసంబంధ
భావ । ములుసవర్ణలయందు నిమ్మదగసేయ । వలయునొక భంగి
హీనతవచ్చుకామ । మమితముగను పునర్వివాహము ఘటింప॥
గీ॥ బ్రాహ్మణులకు నాల్గుజాతుల భార్యలుదగు । క్షత్రియులకు మూ
డింటను సతులువెలయు । వైశ్యునకును రెండింటను వనితలొప్పు ।
శూద్రునకు తనకులము నందసుదతులెనయు॥ గీ॥ బ్రాహ్మణ క్షత్రియు
లకొక భంగినైన । కామశూద్రాంగనల పరిగ్రహమొనర్ప । నెరుగక
పరిగ్రహము సేయునేని వ్రతము । లర్ధనడుపంగవలయు మహాత్ములార॥
గీ॥ హీనజాతి కాంతనెన్న కవిప్రుడు । పరిణయాను భంగిబడసెనేని ।
శూద్రతుల్యుడగు నుపద్రవంబులు పెక్కు । లడరునైన వలవదట్టితెర
గు॥ గీ॥ బ్రాహ్మణుండు శూద్రాంగన పరిణయంబు । జేసికొనునేని పతి
తుండ శిష్టరతుడ । పాత్రముడు గ్రూరుండిహపరసుఖములు । గోలు
పడిన హీనాత్ముండగుట నిజంబు॥ వ॥ మరియు శూద్రస్త్రీయందు
క॥ శయనాసనాదిపూజల । నయముగఁ గావించు నెవ్వడావిప్రుండ ।
ధ్యయన పరాయణుడయ్యు । వెలయుమాలండి తడనగకళంకముపేర్మిఁ॥
క॥ కారణములేక శూద్ర । స్త్రీరూపము నిచ్చుజూచుద్విజుడును త

త్సం । గారంభము గలవాడును । నారదునిమతంబున౯ మహాపాపుల
గుఁ౯॥ క॥ ఆరయువిప్రుండు శూద్ర । స్త్రీరాగవశంబున౯ జరింపగనా
త్మఁ౯ । గోరినపతితుండగు ని । స్తారతి యును యశముగల్గు సజ్జనుడ
య్యు౯॥ క॥ పాదజునికాంత పెండిలి । యైదానివలన బ్రియంబు నందిదిను
గు వి। ప్రాదులు భువి నెలివాండ్రనగా। దగునని యుత్తములు జగన్నుతులా
రా॥ వ॥ మరియు నే బ్రాహ్మణునిగృహంబున శూద్రాంగనాకల్పితం
బులగు దైవపిత్రాతిథిపూజాద్రవ్యయంబులు వెలయునవి విశేషంబుల
య్యు సద్దైవపిత్రాతిథుల కంగీకారంబులుగాక వృథాయగు నా బ్రాహ్మ
ణుండును మహానరక పతితుండగునిట్లు॥ క॥ బోరసిన తమిశూద్రసతియ।
ధరరసమానిన యతండు తల్పకుడు తదా। దరరతియు కాముకుండును ।
నరకనివాసులగు దుర్జనంబులువారల్॥ క॥ వారలకునిష్కృతులు లే ।
వారయనిష్కృతులు సేయునైనమహావ్యా । పారములు సల్పునైనను ।
దారములగు నయ్యఘములుదరుగవు రువగు౯॥ క. పాటించిశూద్రకాం
తా । కూటమునిచ్చలు నొనర్చు క్రూరుడు మర్త్యా । ఘాటకుడును మృ
త్యుప్రతము । వేటాడగనుఁబడు౯ దవిలియుగ్రగతి౯॥ క. తగ వెయ్యది
శూద్రాంగన । దవిలిన బ్రాహ్మణుడు బహుమతంబుల కర్మా । ను గు
డయ్యు బాయనేరడు । జగతి౯ తత్పాతకములు సంయములారా॥
క॥ పరమానురాగరస సం । భరితాత్ముండగుచు శూద్రభామినిగల
య౯ । దినుగుద్విజుడెల్లవారలు । నిరతము దిట్టంగమాలనికి తుల్యుడ
గు౯॥ వ॥ సమస్తవర్ణంబులకును వివాహవిధులవశ్యమాచరణీయంబు
లై యుండుగాప్రన తద్భేధంబు జెప్పెదవినుండు బ్రాహ్మంబు దైవంబు

—*అష్టవివాహవిధులు.*—

నార్షంబు ప్రాజాపత్యంబునాసురంబు గాంధర్వంబు రాక్షసంబు పైశా
చంబను వివాహవిధులష్టవిధంబులని చెప్పి మరియునిట్లనియె. క. ఏవర్ణ
మునకు నెయ్యది । పావనధర్మముగ బరగుపరమవిబుధ సం । భావన
పాత్రంబుగ౯। ష్టావిధ మైయదివినుండు సన్మునులారా॥ వ॥ అనిచెంపువ

డఁ బలికి యిట్లనియె॥ గీ. బ్రాహ్మమాదిగ నారును బ్రాహ్మణునకు ।
నాల్గు క్షత్రియునకు వైశ్యునకును శూద్రు । నకును మూడును
పరమ మాన్యత్వశిద్ధ । లగు వివాహవిధులు భువి నాఘ్యులారా॥
గీ॥ బ్రాహ్మమాదిగ నాలుగు బ్రాహ్మణునకు । రాక్షసము క్ష
త్రియున కాసురంబు వైశ్య । శూద్రులకు ధర్మమగునని సూక్ష్మధ
ర్మ । విదులు కొందరు సెప్పిరి విమలమతులు॥ గీ. బ్రాహ్మణునికి జెల్లు
పంచధర్మంబుల, రెండుగాక మూడు పండితాను, మఱియు సెలగ నె
ప్పుమరియు యథాప్తిబై । శాచమాసురంబు నీచములుగ॥ క. మాటి
కి మాటికి దగుపరి । పాటి వెలయ క్షత్రియునకు బ్రాహ్మాధర్మం, బో
టముగ నన్యధర్మము, సాటిఁ గాంధర్వ రాక్షసంబులు రెండుఁ॥ గీ. క
న్యనధికశీల గౌరవనీయగు । నాఢ్యవస్త్ర భూషణాదులనిడి । యోగ్యు
డైనవరుని కుచితదానము సేయు । టదిసదాప్తి బ్రాహ్మమనగ వెలయు॥
క. వైదికమగు యజ్ఞము నం । దాదరమున ఋత్విజుడన నలరె య
లంకా । రాదు లిడిస్వీయము గాక । న్యాదానము సేత దైవమగునని
రి బుధుల్॥ క. వరునివలన గోమిథునం । బరయగ నొకడైన రెండు
నైన గొనిసమా । దరమతి కన్యనొసంగుట । బరగున్నార్షమనదగి
విభవమూలంబై॥ క. తగ వెఱిగి ధర్మమోడక, నెగడుఁడుమీఱలసి కన్య
నెఱినిచ్చుట బెం । పుగ నది ప్రాజాపత్యమ । నగ వెలయుననిరి మహా
జనంబులు ప్రీతిఁ॥ గీ. కన్యకైన దానిగనిన వారలకైన । ధనమొసం
గి యప్రదానభంగి । దగపరిగ్రహించు టగురాక్షసంబన । నదిమహా
తపోధనాఘ్యులార॥ క॥ యోగానుభంగి దగునను । రాగము కన్యకును వ
రునకు రంజిల్ల నవా । భోగరతి వారలెనయం । గాగూడిన నది
జెలంగు గాంధర్వమనఁ॥ క. బలిమి మెయికన్య నుక్కుఱ ।
వెలువడుపగ దీర్ఘశోక విహ్వలయగుచుఁ । విలపింపదాని గొని
చను । టిల రాక్షసమనిరి లోకహితులగు నార్యుల్॥ గీ॥ మత్తయగు
డుమఱి ప్రమత్తయగుడు సుప్త । యగుడు విజన చారియగుడు కన్య ।
నపహరించి గొనుట యదిపిశాచంబన । మంబనర్హతమము మాన్యు

లార॥ గీ. ఉదకదానపూర్వకముగనొప్పు బ్రాహ్మ, ణులకు కన్యాప్ర
దానవిధులు ఘటింప, క్షత్రియాదులకదిగాదు జనుపనప్ప । రాను
కూలప్రదాన మాన్యత్వగరిమ॥ క॥ ఒనరంగ వివాహవిధులు, మను
వు ప్రకీర్తించె నుత్తమంబగు ధర్మం, బునెగడ దత్సర్వంబును । విని
పింతు మహాత్ములార వినుడు సదాప్తిన్॥ సీ. బ్రాహ్మవివాహ సంబంధుడై
న సుతుండు పదితరంబులు జనుపైతృకులను, తాను పూర్వుండుగా
దనరిన పదితరంబులవారలను భవ్యభూతి సెలగ । కృతకృత్యులుగ నొన
రింప సమర్థుండు నుత్తముండును సదారోగ్యరతుడు, పావనుండును
నగు దైవసంభూతుండు నరయనేడుతరంబు లరుగువార । లను తన
కునేడు తరములై యెనయువార । లను పవిత్రులుగాజేయుననఘుడార్ష ।
జుండుమూడేసి తరములు శుద్ధగతులు । గాఘటింప మహాశక్తి గలు
గువాడు॥ గీ. ఆరునారుతరంబుల వారలను ప । విత్రులుగజేయశక్తుం
డు ప్రాత్రతముడు । ఘనుడు కామోహజతనూజుడనిరి పరమ । ధర్మ
శాస్త్రప్రవీణులుదాత్తగరిమ॥ ఉ॥ ఆదరణీయులుత్తములు నప్పాలు
నార్యులు వారలుదివ్యబ్రా । హ్మాది చతుర్వివాహవిధులంచు జనించు
కుమారకుల్ మహా । శ్రీములు వారలెన్న మనచింపరు బొంకులు
క్రూరులై వృథా । వాదముల్ జరింపను భవంబులు వాపునుర్చిప్ప జే
సినన్॥ క. రూపమునత్యుత్తమ వి । ద్యాపాండిత్యంబు పాత్రతమును
భవ్యవ్యాపారంబును ధర్మము । దీపింపగవారలున్నతి రహించదగన్॥
క. ఆరంభశీలురై మరి । వారలుజీవింతురు శతవత్సరములు చిం । తా
రోగవ్యాకుల ని, స్సారపత్రిభములులేక సాధుజనములై॥ క. వేద
విహీనులుమిథ్యా । వాదులుదుర్మార్గులగు నవనిగాంధర్వం । బాదిగగల
చతురుద్వా, హాదయులగు సుతులు సిద్ధయులునింద్యులనన్॥ క॥ నిం
ద్యంబుగాని పెండ్లి న । నింద్యులగు సుపుత్రకులు జనింతురుసతమున్
నింద్య వివాహవిధిజగ । న్నిందులగుసుతులు జనించునీచులువారల్,
వ॥ పాణిగ్రహణ విధులు సవర్ణయగు కన్యయందాచరించుట ప్రాత్రతమం
బును నసవర్ణయగు కన్యయందు సేయుట నింద్యంబునగునైనను బ్రాహ్మ

ణవివాహంబునందు క్షత్రియకన్య బాణంబుచేతను బ్రాహ్మణ, క్షత్రియవివాహంబులందు వైశ్యకన్య ప్రతోదకంబుచేతను బ్రాహ్మణక్షత్రియ వైశ్య వివాహంబులందు శూద్రకన్య సమావృతాంబరదశంబుచేత

—*పుత్రోత్పత్తివిధులు.*—

ను పాణిగ్రహణవిధులు సేయుటుత్తమంబు మరియును॥ క. ఋతుమతియగు నిజసతినతి। రతిసుఖమున దేల్చుటొప్పు రాగంబున వ। ర్జితపర్వరాత్రుడై పర। సతులరమింపక, నిజేచ్ఛచందంబుదగన్॥ క. పదియారు దినములురువగు। మదవతులకు ఋతువుమాస మాసమునందున్, మొదలచతుర్దినసము లో। ప్పను గర్హితమఖిల శాస్త్రపద్ధతు లందున్॥ గీ. నాల్గుదినముల ఋతుదర్శనంబులను చి, తంబులేకాదశియు త్రయోదశియు రెండు, వర్జనీయంబులగుట నవశ్యముపది। రాత్రులందు వధూరతి శాత్రతమము॥ క. వెలయగజంటలు సవ్యం। బులు నగురాత్రులగలసిన బుట్టుకుమారుం। డలఘుమతి బేసిరాత్రుల। గలసిన కూతురుజనించు గావుననర్థిన్॥ క. పాత్రతమము యుగ్మములగు। రాత్రులనిజసతిసదాను రాగము నెలయన్। పుత్రార్థిగలయుటనిరి క। ళత్రసమస్తక్రియా ఫలజ్ఞ మవేదుల్॥ క॥ పురుషుని శుక్రంబురువుగ। బరగినపుత్రుండు గలుగు భవ్యతదగి కూ, తురగున్ మధ్యమగతి వని। త ఋతుసహజ శోణితంబుదాత్తంబైనన్॥ క॥ రేతశ్శోణితములుసరి। యైతోచిన పుత్రుడుదయమగు కాదేనిన్। యాతెరవున కనుకూలం। బై తగషండుడగు తనయుడైన జనించున్॥ గీ॥ బ్రహ్మచర్యవ్రతమున కపాయమొదవ। దధమములు నింద్యములగు నిశాష్టకంబు। నన్యరాత్రిత్రయంబునునాగి యోగ్య, మైన దినములగలసిన ననఘులార॥ క॥ వినుడల్పమైన శుల్కము। గొనికన్యానొసంగునట్టి కుమతివినింద్యుం। డున పత్య విక్రయుడునగు। జనులకు తనవర్తనంబసహ్యముగాగన్॥ క॥ వనితాసంబంధంబగు। ధనమునను పజీవుడగు నతండును కాంతా। జనధనపత్న్యాదులను గొ, నినవాడును పాపులగుచు నిరయమునబడున్॥ క. ఒనరగనార్షవివాహం। బున గో

మిథు నమ్ము గొనుట బోలునని యెఱుం , గని నీచతములు కొందరు ।
వినిపింతురు బలుసభలనవిశ్వాసాస్పదల్ ॥ క॥ అన్యతాస్పదమది వెండి
యు । నవాచరణీయమధమ మగునల్పం । బైన నధికమైనన్ బ్రియము
న , గొనుటది శుల్కంబుగాదె గురుమతులారా॥ క. కన్యకొరకు శు
ల్కాదులు। కన్యాజనకాదులిచ్చు గైకొనకసదా। మాన్యగతినీగ గల్గిన।
ధన్యులగు మరిసుభవ ప్రదాతలువారల్॥ క. జనకుడు సోదరులును

*వనితాగౌరవవిధులు.*

బతి । యును బాంధవులును తనకు మనోజ్ఞములై బెం । పెవసిన వి
భూషణాదులు , ననయము నిడ కన్యపూజ్యయగు ననిరిబుధుల్॥ గీ. పడ
తు లెచ్చటపూజింప బడుచునుండు , నచ్చటరమించు దేవతలాదరము
న । వారలెందున పూజ్యత వనటబొందు । నందుకార్య ఫలములు
మాయమగుచుండు॥ క. శోకింపుచు నెచ్చటకడు , నాకులతన్ బొందు
జామ యంతమగుకులం । బాకులత లేక నెందున । శోక స్థితినుండునందు
శోభనములగున్॥ క ఏమందిరమునవని తలు । కామితపూజాదిరహిత
గతులై బహుశో , కామితవై శాపములిడు , నామందిరములు వినాశ
మగునని రార్యుల్ ॥ క. గౌరవనీయులు నిత్యము , నారీజనములు
మనూజ్ఞనవమ్మనుచేష్టా । పారీణలు రాగమతులు , పూరుషులకు న
నియె మనువు భూనుతముదగన్॥ క. అదిగావున కాంతలు స । మ్మోద
మున్ బొందంగ నిత్యమును తదభీష్ట , ప్రదులగుచు పూరుషులు బ్రి
య । ము దొరంగకమెలగు నదివిపులకర్మములన్॥ క. సతివలనన్ బతి
యును మరి । బతివలనన్ సతియుతుష్టి బరిగిన కడునూ । ర్జిత కల్యా
ణాస్పదమగు । సతతము తత్కులము విబుధజనవర్ణితమై॥ క॥ సతియు
ను పతియనునిచ్చలు , నితరేతరరాగభూతి నెసగక రోషా । న్వితమతు
లగు నేనిరయు పర , హితసంతానాప్తి లోక నింద్యతములగున్॥ క. వేదము
లు జదువకున్కన , నాదరకార్యములు సేతసనిశము కుపివా , హాదులు
నడుపుట దుష్కుల, మైదబుగున్ సత్కులంబనఘమతులారా॥ వ. మరి
యున్ జిత్రకర్మ వ్యాపారంబుల చేతను శూద్రసతులందు పుత్రులంబడ

యుట చేతను రాజుకొలువు సేయుటను నాస్తికకర్మంబు లొనర్చుటచే
తను సత్కులంబులు కాలక్రమంబున దుష్కులంబులగు॥ క. వేదంబులు
చదువుటయు స। మాదరణీయ మగువృత్తి నలరుటయు గ్రమం। బైదు
ష్కులంబు సత్కుల। తాదశ బెంపొందు నత్యుదాత్తపుభంగిన్॥ గీ. అర
యవైవాహికమున గృహస్థుడర్థి। పంచయజ్ఞంబులును తదుపరి సమస్త।
కర్మములు నిత్యశుద్ధపాకములు బాత్ర। దానములు నేయవలయుమతం
బుపేర్మి॥ క. మానుగ పంచపశువధ। స్థానంబులు కండని యునుదక కలశం

—*గృహస్థధర్మములు.*—

బుల్। మానక గేహికిహింసా। స్థానోపస్కరములగు సదాబద్ధములై॥
క. ఈపాపంబులు దూలగ। పూపమతిన్ పంచయజ్ఞములు దినదినము।
దీపించుచు సేయన్ జను। నోపి సదార్తిన్ గృహస్థునుచితస్ఫూర్తిన్॥
సీ. అధ్యాపనము బ్రహ్మయజ్ఞంబనియు తర్ప[illegible]సక్తి పితృయజ్ఞమనియు
హోమ। సత్క్రియ దైవయజ్ఞంబనియును బలియుత్యుత్తమము భూత
యజ్ఞమనియు। నతిథిపూజనము నృయజ్ఞంబనియు సెప్పుదురు పంచ
యజ్ఞముల్ బరగునిట్లు। పశువధస్థానాది పాపంబులన్నియు బాయంగ
నెప్పుడీపంచయజ్ఞ। ములు క్రమంబున సేయడా మూఢమతికి। లేదుని
ష్కృతి పుణ్యంబులేశమైన। బాఱయదుజ్జ్వలశక్తినొప్పు నెక్కర్మ। శత
ములొనరించినను వాడు సాధులార॥ క. మనమునకును బెతరులకును।
జననీజనకులకు నతిథిజనములకు గ్రమం। బునెగడ దేవతలకు బ్రియ।
మొనయింపగలేని వాడు మృతుడరయంగన్॥ సీ. అహుతంబును హుత
మరయ ప్రహుతము బ్రాహ్మ్యహుతంబు బ్రాశితంబనగ పంచ। యజ్ఞ
నిర్వచనంబులగు జపమాహుతంబనియు హోమము హుతంబనియు
భూత। బలిప్రశిద్ధావాప్తి ప్రహుతంబనియు బ్రాహ్మణార్చనా విధులు
బ్రాహ్మ్యహుతమనియు। బితృతర్పణంబు బ్రాశితమనియును జెప్పుదు
రు సదాధ్యయనంబు దొడరునేని। దేవయజ్ఞంబదియగును దైవయజ్ఞ।
కర్మరుండగువాడు జగంబు సర్వ। మాగిభరియించు వాడగునట్టి భవ్య।
శక్తి వెలయుట నిత్యవిముక్తుడతడు॥ సీ. హోమంబులాదిత్యునుదయాస్త

మయుముల నోసరింప బ్రియమగునినునికతని । వలనయోగ్యములగు
వానలుగురియువర్షంబులు గలుగనన్నంబు వెలయు। నన్నంబువలన నరా
దులు జీవించునదిగాన హోమంబులను దినంబు । సేయునాతడు పూజ
నీయుడై బెంపొందు వాయుకనిత్యంబు వాయువాశ్ర । యించి చేతనకో
ట్లు దీపించునట్లు । లాశ్రమములన్నియును నిత్యమాశ్రయించి । యుం
డు గృహమేధినదిగాననుడుగ కాశ్ర । మానుగతినడుపవలయు గృహ
స్థుడర్థి॥ క. జ్ఞానాన్నము లాశ్రయములు । గానెగడున్ త్ర్యాశ్రమము
లుగాన నవిగరి । ష్ఠానిరతిదాన మీగుట । మానవుడు సమస్త లోకమ
యుడై వెలయున్॥ గీ. ఎవ్వడాత్మేంద్రియములజయించునను వు । తనకు
గాకుండ నోసరింప దగునతండు । మహితభూతిగృహస్థ ధర్మంబులెల్ల ।
నైహికాముష్మిక సుఖంబులందగోరి॥ క. దేవతలును ఋషులును బితృ।
దేవతలును భూతములు నతిథులుతనున్ సం । భావించియాస సేయున్ ।
గావునగృహమేధినడుపగా దగును క్రియల్॥ గీ. దేవతల హోమము
ల వేదదీక్ష ఋషుల । శ్రాద్ధముల పితరులను ధర్మసరణినన్న । మునమ
నుష్యుల బలికర్మముల సమస్త । భూతముల పూజసేయంగ బోలు
నరుడు॥ గీ. అన్నమునన్నైన జలములనైన పాల । నైనమూల ఫలం
బులనైన నిత్య । మాచరింపంగవలయు శ్రాద్ధాదికర్మ । ములుప్రి
య-బున పితృదేవతలు జెలంగ॥ గీ అరయపితృర్థమగు పాంచయజ్ఞ
మందు । భోజనము సేయుటొప్పు విప్రుండొకండు । వైశ్వదేవంబునం
దునవశ్యమట్లు । కూడుకూరలొక్కండిచ్చు గుడువరాదు॥ గీ. హోమ
కర్మాదివిధులతియోగ్యభంగి । గడపి బ్రాహ్మణుడర్థిమై గడగవలయు ।
వైదికంబగు మతమునవైశ్వదేవ । నర్చనంబులు నతులు సేయంగసతము॥
గీ. ఆదినగ్నియు సోముందునలరునట్లు । హోమములు రెండుగావించి
యోపివిశ్వ । దేవులును దేవతలులోకభావనీయు । డైనధన్వంతరియు
బ్రియంబందుకొరకు॥ వ॥ అర్చనంబులు సేయవలయును మరియును॥
క. మతమనఘముగాగ ప్రజా । పతులున్ గగనంబు నుర్విపరదేవతలన్ ।
సతతము పూజించునది వి । నుత శుద్ధక్రియలొనర్చి యుక్తముగాగన్॥

సీ॥ ఈతెరంగున వెలయుంచిహోమమ్ములత్యధికంబుజేసి ప్రదక్షిణము లు । సర్వదిక్కులయందు సలిపి చతుర్దిశాధీశులై వెలయు మహేం ద్రయమ వ । రుణసోములకు తత్పురుషమూర్తులకు ప్రియంబగుభంగి బలికర్మమాచరించి । మరియు (మరుద్భ్యోనమః) యని పల్కుచు దొడరి ద్వారమున (నద్భ్య) యటంచు । నుదకమందు (వనస్పతిభ్యో) యటం చు । నొగిముసలమందు రోలున నుచితభక్తి । వెలయుబలికర్మములు సేయవలయు శుద్ధ । మతముపేరిమి సామాన్యమనుజుడైన॥ వ॥ వాస్తు పురుషుని మస్తకోత్తరపూర్వభాగంబులందు లక్ష్మికిని పాదప్రదేశంబు లగు దక్షిణపశ్చిమదిశలందు భద్రకాళికిని మధ్యదేశంబునందు పితామ హామహేంద్రులకును పృష్టభాగంబున సర్వాత్మభూతంబులకును బలిక్రి యలుచేసి బలిదానశేషంబగు నన్నంబువాస్తుపురుషు పాదమూలంబగు దక్షిణదిశయందు పితృదేవతలకు సమర్పింపవలయు వెండియు॥ క॥ శున కములకు పతితులకా । ద్విజులకు మాలలకు కల్మషనిరతులకు తీ । రని రోగ పీడితులకును । శకునములకు కాకులకును జనునన్నమిడగ॥ గీ॥ సర్వ భూతంబులను యోగ్యసంతసిల్లు । బ్రాహ్మణుండెవ్వడర్చించు పరమని యతి । వాసుపరమ పదంబు దివ్యమగు తేజ । మలరజొచ్చి సుఖించు మహాత్ములార ॥ మ॥ బలికర్మంబులుదీర్చి తానతిథులన్ బాటించి యస్థాసన । స్థులుగాజేసిసభైక్షకాదులిడి సంతోషించియాశీర్వచః । కలనాభద్రత వారలేగుటయు భోక్తవ్యాదులుంగూడన । స్థలితావా ప్తిగకర్మకర్త బుధవంగానొప్పరేభాగకిన్॥ క॥ గురునకు గోవునొసంగు ట। బరగినసత్పుణ్యఫలము బ్రాపించుసమా । దరమతిభిక్షు మొకని కిడ , పరమాప్తిగృహస్థుడైన బ్రాహ్మణునికిలన్॥ గీ. యోగ్యభిక్షుమైన నుదపాత్రమైనవే । దార్థతత్త్వవేదియైన బ్రాహ్మ । ణోత్తమునకు భక్తి నొసగిన జాలు భూ । దానపుణ్యఫలముతనకుగలుగ॥ గీ. హవ్యములు కవ్యములు వృథాయగునపాత్రు । డైన బ్రాహ్మణుసన్నిధినాచరింప , బా త్రితము మహాత్ముండు భవ్యుడునగు । విప్రుసన్నిధినవి జాలవెలయు చుండు॥ గీ. విద్యయును తపంబునెలంయు బ్రాహ్మణులము , ఖంబులగ్ను

లనగ గ్రాలివారి । సేవనంబులోపిసేయు వారలు నర । కములగూలకుండ గాచుచుండు॥ క ఆగతుడగునతిథి మహా । భాగునిగాదలచి యర్ఘ్య

## —*అతిథిపూజావిధులు.*—

పాద్యాసన గో । ష్ఠీగతులు నెరపిదాత మ, హాగౌరవభూతి సేయునది యనిరి బుధుల్॥ గీ బ్రాహ్మణుండతిథి పూజాదిభవ్యకర్మ । ములుసదా యొనరింపక మొద్దువైలె । నుండువాడగునేని యతండుసేయు, వేద పాఠకర్మాదులు విఫలములగు॥ క జలములు పూవులుకాయలు, ఫల ములు వల్కలములును సహాయకరములై । వెలిగాపతిథులకు విని । ర్మ లబోధాస్పదములగు సమస్తక్రియలక్॥ క. పరునిగృహంబునదగునే । కరాత్రివిని యతినుండగా నతిథికిగా । దరయగపెక్కుదినములే, కరా త్రుడతిథియనక్ జగంబునవెలయుక్॥ గీ. ఒక్కయూరునందు పెక్కు దినంబులుం । డునతడతిథిగాడు వినుడయోగ్య । తముడువాడ బహు జనములు నవ్వుచుదన్ను దిట్టనింద్యుడగుసుధీరులార॥ క. ఒరులిడు నన్నము గుడుచుచు । వరలు గృహస్థుండు తృప్తినడయక జన్మాంతరము న సదాన్నదానము । బరగించెడివారియింట పశువైపుట్టుక్॥ గీ. అతిథి సూర్యోదయాస్తమయాది వేళ । లందెపుడువచ్చునప్పుడత్యాదరమున, నర్ఘ్యమును పాద్యమును నాసనాదులొసగి । కుశలమడుగునది గృహ మేధి కుతుకమార॥ ఉ. ఆదరహీనుడైయతిథి కన్నముబెట్టక నెవ్వడాత్మ పు । త్రాదులుదాను నంగనలు నన్నముకూరలు పాలునేయి దధ్యాది పదార్థముల్ గుడుచునాతడమేధ్యము మెక్కువందికిక్ । సోదరుడందు రార్యులు మనుష్య పశుత్వముచేఅయున్నదే॥ గీ. ఉత్తముండగు నతిథి కి నుత్తమంబు । మధ్యముండగునతిథికి మధ్యమంబు । నధముడగునతిథి కధమంబు నాచరింప, వలయుపూజాతిశయ గౌరవంబులర్థి॥ సీ. వైశ్వ దేవార్చనావశ్యకర్మంబులు దీరినయప్పుడతిథిసమాగ । తుండగునేనియు వండి యన్నంబిడగాదగునతనికి గౌరవమున । బలిశేషమిడుట యొప్ప దు భోజనార్థంబు బ్రాహ్మణులాదిగా బరగు నాల్గు । జాతులవారికి జను కులగోత్రనామాంకితంబులు దెలియంగ జెప్ప । టొక్కజాతికి పూ

జ్యమింకొక్క జాతి । యగుట శూద్రుఁడుకాఁడు బ్రాహ్మణునికతిథి । యి తరంగున జాతుల కెల్లజాతి । నియమములు వలయునని మనీషిజనులు॥ గీ. అతిథిధర్మంబు సెలఁగ బ్రాహ్మణుని యింటి । కాగతుండైన క్షత్రియు నాతఁ డార్య । సత్కృతులు చేసి పిదప భోజనమిడంగ । వలయు తనకు నధికగౌరవంబు గోరయ॥ క. ఒనరంగ వైశ్యశూద్రులు । చనుదెంచిన బ్రాహ్మణుండుజను వారికి భో । జనమువిడ భృత్యజనముల । కు నిడు సమయమునననిరి నిగూఢార్థవిదుల్॥ గీ. అతిథికడుపూజ్యుఁడగుట గృహ స్థుడైన । వాడు పూజింపవలయు నెవ్వాడతండు । యునవిచారింపకా ప్తి మైయనిరి కొంద । రార్యజనములు తుల్యమాన్యత్వగరిమ॥ క. పరులు సుమిత్రాదులు ని । గ్భరకారాహాలముతోడ రానతిథులుగా । నరయ కవారలకును స । త్కరింపవలయు బ్రాహ్మణుం డుదాత్తమనమునన్॥ గీ. కన్యయు సువాసినియు మరి గర్భిణియును । రోగిణియు వృద్ధయును భవ్యయోగినియును । భోజనంబులు సేయుఁగఁబోలు నతిథి । జనముల కు పూర్వమదియు దోషంబుగాదు॥ క. అతిథులునాప్తులు భృత్యులు । కుతుకంబలరారనున్న గుడిచినపిదపన్ । వ్రతపరిశుద్ధి జెలంగిన । సతిప తులుకూడు కూరజనుభుజియింపన్॥ గీ. దేవపిత్రాతిథిజనసంభావనీ య । మైన పూజాక్రియాదులు నాచరించి । తద్విశిష్టాన్నమిచ్చులుదం పతులు భు । జింపవలయు వ్రతావాప్తి పెంపువెలయ॥ గీ. దేవతా దులకన్నంబు దివిరియిడక । యెవ్వడు భుజియించునిచ్చలు హీనతముఁడ। పాత్రుడన్నంబుగా దది పాపరాశి । వాడుదానిగుడిచినట్టి వాడయగు ను॥ గీ. ఋత్విజుడు స్నాతకగురులు నెలమిరాజు । మామయును ప్రియ తముడు మేనమామయు తన । యింటికే తేరమధుపర్కమిచ్చి ప్రియ ము । సేయువలయు గృహస్థుండు శిష్టజనుడు॥ వ॥ సంవత్సరంబొక్కటి చనిన పిదప వారలు మరియు సమాగతులైన నిట్లుపూజింపవలయు వత్సరాంతంబున తాను యజ్ఞదీక్షాపరుండైయుండుతరి రాజును శ్రోత్రి యుండును సమాగతులగునేని పూర్వప్రకారంబున మధుపర్కవిధిపూ జించుటయు నన్యవిధుల పూజింపకుండుటయు మాతులాదులయజ్ఞ

సమయంబునవచ్చిననే విధులు సేయకుండుటయు వత్సరార్ధంబున మరి
యు దానుయజ్ఞంబయిన వివాహంబయిన సేయుచుండునప్డు వారిలో
నొక్కడైన నంద్వైన నరుగుదెంచిన మధుపర్కవిధి పూజించుటయు
సామాన్యధర్మంబులు॥ క. సూర్యోదయాస్తమయముల । కార్యముల
న్నియును సేయగాదగు దానుర్ । భార్యయు కడునియమంబును । మర్యా
దయు సెలగనుత్తమ గృహస్థుశీలర్॥ క. సాయంకాలంబున కడునియ ।
మాయతుడై దేవతార్చనాదులు మరి య । ధ్యాయనము సతీసహి
తుం । డై యొనరింపంగ జనుగృహస్థుడు పేర్మిర్. క. సాయంతంబున
నిజభా । ర్యాయుక్తుండగుచు శిడముగ నన్నముతో । సేయవలయు
బలికర్మము । లాయువు నారోగ్యమును సుహార్ధముగలుగర్॥
క. సాయంతంబునసూర్యా । ధ్యాయత నాచమనవిధులు తగనడపె
డువాడాయుర్విద్యాసౌఖ్య । శ్రీయోగ్యత్వదశలిచ్చు జెందు సతంబుర్॥
గీ. వైదికపథంబుదగ నమావాస్యయందు । పిండపితృయజ్ఞకర్మముల్
పెంపుసేయ । వలయు ప్రతిమాసమును తె వచ్చునే? । కొలది ప్రజలం
దరొక్కింతకొఱతలేక॥ గీ. మంచిమాంసంబుగూర్చి మాసికంబు ।
సేయవలయు హితంబు సత్యాయుతముగ । మాంసమునిషేధమనరాదు
మాంసమాసి । కంబు పితృదేవతలకు ప్రియంబుగూర్చు॥ క. పితృకా
ర్యంబుల గుడుచుట । కతిపూజ్యుల పూజ్యులుభయులగు వారలు రెం ।
డు తెరంగుల బరగుదురా । యుతమతివారలసపర్య మరయగవలయుర్॥
క. ఒనరంగ దైవకార్యం । బునవిర్వురును బితృకర్మమున ముప్పురు భో ।
జనములు సేయగ నర్హులు । ననడొక్కరుడైన దగు పవిత్రుండరయుర్॥
గీ. సత్క్రియయు దేశకాల శౌచనియతములు । బ్రాహ్మణాపిశేషమును
ననబరగు పంచ । విధులు సెప్పుదు శ్రద్ధతో వినుడు పరమ । శాంతమ
యమూర్తులార ప్రశస్తులార॥ క. పితృకర్మంబులు పండిత । మతమున
సేయంగ గునమావాస్య జగ । న్నుతవృత్తి లౌకికాదులు । చితములు
భవ్యంబులును విశిష్టంబులగర్॥ క. పరదివసములనదగు భా । స్కర
చంద్రగహణ పుణ్యకాలముల సమా । దరమతి పితృకర్మంబులు । పర

మనియతిసేయనగు సభాసదులారా॥ క. శ్రోత్రియుఁడత్యుత్తముఁడును।
పాత్రతముఁడు నైష్ఠికుఁడగు బ్రాహ్మణునికిడఁ । బాత్రములై జనుదైదే
వత । పితాగ్నిన్నములనిఁ సర్వపృధ్వర్ధవిపుల్॥ క. వేదవిదుండొకఁడైనను।
మేదురఫలమొసగునైన పిత్రుకార్యములం । దాదిభుజింపగఁగల్గిన । కాద
జ్ఞానులు పలువురు గలసెకుడిచినఁ॥ క. వేదజ్ఞుండు మహాత్ముం । డైద
గుబ్రాహ్మణునిదూర మొనసియతిథిగా । నాడగమారబిలచియు । న్నాదు
లపరితుష్టిసేయ నగుఫలముగనై॥ క. వేదజ్ఞుండొక్కరుఁడున । వేదజ్ఞులు
బహుజనములు వెలయుసమాన । త్వాదశదైవతపిత్రుక । ర్మాదుల
గుడువంగననిరయమహితచిత్తుల్॥ క. జ్ఞానోత్కృష్టుండైదగు । వానికి
కవ్యాదులిడుటపశ్యము దగున । జ్ఞానులకదిగాదిల పి । త్రానందక్రియ
లుసేయు నర్హతములకుఁ॥ గీ. శ్రాద్ధకర్త వేదజడులగువారల । కన్న మెం
దుకుసదా ప్తినొసగు । నన్నివత్సరంబులాతండు యమపుర । తప్తములగు
నాయుధములుబ్రమింగు॥ గీ॥ జ్ఞాననిష్ఠునకు తపోనిష్ఠునకు సదా । ధ్యానని
ష్ఠునకునుదాత్తకర్మ । నిష్ఠునకు నిడునదినేశుద్ధకవ్య హ । వ్యాదులనిరి
బ్రాజ్ఞులార్యులార॥ ఉ. నైరులుమిత్రులుఁ స్వజనవర్గముశ్రాద్ధములఁ
భుజింపగా । దారయ లేమవారు దినినందున సత్ఫలమింతయైనసా । చార
పరాయణుండు బుధసత్తముఁడూర్జితభవ్యతత్త్వ వి । ద్యారమణుండనం
దగు నతండగు పాత్రతముండు పెంపఁఁ॥ క. శ్రాద్ధంబుతోడ సంగ
ము । బద్ధంబుగజేయువాడు బడయడుఫలమా । శ్రాద్ధంబువలన
శాస్త్ర వి । రుద్ధంబదిగాన నప్పురుసునలనదిలఁ॥ క. పలువురిహితు
లొకచోటఁ । గలసిభుజించుటదిమతముగాదు క్రియా సం । కలితంబై
నైహికసుఖ । ఫలదముగుఁ నదిపరంబు బగగదుదానఁ॥ చ. తన
యుడు శత్రుమిత్రులును దానును భృత్యులు బంధువర్గమం । గనలును
శుద్ధమైన పిత్రుకర్మములందొకచోటగూడి భోజనములుసేయుటొప్ప
దుపిశాచసమాజముభంగినార్య లో । ల్లనిశుభకర్మమైనను జెలంగదు
గావున నంతప్రత్తగుఁ॥ క. ఆదరముభవ్యతమముగ । బీదలకన్నంబిడున
ది పిత్రుకర్మము లం । దాదిసతిథులును మాన్యులు । వేదజ్ఞులుగూడ

శాస్త్రవిహితమదియగుచ॥ క. బీదలకన్నంబిడకన । నాదరమగుభంగి జూచు నాతడుకడు పెం । పూదియొనరించుకార్యము । లాదరములు గావుపితృగణాదులకెల్లన్॥ క. బీదలు నతిథులు పూజ్యులు । గాదల చుచునెవ్వడు పితృకర్మములందు । త్యాదరమతినన్నంబిడు । నాదరము లగునవి పితృగణాదులకెల్లన్॥ క ధనవంతులు నధికారులు । తనకుఁ పూజ్యులుగ దలచితగనెవ్వడు భో। జనములిడు బీదలకుగా। కనతడునర కంబునచిరకాలంబుండున్॥ గీ చవిటినేలనిడిన సుబీజంబువలన । ఫల ముబొందంగనేని పగిదిబాత్ర । తములుగాని వారలకన్న దానవిధు లు । చేసిఫలమించుకయుదాత జెందడరయ॥ క. దాతప్రతిగ్రాహకు డు ని। రాతంకము గాగ నైహికాముష్మిక సౌ । ఖ్యాతిశయ జేయనోపుస। నాతనవిజ్ఞానమూ నానగునేని॥ క. ఆదరణీయుండగు శ్రాద్ధాదిమ హాకార్యకర్తయన్నంబును వి । త్తాదులుతనకు నొసంగుట । పూది ప్రతిగ్రాహకుడు సుఖోన్నతి బొలచున్॥ క. వేదజ్ఞులైనను రి పుల । నాదరమున బిలచి వలవదన్నంబిడ శ్రా । ద్ధాదులదుర్మ తులైనను , బీదలపూజింపఁల యు ప్రియములరారన్॥ క. తగునన్నంబి డశ్రుతిపా । రగునకు ఛందోగునకు నిరంతరశాఖాం । తగునకు సమా ప్తికునకును । జగతిసమాధ్వర్యునకును శ్రాద్ధక్రియలన్॥ క. వీరలకన్న ముదగనిడు । వారలకేడుతరములగువారలు పెతరుల్ । గౌరవనీయు లగుదురు స । దారహితులచే నుదాత్తముగాగన్॥ క. ఆదరమును కూలాస్పద । మైదగ వీరలకిడునదిహవ్యము కవ్యం । బాదినతితులకు ముఖ్య జ । నాదులకున్ బిదప దాతయుచితభంగిన్॥ సీ. మాతా మహుడుమేనమామయు భాగినేయుండు మామయునుగురుడు భాం ధ , వుండు ఋత్విజుడునల్లుండు యాజితుండు శిష్యుడిష్టుండు భుజించు టొప్పు। బ్రాహ్మణుడైవకర్మమున భుజింపజేయగ పరీక్షించుట దగదు దగుప । రీక్ష సేయుట నతిదీక్షపై తృకకర్మతంత్రంబులందు యత్నంబు నూది । పతితుండపుంసకుండును పాపరతుడు । నాస్తికుండును హవ్య కవ్యములుగొన న । పాత్రతముఁలగు గాపున బాత్రమెరిగి । కర్మములు

సేయునది ధర్మకర్తలెల్ల॥ సీ. జూదరియును బాలిసుండును జడదారి

—*పితృకర్మభోజనానర్హుల నిరూపణము.*—

కూర్మహంతకుడు నధర్మరతుడు । వైద్యుండు ఖలుడు దేవలకుండు మాం
సవిక్రయుడు హవ్యమ్మును కవ్యమును గొ । నంగనపాత్రులనందగు నీ
గుట కాదోకప్పుడు నృపగ్రామసేవ । కుండును ప్రచ్ఛన్న గోళులు
గలవాడు ప్రతికూలములు గురుబలుకువాడు । నగ్నిహోత్రక్రియలు
మానినట్టివాడు । పరమసేచకుండు గోపరిపాలకుండు । క్షయమహా
రోగియును బ్రహ్మచౌర్యరతుడు । కరిముశ్రాద్ధాదుల భుజింపగానివా
రు॥ వ. మరియు బ్రహ్మద్వేషియు కొలువుగొలుచు వాడును కుశీలవుం
డును ప్రమాదంబుల బ్రహ్మచర్యవ్రతంబు చెడినవాడును శూద్రాంగ
నా సంగమశీలుండగు విప్రాధముండును జారపుత్రుండును కూలిగొని
వేదంబుజెప్పువాడును శూద్రశిష్యుండును శూద్రగురుండును దుర్వచ
నంబులు బలుకువాడును కారణంబులేక జననీజనక గురుబాంధవాదు
లను పరిక్రమించినవాడు నధమకన్యాదానాది సంపర్కంబున పతితుం
డగువాడును గృహంబులు గాల్చినవాడును గరదుండును సోమవిక్ర
యుండును సముద్రయానంబు సేయువాడును స్తుతిపాఠకుండును తైలి
కుండును, కూటకారకుండును కితవుండను మద్యపానంబు సేయువా
డును పాపరోగియు డాంబికుండును రసవిక్రయుండును ధనుశ్శరాదికర్త
యు మృతిబొందిన యన్నపెండ్లామును వరించినవాడును మిత్రద్రోహి
యు ప్రాణిద్యూతవృత్తి గలవాడును పుత్రునివలన వేదాభ్యాసము సే
యువాడును గండమాల రోగముగలవాడును తెలుపుకుష్ఠురోగము వ
లన పీడింపబడువాడును దుర్జనుండును వెఱ్ఱియు నంధుండు వేదనిందకుం
డును యేనుంగులకు గోవులకు నొంటెయలకు నధికారియైన వా
డును జ్యోతిశ్శాస్త్రము వలన జీవించు వాడును పంజరములందుని
చిపక్షులు పెంచువాడును యుద్ధార్థమాయుధవిద్య నేర్పుచుండువాడు
ను సేతుభిన్నకుండును వాస్తువిద్యోపజీవియు వినోదార్థము కుక్కల
పెంచువాడును దేగలవలన జీవించువాడును కన్యాదూషకుండును

హింసాపరుండును హీనాచారపరాయణుండును నిత్యయాచకుండును వ్యాధివలన బలిసిన పాదంబుగలవాఁడును గొఱియలు మేకలు కుక్కుటములు జీవధనములు గాఁగలవాఁడును పాడియు నాడియు హాస్యంబు జెప్పియు జీవించువాఁడును పరస్త్రీ పరధనాపహరణోద్యోగ పరాయణులు సింకవివిధపాపరతులును బిత్రృకర్మంబుల భుజింపననర్హులగు వెండియు॥ గీ॥ వేదముపఠింప డెవ్వఁడావిప్రపశువు । నర్హతముడనియిచ్చిన హవ్యకవ్య । ములువృథాయగునాజ్యంబు బూడిదెనిడు । చందమునెరుఁగునది యిదిసర్వజనులు॥ గీ॥ పంక్తిభోజనానర్హుండగు బ్రాహ్మణునకు । హవ్యమునుఁ కవ్యమును నిచ్చునాదరమున । నెవ్వఁడూర్ధ్వఫలోదయమిచ్చఁ జేసి । వాఁడు రెంఁడును చెడినట్టివాఁడునిజము॥ క॥ పరఁగఁగనే శ్రాద్ధంబున । పరివేత్తయునగ్రతుండ పంక్త్యయుఁడు నా । దరమునభుజించుదానఁ । బొరయుఁడు సత్ఫలముదాత భూనుతులారా॥ క॥ దారాగ్నిహోత్రసంయో । గాఱుహాఢిఁ బొలచు నెవఁడన్నకుపూర్వం । బారయుపరివేత్తయన న । గౌరవనీయుండతఁడు జగంబున వెలయున్॥ వ॥ వానికన్నయగువాఁడు పరివిత్తయనంబరఁగు॥ క॥ పరివిత్తియు పరివేత్తయు । పరఁగఁ నేకన్యతోడ పరివేతనముఁ । దొరకొను నదియును తద్దా । తఋత్విజువియ్యొవురత్యధములన బరఁగుఁ॥ క॥ మృతుఁడైనయన్న పెండ్లా । మతిధర్మని యోగనెవ్వఁడనురాగము పెం । పుతగఁ వరించునోడక । నతఁడిలధిధిషూపతి యనఁనలరు డధముఁడై॥ క॥ పతిబ్రతికి యుఁడునప్పుడు । సతికిఁ విటపురుషువలన జన్మించిన యా । సుతుఁడొప్పకుండ డనగా । స్మృతుల పురాణములవిబుధశిద్ధార్ధములఁ॥ క॥ పతిమృతి బొందినపిమ్మట । సతికుపపతివలననిచ్ఛజన్మించినయా । సుతుఁడొప్ప గోళకుండన । క్షితిపంక్తి భుజింపనప్రశిద్ధులు వారల్॥ క॥ వారలకు హవ్యకవ్యము । లారయకిడు దాతనిష్ఫలావాప్తిమదిఁ । గూఁడుపరబీజసంభవ । కారణులు పిత్రృక్రియాప్రకాశ సుగతులే॥ సీ॥ తొమ్మిది మడుఁగులంధుండాఁప మడుఁగులు కాణయుకుష్ఠురోగంబు దొడఁరు । వాఁడుశతాంశముల్ నసుమతి వేయిమడుఁగులు పాతకరోగియుగొనుదాత । పు

ణ్యాఫలంబు సంపూర్ణంబు దిపుట మైగాపున వారలగౌరవింప, వలవదు హావ్యకవ్యములిడిశూద్రయాజకుడు బ్రాహ్మణతను స్పర్శనంబు| సేయు నెందాక నంతలుచిప్ప ఘటములెబలె। దాతదానఫలస్ఫూర్తి దరుగుచుండు। బ్రాహ్మణుడు నరకమున బడుబరగ శూద్ర। యాజకునకు ప్రతిగ్రహా ణాప్తిచేసి॥ క॥ వైద్యుడు దేవలకుండును, విద్యావంతుండు సోమవిక్రయు డును దు। ష్టోద్యముడు కపటశీలుడు| మద్యపుడునపాత్రులగుసమాజం బులకున్॥ క॥ వణిజుండును గోఘ్నుండును। ఫణిసంపాదకుడు నిష్ఠ బరగింపని బ్రాహ్మణుడును కితవుండునువా। రణపాలకుడును వసింప రాదు సభలలోన్॥ ఉ॥ మాన్యములై జెలంగినసమాజములందొక బ్రా హ్మణుండుకా। దన్యులనంటినిల్వగ నయంబగునిర్వురు ముఖ్యరార్యు సా, మాన్యులు నల్వురిగతి గ్రిమంబుగనేవురు నార్యులేడ్వురున్। ధన్యులు వారలొప్పగునుదాత్తసభాసద కార్యధుర్యతన్॥ క॥ పితృకా ర్యములందును నీ, గతిపూజ్యుల పూజ్యులును జగంబున వెలయున్। కృతకార్యారంభులు సు। వ్రతశీలురుదీనివిధము వలయునెరుంగన్॥ క॥ వెలసినపంక్తిక పాత్రులు। బొలచుట దూష్యమగుపంక్తి భూనుత మగు స। త్ఫలలా భార్థముపంక్తిన్। వెలయింపగ జాలువారి వినుడు బలికెదన్॥ క॥ వేదములు తదంగములు ల, త్యాదర మతితో జదివిత

—*పంక్తిపాత్రుల విధము.*—

దర్థము బలుకం। గాదగు విప్రులుశమ సం। పాదకులగు నేనిపంక్తి పావనులయగున్॥ గీ॥ వేదములును తదంగముల్ విపులమతి పు। రా ణములు జదివి నిత్యసువ్రత పరాయ। ణాప్తిదగు బ్రాహ్మణోత్తముం డరయ పంక్తి। పావనుండగు నాతండ దేవసముడు॥ క॥ శతజీవియు గో దాన, వ్రతసంభావ్యమతియును పరాయణతా సు। స్థితబుద్ధియు గు రుసేవా। రతుడును బాత్రములుపంక్తి బ్రాహ్మణహితులున్॥ గీ॥ శ్రా ద్ధదినమందు బ్రాహ్మణ త్రయమునియమ। ముతసమన్వితులను నిమం త్రితుల జేసి, భోజనాదుల పరితుష్టిబొరయనడపు। టదిత్రయీపాప్త మనబడునార్యులార॥ క॥ వెలయునిమంత్రితులగు వి। ప్రులు ముఖ్య

రు శ్రాద్ధకర్తభోజనములు పూ । వులు పండ్లును గంధరసా । దులు తమకర్పింపంగ ముదముతో గైకొనుటల్॥ క. వేదవిదులైన బ్రా హ్మణు । లాదరమున శ్రాద్ధభోజనాదులు సేయం । గాదగు నుమ్మలికం బున । కాదుగుడువనట్లు దినజగతినిందుల్యలగుౘ్॥ క. పిలువఁబడివచ్చి నవి । ప్రులనీడలయందదృశ్యరూపంబులతో । గలసివెలువడి పితృగ ణం । బులువత్తురు శ్రాద్ధగేహము సమీపింపఁ॥ చ॥ అతినియమంబు శౌచము బ్రియంబును బెంపలరఁ సదానిమం । త్రితులగు బ్రాహ్మ ణుల్ కరము దేకున హవ్యముకవ్యముఁ వృథా । గతి భుజియింప కేగినర కంబున బాల్పడి యూరబందులై । క్షితిజనియింతు రాదరముచేసిన పావనమూర్తులైదగుఁ॥ క. పాదజునికాంతతోన । త్యాదర శ్రాద్ధములు సేయునట్టి ద్విజుండం । దాదరమున గుడిచిన వి । ప్రాదులును సమాన పాపులగు ఋషులారా॥ క. కోపంబు లేనివారల । పాపులు శౌచపరు లధిక భాగులు నియమో । ద్దీపితులు పితరులగు హిం । సాపరులును పూర్వదేవసత్తములరయఁ॥ క. వారలుజన్మించిన త । త్కారణమును పావన ప్రకారము నిత్యం । బాగోపించెడివిధము ల । పారసుమతులార వినుడుబల్కెద దెలియఁ॥ క. ఆదివిధాతకు పుత్రుం । డైదోచిన మను వుపుత్రులగు ఘనులమరీ । చ్యాదిమహర్షులనందను । లాదరణీయులు పితరులయమహితులారా॥ వ॥ మరియు విరాణ్ణందనులగు సోమ పదు లు సాధ్యులకును మరీచిపుత్రులగు నగ్నిష్వాత్తాదులు సర్వనిర్జర సం ఘంబులకు నత్రితనయులగు బర్హిషదాదులు దైత్యదానవ యక్షరక్షోర గ గంధర్వసుపర్వకిన్నరులకును బితృదేవగణంబులగు వెండియు॥ గీ. బ్రాహ్మణక్షత్రియార్య శూద్రగణములకు । సోమపుండనగహవిర్భు జుడనవాజ్య । పుండనసుకాలినుండన బొలచునల్వు । లరయబితృదేవ తులగు మహాత్ములార॥ వ॥ సోమపుండు భృగువునకును హవిష్మంతు డంగిరసునకును నాజ్యపుండు పులస్త్యునకును సుకాలినుండు వశిష్ఠున కును బుత్రులగు మఱియు నగ్నిదగ్ధానగ్నిదగ్ధకావ్యబర్హిషదసౌమ్యాగ్ని ష్వాత్తలను మహనీయులు బ్రాహ్మణుల కుపపితృవర్గంబులగునిట్లు॥

క. పితృగణముఖ్యులజెప్పితి । నతిసంఖ్యులు వారలకు తనయులును బౌ
త్రుల్ । మతిమంతులుగలరివ్యాసు । మతిచేకొ౯నరాదు వారి మాని
తులారా॥ గీ. సతము ఋషులవలన బితృగణంబులు వారి । వలన దేవ
దానవనిచయములు । దేవతలవలన నతిప్రవృద్ధి వెలయు । సర్వభూతమ
యము జగముగలిగె॥ సీ. రూప్యపాత్రములందు రూప్యంబు లిడినైన
తామ్రపాత్రముల నీరంబులునిచి । యైనబితృగణంబులందుశ్రద్ధాభక్తి
వినయాది పరిచర్యవృత్తులెనయు । నీగియక్షయభూతి యోగంబుగొన
నోపునసువర్ణాది దానార్తఫలము । వేంజెప్పగనేల విప్రుండు లోక
సామాన్యుండు దైవకర్మంబుచేసి । పిదప పితృకార్యములు సేయుట
దిఘనంబు । బితృగణములకు దేవతల్ పెద్దలగుట । నిట్లుగావింప విధ
యయ్యె నివ్విధంబ । యెల్లవారల కాచరణీయమగ్యు॥ గీ. రక్షభూతంబు
గాగ పూర్వంబుదైవ । కర్మమును మంత్రవిధులును గడుపనగున । రక్ష
భూతాస్పదంబగు శ్రాద్ధమంచు । రాక్షసులు బొల్చురదిగాన దీక్షవల
యు॥ సీ॥ శుచియు వివిక్తంబు సురమందిరాంతికమగుచోట గోమయం
బలికిపుచ్చి । దక్షిణాప్రవణంబుగ పితృకర్మముల్ సేయుటొప్పగు నిర

—*పితృకర్మాచరణవిధి.*—

పాయభంగి । సహజశుద్ధంబు నిర్జనము గునటి ప్రదేశసామీప్యనదీత
టమున । పితృకర్మమొనరింప బితృగణంబుల కతిప్రీయమొనగూరు సం
ప్రీతితోడ । నచ్చట నిమంత్రితులగు విప్రాదులధృతి । బరగువారలనా
మ్నాయ పారకలన । భవ్యవిజ్ఞానమూర్తుల పరమగతుల । నాసనస్థితు
లుగ జేయుటదిఘనంబు॥ క. ఆసనములందు బొలచిన । భూసురపుంగ
వుల గంధపుష్పాదులతో । దాసుని శాపము బొలచి యు । పాసింపగ
వలయు లోకపావనులారా॥ క॥ వారలకుదకముతిలలు న । పారంబుగ
నొసగి యాజ్ఞబడసి నియతిబెం । పారగ విప్రసహితుడై । యారంభిం
చునది హోమమర్ధి నొనర్పన్॥ వ॥ ఇట్లుహోమంబుచేసి॥ క. అనలున
కును యమునకు సో । మునకు హవిర్భాగదానములుచేసి క్రమం ।
బున పితృగణములపూజిం । చునది సమస్తవిధులను విశుద్ధి జెలంగన్॥

క. వెలయంగ నగ్న్యభావో, జ్వలుడగు బ్రాహ్మణునిపాణి సంధించి
విని, ర్మలమతిబ్రాహ్మణులుదకం, బులుగూరిచి సేయవలయు భూ
నుతులారా॥ క. కోపములేమియు శుద్ధ, వ్యాపారముగలిమియును మ
హామతమును ని । ష్ఠాపరతయును జెలంగ న । పాపుండగు ద్విజుడు
శ్రాద్ధపాత్రుండయగున్॥ క. అమావ్యతమును విప్రుడు, హోమము
గావించి జలములురులవలయు ని । ష్ఠామతిదక్షిణపాణిమ । హామతమ
గునదియనిరి సదార్యజనంబుల్॥ వ॥ ఇట్లుజలంబులురివిహోమంబున
హవిశ్శేషంబుగొని దాని మూడుపిండంబులుగాజేసి యాపిండంబులుదక
విధిసంయోగంబుగా దక్షిణాభిముఖుండై పితృదేవతల నుద్దేశించి విడు
వవలయు॥ మరియును॥ క. పితృకార్యపరాయణుడగు । నతడు పవిత్ర
ములు బంపి యందుసమానా । యతముగ పిండత్రియమిడు ।
టతిప్రియమొనరించు పితృగణాదులకెల్లన్॥ చ॥ అతినియమంబుతో
పిదప నాచమనంబొనరించి బేర్మి న । ద్రుతుపితృవందనాదులుగడున్
వెలయించుట బెంపగున్ సదా, యతమతిదక్షిణాభిముఖుడైమరి
నీళ్ళురిలించిమాటికిన్ । నతులిడిమూడుపిండములహోరి సువాసన
జూడగాదగున్. క॥ తానును విప్రులు గుడువం । గానగు నాపిండము
లునొకడునుడుగకుమీ, దై నెరసినయన్నలవము । లానిగ్ర
హించికొని విస్ఫుటానందమునన్॥ గీ తాతజీవించియుండగా తండ్రి
చచ్చె । నేని పుత్రుండు భువి మహాసీయభంగి, తత్పరతమైబితృప్ర
పితామహులకు । శ్రాద్ధవిధులాచరింపగా జనుగడంగి॥ క. మనువు
పితామహుడును కీ । ర్తనీయుడనుటవలన పితామహునాజ్ఞన్ । గొని
పితృప్రపితామహులకు । జనుసర్వక్రియలుసేయ శాస్త్రీయముగన్॥
వ. పితృప్రపితామహ వృద్ధప్రపితామహులకు శ్రాద్ధత్రయంబుసేయ
వలయునని కొందరు మతంబైయుండు నిర్వ్యాధంబున పితృదేవగణప్రకా
రంబు లెరింగి పవిత్రంబులగు తిలోదకవిధులాచరించి పిత్రేస్వధాస్తి
యనిపల్కుచు తత్పిండాగ్రంబు వెటికికొని బ్రాహ్మణాదులతోగూడ
భుజింపవలయునన్నపూర్ణ పితరాదిపాత్రంబులు స్వపాణియుగంబున

గ్రహించి పితృగణంబుల ధ్యానించుచు బ్రాహ్మణుల సమీపంబున నిడుట యుత్తమఫలశిద్ధికరంబగు నిట్లు॥ గీ. ఇనువురన్న పాత్రంబులు నెరిగ్రహించి । బ్రాహ్మణాంతికమున నిడబరగదది మ । హాసురంబును బితృవినింద్యంబునగుచు । నసురులకు జెందుననిరి శాస్త్రవిదులు॥ సీ. పప్పునుకూరలు పాలు పెరుగును నేయి తేనెయు బెల్లమాదిగపదార్థ। ములు పాకశుద్ధిగా వెలయించిపాత్రంబు లందిడిదారుశిలాదివివిధ । ఫలకసంతతుల స్థాపనము సేయుటదగు భక్ష్యభోజ్యంబులు ఫలములు మృదు । కందమూలములు యోగ్యంబైన మాంసంబు సురభిపానంబులు బరగునట్లు । లాచరింపంగ నిట్టులన్నాదులగ్ర । జన్ములసమీపముననిడి శౌచనియతి । నెలమిపరివేషమొనరించి యిదిమధురము । కారమిదియు నవలయు పాకగుచు లెన్ని॥ క. రోదనకోపవృషా వా । క్యాదులు బచరింపవలన దన్నంబునకుఁ । పాదస్పర్శనమునుగా । దాదరమతి జూడవలయు నయ్యన్నంబుఁ॥ వ. అశ్రుపాతంబున ప్రేతంబులకును కోపంబున శాత్రవులకును పాదస్పర్శనంబున కుక్కలకును బోర్లించుట వలన రాక్షసులకు నయ్యన్నంబుజెల్లుగావున నప్పుడు కడు జాగరూకతవలయు బ్రాహ్మణులకేపదార్థంబులు రుచ్యంబులై యుండునవి వారలకు గుడువనిచ్చుటయు శ్రాద్ధకాలంబున పరమేశ్వరుకథలు సెప్పుటయు వినుటయు వేదంబులు ధర్మశాస్త్రంబులు పురాణంబులు పఠించుటయు నవశ్యంబు వెండియు॥ మ. పరితోషంబును నార్జవంబును సదా బాటించి శుద్ధాత్ములై । గరిమంబారగనుండు బ్రాహ్మణులయోగ్యంబైనభంగిఁ సదా । పరిచర్యాదులు శాంతవాక్యములు దోషఁతుష్టి బొందించి స । త్వరతఁ బన్పుట జొప్పగుఁ పితపదివ్యఖ్యాతిరంజిల్లగఁ॥ గీ. బ్రహ్మచర్యవ్రతస్థితిబరగునైన, యత్న మొనరించి దౌహిత్రునాదరమున । శ్రాద్ధభోజనసంతుష్టసదములాత్మ । జేయుటొప్పగు కంబళాసీను జేసి॥ గీ. కుతపమును తిలలు దర్భలుగూడమూడు । వేగిరము లేమిశౌచంబు నాగిశాంతి నెగడియుండుటమూడు దౌహిత్రుడును బ। విత్రములు శ్రాద్ధమందిలామిత్రులార॥ గీ. కూడు వేడిదైన

గుడుచు భూదేవులు । పాకరుచు లెరుంగ పాటిగామి, నీపదార్థ మొక్క
డింపగు నేయను । దాతకు త్తరంబు దగదొ సంగ॥ క. తలగుడ్డలు పా
దుకలును, జలములురులు కేశములు భుజంబుల వస్త్రం । బులు దక్షి
ణాభిముఖములు । గలిగి భుజించుట దిదైత్యగణకృత్యము గుఱ॥ క. శున
కము పందియు కోడియు । వినుడు రజస్వలయు మాలవృషులుడు
పండుం : డునుజూడ నైనజూచుచు । జనదుగుడువ బ్రాహ్మణులు యశ
స్కరులారా॥ సీ. హీనాతిరిక్తంబులై నయంగంబుల గలుగువారల
ఖంజకాణజనుల । కర్మకర్త దొలంగగా జేయునది సూవ మతిథులు భి
క్షుకులైన విప్రు, లరుగుదెంచిన శ్రాద్ధమందు నిమంత్రితులై యున్న వి
ప్రుల యనుమతంబు । గొని పూజలొనరింప జనువారలకు వెండియును
పదార్థము లెల్ల నొక్క చోట, నొక్కడుగ జేర్చి తీర్థంబులురివి భోజ ।
నములు సేయుచునున్న బ్రాహ్మణుల వెనుక, భాగమను చోట దర్భలు
బరచియుంచు । జల్లవలయు నిదియు సుప్రశస్తమతము॥ వ. మఱియున
సంస్కృత వ్రతులకును త్యాగినులకును కులస్త్రీలకును బ్రాహ్మణో
చ్ఛిష్టాన్నంబును దర్భలందు విడచిన యన్నంబును భుజింపనిచ్చుటయు ను
చ్ఛిష్టంబైన భూగతాన్నంబు దాసవర్గంబులకును కుంటి గ్రుడ్డి మొదల
గు వికలాంగులకును నిచ్చుటయు సపిండీకరణంబాదిగా శ్రాద్ధపర్యం
తంబున చిరకాలమునఁ గతించినవానిఁ గూర్చి వైశ్వదేవక్రియా ర
హితంబుగా సర్వకర్మంబులు నిర్వర్తించి శ్రాద్ధాన్నంబు బ్రాహ్మణుల
కు మాత్రమిడి యొక్కపిండంబు విడచుటయు సపిండీకరణంబునకు పూ
ర్వ మేకోద్దిష్టంబు సేయుటయు నది మొదలమావాస్యాది పితృదివసంబు
లందు శ్రాద్ధంబులు సేయుటయు సర్వకర్మజ్ఞులమతంబు మరియును॥ సీ. శ్రా
ద్ధాదిగ పితృకర్మములందు నెవ్వఁడు చ్ఛిష్టాన్నమిడునవిశిష్టభంగి । శూద్రా
దులకు బాలిశుడు వాడు కాలసూత్రంబను ఘోరనరకమునబడు, శ్రాద్ధా
న్నము భుజించినమతనుండక వధూసంయోగమెవ్వఁడు సలుపునాది ।
నంబున రాత్రి నన్నాతి మూత్రపురీషములు నిల్తురొకమాసము వెలియ
డిగి । వానిపితృవర్గములు నార్జవంబుదఱిగి । శ్రాద్ధమందు భుజించిన బ్రా

హ్మణులతి । తుష్టిదీపించిదాతసంతోషమొంద । గాస్వధాస్తుయనుచుబ
లుకంగవలయు॥ గీ. దైవకర్మంబులను రుచితమనియు బిత్ర్య, కార్యముల
స్వదితమనియు గోగణములుండు । తావులనుశృశ్రుతమనియుపావనా
భ్యుదయవిశేషాప్తిబలుకవలయు బుధుండు॥ సీ. అపరాహ్ణమునవిర్జనా
యతపరిశుద్ధ మగుచోటగోమయం బలకిదర్భ । లందునబఱచి తిలాక్ష
తాదులుజల్లి శుద్ధిజేసికరంబు సొంపువెలయ । భక్ష్యభోజ్యంబులు పాన
కంబులుగూర్చి బ్రాహ్మణులయ్యెడ పంక్తిగా భు, జింపజేసిననదిజెలగు
శ్రాద్ధంబనపూర్వాహ్ణమున భక్తిపూర్వకముగ । శుద్ధమును నిర్జనమగు
చోట దర్భ । లెసగబఱచి హావిర్భూతినింపుజేసి , విప్రులగుడువజేయుట
వెలయుదైవ । కర్మమనసదిలోక విఖ్యాతులార॥ క. అమరుహావిస్సన
మున్య। న్నమునులతారసముపాలు నంజుడియు నక్ర్య । తిర్యమలవణంబును
తేనియు । విమలజలంబులునుగూర్చి వెలయుంపంగన్॥ గీ. దైవపిత్ర్య
కర్మములుచేసి దక్షిణాభి । ముఖుడుశుచియును దృఢనియముండును
నయి । కోరికలపెంపునెదలోన గుదురుపరచి , ప్రార్థనముసేయునదిపిత్ర్య
వర్గములను॥ క. వేదాధ్యయనము సర్వజ । నాదరణీయతయు నతియ
విభవసం పూ । ర్ణోదయముచిరాయు ర్వి । ద్యాదులుమావంశమందు
నగుగాకెపుడున్॥ వ. అని॥ క. ఈరీతినభీష్టంబులు । గోరుచుపిండంబు
లిడి మగుడనియతుండై । వారికణంబులునురుచులు । నారాధించునది
పిత్ర్యగణాదులనెల్లన్॥ క. జలములనగ్నినిపిండం । బులువిడచినమత్స్య
ముఖ్య భుక్తంబులు ని । ష్కలుషంబులునగు గావున । వెలయునది
సమస్తకర్మ విధులనొకటియై॥ క. పిత్రృపూజాతత్పరతయు । పతివ్రతయు
మతయు ధర్మపత్నియునగు నా । సతిపుత్రార్థినియైతగ । పితామహు
పిండముదిన బెంపగునుర్విన్॥ క. ఆయుష్మంతుడుదృఢమే । ధాయుక్తుడు
ధార్మికుండు ధనవంతుడు వి । ద్యాయోగ్యపథారూఢుం । డై యొప్పు
కుమారునిగను నాయమహాత్మన్॥ క. చేతులుగడిగికొని నిజ । జ్ఞాతుల
కన్నాదులొసగి జనుపూజింపన్ । ప్రీతియునార్జవమును వి । ఖ్యాతి
యు వెలయుంగదైవ కార్యములందున్॥ క. పిత్రృపూజాదిమహా విధు।

లతికాలమునాచరింప నగుపద్ధతియూ । యుతభంగి వెలయజెప్పెద , కుతు

——*దీర్ఘకాలపితృక్రియా విధులు*——

కంబునవినుడుమాని కుంజరులారా॥ క. తిలలును యవలునుమాషం।
బులువ్రీహులునై నతీర్థములు కందంబుల్ , ఫలములుమాంసమునైన
వి । మలమతివర్పింప పితృసమాజములలరున్, సీ. మత్స్యమాంసంబున
మాసముల్ రెండును లేడిమాంసంబునమూడు నెలలు । గొఱ్ఱెయమాం
సమునకనాల్గునెలలు పక్షిమాంసంబునన్నైదు మాసంబులారు , మాస
ముల్ గఱిమేకమాంసంబున పృషతమాంసంబునను నేడు మాసములిల।
నేణమాంసంబున నెనిమిదినెలలు తొమ్మిదినెలల్ రౌరవామిషమున
బది । మాసములుపురుష భూదారమహిష మాంస । ములశశకకచ్ఛప
పలలములపదియు ను । కండుమాసంబు లబ్దముఖంబునందు । బాయ
సాదులబూజింప భవ్యతమము॥ వ. కాలశాకంబు మహాశల్కలమునను
మత్స్యమాంసంబులును ఖడ్గమృగమాంసంబు నెరుపునలుపువర్ణముగల
మేకమాంసంబును తేనెయు మున్యన్నంబును పరమప్రశస్తంబులు మరి
యును భాద్రపదకృష్ణత్రయోదశియందు మధుసహితంబుగా పితృతర్ప
ణంబుసేయునేని యది రెండుమడుగులధికంబై యుండు భాద్రపదకృష్ణ
దశమి యాదిగా జతుర్దశిగాక తక్కినదినంబులు శ్రాద్ధకర్మంబునకు
యోగ్యంబులును మహాఫలప్రదంబులనియు కృష్ణపక్షంబున జంటలగు
ద్వితీయ చతుర్థతిధులందును భరణీ రోహిణీనక్షత్రంబులను బితృకర్మం
బులాచరించునేని యభీష్టంబులు శిద్ధించుననియు జంటలుగాని పాడ్య
మీ తృతీయాతిథులందు నశ్వినీకృత్తికానక్షత్రంబులసేయ సుపుత్రసం
తానప్రాప్తియు పుష్కలధనవిద్యావిశేషాదిలాభంబులు బొరయునని
యు పితృకర్మంబులాచరించుటకు పూర్వపక్షంబుకన్న నపరపక్షంబు
యోగ్యంబగుచందమున పూర్వాహ్ణముకన్న నపరాహ్ణంబత్యుత్తమం
బనియు దక్షిణసంస్థితయజ్ఞోపవీతుండును దర్భపాణియు నపసవ్యపితృ
తీర్థభాసమానుండును నియతేంద్రియుండును శుచియు శాస్త్రీయ వృ
ద్ధాచార పరాయణుండునై పితృక్రియలు సేయవలయుననియు మహా

నీయుండై న మనువుజెప్పె నంతియగాక॥ సీ. శ్రాద్ధంబుసేయంగ జనదు రాతిరియందు రాక్షసమనిరి కర్మవిదులదియు, నుభయ సంధ్యలయం దు నొప్పదచిర భాస్కరోదయసమయంబుగాదు గడక। సంవత్సర మునకు సలుపంగదగుశిశిరనిదాఘములను వర్షర్తువునను, మూడు శ్రాద్ధంబులుగీడుబొందక లౌకికాగ్నిహోమములు సేయగడగుట యు। దర్శవిని కృష్ణములనగు దశమి మొదలు। గాకనన్యతిథుల బిత్రు కర్మములు స। మాచరించుటయును బ్రాహ్మణాదివర్ణ। ములకు సత్ఫ లములుగాక దొలగునెద్దియి॥ గీ॥ స్నానమొనరించినిర్మలజలములుగివి। యెవడు బిత్రుతర్పణముసేయునిచ్ఛలుదగ। ప్రతిదినంబును నాతండు బడ యు పిత్రు మ। ఖక్రియలనేకములు సేయగలుగు ఫలము॥ క. పిత్రుగణ ములు వసువులనియు। బితామహులు రుద్రులనియు పెరయాదిత్య। ప్రతతులు బ్రపితామహులని। యుతగణ బేర్కొనియె మనుమనువు మునులారా॥ సీ॥ విఘసంబనగనొప్పు విప్రాది భుక్తశేషాన్నంబది బ హు సమాదరమున। నారగించిన భవ్యుడమృతాశనుండగు నమృతం బనగనతిథ్యాదులెల్ల। గుడువగామిగిలిన కూడుకూరలకొప్పవాని భు జించుచు మానకదగు। సతియునుబతియు యజ్ఞంబున మిగిలిన యన్నా దులను దినువట్టివార। లగుదురిప్పుడు పంచయజ్ఞాదిగ పిత్రు। కర్మము ల తెరవులన్నియు బేర్మిమెరయ। తేటపడజెప్పితి మనువు దివ్యసత్ఫ్రి। పావి శేషవశంబున భవ్యులార॥ వ॥ అనిచెప్పెనని॥

ఉ. భవ్యసమాధిరూఢ పరిపక్వమనస్సముపేత పండిత
స్తవ్యవిలాసకారణ వశంవదశాశ్వత చిన్మయాద్య త
త్త్వవ్యవసాయమార్గఫలవత్స చరాచరజంతుజాల దీ
ర్ఘావ్యసనానుమాత్ర బుధసత్తమపాలన ఖేలనవ్రతా.

క. పరమేశ్వరసకలచరా
చరచేతనజాలపూర్ణ సంగవిలాసా

దరనిత్యసిద్ధాకార
స్ఫురణప్రతిభావయోగ భూయిష్ఠగతీ.

మాలినీ. విమలహృదయహేలా విశ్వగర్భానుకూలా
శమదమయుతబోధా సారమూర్తి విశాలా
శమితకలుషజాలా సాధుసంసర్గశీలా
యమరవినుతపాదా వ్యాప్యతత్త్వైకవాదా.

గద్య.

ఇది శ్రీమత్పరమేశ్వర లీలా విచిత్ర ప్రపంచసేవాపాత్ర శ్రీమద్వారపురెడ్డి
పాపినాయక పుత్ర నిఖిల బుధజనవిధేయ యప్పలనాయక
నామధేయ ప్రణీతంబైన శ్రీమదాంధ్రమనుస్మృతియను
మహాధర్మశాస్త్రమునందు తృతీయోధ్యాయమ్
సంపూర్ణమ్.





శ్రీరస్తు.

శ్రీమద్ద్వితీయరామకృష్ణపరమహంసగురుస్వామినేనమః.

# శ్రీమదాంధ్ర మనుధర్మశాస్త్రము.



## చతుర్థో ధ్యాయము.

శ్రీయుతమూర్తిసనాతన। మాయాగుప్తప్రకార మహితసమస్తా। పాయరతసర్వలోక। శ్రేయఃపరిభావహృద్ధృతి పరమేశా॥ వ. దేవా యవధరింపుమట్లు సావధానులైయున్న ఋషిసమాజంబులతో భృగుమహర్షీంద్రుండిట్లనియె.

### —*నానావిధసూక్ష్మధర్మప్రకారము.*—

క. పరమాయువునిబుధోక్తి జ। తురంశములుగను వెలయుదొట్టిదివుట స। ద్గురుసేవ జేయవలయుఁ। బరమనియతిరెండు ప్రథమభాగమునదగఁ॥ గీ. దారకర్మాదివిధులత్యుదారబుద్ధి। నడుపవలయుదొరంగకనరుడుప్రీతి। మైద్వితీయాంశమందు నిరంతరంబు। ననిమెలోకహితంబుగా మనువుమున్న॥ గీ. భూతములకుద్రోహ భూయిష్ఠమగుభంగి। నైననట్టిసేత లరయలేని। వృత్తినైననొప్పు విప్రుండుజీవింప। నాపదలునిరాంత మడరునపుడు॥ క. కాయక్లేశము లేక ను। పాయము వెంపఱకుటుంబ భరణంబునకై। సేయవలయు నర్థార్జన। మాయతమతిబ్రాహ్మణుడు నిజార్హక్రియలఁ॥ క. ఏయుద్యోగంబుల శా। స్త్రీయములగునవియుడిగి సహింపుచునిచ్చఁ। జేయవలయు నిర్దుష్టము।

లై యొప్పినకర్మములు ధరామరులెలమిన్॥ క. జ్ఞానాస్పదమాత్రంబు
లు । గానిపనులు సేయరాని కర్మంబులు న । జ్ఞానియగువిప్రుఁడొనరిచి।
నానాయాతలనబడు మహామునులారా॥ క. ఆపదలుగల్గునైనను ।
బాపంబులు సేయనగునె బ్రాహ్మణుఁడటుగా, కేపాటినైనఁగొందరు । జూ
పింతురుదుష్పథము లసూయాపరులై॥ క. వారలుజూపిన తెరవులు ।
పారగమతులొల్ల రేయుపాయములైనన్ । దారుసహింతురు సద్ధ । ర్మా
రంభగరిష్ఠశీలురై నిత్యంబున్॥ వ. కావున॥ క. సేవకవృత్తియొకప్పు
డు । గావింపక బ్రాహ్మణుఁడు తగంగఋతాదుల్ । వా విరిసమాచరిం
చుచు । జీవింపగవలయుమతము శిద్ధిన్ బొరయన్॥ సీ. కళ్ళంబులందు
మార్గములందుపొలముల యందెందునైనధాన్యంబులద్ధి । పిసువక
గొనుటది యొసగుఋతంబన నెన్నులపుంజంబు లేరికొనుట । శిలమనగా
నొప్పు జెలగుప్రార్థింపక నన్నంబువడయుట యమృతమనగ । బ్రార్థిం
చియన్నంబు బడయుటమృతమన నదిజెల్లుబ్రమృతము ననగ వెలయు।
గర్షణంబాపదలు జాలగలుగునప్పు । డాశ్రమాంతరమనుబొందు నపు
డువిప్రు । డెలమినీయైదువృత్తుల నెద్దియైన, జేసికొనిబ్రదుకవలయువిశిష్ట
భంగి॥ క. శునకముచాడ్పునవిప్రుడు , జనదన్యులకొలువుసేయ సత్యా
నృత వ । ర్తనమైనను వాణిజ్యం । బున జనుజీవింపనడరు పుట్టిన వేళన్॥
క. ఐనను శాస్త్రీయంబులు । గానిపనులు జేసి బ్రదుకగాదియువృట
వి । జ్ఞానధనులకు మతంబగు । నే నింద్యంబులగుగాక నెయ్యెడనై
నన్॥ వ. మరియు మూడుసంవత్సరంబులు జీవింపననువుగా గూర్చిన
ధాన్యంబును సంవత్సరంబు బ్రదుకవలనుజేసినవియు మూడుదినంబు
లుపయోగింపదగినవియు నొక్కదినంబునకు జాలునవియు కుశూలకుం
భీత్ర్యహైహికశ్వస్తనికంబులనంబరగునిట్లు॥ క. మేదినిగృహస్థులగు వి।
ప్రాదుల కీనాల్గువిధములగు ధాన్యంబుల్ । వేదవిహితంబుగా సం ।
పాదింపగవచ్చుననిరి పరమమునీంద్రుల్॥ సీ. షట్కర్మములలోన జను
నొక్కడైన మూడైన నాశ్రయములుగానెగడగ । గాదేనియిచ్ఛాప్రప
కల్పితంబులగు చతుర్విధధాన్యముల్ దొడరగూర్చి । మైనజీవింప వి

ప్రాదులకగుబుతాదులును భవ్యములగు వలయునెడల । కృషియు
వాణిజ్యంబు ఋణము లెన్నఁగా వు క్షత్రియాదులకవి శాస్త్రములగు।
బ్రాహ్మణుండగ్ని హోత్రపరాయణాప్తి । శిలమురుంఛంబు వృత్తి
గా జెలగిభవ్య । యజ్ఞములు కేవలంబు పారాయనముల । నాచరించు
చు జీవించుట దిఘనంబు॥ చ. అనృతములాడకుండుటయు నదృతమా
త్రకథాప్రసంగ హా । సనిరతవృత్తిబూనకయు సత్యము శౌచము వేద
మగ్ని హోత్ర । త్రనిపుణతఁ జెలంగుటయు బ్రాహ్మణుభవ్యమతా
వలంబనం । బునకగు కారణంబులవి జోకడ జేసిన గీడుమూడగుఁ॥
క. సంతోషంబును శుద్ధ । స్వాంతంబునుగలిగి బ్రతుకవలయు నొక
ర్తుఁ । భ్రాంతివడకనిత్యంబును । సంతోషముమూలమెల్ల సౌఖ్యం
బులకుఁ॥ క. అనుకూలింపకనిత్యము । ధనుమత్యధికంబు గూర్పదల
చుటదుఃఖం । బనదగునది యిహపరసా । ధనభంగకరంబు దుర్మత
ము బుధులారా॥ క. తగునిదితగదిదియని శా । రగమతి జర్చించి
హితపరాయణదీక్షఁ । నెగడితనకైన చెయ్యాలు । జగతీసురుడాచరింప
జను వెఱగాకఁ॥ క. వేదోక్తంబులు శుద్ధము । లైదగు కర్మములు సే
యుటగు బ్రాహ్మణుడ । ట్లాదరమతినడపిన వా । డాది విరాట్పురుషు
బొందియమృతాత్ముడగుఁ॥ క. వేదవిరుద్ధంబులును న । నాదరణీ
యంబు లుఱువులగు కర్మంబుల్ । గాదాచరింపనిచ్చలు । నాదిమవర్ణ
నకు బతితుడగునవి సేయఁ॥ క. వెలయంగనింద్రియార్థం । బులుయం
దునతిప్రసక్తిబోవుటయందుఁ । బలుతెరవులందుజిత్తము । జలింపక
నుండునియతి సంధింపజనుఁ॥ క. వేదవిరుద్ధములగు న । ర్థాములు
గూర్పంగ దిరువుటాగినియతి సం । పాదింపవలయు ననిరి బు । ధాదర
ణీయులగు భవ్యులఖిలార్థవిదుల్॥ గీ. వయసునకు కర్మమునకు భవ్య
మగునర్థ । మునకు శుశ్రుతమున కభిజనమునకగు । వేషవాగ్బుద్ధిసా
రూప్యవిధములు దగు । కాపుకోరగాని యప్రసంగంబులరయ॥ గీ బు
ద్ధివృద్ధికరంబులై బాలచుధాన్య । ములు హితంబునుగూర్పగా మొదల
దివురు । టతివినోదంబులును శ్రుతిస్మృతిపురాణ । పాఠకలనాప్తియు

నుదగు బ్రాహ్మణులకు॥ క. మానవుఁడెంతదనుక యత । మానసుఁడై
శాస్త్రములు సమతఁబఠియించుఁ దుఁ । జ్ఞానంబభివృద్ధికరం । బైనెగడుఁ
వానికంతలంతలు సుప్రతై॥ గీ. ఒనరఋషి దేవభూత పితృనృమఖములు।
దినదినము సేయవలయును దివుటమైన । రుండు శౌచమునియమంబు
రెండు మనువు : లధికముగనని రి కర్మజ్ఞులైనబుధులు॥ క. బుద్ధీంద్రి
యంబులైమని, బద్ధంబులుగాగమనసు పాటించి సదా । వృద్ధిబొగయ
నానందము । పద్ధతి వెలయింప యోగపంచకమునగుఁ॥ గీ. భాషణం
బులందు ప్రాణవాయువులను । ప్రాణవాయువులను భాషణములు ।
గుదియజేర్చి పెంపగుట మాటలును ప్రాణ । మేకమైన యజ్ఞవృద్ధి వెల
యు॥ క. జ్ఞానాగ్నిని వ్రేల్తురు బ్ర । హ్మానందమ్మైక చిత్తులగు బుధులె
నయం । గానీయజ్ఞములైద స, దానుభవ విశిష్టతం మహాత్మ్యము పే
ర్మిన్॥ వ. ఉదిత హోమపక్ష దినాద్యంతంబులన నుదితహోమపక్ష ని
శాద్యంతంబుల నగ్నిహోత్రకార్యంబు లవశ్యంబులై యుండు॥ మఱియు
ను॥ గీ మూడుఋతువులందు మూడుయజ్ఞంబులు । పశువధంబుచేసి
బ్రాహ్మణుండు । సేయువలయునవియ జెలగుచాతుర్మా స, యజ్ఞము
లనజగతినాఖ్యలారా॥ క. ఆయువుఁగోరినవిప్రుడు , పాయక దామార్గ.

—*పూజ్యాపూజ్య జన నిరూపణము.*—

శీర్షమాసమునందుఁ , గోయజ్ఞంబునవాన్నము । స్త్రీయునుమాం
సంబునుడిగి జెలగగవలయుఁ॥ క. గోయజ్ఞముచేసినియతు । డై య
గ్నిక్రియలుడిగినవాన్నామిషముల్ । హేయమనక గుడిచినద్విజు, నా
యువుఁగొనునతని యాహితాగ్నులురువులై॥ సీ. అన్నపానములిచ్చియై
న కందంబులు ఫలములొసగియైన పరమభక్తి । నతిథిపూజలు సేయుడ
ధముడెవ్వడు వానిమన్నింప కింతలుమాటలాడ । నలయు నార్యులు పె
ద్దవారలజూచి సహింపకిచ్చలు ద్రవ్యాసిగతముల । ప్రాజ్ఞజనముల మ
ర్యాదసేయునది వేదవిరుద్ధకర్మతంత్రవ్రతులు న । వినయరతులు కపట
వేషులు శఠులు మాం । సాశనులు బకవ్రతాభిమాత్ర । తములు నతి
థులైనదగు వాక్యమాత్రాన్ప । నవిఘులనియె మనువు భువనహితుడు॥

ఉ. వేదపరాయణుండునుపవిత్రుడు సువ్రతనిష్ఠికుండు సం, పాదిత యోగతత్త్వ ధనపాలుడు భవ్యకళావిశారదుం। డాదరణీయు లేవురు గృహస్థునికిచ్చలు వారలన్ గరి, ష్ఠాదరపూజ సేయుగల సజ్జనుడొందు మహోగదోన్నతుల్॥ శా. చేతస్స్వాస్థ్య విహించి యింద్రియములన్ శిక్షించి సమ్యక్కళా। తీతుండయి గృహమేదియిచ్చలు సముద్దీపించు దీక్షాపరతన్। భూతశ్రేణుల బ్రోవగావలయు సంపూర్ణానుకంపంబు ని। ష్ఠాతంత్రంబు సదానుభూతియు బుధస్తవ్యంబులై యేర్పడన్॥ మ విభవ ప్రోత్కృష్టతమించియుండుతరి నుర్వీదేవుడష్టాంగయో। గభరంబాత్మ జలింపకుండుశమమార్గంబా ప్తినార్జించి పా। పభయంబింతయు లేక సౌఖ్యపదవుల్ బాటింపగావచ్చు వే, దభృతి వ్యాప్తధనార్జనేచ్ఛలు వినింద్యంబై నిరూపింపగన్॥ మ॥ తగవిద్యావ్రతస్నాతకుండును విశుద్ధజ్ఞానశీలుండునై। జగతీ దేవుడు యోగమార్గము మదిన్ సంధించి నిత్యంబు శి। ష్యగణంబుల్ వెనువెంటరానడచి యజ్ఞానాత్ములన్ శుద్ధత। త్వగరిష్ఠాఢ్యుల జేయగావలయు నవ్యాజక్రియోద్యోగియై॥ క॥ శాంతుండును వేదజ్ఞుసు। దాంతరితుడు పరమధర్మతత్పరుడగు ధీ, మంతుడు తనకింపగునవి। సంతోషంబున ధరింప జనునని బుధుల్॥ క॥ బీదలు సర్వజనంబుల। కాదరణీయులగు గాననలుక జనింపన్। కాదు విరోధము సేయ మహాదశ దగువారువారలం దెన్నంగన్॥ క॥ నిరుపేదలు। సర్వజనా। దరణీయులు వేదచోదితంబిదియని పూ। ర్వాబుధీంద్రుల నకులుజె। ప్పిరి లోకహితంబు గోరి పెంపు జెలంగన్॥ క॥ వేదజ్ఞుండగు విప్రుడు, పేదయు విజ్ఞాన ధనుడు పృథివీపతియున్। వేదాంతియు విద్వాంసుడు। నాదరణీయతకుతుల్యు లనిరి మహాత్ముల్॥ క. నిరుపేదనధికదుర్దశ। బొరయంగాసీకశక్తి బోటినశుద్ధా, దరమతి బోషించిన స। త్పురుషుండొక్కరుడె లోకపూజ్యుండరయన్॥ క. సాధుజనంబులబీదల। వ్యాధిగ్రస్తుల మహామనస్కులపూజా, శ్రీధర్మాస్పదమిహపర, సాధనమని యెన్ మనువు యశస్కరులారా॥ సీ. అన్నంబులేమిలోనై నచాడ్పునమూడు ముడతలువారిన కడుపుతో

డ। నాయాసమధికమై బాయకవిన్నదనంబురూపించుమొగంబుతోడ।
సంతతంతకదీర్ఘమైనక్షుద్బాధశుష్కంబులై యొరయు నంగములతోడ।
సతియుబుత్రులు పెంపు సడలిచుట్టికొనదుర్భరమైన చింతాభరంబుతోడ।
తనువుగప్పిన జీర్ణవస్త్రములతోడ, దొడరదివియుటపదములు తొట్రు
నడగ। వచ్చునిరుపేదజూచి యెవ్వాఁడు బ్రియము, సేయడాతనిగతి వేఱ
జెప్పనేల॥ క. నిరుపేదలకన్నంబిడి। పరమాదరభంగిజూచు భవ్యాతము
నితో। సరిరారెవ్వరతండిహ। పరసౌఖ్యములెల్లబొరయు పండితు
లారా॥ క. దైవపితృకార్యసద్విధి। పావనులునుపంక్తిగుడువ పాత్రులు
పుణ్యా। శ్రీవెలయింపసమర్థులు, నై వెరవ్రగదోచుబీదలనిశమునుర్విన్॥
క. బీదలకన్నంబును వ। స్త్రాదులుదానంబుసేయ నైనఫలముతో।
రాదుసమానంబై స। ద్వేదజ్ఞునికీగు వడువు వివరింపంగన్॥ క. దీనజనం
బులుశ్రద్ధ। జ్ఞానధనులుపూజ్యులు పరసాధనమాత్మన్। మానితగతియో
చించెడి। వానికనియెమనువు దేవ వర్గంబులతోన్॥ క. ఏపురుషుడు
నిరుపేదల। కోపించునుదగ్రుడై దిగులు పుట్టమహా। పాపాత్ముండాతం
డా। కాపురుషునిజూడరెరుక గలభవ్యతముల్॥ క. కోపించిబీదవలికిన।
పాపాత్ముడురెండువేలు బదియైదేడుల్। రూపఱగూలుఘననరక।
కూపంబునవానితనువు కుక్కలుజీల్చున్॥ క. దండంబునుజలపూర్ణక।
మండలువును జన్నిదంబు మణిమయ భాస్వత్కుండలములు మృగచర్మ
ము। ముండితయునువలయువిప్ర ముఖ్యులకెల్లన్॥ గీ. అంబువులయం
దుప్రతిబింబితాకృతిగన। నైనయప్పుడుగగన మధ్యంబునందు। వెలుగు
నప్పుడు గ్రహముక్తి వెలయునపుడు। సూర్యునుదయాస్తమయముల
జూడరాదు॥ గీ. క్రేపుగట్టిడిత్రాడు లంఘించుటయును, వర్షముత్కట
మగుతరివారుటయును, జలములందున తనరూపు గలయజూచు।కొనుట
యునుగావశుద్ధముల్ గుడుచుటయును॥ క. ఘృతమున్మృదంగము తేనె
యు। చతుష్పథముత్తమద్విజన్మంబు వన। స్పతియును దైవముగన

—*సామాన్యసూక్ష్మధర్మవిశేషము*—

నై। నతరికిదగుసత్ప్రదక్షిణంబులుసేయన్॥ క. వినుడుగజస్వాలయగు

సం । గవతోఁ బోవుటయు నిచ్చగలయుటయు బ్రియం । బున బవ్వ
ళించుటయునూ । కొనుటయు నంటుటయుగాదు గురుమతుల్లారా ॥
క. ఆరయఋతుమతియగు సతి । తోరమియించినపురుషుని దుర్ఘట బ
ల తే । జోరూపబుద్ధి శక్తి । స్ఫారగతులుదగుగుననిరి పరమమునీం
ద్రుల్ ॥ క. ఆయుఃప్రబలమును తేజము । భూయిష్ఠస్ఫారగతియు బుద్ధి
యుయోగ్య । శ్రీయునువృద్ధిబొరయు ఋతు । మాయికమగుసతిరమిం
చుమనుజునికు నవై ॥ గీ. ఆవులించునప్పుడన్నంబుదినుచున్న । సమయమం
దునధిక సౌఖ్యలీల । నాసనమునసుందునత్తరిభార్యా ము । ఖంబునిచ్చ
జూడగాదుపతికి ॥ గీ. ఏకపాత్రమందునిల్లాలుతానును । భోజనంబుసేయ
బోలదధిక । గోష్టిపతికినిగ్రగూరిన భార్య నా । మంబెలుంగు సెలగబ
లుక రాదు ॥ క. తనసతినయనంబుల కం । జనమిడు కొనుచుండునపుడు
జనదుప్రసవ వే । ళనితాంతమునుదిగంబరి । యునగులరిక జూడ
చనువు మెయిపతికిక ॥ సీ॥ ఏకవస్త్రముధరియించియన్నము గుడు
చుటయు బ్రసవగోవు జూచుటయును । దిసమొలతోడ నదీతటాకాదు
ల స్నానంబుసేతయు సంధ్యవార్చు । టయు త్రోవలందు పుట్టలయం
దు భస్మంబునందుపర్వతములయందు జలము । లందును దేవా
ల యాంతికస్థలములయందుజీవులు పుర్వ్వలాదిగాగ । ప్రాణులు వ
సించి యుండురంధ్రంబు లందు । నేటిగొయ్యలయందును తోటలందు ।
మలము మూత్రమువిడుచుట మాన్యతముల । గర్జనంబులు సేయుటకా
దుమఱియు ॥ క॥ జలముల వాయుప్రసనలము । ఫలవంతము లైనతరు
ల బ్రాహ్మణులను గో । వుల సూర్యచంద్రబింబం । బుల జూచు
చుకాదు మలముమూత్రము విడువర ॥ గీ॥ ప్రాణభీతి తనకుబరగు చో
టులయందు । నీడలందు తమమునెగడియుండు । స్థలములందు దివుట
మలమూత్రములు విస । ర్జింపవచ్చుననిరి శిష్టజనులు ॥ గీ॥ బ్రాహ్మ
ణుండును వహ్నియు భాస్కరుండు । చంద్రుడును గోవువాయువు జల
ము లెదుట । గాననగు చోటులను మలమైనమూత్ర । మైనవిడుచుట
దరగు ప్రజ్ఞానుభవము ॥ క॥ ఊదివెలింగించుటయును । పాదంబులగా

చి కొనుట బయిపిడచు టమే । ధ్యాదులు వైచుట దాటుట । కాద గ్నినుదారవృత్తి గాన్పింపంగన్॥ సీ॥ గ్రామాంతరము నేగు-చోమార్గ మున నిద్రబడలుటయును జంతుబాధ సేయు । టయు నేలపై వ్రాయు టయును సంధ్యలయందు గుడుచుటయును నిద్రగూరుటయును । మల మూత్రములుబడి మాసిన వస్త్రంబు నుచ్ఛిష్టములు పేడయుప్పుమ న్ను । రక్తంబు విషపదార్థంబులు మాంసంబు పశువులకొమ్ములుభ స్మరాశి । రోమములుచర్మములును పురుగులుజలము । లందు వేయిం చుటయును పాడైనయింట । బందుకొనుటయునిద్దురబడలియున్న । వా ని వెల్పుటయునుగాదు వదగుటయును॥ చ॥ ఋతుమతిబల్కరించు టయు ఋత్విజులెవ్వరులేనియజ్ఞము । స్నతమనిచూడబోవుట మహా సుజనంబులనేవగించి దూ । షితవచనంబులాడుటయు సేతలుమాను టయున్ సదావృథా । గతులజెలంగుచుండుటయు కాదుచిరాయువు గోరువానికిన్॥ మ. అనలాగారములందు గోష్ఠములయందన్నంబుభ క్షించువే । శి నమస్కారముజేయబోవునపు డుల్లాసంబురంజిల్లగా । తనయుద్వాహమహోత్సవాది బహుతంత్రశ్రేణులైనప్పుడు మె । ల్లనస వ్యాయతహస్తమూదునది లీలాభద్రసంయుక్తుడై॥ గీ జలములైన పా లైననిశ్శంకద్రావు । చున్న గోవునివారించుటొప్ప దాక । సమునవొక వేళ నింద్రాయుధమును జూచు । నేని బుధుల సందర్శింపనేగవలయు॥ క. అరయనధర్మమయములు । నారోగ్యములైనపురము లందో'క వే డ్కన్ । నూపులపల్లెలనుండం । గారాదనియెన్ మనుప్రజగద్ధితులా రా॥ క. చిరకాలంబునగా గ్రో । పరివాసము సేతగానిపలుకులుతను నా । దరమతి జూడనిపురుషుని। పరిచర్యయువలవదనిరిపండితవర్యుల్॥ క. పాషండగణాక్రాంతము । దోయమయముశుద్ధకర్మదూరంబుసదా। దూషితము శూద్రరాజ్యము । రోషబహుళముండగాదు రుచియగునై నన్॥ సీ. అన్నంబుసూర్యోదయాస్తమయంబుల గుడుచుటమిక్కిలికూ డుకూర । లాకాంక్ష సేయుట యనువుగానివృథాప్రయత్నముల్ సలు పుటయురులనిచ్చ । గూడుటదోసిలి గుదియించిజలములు ద్రాగుటవే

డ్కనుత్సంగమందు, నన్నంబుభక్ష్యంబులారగించుట పరసేవకవృత్తి విశిష్టమనుట। యార్యమతముగాని యాటలుపాటలు। నాద్యములునుగరు వ నుద్యమించు। టడరిసింహ నాదమూ|క్రందనంబును। నూరకయమొ నర్చు టొప్పదరయ॥ గీ. కంచుపాత్రమందు కాసులుగుదియించి। కడి గికొనుటభిన్న ఘటములందు। గుడుచుటాత్మ్రక పటమిడికొనియున్న వా, డిడినకూడుదినుట యొప్పుగాదు॥ గీ ఒరుడుధరియించివిడచిన సురభి శములు। పాదుకలుజన్నిదంబునంబరముపుష్ప। మాలలుకమండలు వుపేదమానిసిబలె। కోయక ధరించుటయుగాదు సాధియయ్య॥ గీ. గోరిజులునుతోతకలును చెవుల్కొమ్ములును వి|భిన్నములునంధ ములుగోగ పీకితములు, చర్మశల్యమాత్రావశిష్టములునైన। యేను గులగుఱ్ఱములబాడ్ల నెక్కరాదు॥ మ. కడువేగంబులుసూపవర్ణబల యోగ్యంబుల్ వినీతంబులై, యడరింపారెడికుంజరాశ్వ వృషముఖ్యా రోహణంబుల్ క్రమా। బడరుఙ్ |శాంతిదోరంగు సౌఖ్యమగు మోదా వాప్తిరంజిల్లు నె, య్యెడనైనఙ్ జనునప్పుడెల్లరకు నెద్దుఙ్ విస్ఫుటవ్య గ్రముల్॥ గీ |ప్రేతధూమంబుమరియు బాలాతపంబు। గాయమున సోకుటదనగు నాయువల్లు। గానవలవదు జాగమాకతవలయు వృ। థాపవాదంబులన్యులనాడరాదు॥ గీ గోళ్లలునువెండ్రుకలునిచ్చ గొఱి కికొనుట, కారణములేకలోష్టంబు గాగమన్ను। గలువ్రుటవినూతన ములగుగడ్డిపోచ, లదికిగోళ్లలద్రెంచుట యరయగాదు॥ గీ. తానుజీర్ణం బుగానిపదార్థములు భు। జించిపూర్ణసుఖావాప్తి జెలచికొనిన, చంద మునననువుగాని చేష్టలుసమా। చరించికష్టదశలబడురీతిగాదు॥ ఉ. కా రణమేమిలేక తృణఖండనమృణ్మయలోష్టమర్దనల్। వారకసేయువాడు బుధవర్యులనూరకదూరువాడు నా। చారములేనివాడు నిమిషవ్రత మూనినవాడు మోక్షకాం। క్షారతిబోనివాడు నరకంబునగూలుదు రార్తిదూలుచుఙ్॥ గీ. తరుచుగోళ్లలువెండ్రుకల్ గొఱికికొనెడి, వాడు శుద్ధసదాచార సంతుడయ్యు। శౌచమునుబుద్ధిబలముతేజంబుభవ్య। శీలమును సిరియునాయువ్రుగోలుపోవు॥ క. మానకగోపృష్టంబున। యా

నముగావించుటయు బయలవడినదశం । బైనసుమాల్యంబైన వి । హీన స్థితిదాల్చుటయు వినింద్యంబులగుఁ॥ సీ. ద్వారప్రదేశంబు దక్క-గో డలుప్రాకి ప్రుచ్చిలునట్లిల్లు సొచ్చుటయును । వృత్తమూలమున రాత్రి వసించుటయులీలన్నె నమానకనత మాడుటయును । కరయుగంబున పాదుకలు బట్టుటయు పాన్పునందునాసనమునందన్నముదిను । టయు నెల్లవారలకయనగృహంబుల శోభావిశేషముల్ చూడబోవు । టయు వృథారతి సూర్యాస్తమయములందు । తిలలొగులకిచ్చుటయు తాను తినుటయును జ । లంబులందిడుటయును భోజనంబుచేసి । నీరుద్రావు టయునుగాదనిరి విబుధులు॥ క. లంచంబులుగొని దీనుల । వంచించుట జారచోర వర్గంబుల యా । చించుట వేశ్యలతో క్రీ । డించుటకాదొరు నిధనమడిచికొనుటయిలఁ॥ క. పాదములుగడిగికొని ని । ద్రాదిసుఖ క్రియలు సేయనగు నిత్యంబుఁ । పాదంబులతడివాయక । నాదరమున గుడుచువాని కాయువు బెఱుగుఁ॥ క॥ మలమూత్రంబులుచూచుట । జలములనీదుటవృథా మసలుట యరణ్యం । బులదుర్గమప్రదేశం । బుల విహరించుటయుగాదు భూనుతులారా॥ గీ. భస్మమునసస్థులందుకపాలి కముల । భిన్నమృణ్మయభాజన భిత్తికలగ । చాదిరోమవికీర్ణంబులందు నిలువ । వలవదాయువుగోరిన వాడుదివుట॥ గీ. పతితుచండాలుపుల్క- సుబ్రహ్మఘాతు । కాగమవిరుద్ధజనముల నంటనిలుచు । టొప్పదువిశు ద్ధవృత్తి సంయోగమాన్య । భూతికారణుడగు నార్యపుంగవుండు॥ క॥ జ్ఞానాతీతుడుభవ్యం । ద్దైనెగడినవాడు శూద్రుడయ్యనుచిత వే । దానుష్ఠానాది విధి వి । హీనుండగు ద్విజునికన్న నెక్కు-డరయగఁ॥ క॥ జ్ఞానమయమూర్తియెవ్వడు । వానిగదా బ్రాహ్మణుడనవలయు బుధులు వి । జ్ఞానంబుపరబ్రహ్మము । యానందరసంబుగ దెలియుమె వే దములఁ॥ క॥ జ్ఞానంబజ్ఞానంబన । గానెగడిన రెండుగాదె గలిగించు జగ। న్మానితగతి బ్రాహ్మత్వ వి । హీనత్వంబులు సదాబుధీశ్వరులారా॥ గీ॥ నిష్కళంకంబు భవ్యంబునిశ్చలంబు । పూర్ణమగు తత్వమెవ్వని బొర యువాడ । బ్రాహ్మణుండర్చనీయుండు బ్రహ్మసముడు । నితరులెల్లనపా

త్రములింతనిజము॥ క॥ బ్రాహ్మజ్ఞానము వారయుట । బ్రాహ్మణుడగు
రాదు వేదపాఠకలనతఁ । బ్రహ్మత్మనేనమోాయని । బ్రహ్మయునుడు ప్ర
టతపఃపరాయణులా రా॥ క॥ పాదజుడధముండారయ । నాదిమవర్ణుండు
పూజ్యుడతిశయమద గ । ర్వాదియుతుండయ్యెనని స । ద్వేదంబులు
వలుకునేసవిస్తారముగఁ॥ క. వేదము జదివినమాత్రన । రాక్షసుడీ బ్రా
హ్మ్యమని పురాతనవేళఁ । వేదాత్ముండగు నీశ్వరు । డాదరమున జెప్ప
డే మహామునులువినఁ॥ గీ హింససేయకుండు టీశ్వరమారాధ వి ,
లాససంభవములుగాసమస్త । జగములనుచుదలచుట గురువిశిష్టత ।
బ్రాహ్మణత్వశిద్ధి బడయుబుధుడు॥ గీ. శాంతిమును శుద్ధత్వప్రశస్తతయు
ను । పరమవైరాగ్యవృత్తియు భవ్యతపము । వాగ్వినియతంబు దృఢశ
గౌరవంబుగలుగు । వాడు వేదంబులు పఠింపవచ్చునతము॥ క॥ నిర్మల
తర వేదంబులు,దుర్మతియగు విప్రుడును చదువుకొన్నప్పుడు స । ద్ధర్మపథం
బుజగద్ధిత । కర్మవిశిష్టతయు తనకుకలిగినదనుకుఁ॥ గీ. పాదపుట
ములు నడనెత్తి బలుపిగ్రోకి । కొనుటయుచ్ఛిష్టములు నగుకూడు
కూర । లాత్మశిరమున నంటుటయంగములను । గడిగికొని శిరము
మానుటగాదుమరియు॥ గీ. కోపమునుపనోరుని కొప్పువట్టుటయును ।
ముష్టిశిరముమీాద గొట్టుటయును । కాదునూనెనొడల గాకశిరస్నాన ।
మాడవలయు కొప్పునంటిరుద్ధి॥ సీ. హింససేయుచు జంతుమాంసంబు
గోయక మద్యంబునెద ననుమానముడిగి । తైలంబుసిగ్గుబొందక యో
నులును విక్రయించికొనుచు జాలహీనవృత్తి । జీవించువారలచేత ప్ర
తాపంబుజూపిధనంబులుజూరగొనెడి । రాజన్యవలన నర్థంబుగొనుట
కాదు బదువురుహింసకుల్ బరగునొక్క । తైలకారకునకు మరితైల
కార । కులు బదువురొక్కడగుశౌండకునకు శౌండ । కదశమొక వేశ్య
కును వేశ్యగణము లొక్క । పార్థివునకును సరియగుభవ్యులార॥
గీ. మాంసమును కల్లునూనెయు మానమును బ్ర । తాపమును విక్ర
యించి యర్థంబులుగొను । వారివలన నర్థముగొనువాడు ఘోర । నరక
కూపంబునఁబడు నలిదొలంగి॥ శా. కాయక్లేశములోపిసూక్ష్మఫల

మున్ గాంక్షింపుచున్ యత్నముల్ । సేయంగాదు మహాఫలార్థియగుచున్ సేమంబు బెంపారస్వా । ధ్యాయంబాచరణంబు జేసిని యతిన్ దైవస్వరూపంబు మం । త్రాయత్తంబుగ బొందగావలయు ధన్యత్వంబు దానన్ దగున్॥ శా॥ ప్రాతఃకాలమునందు లేచిమలమూత్రంబుల్ విసర్జించి శు । ద్ధాతీతంబులు నైష్ఠికంబులగు దైవారాధనాదుల్ మహా। భూతోద్దేశితకర్మ తంత్రములు విప్రుండగ్గిగావించుటల్ । ప్రాతస్స్థితగరిష్ఠభూమములగున్ స్వాధ్యాయ యుక్తంబుగన్॥ వ॥ ఇట్లుపూర్వ సంధ్యా క్రియలు నిర్వర్తించి యతిథిపూజావిధులు సముచితంబుగా నడపి పిదప బ్రాహ్మణదంపతులు భుజించి యపరకర్మంబులు యథావిధిసేయన్ వలయు మఱియును॥ క॥ ఆయుఃప్ర గోరినవిప్రుడు । వాయక దీర్ఘంబుగా నుభయసంధ్యా క । ర్మాయత్తవిధులు వెరవరి । సేయవలయు నైష్ఠికములు శిష్టంబులుగన్॥ క॥ పేర్మిమెయిను భయసంధ్యా । కర్మంబులు దీర్ఘములుగ గావించిబుషుల్ । నిర్మలచరితులు దీర్ఘా । యుర్మాన్యతగనిరిగాదె యుత్తములారా॥ వ॥ శ్రావణపౌర్ణమియందైన భాద్రపదపౌర్ణమియందైన నుపాకర్మంబులు నిర్వర్తించినాడుగోలె జాతుర్మాస్యవ్రతంబును వేదాధ్యాయంబు భగవత్కథాశ్రవణ పారాయణాదివిధులు సేయుటయు పుష్యమాసంబున గృహంబువెడలి నిర్జనప్రదేశంబున వసించి వేదాధ్యయనంబుసేయుటయు మాఘప్రతిపదాదిగామాంసంబొక్కడట్లు నిరతోపాసన క్రియాభరితుండై యుండుటయు బ్రాహ్మణుని కవశ్యంబులు నదుపాకర్మ రయితుండట్లు సేయుట వృధాయగు నిట్లుత్సర్గవ్రతంబాచరించువాడు శుక్లపక్షంబున వేదంబులును కృష్ణపక్షంబుల వేదాంగంబులును పఠించుచుండవలయు ననధ్యాయ

—*వేదములు పఠింపగూడని దినంబులు*—

దివసంబుల నగ్నిక్రియలు మాత్రము నడుపుటర్హతమంబని చెప్పి మరియు నిట్లనియె।

గీ. సర్పము దక్కుటకడుపరిశాంతిజెంది।యుండు వేళల నిద్దురయొదవుకష్టు । కామశూద్రుని సన్నిధి వేదములు ప । ఠింపవిప్రునికనిరి బాడి

మెయిబుధులు॥ సీ. ఆయతమతిననధ్యాయ వాసరములువర్జించి బ్రాహ్మణవర్యుడాప్తి। వేదంబులుపఠించి వినతస్వభావులై ప్రియముసేయుచుగడునియతినుండు। శిష్యులకేగింప శిష్టత్వమగువేదములు పురాణంబులు పలసినట్లు। రాత్రినత్యుత్కటారావంబు పేతెంచునప్పుడు పెంధూళిగప్పునపుడు। వర్షమును పిడుగులు వడిగండ్లు నుల్కలు। దొరగునపుడుగాలి బరచునపుడు। గ్రహణసమయములనుగాదు భూకంపాదు। లులుము వేళ వేదములు పఠింప॥ సీ॥ గుంపులై జలములు గూడియుండిన చోట గ్రామంబులందు పురంబులందు। దుర్గంధమగు చోట దుర్మార్గసన్నిధి కాటిసామీప్యపుచోటులందు। మధ్యరాత్రంబున మలమూత్రములు విసర్జించు వేళలనుమ్మలించునపుడు। వేదంబులు బఠింపగాదు శ్రాద్ధాన్నంబు గుడుచుట యెంగిలి కూడుకూర। లంటుటయు శౌచమగు గానట్టి దినము। లందు రాత్రుల నిజహృదయంబునందు। నైన వేదంబులు బఠింపమానవలయు। బ్రాహ్మణుండనియె మనువు ధీరవరులార॥ క॥ నరపతియే కోదిష్టము। బరగంగా జేసిపిలువ బనుపనరిగి కూ। డురుచిర గొనునెవ్వండా। ధరణీసురుడంటరాదు త్ర్యహములు శ్రుతులన్॥ గీ॥ సూర్యచంద్రోపరాగముల్ జూచెనేని। కాదు మూడుదినంబులు వేదములు ప। ఠింపశ్రాద్ధగంధము మేననింపు వెలయు। నెంతకాలంబు జదువరాదంతసేపు॥ వ॥ జననమరణాది సూతకంబులును సంభవించుకాలంబును యానశయ్యాసదుల సుఖోపవిష్టుండై యుండునప్పుడును మాంసంబుభుజించినదినంబును రాత్రియుమంచుగప్పిన సమయంబులును బాణధ్వని వినవచ్చునప్పుడు నష్టచతుర్దశీ పౌర్ణమీయమవాస్యలయందును వేదంబులుదుగవలయు॥ గీ॥ వేదమునకు గురుశిష్యులకాదిగీడు। మూడగునుగాశిదినములమూర్ఖులట్లు। వేదములు విప్పిరేనియు వేదములు క। శంకరహితంబులనుట దెల్లంబుగాదె॥ ఉ. గాడిదలొంటెలున్ మరిసృగాలములున్ శునకంబువెల్కలున్। గూడియెలుంగులిచ్చుతరి గూబలుగూసెనీ వేళదిక్కుల। ల్లాడినభంగిదోచునపు డాకసమందరుణాంబుధావళుల్,

పీడకగప్పినప్పుడును వేదములంటిననైనగీడగుఁ॥ క. గ్రామశ్మశానగో వ్రజ। సామీప్యస్థలములందు శ్రాద్ధాన్నంబుఁ। సోమరసముగుడిచిన దిన, మేమునుతరి వేదములు పఠింపనడరగుఁ॥ సీ॥ తరుణులు పతులే కతముగూడి క్రీడించుమందిరంబులచె తమాటలు పొగ, యెగయుచో టులనరమ్యగ ఖగరావంబులతిశయముగవిన నగుచువచ్చు। స్థలముల నెరులు శ్రాద్ధముచేసితనకుదానంబుచేసిన పదార్థంబులైన, గోవైన వలునైన గొనివచ్చునప్పుడు చోరాగ్నిపీడలపారములగు। భంగిసెల గెడినెడల నొప్పనిదినముల। కరితురంగశకటమహాంగములు తరువు। లోడలును పర్వతంబులు మేడలు రహి। నెక్కినప్పుడు వేదముల్ జక్కగావు॥ క. వాదంబును కయ్యంబు వి। పాదమజీర్ణంబున ప్రసంగంబు విచి, తాదులు తనకగు వేళల, వేదంబులుజదువరాదు విప్రు తులారా॥ క. కాయంబునశస్త్రాదుల। గాయములై రుధిరమురువు గ్రమ్మెడితరి దు। ర్వాయువు పడునపుడు నా, మ్నాయంబు పఠింపగాదనఘ మతులారా॥ గీ॥ సామవేదరవంబభిరామమగుచు। వినగదో తెంచునప్డుఋగ్వేదపాఠ। కలనమొప్పదు బఠియింపగాదరణ్య, కంబు వేదంబులత్యధికమముగా నైన॥ గీ. ఋగ్యజుస్సామవేదముల్ త్రివిధములగు। దైవమానుష పితృసంవిధానగరిమ। గానవానికియోగ్యంబులైన శుచిత, యును ధ్వనియు నార్జవమువలయుఁ ధరిత్రి॥ క. వేదంబులమాటితెరం। గాదిదెలసి ప్రణవముల్ నియతి జపియింపఁ। గాదగుమును మరియు పిదప। వేదంబులుజదువుభంగి విశదముగాగఁ॥ క. గురుశిష్యులమధ్యంబున। బరువులిడుచుమూషికములు పాములుకుకగు। ప్కరములు కప్పలుము గిస। లరుగననాధ్యాయమగునహము లారర యఁ॥ క. పలుతెరగు లేలవర్జన। ములురెండవచిత్తశుద్ధి భూశుద్ధియునై। వెలయునవిగాకతక్కిన। వి లఘుప్రాయంబులుమూడు వేదంబులకుఁ॥ వ. అమావాస్యయు, బూర్ణిమయు, చతుర్దశియు, నష్టమియగు వ్రతస్నాతకుండగు బ్రాహ్మణునికి ఋతుమతియగు సతితోఁగలయుటైన వర్జనంబులు మరియును॥ క. వేదంబులేకవిప్రుడు। పాదజుడగుపాదజుం

డు బ్రాహ్మణుడగు బె । ప్పాదినియతవ్రతుం జ । నావగణియుండు
భవ్యుడనదగునేర్పిన్॥ క. స్నానము సేయుంగాదు మ, హానిశిన త్యాతు
రమగునప్పుడును మహా । మీనాకరంబునెసగగ । రాని జలాశయము
నందరయ ఋషులారా॥ సీ. గురువురాజునుస్నాతకుండు శిలాదిదైవత
విగ్రహములు సువ్రతపరాయ । ణుండు నాచార్యుండుబాడితుండె
దురేగు నప్పుడువారిచాయల నతిక్ర । మించుట నొప్పదామిషము
తోజేసిన శ్రాద్ధాన్నము భుజించి జరుగునప్పు । డుభయసంధ్యలయందు
నుద్వాహమునకేగునప్పుడు మధ్యాహ్న ందు మరియు । నర్ధరాతిరి
వేళగాదాగినిలువ । గాటమైయుత్కటమగు శృంగాటకమున । మాం
సముభుజించుచుండు గోమాయువడచు । టయును గుక్కలబురిగొల్చు
టయునువలదు॥ క. మలమూత్రస్నానజలం । బుల వాంతిశ్లేషరక్తము
లనిష్ఠూతం । బులమరియు గానిచోటుల । నిలువంగాదనిరి సన్మనీషిజ
నంబుల్॥ క. పరకాంతలందుర్మార్గుల । గురువులపూజింపకుండు కుత్సి
తులను ద, స్కరులవిరోధులగొల్వక । బరగదు తనకుమ్మలికనపా
యమగుతుదిన్॥ క. గరిమను నెమునాయువు పా । లనగుమనంబణచి
యింద్రియములుక్కణమె । చ్చరు సజ్జనంబులేటికి । పరకాంతారతుల
కాసపడపురుషులకున్॥ క. భూరమణుసర్వశాస్త్ర వి । శారదుస
ద్బ్రాహ్మమూర్తి సర్పముదృష్ట్వని । స్థారతునతివర్ణస్థున । గారవముగ
జూచు నొప్పగాదెవ్వడలన్॥ క. వారలనవమానించిన । పూరుషు
డు దహింపబడు విపులసంతాన । శ్రీరమ్యమందిరంబుల । తో నూపర
ననిరిసద్బుధులు ఋషులారా॥ గీ. ప్రియముసత్యంబునెఱిసెప్పుటయును
సత్య । మయ్యునప్రియములు సెప్పనాగుటయును । ప్రియమనృతమయ్యు
సెప్పించుటయును జెప్పు । టయును ధర్మంబనిరి కొందరయమహాతు
లు॥ గీ॥ అప్రియములయ్యు ననృతంబులాడ కునికి । యెరిగినంతయు స
త్యంబు తెలుగు సెప్పు । టుభయలోకములందు శ్రేపొందజేయు । పు
రుషునాతండనిర్జర పూజ్యతముడు॥ క. ఒరులకునోడక సత్యము । పరిస్ఫు
టముగజెప్పనేర్చుభవ్యుండు సభా । దరణీయుడు సభలందున । నిరిమను

వును బ్రహ్మయను మహితచారిత్రుల్॥ క. పగురలకుహితంబు సేయగ। పరువము సెడికల్లలాడుపంద చెనటి ని। ష్ఠురతరమహావిభీషణ। నరకం బునగూలు సజ్జనవిగర్హితుడై॥ క. భద్రమనియైనభద్రము। భద్రంబని యైనప్రియముపలుకగలిగిరగ। భద్రమగు నొరులవలన ను। పద్రవము లఁతనువొరయక పండితులారా॥ క. కారణము లేనివాదమ। పారబ లుండయ్యునేన బలవంతుడ నె। వ్వారలునా కేదు రేయను। పౌరుష భావంబుగా దపాయముపచ్చుగ॥ క. సోదరులజుల్కనాడుట। బీడల వంచించుట హితుభేదించుట మ। ర్యాదదొరగివర్తించుట। కాదప కారంబు సేయగా దిపుగుటయుగ॥ సీ. అత్యుదయంబున సత్యస్తమయ మున మధ్యందినంబున మార్గమరుగు। టొప్పదు దాయాదులొప్పని వారలుతోడరాపండితుదూరదర్శి। బ్రాయంబుగలవాని బలవంతు నధికాంగు హీనాంగుదుర్జను హీనవర్ణు। విద్యయురూపంబు విత్తంబు లేనివారల నింద సేయగా వలవదశుచి। యైమహాత్ములగో బ్రాహ్మణా నలముల, బుస్తకంబుల సత్యంతశస్తగతుల। నంటుటయును గ్రహాదు

—*అగ్నికార్యాదిక్రమము *—

లసంబరమున। జూచుటయుకాదు కులకాంత నేచుటయును॥ గీ. అశు చియై యట్లుజేసిన యాతడర్థి, జలముల మునింగి నీరుదోసిలివహించి। తనువునంగంబులును నాచమనము జేసి। శుద్ధిబొందయుననిరి ధర్మసూక్ష్మ విదులు॥ క॥ తనురంధ్రంబుల రోమ। స్తనబహిరింద్రియ కపాలతలము లనతిమ। ర్మనిరూఢి వెలయుచోటుల, జనదునిమిత్తంబు లేక సంస్పర్శిం పగ॥ క॥ నియమితసర్వేంద్రియుడతి। శయగునిష్ఠారతుడు నిత్యశౌచవ్రతు డా। ప్తియుతుండు పూజనీయుం। డ నయగ్నిక్రియలు సేయనగు దీర్ఘముగగ॥ గీ॥ చిత్తశుద్ధియు నెఱుకయును త్తమవ్రవ, తంబులునుగల్గు వాడు జపంబునగ్ని, కార్యములు సేయుచునతి సౌఖ్యంబువడయు। నో పునిత్యంబునపగతపాపుడగుచు॥ క॥ వేదంబులు జదువుట హిం। సా దులుడుగు టాత్మశుద్ధియలవడుట దపం। బూదుటగల్గిన భవ్యుం, డా దట తనపూర్వభవ మహత్వము దెలియుగ॥ క॥ తానుతనపూర్వభవ

వా । ర్తానిశ్చయమార్గములనరసి మఱిబ్రహ్మ । జ్ఞానములవరచుకొనునది ।
జ్ఞానంబున సుఖముగల్గు కలుషములణగుఁ॥ క॥ సావిత్రీహోమముల
తి । పావనమతిజేయుటొప్పు బర్వంబుల దీ । క్షావిధి బిత్రుదివసంబుల ।
గావింపగవలయు పైత్రుకక్రియలెల్లన్॥ క॥ అనలగృహమునకుదూరం ।
బునపాదశౌళనమలమూత్రాదివిస । ర్జనములు కుండలుగఁజుగుట । యు
ను నుచ్ఛిష్టములుసేయుటొప్పు నరయగన్॥ వ॥ మలమూత్రవిసర్జనము
లును గాత్రప్రసాధనంబును దంతధావనంబును స్నానంబును గురుసన్ని
ధికరుగుటయు బూర్వాహ్ణంబున జరుపవలయు॥ చ॥ గురుడు సమాగ
తుండయిన కూర్చునియుండిన శిష్యుడంచితా । దరమునలేచి యాసన
ముదానతిభక్తినొసంగి ప్రాలిత । చ్ఛరణములొత్తిపూజలనిశంబునుజే
సినమస్కరించి సు । స్థిరమతినంతికంబున వసించుట శాత్రతమంబు ని
చ్చలున్॥ క॥ వేదములుధర్మశాస్త్రము । లేదిమహాధర్మమనియె నింప
అనదువం, గాదగు నమ్మార్గంబున । నాదరణీయుండు పూజ్యుడనబడు
దానన్॥ క॥ ఆయువుమనోరథంబులు । శ్రీయును విద్యయుఫలంబు చిర
సౌఖ్యములున్ , బాయకవృద్ధిబొరయు నా । మ్నాయవిహిత ముత్తమ
మగు నాచారమునన్॥ క॥ ఆరయనిత్యంబు మగా , చారము బాటించు
వాడు సభ్యత సెడి ని । ష్కారణమెల్లరచేత న । గౌరవమున్ బొందు
నాస్తిక మతాప్తుబలెన్॥ గీ॥ శ్రద్ధయును గౌరవముసదాచారమును వ,
హించు పురుషుండు లక్షణహీనుడయ్యు , వత్సరశతంబుజీవించు వాడు
మరియు , పరమపదమాటపట్టుగా బడయగలడు॥ క॥ పరవశమగుకర్మం
బులు , బొరయుంచున్ దుఃఖమెల్లుపూర్ణసుఖంబున్ । బరగించుచునాత్మ
వశములు । పురుషునికీరెండు ద్వివిధభూతములగుచున్॥ క॥ పరవశమ
గు కర్మంబులు , పరిపాటింపకసదాయుపాయము పేర్మిన్ । పురుషు
డు తనవశమగునవి । బరగించుటపరమధర్మపథమనిరిబుధుల్॥ క॥ పరి
తోషంబేకర్మము । బరగించుటని త్యమునునపారంబగు సా । దరమతి
నుపాయ విమడగు । పురుషుండది సేయవలయు భూనుతముదగన్॥
క॥ జననీజనకులకాచా । ర్యునకు తపోధనునకున్ గురునకు సుమతికిన్।

ధనమొసగి బ్రోచువానికి । జనపతికిన్ బ్రతివచనము జనదువలుకగన్॥
క॥ కోపము దంభములోభము । జాపల్యము నిగ్రహము కుజనసంగతి
దు । ర్వ్యాపారవశనాస్తిక్యము । కాపట్యము వేద నిందకాదెన్వరికిన్॥
క॥ అపరాధము చేసినదు । ష్టపురుషు దండించుటొప్పుజనదు నిపాతం ।
బపురూపంబుగనది తన । కపాయకరంబగు నొకప్పుడారయవలయున్॥
గీ॥ వేణుదళమైనరజ్జువు వెలిచినైన । తాడనము సేయునది తప్పిదములు
సేయు । నెడల మొగమోడకళ్ళ త్రికొడుకు శిష్యు । భార్యనాథుజ
నంబులు బాంధవులను॥ గీ॥ పాపనర్తనుండు బ్రాహ్మణుండపరాధ । మా
చరించునేని యతనినణచి । వధము సేయ జూచువాడుండు తామిస్ర ।
నరకమందు నూరుహాయనములు॥ గీ॥ బుద్ధిపూర్వకముగ భూసురుగడ్డి
గా । దరలచేతనైన తాడనంబు । సలుపువాడు నీచజంతుయోనులయం
దు । నుర్విబుట్టు నిర్వదొక్కమార్లు॥ గీ॥ బ్రాహ్మణుని తనువు దొరగిన
రక్తమెన్ని । ధారణీరేణుకణముల దడుపజాలు । నన్నివత్సరములు
రక్తమంగకముల । దొరగతత్కర్తదుఃఖించునరకమందు॥ గీ॥ బ్రాహ్మ
ణాధముండు పాపకర్మంబులు । సేయునేని వధము సేయుటొకటి । మాత్ర
ముడిగి లోకమాన్యుండు నరపతి । చండదండనంబు సలుపవచ్చు॥
గీ॥ హింససేయకుండు టెన్నరి పైనిగ । హింబుబూనకుండుటది యబ్రాహ్మ
ణత్వమవిదియొనగ్చ సనుడటుగాడట్లు । గానవధము సేయుటెనయొప్పు॥
వ॥ ఇదిపులస్త్యునిమతంబు॥ గీ॥ బ్రాహ్మణుండనంగ బాగుబ్రహ్మజ్ఞాని ।
గాడు దానిదెలియగానివాడు । గానవధము సేయగానగు నపరాధ । మా
చరించునేని నీచువిప్రు॥ గీ॥ అనృతమాడి ధనముగొనువాడధార్మికు ।
డాతతాయి హింసలద్ధిజేయు । వాడుసౌఖ్యగతులు నడయు నేరరు నింద ।
బనుదురిహమునందుపరమునందు॥ గీ॥ పరమధర్మపథము బాటించుటొ
ప్పు దు । ర్దశలనైనగాదధర్మసరణి । పాపరతులు భంగపడుట జూచుచు
నేల । ధర్మమార్గమురుక బేర్మెసెరుప॥ క॥ తనుఁలోకముగొనియాడుట ।
కును నిందించుటకు బ్రియము గుందుటయు మనం । బునలేక
మహోద్యోగము । వెనరింపగవలయు హితులు నాలె జనంబుల్॥

క॥ వెలయంగ నధర్మంబున । ఫలమప్పుడదోచు సేయు పనులకు మరి
యుఁ । బొలచు వినాశకరంబై । యిలమూలముగొట్టబడు మహీజ
ముఁబోలెఁ॥ క॥ తనునైన కుమారులనై । నను పౌత్రులనైన బొరసి
నాశముగాపిం । చునధర్మఫలంబు వృథా । జనదంతతకును నెఱివిష
ముబలెనుఋవా॥ క॥ ఫలముగనవచ్చు విజయము । జెలగునధర్మం
బునిచ్చజేయునపుడు క్రము । చ్చలువోలెసమస్తంబును । గలచు
నణచి హీనదశలుగావించుతుదిఁ॥ ఉ. శౌచముధర్మమార్గము సత్య
ముగౌరవభూతియార్యసే । వాచరణంబుబెంపలరునట్లు జరింపుచు తృ
ష్ణనెమ్మదిఁ । దోచగనీకసంతతము తుష్టివహించినవాడు ధన్యుడై ।
యాచిమహాపదంబు బొరయంగలడారయ శాశ్వతంబుగఁ॥ క. ధర్మం
బునెఱుపగలిగిన । కర్మంబులునట్టియర్థ కామంబులుగా । వర్మిలి సెయగ
నుత్తమ । ధర్మపరాయణుడు సత్పదంబులువడయుఁ॥ క. లోకమునక
శుభదాయక । మై కానగవచ్చు ధర్మమైనయుడిగి సు । శ్లోకులు జగద్ధి
తంబులు । గైకొనిసేయుదురునిత్య గౌరవముదగఁ॥ క. పరనిందయు
నాత్మస్తుతి । పరాయణతయు పరునిభార్యరమింపఁ । దిరుగుటయు బొర
యరానివి । బొరయగజూచుటయుగాదు భూనుతులారా॥ క. తగువృ
ద్ధాచారమునదు । పగనదిసమ్మతము ధర్మపథమూర్జితముఁ । జగతీనుత
ముఫలప్రద । మగుచేసినరుండసంశయమనసూర్తిఁ॥ సీ. తల్లిదండ్రు
లతోడ వల్లభతోడ గారాబైనబంధువర్గంబుతోడ । ఋత్విక్పురోహిత
వృద్ధాతురులతోడ మాతులుతోడ ధర్మజ్ఞుతోడ । నాచార్యుతోడ భా
ర్యాసోదరులతోడ నన్నదమ్ములతోడ నతిథితోడ । విద్వాంసుతోడ
నుర్వీపాలకునితోడ వైద్యునితోడ భవ్యతముతోడ । కొడుకుతోడ
మఱియుకూతురుతోడ స । న్యాసితోడ బుధగణములతోడ । కార
ణంబులేక కలహించుటయు వివా । దంబుసేయుటయు క్రమంబుగాదు॥
వ. ఆచార్యుండు బ్రహ్మలోకంబును జనకుండు ప్రాజాపత్యంబును

—*అపాత్రప్రతిగ్రహాదుల విధము.*—

యింద్రలోకంబతిథియుఋత్విజుండు దేవలోకంబునుజామలప్సరోలోకం

బును బాంధవులు వైశ్వదేవలోకంబును పార్థివాదులు వరుణలోకంబు
ను మాతృమాతులాదులు భూలోకంబును బాలవృద్ధకృశాతురాదులు
పరంబును బడయుజేయువార్లగుటయు నగ్రజుండు పితృసమానుండగు
టయు భార్య యర్ధాంగభూతయగుటయు విద్వాంసుండును బుధవర్గంబు
వైద్యుండు మొదలగువారలు పూజ్యులగుటను వారలతో శుష్కవా
దంబులు బచరించి యలుకవుట్టింపక నుచితవిధుల పూజింపవలయు
నెండియు॥ గీ. బ్రాహ్మణుండు ప్రతిగ్రహపాత్రుఁడయ్యు । కాదుబుచ్చి
కొనగనర్హుగాక తృష్ణ । యధికమగుడు ప్రతిగ్రహణాప్తిదిరుగు । నేని
చెడుబ్రహ్మతేజామలింతనిజము॥ గీ. ధర్మమునకుగాని ధనమునన్యప
దార్థ । ములు బ్రతిగ్రహించుమూర్ఖతముఁడు । బ్రాహ్మతేజమెడలి పా
పాత్ముఁడగువాని । నంటజూడబాపమనిరిబుధులు॥ గీ. కనకమును భూమి
యునుతురంగంబుగోవు । నేయియును నువ్వులన్నంబు నెరిజెలంగి ।
బ్రాహ్మణుడుపుచ్చుకొనునేని బ్రాహ్మతేజ । మెడలిచెండాలుడగు
వానికేటిపదము॥ గీ. ధరణియును గోవునన్నంబుతనువుజెరచు , కనక
మాయువు బరపులోచనములణచు । తురగముజ్వలతేజంబు బరిహరిం
చు । నేయినువ్వులు సంతతిమాయజేయు॥ గీ. వేదమును తపమును త్త
మవిద్యయును మ । హత్వమును లేకదివిరిబ్రాహ్మణుడతిప్ర । తిగ్రహా
సక్తిబడునేని తీవ్రనరక , పంకమునమూలు బహుశతాబ్దములుదనుక॥
గీ. అల్పమైననధికమైన బ్రతిగ్రహ , ణంబుచేసి బ్రాహ్మణాధముండు।
నిరయమందుమూలు టెరిగియెఱింగి మ । హాత్ముఁడేలబూనునట్టితెరవు॥
వ. బైడాలవ్రతపరాయణుండును పాషండమతసంయుతుండును జలంబు
లుగొనన్నైనన పాత్రతములగుమరిట్లుగాపున వారలకు దానంబుజేసినదా
తయు వారలతోఁగూడనరకంబునంబడునిట్లు॥ గీ. రాతియోడనెక్కి రహి
సముద్రంబు ద । రింపజూచునట్టి పెంపుగాదె , యజ్ఞుడైనవాని కధిక
దానములిచ్చి , సుగతిబొరయవడుపుజూచుటెల్ల॥ వ. ఒరులుతన్నునమ్మ
భజింపను గీర్తింపను బహుజనసమక్షమ్మున ధర్మంబుసేయువాడు ధర్మ
ధ్వజుండనియు పరధనాభిలాషియగువాడు లుబ్ధుండనియు నన్యులతనక

పటసూత్రంబునజిక్కించి నిక్షేపాదులుహరించువాడు ఛాద్మికుండని యు బాహ్యవ్రతశుచిత్వభూతిదగువాడు లోకడాంబికుండనియు జేత నంబుల జిదుముటాదిగ పీడలుసేయువాడు హింసాపరుండనియునసూ యాపరస్వాంతుండు సర్వాభిసంధికుండనియు సమయంబు వేచి యన్యు లననాచువాడు బైడాలవ్రతుండనియు మీనుజూచుచు వినయంబుచూ పించు తెఱంగున నటించి నిష్కృతులుసేయువాడు నైష్కృతికుండనియు పరధనాపహారి స్వార్థసాధనతత్పరుండనియు నాతతాయిశఠుండనియు బకతంత్రసాధకుండు బకవ్రతుండనియుజెప్పంబడు మఱియును॥ క. ఒన రంగబకవ్రతుడని। యును మరిమార్జాలలింగినుండనియు దనుక్। జన ములువిట్టగనేద్విజు । డనయంబుజగించు నరకమందతడు బడుక్॥ క. ఏనుమహాధర్మపరుడ । నైనియతిజగించుననుచు నన్యులునమ్మం। గానెరిగింపుచు నిత్యము । దానడువగరాదు దప్పుధమున దివ్రుటమై॥ క. ఏయువిచేసినవారుల క । పాయంబగునట్టిచెడుగుపనులుమగుట శా। స్త్రీయములగుకర్మంబులు । సేయుటపురుషుండుపరమశిద్ధులువడయుక్॥ గీ. బ్రహ్మచర్యాదిసువ్రతభవ్యగతులు । తనకులేకుండియును తద్విధం బులైన । లింగములువేషములు గడులీలదాల్చు , వాడునరకంబు నంబడువాడునిజము॥ క. ఒరులొనరింపవెలయు పు । ష్కరణీప్రముఖ ములగాదుస్నానముజేయుక్ । బురుషునికిజేసెనేనియు । బొరయుక్నవి సేయువాడు బోవునరకముక్॥ సీ. మందిరంబులయందు సుందరోద్యా నంబులందు దటాకకూపాదులందు । నిచ్ఛమైపెరవారలిడినయానముల శయ్యాసనాదుల సుఖంబనుభవించు । నెవ్వండువానికధీశులైయుండు వారియకితనయంత నెలమిడెలగి । వాడట్లొసంగని వారి పాపాం శముల్ తనువొరయంగ చందంబుదక్కి । నరకమునబడు జెరువుల నదులదేవ । ఖాతముల నిర్ఝరంబుల గర్తముల కొ । లంకుల జలంబులాడవలయు నవశ్య । మవిశంచిర్యాభతములుగాన నార్యులారా॥ క॥ యమనియమంబులు రెండును । నిమలమతివహింపవలయు విధ్యు క్తముగా , యమముడిగిసంతతంబు ని । యమముజెలంగించువాడు నర

కమునబసుఁ॥ క॥ వేదోపక్రాంతమనం । గాదగుయజ్ఞంబునందుకాదు
భుజింపఁ । వేదవిదులకత్యంగను । లాదిగపంక్తికినపాత్రులగు వారల
తోఁ॥ సీ॥ బహుయాజకాదులు బలసియుండినయజ్ఞమందు భుజింపగా

—*దూషితాన్నప్రకారము.*—

దార్య్యజనుల । కతిమత్తకు పితాతురాదుల యన్నంబు కేశంబులును ధూ
ళికీటకములు , గలసినయన్నంబు కాలనంటినకూడు భ్రూణఘ్నునన్నం
బుబుంశ్చలియగు । బ్రాహ్మణియన్నంబుబశువ్రలాఘ్రాణంబుచేసిన య
న్నంబుచెనటికూడు । కాకునును కుక్కుటములాదిగాగపక్షు । లంటిపు
చ్చినయన్నంబు నధముకూడు , గణికగణగాయకాన్నంబుగడకదర్య ।
బద్ధచౌర్యాన్నములు దినబరగదెందు॥ క॥ ఋతుమతియంటినయన్నము।
వ్రతహీనునియన్నమనుభవముగాక వృధా । రతినొరులకీకధనమే । కత
మార్జించుజనుకూడుకాదు భుజింపఁ॥ మాలిని॥ పాదజునన్నము పాత
కునన్నము బ్రాకృతునన్నము భద్రగతిఁ । వేదముమానినవిప్రుని
యన్నము వెంగలియన్నము దగ్రుడునై । పేదలగొంతలపెద్దలపూజ్యుల
బిట్టువధించిన భీకరుకూ । డాదరమారగ నంటినపాపము లారయ బొం
దు మహాజనముల్॥ ఉ॥ క్రూరునియన్నముఁ మృగయుకూడు జికిత్స
కునన్నమూపు లె।వ్వారును బంధువర్గమునవశ్యసతీసుత సోదరాదులుఁ।
గొగవనీయులార్యులు దగఁ తనురోసినవాని యన్నముఁ । పౌరుషహీ
నునన్నమును పామరునన్నమునంటరాదిలఁ॥ వ॥ ఉచ్ఛిష్టాన్నంబును
సూతకోగ్రాన్నంబులును కల్లలాడువానియన్నంబును మద్యమాంస వి
ద్యావిక్రయులయన్నంబులును విధవాన్నంబును జాకలి మంగలియగసా
లెవాండ్రయన్నంబును సూతకాన్నంబును హీనకర్ములగు సమస్త వర్ణం
బులయన్నంబులును భుజింపరాదు మఱియును॥ క. ఈయన్నములెవ్వడు
మది । రోయకభుజియించు నన్నగుండు నియతిన్నై । ప్రాయశ్చిత్తాదివి
ధులు । బాయకచేసికొనవలయు బహుయత్నములఁ॥ క॥ ప్రాయ
శ్చిత్తాదివిధులు । బాయకచేసికొనడేని బ్రాహ్మణుడత్య । ల్పాయుష్మం
తుడ గారన । నీయుండై జచ్చిగూలునిరయాగ్నినడిఁ॥ క॥ పితృకర్మ

దులులేని కు । మతి పాదజునింట బ్రాలు మాలిగుడువగా । దతిశుద్ధ
కర్మనిష్ఠా । రతుడును విద్వాంసుడునగు బ్రాహ్మణుడిచ్చన్॥ క॥ దాత
యు లోభియు విద్యా, తీతుడుశుంతయుమహామతియు దుర్మతియున్,
భూతదయాపరుడును హిం । సాతత్పరుడెట్లువడయు సదృశఫలంబుల్॥
గీ॥ కానసటి విధముగాడె మహాజను । నన్న మారగింపనయినఫలము ।
క్రూరుడైనవాని కూడుభుజింపగ । లిగినఫలంబు సదృశమనుటయరయ॥
క॥ వేదంబులు శాస్త్రపురా । ణాదులు సదృశంబుగాని యనువునచిరపు,
ణ్యోదయకర్ముడుహీనుడు । మేదినిసరిగారనిరి సమీచీనమతుల్॥ గీ॥ ఉ
త్తమునియింట గుడుచుట యుత్తమఫల । మధమునింటభుజించుట యధ
మఫలము, బడయుదురు సంతతంబును బ్రాహ్మణాదు । లట్లుగావున
నెఱుగుటత్యవసరంబు॥ క॥ మాంసాశనుండుచేతన । హింసాపరుడనుట
తెల్లమెల్లరకు బుధో । త్తంసులదిగానగుడువరు । మాంసంబుభుజించు
దుష్టమానవునింటన్॥ క. అనృతంబులాడుటయు పరు, ధనమురుకన్
గొనుటయును వృథావాదంబుల్ । వొనరించియార్యజనముల । మన
ములునొప్పించుటయు సమానకలుషముల్॥ ఉ. కావునవింతలేసియఘ
కర్మ ములన్వొనరించువారితో । నేవిధమాటలాడదగు నెట్లుభుజింప
గవచ్చు లోకసం । భావితపుణ్యకర్మలగు పావనమూర్తులకేలపెక్కు లు।
ర్వీవలయంబునన్గలవు వింతలనేకము లారయందగున్॥ క. వేదములు
జదివియుంత । ర్వేదికములుసేయవలయు విప్రుండారా । మాదుల
నొరులనుభూర్థము । కాదునివాసములపెక్కుకార్యములైనన్॥ ఉ. దాన
ములున్జగద్ధితధర్మములున్ మరిపొర్తికాదులున్, ధ్యానముసంయ
మంబు నుచితంబగువేషము నిత్యశౌచమున్ । సూనృతమున్ బ్రియం
బునవసూయతయున్ భజియింపగాదగున్ । భూనుతకీర్తిబ్రాహ్మణుడు
పుట్టినదాదిగనెల్లకాలమున్॥ క. తానడుగకనొరులిచ్చిన వానివలనమి
గులదుష్టివడయుట శుద్ధ । స్నానాదులుసేయుట ని । త్యానందసుఖాప్తి
నుండుటగుపురుషునికిన్॥ క. దానంబులు ధర్మంబులు । మానితమతి
సేయవలయు మరణముధృవమ । జ్ఞానంబుదొరగి శుద్ధ । జ్ఞానంబలవర

చుకొని జగతినరులెల్లన్॥ క. జలములు నన్నము దీపము, తిలలను
దానంబులిచ్చి తృప్తియుసుఖము। జ్వలనిర్మలాత్ములును గోడు। కుల
కూతులవడయునరుడు కుతుకంబుదగన్॥ గీ॥ కనకమును వెండియును మ

—*దానాదివిధిఫలితాంశము*—

హీఖండమును గృ। హంబులును దానములుచేసినరుడుగను చి। రా
యుఃవులు రూపమును సుఖోపాయమైన। భూమియును దివ్యమందిర
ములుధరిత్రి॥ గీ. అంబరంబుబలీవర్ధనంబు గుఱ్ఱ। మధికపుష్టియు నెరి
గలయావుదాన। ములొసగుట సూర్యచంద్రాశ్వినులవిభూతి। కరము
లరులోకములనిచ్చు బొరయునరుడు॥ క. యానముశయ్యయుధాన్యము।
జ్ఞానమునభయంబునొసగు ఘనుడొగివడయున్। యానాదులు భార్య
యుల। క్ష్మానిత్యసుఖప్రభుత్వశిద్ధపదంబుల్॥ క. దానములన్నిటనుత్త
మ। దానంబనబరగు సత్పథముదగబ్రహ్మ। జ్ఞానంబుపదేశవిధిన్।
జ్ఞానరహితులందువెలయగా సేతభువిన్॥ క. ఏయువిగోరుచుదానము। లీ
యంబనుశుద్ధపాత్రమెరిగినరునిచే। బాయకతమంతనవిని ర। పాయస్థితి
బొగయునతనిపండితులారా॥ క॥ అర్చించిదానమిచ్చుట।యర్చింపగవడిప్ర
తిగ్రహముసేయుటదే।వార్చనపాత్రములవియతి। వర్చసకాలములకు లో
కవందితరూషిన్॥ క॥ తపమొనరింపుచు నెమ్మది। విపరీతముబొందుట
మఖవిధుల ననృతమూ। దిపలుకుట దానమిచ్చి పి। దపచింతించుటత
గదు వృధావిప్రినికిన్॥ చ॥ అనృతముచేతయజ్ఞము మహాద్భుతమొం
దుటచేతపంబువా। ధనములుపెక్కులోడక వృధా బచరించుటచేత నా
యువున్। జనములతోడజెప్పికొను చందముచేనుతదానముల్ గ్రి
మం। బునశియించుగాన హితబుద్ధిధరామరుడారయన్ జనున్॥ ఉ॥
చీమలుమన్నుకొంచెముగ జేర్చుచునోపిక కొన్నినాళ్ళకు। ద్దామపుపు
ట్టజేసెడివిధంబున మెల్లనమానవుం డహిం। సామతశుద్ధధర్మములు న
ల్పుచు నుత్తమమార్గదర్శికుం। డైమహిం మించుటొప్పగు ఖలాదులకె
ల్లరకట్లుజెప్పుచున్॥ క॥ పరలోకసహాయార్థము। పురుషుడు ధర్మపథ
మునదుపుటకదుశ్రేయ। స్కరమదిజెడనిఘదపితను। బొరయంగా జే

యనోపు భూనుతలారా॥ చ॥ తనయులుతల్లితండ్రులు బంధువులుబాంధవవర్గమాప్తులం । గనవిహాలోకమందు యుపకారముసేయుదురింత లిష్టులై । తనకొకరైన సేయరటదక్కిన వేళ సహాయమొక్కడే । జనువి ఫలప్రయత్నరతసంభృతయోగ గరిష్ఠభూతుడై॥ క. హీనదశ బొరయకుండం । గ౯ నచ్చటసేయుమేలొకడు విడువక నెం । దేనియు వచ్చుచు బూర్వము । దానిచ్చలు సేయుహితుడు ధర్మముగువునై॥ గీ. ఒక్కడెజనించు వర్ధిల్లు నొక్కరుండె । సుకృతములు దుష్కృతంబులు జూచిజూడ । కొక్కగుడసేయు తత్ఫలమొందునొకడ । యింతగావున తనకొరులేటవారు॥ ఉ. చచ్చినతోడతన్ను నిమిషంబెడవాయకనుండు పుత్రులు౯ । మచ్చికగల్గుబాంధవ సమాజములున్ మరితక్కువారలు౯ । బొచ్చెములేని శోకరవముల్ సెలగించి శవంబుచెచ్చెర౯ , జిచ్చున కప్పగించి యిలుసేరుదురన్నములారగింపగన్॥ క. తానొనరించిన సుకృతము । లైనను మరిదుష్కృతంబులైన విడువ కెం । దేనియు తనతోవచ్చు న , హీనాప్తహితాహితపథనియతి వెలయగ౯॥ గీ. గానమానవుండు పూనికధర్మంబు । సేయవలయు శక్తి జెలగునంత, కేమిశాశ్వతంబుదా మొరమెచ్చులు కొలది నడచుభంగి దలచుటరయ॥ సీ. ధర్మంబుసేయుట తపమాచరించుట యున్నాదులధిక కర్మంబులనిరి , పురుషుని కారెండు బరగించునాతండు బడయు శాశ్వత పరబ్రహ్మపదము । తపముసేయక సదాధర్మమాత్రము వెలయించు నాతండునశించుదేవ । తాలోకమున మహాధర్మంబుగాక తపంబుచేసినవాడు బడయుసత్య , లోక మీరెండులోకముల్ శ్రీకరంబు । లుత్తముండుత్తముని తోడబొత్తుసేయు , టధికమగునీచుతోడగా దధముమైత్రి । భావముత్తమునకు జాలభాధకరము॥ ఉత్సాహ॥ ధర్మమాచరించుటిష్టదంబుగా జెలంగు స , త్కర్మపాక మాత్మశుద్ధిగల్గజేయుగావున౯ , ధర్మమాశ్రయించి సూనృతవ్రతంబుబూని స । త్కర్మముల్ సమాచరింపగా దగు౯ నుతంబుగ౯॥ పంచచామర॥ ఫలంబుదోపదెట్లుకర్మఫక్వమైన నుర్విగా । నలీలబొల్చి ధర్మమార్గహానిమాను

టొప్పని । పృథ్వీంక భవ్యచిత్తవృత్తిగాంచి పండితుండు లో, కుటె
ల్ల దన్నుజూచి దారుగూడనట్లు వర్తిలున్॥ గీ. అభయదక్షిణంబునన్నం
బు జలములు । కందమూలఫలని కాయములును । నడయుటొప్పునెట్టి

—*అయాచితపరిగ్రహాదివిధులు.*—

వానివలననైన । నాపదలునితాంతమడరునప్డు॥ క. పగలనగ కనేమి
చ్చిన, బరిగ్రహము సేయవచ్చు బరగదడుగ కై । వ్వారి వస్తువల్పము
ను గొన । పురుషుని కదిపాతకముల బ్రోవరయంగన్॥ చ. అనుమతి
లేకనన్యనిధనాదులఁ గొంచుబితృక్రియాదులిం, పెనయగ సేయునైన న
వియిచ్చుమెయిన్ బితృదేవసంఘముల్ । గొనరుపదేనువర్షయులు కో
పముబెంపఱబూని హవ్యవా, హనుడును హవ్యముల్ వెలయునట్లొ
నరింపగుకీడుమూడగన్॥ సీ. జలములన్నంబును శయ్యాసనములుదర్భలు
గృహంబువిరుల్ పండ్లుపెరుగు, పాలునేయియుచింతపండుబెల్లముమ
త్స్యమాంసంబులెదనను మానముడిగి । యుపహరించిపితృక్రియలు సే
యుటొప్పదు జననీజనకులకాచార్య శిష్యగణముపుత్రకళత్రగణకాది
నులబోషించంగవలసి యాచించుటజను । బ్రాహ్మణక్షత్రియార్యులపా
దభవులు । బతితజాతులఁ గాక గోపాలకులకు। నాశ్రితాదులకిడునదియ
న్న ముడిగి। తెచ్చియైనను బ్రాహ్మణుండిచ్చుమెరయ॥ క॥ భావమునకుపరి।
చర్యకునీవికి బాత్రతకుననుసయించినటుల భూ। దేవుడుశిష్యగణములకు,
గాపలసిన విద్యల కగ్రకపితునుడగున్। గీ॥ పాపరతియునన్నృతభాషణంబు
లుగల । వానిశిష్యవిడునవలయు విప్రు । డట్లుగాక విద్యలభ్యాసమొన
రించు । నేని బొరయునరకమింత నిజము॥ గీ॥ భాషణంబులర్థబంధు
రంబులుకర్మ । కారణంబులట్లుగానకపట । వాదియైనవాడు వరలు స
ర్వస్తేయ । నామధేయమునజనంబుదిట్ట॥ సీ॥ స్వాధ్యాయమును పుత్ర
సంతానశిద్ధియు యజ్ఞక్రియాఘనుండై జెలంగి । సత్ప్రవర్తనమును స
ద్గుణంబులు యౌవనంబు బొల్చి నపుత్రునకు సమస్త । గృహకార్యభ
రమప్పగించియేకాకియైవిజనంబునిత్యపవిత్రమైన । స్థలము ననివసిం
చి నవినీశ్వరధ్యానభ వ్యార్చనంబులుబరగజేసి । సర్వసముడాత్మ గ

తుడు నిస్సంగుడగుచు, నెవ్వడుగ హించు మేనుపైనిచ్చ లేక। వాసికీ శ్వరదివ్య తత్త్వంబెఱుంగ। వచ్చుదానఁ బొరయును శాశ్వతపదంబు॥ గీ. బ్రాహ్మణుడుశుద్ధవృత్తి ధర్మంబునడిపి। యాశ్రమాంతరమాపయి నాశ్రయించు। గొప్పసమదర్శనుండు మహాన్నతుడయి। దానశా శ్వతమైనపదంబునడయు॥ క. జీవనధర్మంబులు ని। ష్ఠావిధులును దాన ధర్మశౌచవ్రతగో। ష్ఠీవార్తలు సర్వమును హి। తావహమతి జెప్పి తిఁ మహాశయులారా॥ అనిచెప్పెనని.

## స్రగ్ధరావృత్తము.

శ్రీమన్మూర్తీ సమస్తేంద్రియవిజితమనశ్శిద్ధ తత్త్వార్థవర్తీ
భూమావ్యక్తానుసారా ద్భుతగసమహితోద్భూత శుద్ధప్రకీర్తీ
నామాతీతాత్మయా నూనతరళవిత్తాహ్లాదపూర్తీభవన్మా
యామూలాంతర్విదుస్త వ్యజనహృదయ సంగానుకూలాభిభర్తీ.

క. ప్రణవస్వరూపజనన మ। రణసుఖదుఃఖప్రకారరహితవిమల ని
ర్గుణతత్త్వాశ్రయభువన భ। రణసమ్యగ్వర్తసత్త్వరమ్యస్ఫూర్తీ.

మాలిని. భరణహరణలీలా వాసమానవ్యథాలో
భరిహితగురుతత్త్వ ప్రాజమానవ్యపాలా
భరితవిహితశీలా ప్రాజ్ఞసేవానుకూలా
పరమసుజనపాలా భవ్యమార్గైకమూలా.

## గద్య.

ఇది శ్రీమత్పరమేశ్వర లీలా విచిత్ర ప్రపంచసేవాపాత్ర శ్రీమద్వారపురెడ్డి
పాపినాయక పుత్ర నిఖిలబుధజనవిధేయ యప్పలనాయక
నామధేయ ప్రణీతంబైన శ్రీమదాంధ్ర మనుధర్మ
శాస్త్రంబునందు చతుర్థోధ్యాయమ్
సంపూర్ణమ్.



శ్రీరస్తు.

శ్రీమద్వితీయరామకృష్ణపరమహంసగురుస్వామినేనమః.

# శ్రీమదాంధ్ర మనుధర్మశాస్త్రము.

## పంచమాధ్యాయము.

శ్రీనారాయణ శుద్ధచి। దానందరసైక నిశ్చలాంతర్మయవి। ద్యాని
రసన కేవలవిజ్ఞానక ళాతీత సత్ప్రకర పరమేశా॥ వ. దేవా యవధరింపు మ
మ్మహర్షి సంఘంబులు భృగుమహర్షీంద్రునితో నిట్లనిరి॥ గీ. బ్రాహ్మణులు
స్వధర్మపథమున నడచుచు। వేదమూర్తులనగ వెలయుచుండు। రట్టిఘనుల

—*బ్రాహ్మణులకు వర్జనీయంబులగు పదార్థంబులవివరము.*—

నేలనణచిమృత్యువ్రగొని । పోవుచుండు సెప్పుముఋషివర్య॥ వ. అని
నవిని యమ్మహాత్ముండు వారలతో నిట్లనియె॥ క. వినుడాకండై నవృథా।
చనకోపికపూర్ణధర్మ సరణినడచువా। డనఘుమతులార లేడు భు। వన
మందదిగాన మిత్తివారకబొరయరె॥ క. వేదములుడుగుట నా। చా
రాదులు దొలగుటనపాత్రమగునన్నము బెం। పేది భుజించుటదడవుట।
భూదేవులమృత్యువు గొనిపోవగజాలె॥ గీ. లశునమును గుంజనమును
పలాండువును క। వకము మేధ్యోద్భవములు సర్వంబుకూర। గాయలు
ద్విజన్ములకు వర్జనీయములవి। దినుటమృత్యువు వారలదినగజాలె॥
వ. మరియు నవప్రసూతయగు గోవుపాలును బహువారకఫలంబులు
ను వృక్షనిర్యాసంబులగు రసాదులును తిలతండుల మిశ్రితంబులు నఫ
క్వంబులునగు పాయసాన్నాదులు ననిర్దశయగు నావుపాలును యొక్క
గొరిజగల యొంటెమొదలగు జంతువులపాలును మేకల గొఱియల జం

కలపాలును దూడలేనియావుపాలును వర్జనీయంబులు వెండియు॥ సీ. మ
హిషముల్ గాక సామాన్యంబుగానరణ్యముల వసించుమృగములపాలు,
స్త్రీక్షీరమును శుక్తశిద్ధరసాదులు మత్స్యసంఘుంబులు మాంసమును
భు । జించుపక్షులు కాకులంచలు కలవింకములు ప్లవంబులు జిలుకలు
రథాంగ । ములు టిట్టిభములు గోయిలలు శారికములు కొంగలు
జెముడులు కుక్కుటములు । మీనముల బొడచికొనిదినుసానవల్లు ।
రాదులును జాలపాదంబులమరుబిట్ట । లుఱికినఖరముల జీరియుక్కఱవు
డేగ । లాదిగా బక్షులను దినరాదుద్విజుడు॥ క. మాంసాదులు దినుఖగ
మృగ । మాంసములు భుజించువాడు మాంసగుడనగా । హింసాప
రుండనంబడు । మాంసంబుడిగిన యతండమరతుల్యుడగుఁ॥ సీ. హవ్య
కవ్యములందు భవ్యంబులైన పాఠీనరోహితములు మీనమాత్ర । ముల
యునరాజీవములు సింహతుండ సశల్కంబులును మరిశల్యకములు । గో
ధంబులును ఖడ్గకూర్మశశశ్వావిధంబులు పంచనఖంబులలరు । నవియుగు
టదినగానగుకుక్కుటంబులు లశునఛత్రాకపలాండుగుంజ । నాదులును
మద్యమును వర్జమైనకూర । గాయలును నిచ్చగుడుచునాయతమతి,
నేద్విజుడు బతితుడగునాతడింతయెఱిగి । నిష్కృతులు జేసికొనునదినేరి
యతండు॥ క. వెలయంగవర్జనీయం । బులగు పలాండ్వాదులిచ్ఛ భుజి
యించినవా । డిలజాంద్రాయణమునడుప । వలయునని యె మనువు
లోకవత్సలతదగఁ॥ క. విపులమతులుకొందరుసాం । తపనంబుచితంబ
నిరిమతము బెంపఱనే । కపదార్థభోజనముదిన । ముపహాసంబనిరికొందరు
త్తములుదగఁ॥ క. తెలియకవివర్జనీయం । బులగుపదార్థములు దినిన
భూసురుడత్యు । జ్వలనియతిమెయినడుపగా । వలయుఁ కృచ్ఛ్రములు
రెండువత్సరములొగిఁ॥ గీ. శాస్త్రవిహితంబులును శుద్ధసాధనంబు ।
లైనబక్షులమృగముల నాగిచంప । వచ్చు బ్రాహ్మణుడెద్దియునవశ్యమగు
కు । టుంబపోషణమునకు యాగంబులకును॥ ఉ. సేగకకుక్కమాంస
ముభుజింపడె పూర్వమగస్త్యుడాతురుం । డైగుదివెట్టిదొంగిలి మహా
మునియయ్యునతండుగాన ని । ష్ఠాగరిమంబుపోవునను సంశయమాత్మ

వహింపకెట్టి హిం । సాగతులైన సేయనగు సంతతమాకటి పెల్లుదోఁచి
నన్॥ ఉ. ఆయతబుద్ధిసాగరు లనంతతపోనిధులాత్మరక్షణో । పాయు
లు తుల్యదర్శనులు భవ్యులునైన మహర్షులెల్ల శా । స్త్రీయమృగ
ద్విజాదుల వధించిమఖంబులుచేసిరాప్తియుర్ । బాయకగానశుద్ధమఖ
పాత్రములంతలు హింసలారయన్॥ క. వెలయుహవిశ్శేషములై ।
బొలచినపర్యుషిత భక్ష్యభోజ్యాదులు ని । ర్మలనియతిమొయిఁదినం
గా । వలయుననియె మనువువిబుధవందితులారా॥ మ. యవగోధూ
మపయోవికారమగు హవ్యంబర్థికాలాధికం । బువిశిష్టంబును నైన
దాగుడుచుటొప్పున్ । బ్రాహ్మణుండాత్మబొం । దు విడంబింపక నుండు
వాడయిన నిర్దుష్టాన్నమత్యంత లా । భవిశేషార్థమొరుండొసంగిన భు
జింపన్ నచ్చు నిష్ఠాప్తిమై॥ క. వెలయుగభక్ష్యాభక్ష్య వి । ధులుసెప్పితి
బ్రాహ్మణుండు దొలగకవీనిన్ । దెలిసికొనియట్లునడవగ । వలయున్
నెందైనగీడవశ్యము గలుగున్॥ గీ. మరియు మాంసంబుగుడువగ
మానుటకగు । విధులెరింగింతువినుడు పవిత్రులార । యనిపలికె
మంత్రసంస్కారమైనయజ్ఞ । పశువుమాంసంబు గుడుచుట భవ్యతమము॥
క. గోయజ్ఞముకామించుచు । సేయుట పాపమగునని నిషేధించిరి
ప్ర । జ్ఞాయుతులు కొందరార్యులు । భూయిష్ఠానుభవవిదులు భూ
నుతులారా॥ క. ప్రాజ్ఞులు కామించుచు గో । యజ్ఞంబులు సేయు

## —*మాంసభక్షణవిధులు.*—

టుడిగిరవిహింసా మా । త్రజ్ఞులకపాత్రములు నమ । నోజ్ఞములని గా
నవానినుడుగగవలయున్॥ ఉ. స్థావరజంగమంబుల సదాభుజియింపు
చు నెల్లజంతువుల్ । జీవనయాత్ర జేసికొన జేసె విధాతృడు పూర్వ
మార్థిమై । గావున మాంసమున్ గుడువగానగు నందురు కొందరార్యు
ల । ల్లవిధిసెల్లు ప్రాణివధహింసగ దాయను కొందరుత్తముల్॥ సీ. హరి
ణాదులగుసచరాళిలకచరంబు లగుతృణసస్యవృక్షాదులనియు । న
తి దంష్ట్రములగు వ్యాఘ్రాదులకునదంష్ట్రలైబెర్మివెలయుయేణాదు
లనియు । హస్తముల్ గలమానవాదులకెల్లనహస్తంబులైన మత్స్య

దులనియు । నధిక శూరత్వమింపలరు సింహాదుల కదిలేనిమదవార
ణాధుల నియు । భక్షణీయంబులని మున్ను పద్మభవుడు । నుడివెనది
గాన దినదినంబుడుగ కిచ్చు । మత్స్యమాంసాదులు భుజించు మానవుల.
కు।దోషములు వైరయు విదిస్మృతి భాషితంబు॥ వ॥ ఇదికొందఱమతంబు॥
క. మాంసము భుజించుటెక్కుడు । హింసావధముత్కృతంబనిగను ని
చ్చమెయిన్ । మాంసంబు గుడుచుదుర్మతి । హింసాపాత్రుండనుచు
వినిందించు శ్రుతుల్॥ క వృద్ధిక్షయములు తనకు నిబద్ధములగుటెఱిగి మే
ల పశువువిధమునన్ । బుద్ధిగల నరుడు హింసా । పద్ధతి నడచున్ తన
యపాయ మెరుగకన్॥ క. మాంసము గుడువనివానికి । హింసలులే
వెందువాడహింసాపరుడై । సంసారి యయ్యు విబుధో । త్తంసుడనం
బరగు మిత్రిదవులదువానిన్॥ క. పితృదైవతక్రియల సము । చితమాం
సాదులను దగభుజింపగనగు కా । దతిలోలత వృత్థార్థా । గతిగు
డువగరాక్షస ప్రకారమదియగున్॥ గీ. మాంసముడిగినట్టి మనుజుం
డు మనుజుండు । గాడు దివ్యుడతడు కాంక్షజేసి । మాంసమును భు
జించు మనుజుండు మనుజుండు, గాడు రాక్షసుండువాడు నిజము॥
గీ. మాంసభక్షణంబు మానకనెవ్వాడు । చెలగి ప్రాణివధము సేయు
చుండు । వాడురెండుకోట్లవత్సరంబులు ఘోర । నరక కూపమంద
ణంగు దొడరి॥ గీ. మాంసముడిగినట్టి మనుజుండు డెబ్బది । రెండువేల
యేడులుండు నిచ్చ । సత్యలోకమందు జంతుగణంబు ల, నేకకోట్లు
తన్ను నెఱిగి కొలువ॥ సీ. మాసంబు గుడువనిమనుజుండుసకలధర్మ పథం
బు లెల్లపరాయణంబు । జేసినవాడగు జెందదమ్మహనీయు మృత్యువు
జూచుచునెలమి బొదలు । యముడు దండప్రణామములాచరించుచు
దినదినంబు ను వేడ్క వినుతిసేయు । ధర్మదేవతమహోత్సవ మగున
ట్లు సంతోషించు కిన్నరుల్ తుషితులతని । పేరుబెట్టి దెసలు మారు
మ్రోగగనిచ్చు । బాడుచుండు రురుకనాడుచుండు । రెల్ల భూతములుర
హించు నిర్జరగణ । ములుసెలంగు కీర్తివెలయునుర్వి॥ క. పరమేశ్వరుం
డు నిత్యా । దరభంగిన్ జూచునమ్మతుకు బొదలదివా । కరసోమా

పల మూర్తులు । పరితోషము బొందుభూత భావ్యుడతడగుర్॥ క. చే
తనముల హింసించుట, పాతకమనిదలచి మాంసభక్షణముడుగం, గా
తెలివికి మూలంబగు । హేతువదియగుర్ మనంబు నెలకొను దానర్॥
చ. ననుబలెనిచ్చ జేయుచు నహో యెడ్డనాయక జంతుకోట్లు జీ । వనము
లు సేయుచున్నయవి వానివృథావధియించుటేల నా । కనుచుగృపావిశి
ష్టుడగునాతని కెవ్వరుసాటిరారుగా, పున పరమేశ్వరుండు పరిపూర్ణ
దయామతి బ్రోచునాఘునర్॥ క. జలములు నన్నము కూరలు । ఫల
ములు మూలములు లేవె బహుసులభములై, యిలనరులకేల ప్రాణు
ల । ములుగొని వధియించి మాంసముభుజింపంగర్॥ క. అతిహే
యాస్పదమును శో । ణిత పంకసమన్వితము వినింద్యక్రిమిసం । వృత
మునగు నామిషంబా, యతమతినరుడెట్లు సేగియనక భుజించుర్॥
స. మాంసంబుగుడువని మహనీయుడీశ్వర మాయారచితమగు కాయ
మెలమి, విడచిభవ్యప్రభావిలసితంబును జరామరణ భయాకుల విర
హితమగు । దివ్యదేహంబునదీపించు నవ్వేళ రత్నమయంబు విరాజ
మాన, మగువిమానము వేడ్కనంపుదురమరులు దానిపైబొల్చున
తండు పంచ । భూతములు భద్రములు వల్కుపుష్పవృష్టి । గురియు
దేవతలాతనికులవివర్ధ, నులగు బితృదేవతలు గూడి గొలుచుచుందు,
రేమిసెప్పుదు భద్రంబులెల్లబొరయు॥ వ. ఇట్లతిసౌజన్యమయప్రభా
విలసితుండును సమస్తభూత దేశీయమానుండునగు నతండు॥ గీ. సత్య
లోకంబుసేరి రజస్తమోవి । కారరహితంబు నిష్కళంకంబు శుద్ధ, స
త్వమయమగుమూర్తితో సంచరించు, శాశ్వతానందలీలమై సాధులా
రా॥ గీ. దైవపితృకార్యముల నిమిత్తంబుగాక । మాంసమారక్రవేల్చి
యే మానవుండు । గుడుచు మృతతుల్యుడగువాడు గుడుచువాని ।
వాడు జంపిన భూతముల్ వచ్చివచ్చి॥ ఉ జంతువులర్ వధించియని
శంబును మాంసము విక్రయించు దు । ష్టాంతుడు మాంసదూషకుడ
సభ్యుడువాని వర్ణంపజూచున, త్యంతమునాచి మృత్యువు ముదంబున
నెవ్వడు జంతుకోట్ల జం । పుం జెగజూచు నక్కమెయి భూతగణంబు

లు నద్ధురాత్మునిన్॥ క. గోయజ్ఞము గావించియు । నాయతమతినొల్ల

*పిష్టగోవధాదివిధులు*

డెవ్వడమ్మాలసము దీ । ర్ఘాయువుతేతము బలములు । శ్రీయును వా
నిన్ రహించివృద్ధింబొరయున్॥ గీ. మరియసంస్కారమైన గోమాంసమెవ్వ
డుండుదినువాడు పతితుండుశూద్రుడగు య । ధావిధులసంస్కృతంబ
గు గోవుమాంస । మారగించినవానికినగు ఫలంబు॥ గీ. నేయితోడనైన
నెరిపిండితోనైన । గోవుజేసిదాని గోయుటొప్పు । మంత్రవిధులతోకమా
న్యంపు బ్రాహ్మణుం । డేలమారక పశుహింసనేయ॥ క. ఘృతపిష్టంబు
లు బశ్వా । కృతిజేసివధింపక నెదనిచ్చ జెలగిగో । ఘ్నుతబొల్చువాడున
రక ప । తితుడగునొకలక్ష యేండ్లతివ్యథపాలై॥ వ. ఇదికొందరమతంబు॥
గీ. గోవ్రజంపిముఖము గావించునెవ్వడా । గోవుచర్మమందుగూడియెన్ని
గోమకోటులుంపు నాపరవాడన్ని । వత్సరములు నరకవాసుడగును.
సీ॥ యజ్ఞార్థము విధాతయాదిసృజించెగోవ్రులగాన యాగంబు వెలయ
జేయ । బశువువధించుట బాపంబుగాదని కొందరాస్యులుసెప్ప వింపు
మైన । కృత్రిమపశువధ కేవలమోక్షావహంబు భవ్యఫలప్రదంబుజూడ।
బశువులోషధులును బక్షులు తిర్యగ్గణాదులు జెట్లులు యజ్ఞమందు । నా
శనము సేయబడియు మహత్వదశలు । నడయుమరుజన్మముల మధుప
ర్కమందు । దైవపితృకర్మయజ్ఞతంత్రంబులందు । పశువధము యోగ్య
మని యెజపాలకుండు॥ క॥ మధుపర్కాదులం దగు గో । వధమనుటన్
మరియు నది యవశ్యంబగుటన్ । బుధులకుమాత్రము మేలగు । నధ
ములకున్ గీడెయగు మహామతులారా॥ క॥ వేదనిషిద్ధములగు హిం ।
సాదులుడుగవలయు బ్రాహ్మణార్యుడు కడు పెం । పూదియటుగాక ద
క్కన । పాదజుడగు నిజము వేదపారగుడయ్యున్॥ గీ॥ పరమధర్మపథము
బాటింపకెవ్వాడు । భూతహింససేయు బుద్ధిపూర్వ । కముగ వాడపా
త్రతముడై మహానర । కములగూలు నొకయుగంబుదనుక॥ క॥ ఆరయ
నెవ్వడు బంధన । మారణములు గొట్టుటయును మానికరుణతో । నా
రయు భూతంబులనత । డీరేడు జగంబులిచ్చనేలగజాలున్॥ వ॥ మరి

యును॥ క॥ ధర్మములరయుటయు స । త్కర్మమ్ముల సేయుటయు సదా పరమార్థం । బ్బలిశిలకొల్పుటయు వి । నిర్మలమతి వానియంద నిశ్చలములగుఁ॥ గీ॥ ప్రాణులవధింపకూరక బడయఁడామి । షంబుమాంసంబుగుడుచుట శాశ్వతపద । మొందగనపాత్రుడగుగాన నుడుగవలయు । మాంసభక్షణముత్తమమానవుండు॥ క॥ వెలయంగ వేయియాగం । బులును మహాదానధర్మములు సత్కర్మం । బులు జేసినవాడయ్యును । బలలాశనుడయ్యేనేని బహునరకమునఁ॥ గీ॥ మఱియు నొక్కసారి మాంసంబురుచిచూచు । వాడుధర్మమార్గవర్తనుండు । దానరతుడు సువ్రతపరాయణుండయ్యు । ఫలము బొందుగాన పాత్రుడయగు॥ సీ॥ యజమాని యనుమతినాగిజంతువధంబు జేసినవాడది సేయ బనుచు । వాడును దానితోలూడిచి ఛేదించువాడును ఛేదించవడిన మాంస । ఖండముల్ దొనిపోయివండినవాడవి గుడిచిన వాడును గొట్టిజంతు । మాంసబు తనయిచ్చ మానకవిక్రయించు నతండు బ్రీతిమొగొనెడివారు । నవియ ఘాతుకులనబడు నరులెవారు । రాక్షసులు నిజము తనశరీరంబు కండ । బట్టుటకు నెవ్వడిచ్చలు బరగ ప్రాణి । వధముగావించు దుర్గతివాడుగూలు॥ క॥ ఫలములు దుంపలునాకులు । జలములుదినుచుఁ తపంబుశతవత్సరముల్ । సలిపినవాడును బొరయని । ఫలముపడయునరుడమాంసభక్షకుడైనఁ॥ గీ॥ మాంసభక్షణంబుమద్యపానముపర । స్త్రీప్రసంగముంబుసేయుస్నై స । పాపసంఘములను బాయునరుండవి । మాని నియతినుండునేని నిజము॥ వ॥ అనిమఱియు॥ గీ॥ వెలయప్రేతశుద్ధి విధులు

—*ప్రేతశుద్ధివిధానములు*—

పూర్వముసెప్పి । పిదపద్రవ్యశుద్ధి పెంపువిధులు । తేటపరతుమీరుదీపితేశాగ్రచి। త్తములతోడ వినుడుధన్యులారా॥ గీ. బాలుడైన వయసు బరగినవాడైన । వృద్ధుడైననొకడుమృతి బొరసిన । సూతకంబు వానిజ్ఞాతిజనంబుల । కొదవుజగముపాటిపదిదివములు॥ వ. శ్రౌతాగ్నిశీలుండగు వానికొక్క దినంబును శ్రౌతాగ్నియు వేదాధ్యయనాదులు గలవానికి మూడుదినంబులును కేవలమగ్ని మాత్రంబుగలవానికి నాల్గుదినంబు

లును సూతకంబు గలదనియు తండ్రితరముగా నైన యేడవతాతకు పిండంబిడుటయు తల్లితరముగా నైన యేడవతాతకు మానుటయు నా యిర్వురకు సమానంబుగా గోత్రనామంబులు జెప్పుచు జలతర్పణాదు లు సేయుటయు నవశ్యంబులని మనువు సెప్పె మరియును॥ గీ. జ్ఞాతిజను లకగు బ్రసూతి సూతకముద । శౌహములని కొందరార్యులందు । ర ట్లుగాదు జలములాడబాయునవశ్య । మంద్రుమరియు కొందరనఘమ తులు॥ క. జనకుడు స్నానము చేసిన । వినుడు దొలగు సూతకంబువి డువదుతల్లికి । దినములు పదియనియెమనువు । మును లోకహితార్థ మైయమోఘుదయాప్తికి॥ వ. మైథునంబునరేతస్ఖలనంబగుట సర్వసా మాన్యంబుగావున స్నానంబు సేయుటయు గోరిక మాత్రంబున నైన స్వప్నావస్థ యందైన మాత్రంబుతో నైన నింద్రియంబుజారెనేని ము మ్మారు స్నానంబు సేయుటయు గృహస్థునికి ముఖ్యధర్మంబులు మరియును బ్రహ్మచర్యాద్యాశ్రమస్థితులకు మాత్రంబుతో గూడరే తస్ఖలనంబైన స్నానంబును తదితరకారణంబుల జారెనేని బ్రాయశ్చిత్త విధులును జేసికొనవలయు. ధనాకర్షణాద్యపేక్షలచే నన్యశవంబంటికొ నిన బ్రాహ్మణుండు పదిదినంబులును జ్ఞాతులు మూడుదినంబులును వెరవారలొక్క దినంబును విధ్యుక్తంబుగా జలస్పర్శనంబు జేసికొనుచున దియని చెప్పిమరియు నిట్లనియె॥ క. తనశిష్యుశవము గురుడం, టిన పితృమేధంబు నెరిఘటింపవలయు నా । తని గూర్చిపదిదినంబులు । వి నియతి మెయినుండిలోక విఖ్యాతిదగ‌కి॥ సీ. ఎన్నవనెల గర్భమింతికు స్రవించు నన్ని దినంబులాయ మకశౌచ । మగు నష్టబాయు తోయం బులాడిన జనకాదులకసిరి మహార్థవినులు । కొందరు మరియొక కొం దరు ప్రథమద్విమాసంబులందైన బరగుమూడు । వాసరంబులనిరి వని తదా బుతుమతియై బుతుదర్శనంబాగునేని । మైదపదినముందునంబు సంస్కారమై । శుద్ధి బొరయు మరణసూతకంబు । పిడబోకన కృతచూ డాకలాపుండు । మూడుదినము లేగవఃఖ్యగరిమ॥ గీ. రెండువత్సరము లు నిండినశిశువు శ । వంబలంకరించి వంశజులును । బాంధవులును

గ్రామసంధుల నతిగోప్య । మైనచోట బూడ్చుటరయ లెప్ప॥ ఉ. కాన
నమందు నేఁగొను కాష్ఠమువైచి దొలంగుచాడ్చునర్ల । వానిగురించిక
ర్మములవశ్యము సేయు నదేమిలేదు సం । తానము వోయెనే యను
చు దాపమునొందుట కాముకుఁడౌ డె । ట్లైన నశౌచమాత్రము త్ర్యహం
బులు దప్పవుబోలజూడగర్ల॥ గీ. వత్సరత్రయమేగిన వానిగూర్చి ।
యేక్రియలు నాచరించిన నేమిలేదు । జాతదంతుని కాహ్వాయజాతకు
నకు । సేయునది కొలదికర్మంబు లాయతముగ॥ క. గురుడీల్గిన బదిది
నములు । బరగునశౌచంబు శిష్యభావునకుఁ గ్రియా । పరత స
హాధ్యాయుండును, మరణము బొందినదినంబు మాత్రమొకడగుర్ల
సీ. వాగ్దత్తయైయువివాహిత యగునట్టి స్త్రీయసంస్కృతయని జె
ప్పబడును । దానిబాంధవులును తండ్రిపక్షమువారు నదిమృతిబొంది
ననతివిధోక్తి । కల్పంబులొనరించి కధలుజెప్పుచు దినత్రయముపసించి
సూతకము వాసి । శుద్ధిబొరయు మృతిజూడక దేశాంతరగతులై వార్త
లురానిబాంధ । వులునుసంబంధులును వినగలిగిరేని । యుదకతర్పణ
ములు సేయుటొప్పనుభయ । పక్షములవారలివి శౌనపాలుమతము।
దీనికార్మికులందరు దెలియవలయు॥ వ. సంబంధులు పిండంబులవశ్యమి
డవలయునని మన్వాది మహర్షులు జెప్పిరి మరియు నేదినంబున మృ
తవార్తాశ్రవణంబగు నాదినంబాదిగానశౌచనియమంబులగు పదిదినం
బులలో సేషించినదినంబులశౌచవిధులునడుపవలయు పదిదినంబులును
గతించెనేని మూడుదినంబులును, సంవత్సరమతిక్రమించెనేని యొ
క్కదినంబును, దీర్ఘకాలంబుచనియె నేనిరెండుగడియలును సూతకంబు
గలదు॥ గీ॥ జ్ఞాతిమరణమైన సత్పుత్రజన్మంబు । నైనదూరదేశమందు
నున్న । వానికివినవచ్చెనేని యశౌచది । నములుగడిపిదగుజలములు
గ్రుంక॥ గీ. ఒక్కనికశౌచదివసంబులుండ మరియ । శౌచమొక్కటి
యైన నశౌచమడరు । పూర్వసూతకదివసముల్ బోయెనన్ని । యా
దినంబాదిగామరియహములుపది॥ క. పినుడాచార్యుండుగతిం । చిన

మూడుదినంబులుపవసింపఁజను నా। తనిపుత్రుఁడైనసతియై । నను
జచ్చినవెలయునొకదినంబు ఋషులారా॥ గీ. రెండువత్సరములు మా
తులుండు ఋత్వి । జుండు మరణంబుబొందిన సూతకంబు । బొ
రయు వేదంబుజదుపునప్పుడు వయస్యు । డైనవాడీల్గినదినత్రయం
బుగలుగు॥ గీ. నృపతిపగటివేళ మృతిబొందెనేని త । ద్దివసశేష
మనియు దీర్ఘనిద్ర । రాత్రిబొరయునేని రాత్రిశేషంబని । యును నశౌ
చమనియెమనువు ప్రజకు॥ గీ. పదిదినంబులవిప్రుండు పదియురెండు ।
వాసరంబుల రాజును వైశ్యుడరయ । బదియునైదుదివసముల పాదజుం
డు।మాసమునశుద్ధిబొరయు సామాన్యగరిమ॥ క॥ ఋతుమతియును శిశు
హంతయు । బతితయును బ్రసూతయునువపతిలంపటయుఁ । మృతిబొం
దినతచ్ఛవములు । చితమెయ్యదియంటికొనిన సేయునదివిధుల్॥
వ. స్నానంబుజేసి శిరోజంబులనుండి జలకణంబులుజలజలనిరాల జల
పూర్ణంబగు తటాకప్రదక్షిణంబుసేతసూత్మ్య విపీయవంబడు వెండియు॥
క. ఆచమనముచేసినియతు । లై చెలగి జపంబుసేయనగుబుధులు స
దా । శౌచరతునామిషాశను । జూచినభాషించినన్ విశుద్ధిబొరయగన్॥
గీ. మానుషాస్థిస్నేహమగ్నుడై యంటి జ । లంబులాడుటయు దొలంగ
మఱచి । ముట్టెనేని నీరుముట్టిగోనతులు సే । యుటయును మెప్పు
బ్రాహ్మణోత్తమునకు॥ గీ. త్యక్తధర్మయైనతన్వికి సంకర । జాతకాత్మ
హితముసేతలేని । దానికనుచితవ్రతపరాయణకు జలక్రియలు సేయరా
దు కేవలంబు॥ గీ. వేదబాహ్యకు తనయిచ్ఛవృత్తినడచు । కాంతకును
భర్తృవధమును గర్భపాత । నాదులొనగించినట్టి యాయమకు నలవ ।
దార్థ్వదైహికకర్మంబులాచరింప॥ క. జననీజనకులకాచా । ర్యునకును
పాధ్యాయునకు గురునకు సకలక । ర్మనిర్యాణమాచరించుట । జనువా
రలుగడువ బ్రహ్మచారికి నైనన్॥ గీ. బ్రాహ్మణక్షత్రియుల వైశ్యపాదభ
వుల । శవములుబహిర్గతములుసేయ జనుపురంబు । పశ్చిమోత్తరప్రా
గ్దండ పాశదిశల । గలమహాద్వారములనుండి యలఘుగరిమ॥ గీ. బ్ర
హ్మభూతునకును పార్థివునకు నుపా । సీనునకును వ్రతముసేయువాని।

హైంద్రపదము బడయునతనికి వేదశౌ । చంబుశుద్ధ సత్రసంయుతునకు॥ క. నరపాలనంబు ధర్మా । చరణంబును ధర్మపథము శాశించుటయుఁ। గురుకార్యభరముగల్గుట, ధరణీనాథుని కశౌచతంత్రముదరఁగెఁ॥ గీ. అ ష్టదిక్పాలకేందు సూర్యానలముల । తేజములు పరమధర్మంబు దృఢ్య్మ తములు । మూర్తిగా నెలయుచుండు భూభర్తమాన్య । తముడు దేవుం డు లేదుసూతకమతనికి॥ క. సతతములో కేశాధి । స్థితమూర్తి యశౌచమెక్కడిది భూపతికే। గతినైనను శౌచాశౌ । చతలాతం డేలుతత్త్వజలకుఁ గాకఁ॥ క. ఎదురించిన నరపాలుర । కదనంబున జంపుటదియ క్రతుకర్మఫలా । భ్యుదయమనగ భూపతికె । ట్లోదవున శౌచంబు నిమిషముండి తొలగకఁ॥ గీ. బ్రాహ్మణుడు రాజు వైశ్యుం డు పాదజుండు । శుద్ధిబొరయుదురారయశుద్ధజలము । లాయుధంబు

—*అసపిండప్రేతశుద్ధాది విధులు.*—

లు యోగ్యవాహనములును బ్ర । తోదమును వేణుదండంబు నాది యంటి॥ క. ఆతతభంగిసపిండ, ప్రేతవిధులు బల్కితిఁ మరియునస పిండ । ప్రేతవిశుద్ధాదివిధులు । నీతియు నెరిగింతు వినుడనిమరల బలి కెఁ॥ గీ. బ్రాహ్మణుండు మిత్రబాంధవాదులగు స్వ । జాతిజులకు సేయజనుసమస్త । ప్రేతకర్మములను మాతాభగిన్యాదు, లకును వో లెనిర్మలమగునియతి॥ గీ. బాంధవాదులైన బ్రాహ్మణులకు పితృ । క ర్మములు నొనర్పగడగు నతడు । నియతి బెంపుమై వెలయనశౌచదినం బు । లెల్లగడుపవలయు నింతలనక॥ గీ. బ్రాహ్మణునిశవంబు బట్టుట యనలంబు । గొనుచు జనుటయంటె కొనుటగాదు । పాదజునకు మో క్షపదము లభింపద । లైన జచ్చినట్టియాద్విజునకు॥ క. జ్ఞానముతపమా చారము, మానసమును బుద్ధిజలము మహితాగ్నులు పా, సీనముక ర్మముయమమన । గానగుపదునొకడు శుద్ధిగలుగగ జేయుఁ॥ వ. ఇవి పూర్ణశుద్ధికారణంబులు క॥ పరధనదారాహరణము।బరగించుచుజలము లాడిపంచమఘాదుల్ । నిరతంబు సేయుచుండెడి। పురుషుండర్థశుచియు

నగ భువిఁ బెంపలరుఁ॥ క॥ తపమున వేదవిదుండో। రుపుకలిమిఁ బండి
తుండో రుఱెరుగని హీ। నపురుషుఁడు జపమునఁ గార్యపరుఁడు దానంబు
లఁ బొఱయు శుద్ధగతుల్॥ క॥ చీపురుఁగొని యెవ్వండు రు। కోపంబున
నొరుని శిరముగొట్టునఁటచియో। కాపురుషుఁడు చాంద్రాయణ। మోపి
నడుపవలయు నిర్వదొక్కఁడు దినముల్॥ క॥ మలమూత్రేంద్రియముల
చే। కలుషితుఁడగువాఁడు మంటిఁగడ్డ శిరమునఁ। నిలిపికొని నీటమునిఁ
గిన। జెలఁగువపుశ్శుద్ధివిను డచిరకాలమునఁ॥ క॥ పరపురుషలంపటయు
నఁ। బఱగి సదాపతితమైన భామినిశుద్ధిఁ। బొఱయు ప్రతిమాసము
ను నె। జరజోదర్శనముఁ జేసి జలములుడుగకఁ॥ గీ॥ పాపవరనుండు
బ్రాహ్మణుండార్య మౌ తంబుననుసరించి దవిలి మాన। సంబు చలనముడి
పిసన్న్యాసియై యొగ। శిద్ధిశుద్ధిఁ బొఱయు శిష్టులార॥ చ॥ జ్ఞానముచేత
బుద్ధియును సత్యము గల్మిమనంబు తత్త్వ వి। ద్యానుభవప్రకారణమతం
బునజీవుఁడు మంచినీటిచే। మేను శుచిత్వసంపదసమృద్ధములై వెల
యుఁ సుసంయత। ధ్యానము సర్వభూతఫలదంబు విశుద్ధతరంబు జూడ
గఁ॥ వ॥ శౌచత్వవిధులెల్లఁ జెప్పితి నింక ద్రవ్యశుద్ధికవశ్యంబులగు విధు
లు దేటపఱతు వినుండని యిట్లనియె॥ సీ. తైజసంబులకు రత్నంబుల
కశ్మమయంబులకగు శుద్ధులఁ రయభస్మ। జలమృత్తికాదులవలన నవ్వి
ధమెట్టులన వినుండు జ్వాలకనకఘటము। నిర్లేపమున మంచినీటిచే ర
త్నాదులశ్మమయంబులే యనువుగాని। రేఖలు లేమివర్ణిత సౌష్టవము
లగు నుదకంబు నగ్ని సంయోగమగుట। కనకమును వెండియును
బుట్టగానవాని। కుత్తమగుణంబు లతిమాత్ర మొదవెతామ్ర। కాం
స్యరైత్యత్ర పుణసీసకంబులకును। క్షారమామ్లంబు మృద్భస్మజల
ములొప్పు॥ వ. రత్నంబులకు సానబట్టుటయును కనకంబున కగ్నిస్పర్శ
నంబును వెండికి భస్మంబుతో రాచిపుచ్చుటయు శుద్ధికారణంబులని
కొందరుజెప్పిరి. ద్రవ్యశుద్ధిప్రకారంబు జెప్పితి. నింక దారుసంహిత శు
ద్ధిప్రకారంబు దేటపరతు వినుండని యిట్లనియె॥ సీ. చమసంబనగ గ్ర
హణమనంగదగు యజ్ఞపాత్రభేదంబులు బరగనవియు। పాత్రంబులన్ని

యుబ్రజప్రోక్షనంబున శుద్ధిబొరయుచుండు సూవెయంద్రు , కొందరు మఱియొకకొందరు యజ్ఞపాత్రములు మాత్రముసమర్థంబులంద్రు । స్రు క్స్రువంబులును చరువులును వేడిజలములచే శుద్ధిజెలంగుధాన్య । మం బరంబులుగడుగుటనధికశుద్ధి । బొరయుచర్మంబులును బెల్లమునుఫల ములు । శాకములుమూలములు దండసంచయములు । బియ్యమల్లం బునారీతి బెంపువలయు॥ సీ కౌసేయములు చిత్రకంబళాదులు నూష రంబుచేశుద్ధిబొరయు కుతపము । లగునరిష్టములచే నట్లంశపట్టముల్ క్షౌమంబులును శ్రీఫలామలకర । సంబులునుగూర్చ శుద్ధంబులగుననిరి కొందరు వఱపిండిగూర్చియు రులు । టనిరికొందరు లలితాబ్జశృంగాస్థి దంతమయవస్తువులు శుద్ధంబులగును । క్షౌమమట్లైన నిర్మలజలముల నిడు । లైన గోమూత్రమురులుటనైన ప్రోక్ష । ణమున మాంసంబు నెల్లతృణములు నింట్లు । మార్జనంబున జాలనిర్మలములగును॥ క. ఒన రమలమూత్రనిష్టీ , వనరక్తసురామిషములవలననశుద్ధిగ । దనరినమృ ణ్మయములు పా । కనిరూఢివిశుద్ధిబొరయ గలనరయంగన్॥ వ. శునక కుక్కుటమార్జాల మూషక సర్పనకుల కృకలాసగోధికాచండాల పతి తపురుషసంస్పర్శనంబున నశుద్ధంబులగు పాత్రంబులు పాకంబునను గో మయగోమూత్రాదుల చేతను గోవులువశించుటచేతను కొలదిమాత్రం బుత్రవ్వైచుటచేతను మూత్రపురీషోచ్ఛిష్ట చండాలపతిత సంకులంబు లగుట నశుద్ధిబొరసిన భూభాగంబు శుచిత్వసంపద వెలయునిట్లు॥ గీ. పక్షిజగ్ధంబు నీచమవక్షుతంబు । గోసమాఘ్రాణమును కీటకులశి రోజ । దూషితమపాత్రతమమవఘాతమైన । మన్ను ప్రక్షేపమున శుద్ధి బడయుమరియు॥ గీ. శంకగలుగుచోటు జలములురివిశుద్ధి । జేసికొనవ లయుమహీసురుండు । శంకలేనిచోటు సమ్మతిమార్జనం । బునశుచి త్వభూతిగనుటయొప్పు॥ గీ. ఎంతజలముకుత్తుకెండినగోవు ద్రా । గగల దంతనీరుగడకనెత్తి । సేచనంబుసేయ నీచాదివాసమ । శుద్ధమైనచో టుశుద్ధిబొరయు॥ గీ. బ్రహ్మచారిభిక్ష బడయనేగినచోటు । పణ్యవీధి యును బ్రపణ్యాతములు । బ్రాహ్మణోత్తములు సభాసదుల్ నివసిం

చు । స్థలములతిశుచిత్వదశల వెలయు॥ గీ. పక్షిముక్కు నుండి ఫలము
బడిన చోటు । కుక్కమృగము బట్టికొనిన చోటు । గోవు పాలుదూడగుడి
చిన చోటు స । దా విశుద్ధములు మహావరములు॥ క. శ్వానంబులు
వ్యాఘ్రాదులు, శ్వానంబులుబోయలును జంపినఖగ సం । తానమ్ము
గామిషములు దిన । గానగు ననెమనువు ఋషిశిఖామణులారా॥ గీ. నా
భిబిలమును గుదము శిశ్నంబు వినుడ । శుద్ధములు వానినంట నశుద్ధి
యయగు । నింత గావున మలముమూత్రాదియము ల । మేధ్యముల
నివచించిరి మేటిఋషులు॥ క. మలమక్షికాదులు వదన, జలము
ను చండాలపతితజాతుల గృధ్రం, బుల కాకున గూబల నెలుకల
పిల్లుల నీడలును దగ నశుద్ధంబుల్॥ వ. వసాశుక్ర మసృఙ్మజ్జామూత్ర
విట్కర్ణ మలనఖశ్లేష్మాశ్రు దూషికాస్వేదంబులను పన్నెండు మలం
బులు మనుష్యునిశరీరంబునందు వీనిశుద్ధి బాగయించికొన నిచ్ఛ
గలవాడు మృజ్జలంబులు వినియోగించుకొనునది మరియు మలమూత్ర
శుక్రంబుల శుద్ధి జేసికొనునప్పుడు వామహస్తంబును దక్కంగలతొమ్మి
దికి దక్షిణకరంబును సాధనంబులనికొందరును రెండు చేతులును దగు
ననికొందరును జెప్పిరిట్లు మలశుద్ధి గృహస్థునికన్న బ్రహ్మచారికి రెండు
మడుంగులును వానికన్న వానప్రస్థునికి మూడుమడుంగులును వానికన్న
యతికి నాలుగుమడుంగులు సమధికంబులై యుండవలయు॥ ఉ. మూత్ర
పురీషశుద్ధవిధి భూసురుడిచ్చలు సేయుచున్ సదా। గాత్రమునిండబూసి
కొనగాదగు భస్మలవంబు దాన లో। కత్రయభూతి సౌఖ్యము లఖండము
గాగొననోపునర్థిమై । క్షత్రియవైశ్యశూద్రములును జాలుగనట్లుధరింప
బాత్రముల్॥ గీ॥ దేహశుద్ధిగోరి దివ్రగుమనుష్యుండు । వాసరత్రయం
బవశ్యముదక, భక్షణంబు సేయవలయు రెండుదినములు, మొగము
గడిగికొనుట యుగడులెస్స॥ గీ॥ బ్రాహ్మణోచ్ఛిష్టభోజన పాత్రతయు
ను, వైశ్యగతి శుద్ధకర్మముల్ వరపుటయును । మాసమాసంబు
క్షౌరకర్మములుదీర్చి । కొనుటయును శూద్రుని కవశ్యమనఘులార॥ గీ॥
నోటిజలమును యెంగిలియును నొకప్పు । వడిననిరువగు దాననెన్నడును శు

ద్ధి। బొరయగాజాలడు త్తమభూసురుండు, గాన మీాసంబుగడ్డంబుకాదుచె
నుప ॥క॥ పాదములుగడిగికొని జం। ఘాదులుమానుటయు జెలగియరచే
తులురెం, డాదిగడిగి కొనిమాంసిబిం। ధాదులు మానుటయు గాదనఘ
మతులారా॥ సీ॥ వమనంబుదోచిన వాడునుబహువిరేచనములు జనిన
వాడును జలంబు। లాడిఘృతప్రాశనాప్తిబోవలయు భోజనమైన పిదప
వమనముదోచె। నేనియాచమనంబు మానకనొనరింప నగు నీటమును
గుట నవసరంబు। శయనించి లేచిసుస్నాత కుండైయుష్ణజలములు
ద్రావిభోజనముచేసి, యాసనంబున బొలిచివేదాధ్యయనము। సేయ
వలయునని మనువుసెప్పెమున్ను। శౌచవిధులెల్లజెప్పితిసర్వవర్ణ। భామి
నీవృత్తులును దేటపరతువినుడు॥ గీ॥ బాలచేతనైన ప్రాయంబుగలదా

—*స్త్రీధర్మములు*—

ని। చేతనైనవృద్ధచేతనైన। నిచ్చనైనస్వతంత్రతమిచ్చి పూరుషులుసే। యిం
చికొనుట బరగదింటిపనులు॥ గీ॥ బాల్యమున తండ్రి వశమున భర్తవశ
ము। నందు యావనమున మృతిబొంది భర్త। చనినపుత్రునివశమున
వనితయుండ, వలయుస్వాతంత్ర్య భావంబువలవదెపుడు॥ గీ॥ తెలివిమా
లిపనుల దేకు వసెడుగీడు। వడివిభుండు తనునవశ్యమెల్ల। కార్యముల
స్వతంత్రగా జేయనేనిశు। ద్ధసతినమపదగు స్వతంత్రవృత్తి॥క॥ పుత్రుండు
లేనిశుద్ధక। ళత్రముపతిజచ్చినన్ దొలంగ కసచ్ఛా। రిత్రముదగనెల్లప
నులు। బాత్రములుగనడుపనగుసభాసదులారా॥ క॥ యెఱిగినసతి యెరుగ
నిపతి। కెఱిగింపగవచ్చుదానసేకవిధములన్। గరంచినసద్ధర్మంబుల। తె
లవులువిద్యయును కార్యదీక్షయునుదగన్॥ చ॥ జనకునివల్లభుగ్ తనయు
సాహసవృత్తిదొలంగియుష్టవ। ర్తనము జెలంగుటొప్పదుబరాయణ య
య్యునుకాంతయిష్టవ, ర్తనమెదనిచ్చసేయుసతిదాను పతివ్రతయయ్యునె
ల్లవారునుకడునిందలాడి మఱిరోయగనాత్మగృశించునిత్యమున్॥క॥ మరి
యు నుభయగోత్రంబుల, జెఱచునడయగున్ సదావశీకృతమైయే।
లతినైనభర్తయలుగని। తెరవునడచికాంత బొరయుదివ్యసుఖంబుల్॥
క॥ తనుజూచియూరిగలిగిన, వనితాజనములు విశుద్ధవర్తనములు నే,

ర్చినదువ గౌరవభావం । బునెగడి సతినదువవలయు భూనుతులారా॥
ఉ॥ సంతసమింపుబెంపగు ప్రసన్నముఖాబ్జముతోడ నిర్మల । స్వాంత
ముతోడదాలిమియు సచ్ఛరితంబును సువ్రతంబునే । కాంతనివాసమా
ర్జవము నాదరభావమునిచ్చ సేయుచున్ । గాంతజెలంగుటొప్పు గృహ
కార్యపరాయణమై సుఖోన్నతిన్॥ క॥ తనుజనకుండైన నతని। యనుమ
తితతోఁ సోదరుండునైన గరిమ నె। వ్వనికిచ్చునతని నిచ్చలు । జనకన్య
వరింపవలయు సచ్ఛరితగదన్॥ చ॥ తనయులుతండ్రియగ్రజులు తమ్ము
లుబాంధవవర్గమెట్టు లఁ । గనలకుబూజనీయులగు కామవశంబుననైన
మోహభా । రనిరతినైన సంతతబరాయణ భూతిజెలంగినైన ద । మ్మ
సయము బ్రోచువల్లభులయట్లు మహాగరిమంబుచేసినన్॥ క॥ అమరంగ
బ్రజాపతియ । జ్ఞముభూతిదగన్ వివాహసమయంబుననే । యమసే
యువరునితోనా । యమబుత్రపతియు మహాధనస్థితయునగున్॥ ఉ. ఏ
యమపెండ్లికాలమున నిచ్చబ్రజాపతియజ్ఞమున్నతిన్ । సేయుమహావ్ర
తంబులు జెల్వొనుభూతియుగౌరవంబు దీ । ర్ఘాయువుభోగభాగ్యములు
నార్జవమున్ నుతశుద్ధతేజమున్। నాయమబొందు నార్యులు మహాజన
ముల్ ముదమారనౌనన్॥ చ॥ వరుడును కన్యయిచ్చలు వివాహము
నందొకపీఠపైశుభాం । బరములబొల్చి సేయునది బ్రహ్మముఖంబటు
చేసిరేనియున్ । పరమసుఖోన్నతుల్వడయు భర్తయుదానును సేయ
కుండినన్ । వెరవగు సంపదల్ దొలగు వేగవియోగము కారణంబ
గున్॥ ఉ॥ ఏయమ బ్రహ్మయోగవిధినిచ్చలు నెవ్వని బెండ్లియాడుదా ।
నాయనతోడగూడి ముదమారగభూతియు సౌఖ్యవృత్తిపూ । ర్ణాయు
వునర్థధర్మములు నంచితకీర్తియు బొందునర్థిమై । యాయమ రెండులో
కముల యందుమనోహర వేషపాత్రమై॥ చ॥ తనకిల నాధుడేపరమ
దైవమటంచు దలంచిసేయగా । జనుపరిచర్యలాతనికి సాధువునైకడు
భక్తిజేసి యం । గనయత డిద్ధకోపియును గాపురుషుండును నిర్ధనుండు
బా । పనిరతుడున్ గురూపియునపండితు డుగ్రుడునైన నిత్యమున్॥
ఉ॥ ఏయమసాధుశీలము వహించుచు భర్తకుప్రీతినిత్యమున్ । సేయు

చునుండు నేయుడలు జెందకనిచ్చు జగత్రయంబు న। త్యాయతపాత్రతఁ
వెలయు నాయను కాయమదర్శనంబునఁ బాయుచురు గ్రపాపములు
పామరులైనజగన్నుతంబుగఁ॥ ఉ॥ ఏయమప్రాణవల్లభుని యిచ్ఛజరిం
పకదుష్టశీలయై। జేయువినింద్యకృత్యములు జెల్లనియిచ్చలుమాడువట్టి
దా। నాయసు మూడులోకములయందు గృశించు మనోవ్యథల్ స
దా। వాయకనొంచుచుండ పంబభంగులదైన్యము రూపుఁబొంప
అఁ॥ చ॥ వ్రతములు తీర్థయాత్ర లుపవాసములుజ్వల దానముల్
జగ। న్నుతముగ సేయునైనను ప్రియుండెదమెచ్చినికాంతకిష్టన। ద్గతు
లనుగూర్చనేరవవి గావున నిచ్చజెలంగుప్రీతిమై। పతికి హితంబుసేయున
ది భామినిదానమహాత్మ్యలాలగున్॥ క॥ పతిహితము సేయునంగన, వ్ర
తములు దానంబులు నుపవాసవిధులుస। మ్మతి సేయకుండియును శా।
శ్వతపదముఁ బడయులోక వందితలీలఁ॥ క॥ పరుడును తానునుధర్మ
ము। పరాయణము సేయుటదియపాత్రతమముగున్। పరమపతివ్రతకవి
పతి। మరణానంతరము దగవమాన్యములరయఁ॥చ॥ పతిమృతిబొం
దెనేని సతిపంప్లుచుదుంపలుకూడుగాగ సం, తతముఁ భుజింపుచుఁ
నొకవిధంబున నోపికరీసియాత్రసే। యంతెరగు భూనుతంబుమఱియుఁ
గలనైసమనోవికారిసం। గతివహించిపు కన్యుని మొగంబును జూడని
సీతిదొయప్పగుఁ॥ ఉ॥ పాలును నేయియుఁ మధువుపానకముఁ హిత
భక్ష్యభోజ్యముల్। పూలును నిర్మలాంబర విభూషణముల్ మృదుగం
ధ తల్పముల్। జాలుగనింటగల్గినను సాధ్వియొకప్పుడు నంటరాదు
దా, లోలుపవృత్తి భర్తపరలోకముసేరినమీదలీలనై॥ గీ॥ నేలపానుపు
గామేనుధూళిబ్రుంగి। కాంతిసెడ పెంపుదరిగి వితంతువునెరి। నెయిదిజీ
ర్ణాంబరయు ముండినియు ససంగ। తయునునై యుండునది యెవ్విధములు
గావు॥ గీ॥ భర్తజచ్చినదాదిగా బ్రహ్మచర్య। వ్రతముబూనిచరింపగా
వలయుసాధ్వి। దానకృతకృత్యయుగు పుత్ర హీనయయ్యు। బ్రహ్మచా
రినియను పేర బరగిమరియు॥ క. సుతుసింబడయగ నేయుమ। బతికతి
వర్తనము సేయుబాడివొంగియూ। పతివంచనశీల విగర్హితయుగు నిహ

పరములందనిరి భవ్యమతుల్॥ గీ. పరునివలన పుత్రుబడయుటయును
బరి । గ్రహముచేసికొను వెరవుదలంచు । టయును సతికిగాదని యెఱుగ
ద్గితపరా । యణుడు మనువుసువ్రతాఢ్యులార॥ క. ఏయధమవర్ణుకైన
ద్వి । తీయవివాహంబుగాదది విగర్హితమిం । పైయుండియునెట్టిన శా।
స్త్రీయవివాహవిధి కీడుసేయకజనుసే॥ క. పరపురుషునిసాంగత్యము।
బరగించినకాంతనింద బడిదుర్గతులన్ । బొరసిచిరునక్కయైపు । ట్టిరో
గముపాలువడిగడిమిసెడి దిరుగున్॥ క. తనకారయపతిదైవం । బనియె
ఱిగి బ్రియంబుసేయునంగనసురలో । కనివాససౌఖ్యపదవుల్ । గనుని
బుధాంగనలు దన్నుగదసికొలువగన్॥ క. ఇతరేతరానురాగము । స
తీపతులకెల్లయెడల సరిగావున భూ । నుతముగ బతిజచ్చినయా । సతి
సహగమనంబునేత శాస్త్రీయమగున్॥ గీ. సర్వలోకంబులందును సతి
కిబతియు । గతియు పూజ్యతముడునగుగాన పలదె । సహగమనయత్న
భంగులు సాధ్వికేమి। సుఖమమాంగల్యమైయుర్వి జూచుచునికి॥ క. పతి
మృతిబొందిన దాదిగ । వితంతువగుచు గాఢనియతివెలయుంగ వృథా ।
గతిదాసి వ్రాలెనుండగ । సతికేటికి సహగమనము చదురైయుండన్॥
సీ॥ పతితనకిచ్చలుపరమేశ్వరుండు కర్తయు భర్తయును మనఃప్రియత
ముండు । కల్యాణదాయి రక్షాపరతంత్రుండు ననివిచారించి యేవనితభ
ర్త । మృతిబొందదానును మృతిబొందు నొకయుపాయంబున సహగమ
నంబనంగ । నది సెల్లునట్టి పుణ్యవ్రతపతిగూడి దివ్యదేహవిభూతి తేజరి
ల్ల । నేడు లక్షలు నరువది మూడువేలు । వత్సరంబులుగడపు దేవత్వ
మొంది । నాకలోకంబునందు రత్నమయ మంది । రములమేడల ప్రమ
దావనముల బ్రీతి॥ క॥ పతికిమునుసత్కళత్రము । మృతిబొందిసురాంగ
నాసమేతంబుగ ది । వ్యతమత్వమలరవిహరిం । చుతదన్ మేరునగకూ
ట శుద్ధగృహములన్॥ గీ॥ వర్ణనీయమైన వనితపాణిగ్రహ । ణంబుచేసి
బ్రాహ్మణప్రవరుడు । బడయునిహపరముల పరమసంతోషంబు। తులు
వచందమైన దుఃఖమొందు॥ క॥ పాత్రతముడు విప్రుండు క । ళత్రము
మృతిబొందినన్ సలక్షణములు మా । నత్రపలుగల్గు కన్య జ। రిత్రమె

రిగి యిచ్చలునువరింపఁగవలయుఁ॥ గీ॥ తానువృద్ధుడైన తనయులుయౌవన । వంతులయిన దగులువలనతనకు , గీడుగలుగునట్లు మూఁడిన జనదు పు । నర్వివాహవిధి మహాద్విజునకు॥ క॥ ఆయుర్భాగములందుఁద్వి । తీయంబున బ్రాహ్మణుడు సతీసంయోగ । శ్రీయనుభవింపవలయు స । దాయజ్ఞాదిక్రియలును ధర్మువ్రనుదగఁ॥ వ॥ అనిచెప్పెనని॥

ఉ॥ కారణమాత్రరంజిత జగన్మయ నిర్మల నిర్వికార సం
సారవిమోహదూర నుత సత్వపరిస్ఫుటభవ్య తత్వదీ
క్షారతమానసాంతర బ్రకాశ విశిష్టసమస్త భక్తమం
దార మహాగుహూత్తమమతస్థిత దీపకళాని వేశితా॥

క॥ పరమ గురుచరణ సేవా
పరిలబ్ధ జ్ఞానవైభవప్రచురార్ధ
స్థిరతత్వ మహాయోగ
త్వరతాదర పరమహంసవాగమృతనిధీ॥

మాలినీ. గురుపదయుగ సేవా గూఢ తత్వార్థ బోధా
స్ఫురిత విమలయోగస్ఫూర్ణ గమ్యప్రభావా
పరమనియతశీల ప్రాభవానందలోల
త్వరసనిగదితాత్మా ధన్యవాదిత్వమాన్యా॥

గద్య.

ఇది శ్రీమత్పరమేశ్వర లీలా విచిత్ర ప్రపంచసేవాపాత్ర శ్రీమద్వారపురెడ్డి
పాపినాయక పుత్ర నిఖిలబుధజనవిధేయ యప్పలనాయక
నామధేయ ప్రణీతంబైన శ్రీమదాంధ్ర మనుధర్మ
శాస్త్రంబునందు పంచమోధ్యాయమ్
సంపూర్ణమ్.

---



శ్రీరస్తు.

శ్రీమద్వితీయరామకృష్ణపరమహంసగురుస్వామినేనమః.

# శ్రీమదాంధ్ర మనుధర్మశాస్త్రము.

## షష్ఠాధ్యాయము.

శ్రీయోగభరితజగతీ । శ్రేయస్సంపాదన ప్రశిద్ధనిరసన । వ్యా
యామయోగమతనా । రాయణ బహుళకరణతంత్రరతపరమేశా॥ వ. దే
వా యవధరింపు మమ్మహర్షిసమాజంబులతో భృగుమహర్షీంద్రుండిట్లని
యె॥ క. ఆయుర్భాగములందు ద్వి । తీయంబున బ్రాహ్మణుండుదిత
విజ్ఞాన । శ్రీయునుధర్మవ్రుదగ భా । ర్యాయోగక్రియలుసేయువది
వెరగాకన్॥

### —*వానప్రస్థాశ్రమ ప్రకారము.*—

చ. అనుపమధర్మశిద్ధి వెలయంగ సమస్త గృహస్థకర్మముల్ ।
బనివడిదీర్చిమోహరతి బాసితృతీయ సమాంశమందు మె । ల్లనహృద
యంబులోపలి కళంకమునిర్మలతత్వబోధ నా । ఘనత దొలంగ జేసికొని
కాననవాసము సేయుటొప్పగున్॥ క. పాత్రతగల్గినశుద్ధ క । ళత్రము
మేలనకుమారులకు తుష్టిమెయిన్ , బుత్రులుగలుగగ విప్ర । క్షత్రి
యులిలువాసివనము జనుసేవింపన్॥ వ. ఇదికొందఱమతంబు॥ చ. అన
యమువృద్ధభావమెనయంగను పుత్రవిహీనుడయ్యు దా । వనముసమా
శ్రయించునది వారకవిప్రుడు నిర్జితేంద్రియుం । డును దృఢచిత్తుడున్
గతకుటుంబభరవ్యసనోన్నతుండు శాం । తనిరతయోగసంభృత మతి

స్థిర తత్వకళాధికుండున్నె॥ వ. ఇదికొందఱమతంబు॥ క. ఆయుర్భాగము
లందు తృ । తీయంబున సద్వివేకదీపిత చిత్తుం । డై యోపికవనవాస
ము । సేయవలయు విప్రుడుమతసిద్ధిజెలంగన్॥ క. పాత్రముశుద్ధమునై
నక । శత్రము రాబ్రాహ్మణుడు దొలంగకతనులో । కత్రయమును కొని
యాడ వ । విత్రస్వాంతుండయి యడవికిజనుటొప్పున్॥ మ. తనతో
డన్ జనుదేరఁగోరనిపినిండ్లన్ దుర్మతన్ చిత్తవం । చనసీలన్ సతినాత్మపు
త్రవశగాశాసించి సంసారబం । ధనముల్ వాసిరొకండ పోవనగుశుద్ధజ్ఞాన
వైరాగ్యశాం । తనిసూక్ష్మస్థిరచిత్తుడైయడవికిన్ ధైర్యంబు పెంపారగన్॥
క. పుత్రవిహీనతయుఁ జక్షయు న । పాత్రముగనుసతికి ధనముపంచియొసగి
భ । వ్యత్రికరణశుద్ధివెలయ । ధాత్రీసురుడేగవలయు దావనమునకున్॥
చ. వనమునయందెప్పితంబుగనివాసముగాదగు గ్రామమొప్పదే । యను
వునైన బంధనభయంబు దొలంగినవానికంచు దా । మనువుపచించె
గ్రామమొకమాడ్కి వసించి జితేంద్రియుండునై । జనువిహితంబు సేత
యనిసమ్మతిజెప్పిరి కొందరుత్తముల్॥ క నియతేంద్రియుఁడు శాంతుం।
డయమహితాత్ముండు ధీరుడగుచునరణ్యా । శ్రయుడున్నతముగ సేయ
వ। లయునగ్నిక్రియలు నిర్మలగ శాభూతిన్॥ క. ఫలములు కూరలుమూ
లం । బులుగూరిచియైన శుద్ధమున్నన్నము బెం । పలగిచియైననుసేయగ।
వలయున్ యజ్ఞములరణ్యవాసుడు నియతిన్॥ సీ. మృగచర్మమైనను
వృక్షాదివల్కలాంబరమైన నిర్మలాంబరముభంగి । కౌపీన మాత్రంబు
గట్టి సూర్యోదయాస్తమయకాలములనుస్నాతకుడయి । జడదారియు
ను సదాశ్మశ్రుశిరోమనఖప్రరోహకుండును గతరోగభయుడు । నైవై
శ్వదేవపూజాదులు తనశక్తికనువగి భంగిమైయాచరించి । ఫలము
లైనమూలములు నై నిర్మల । జలములైన నొసగి సతతవర్షాశ్ర ! మా
గతుల సమార్చనాద లుసేయుచు । వననివాసినడుప వలయు నిష్ఠ॥
క. వేదంబులుజదువుచు దు । ర్వాదంబుల బోవ కెట్టివాడలిగినదా।
నాదరము దక్కకోపం । బూదక భూతదయగలిగి యుండగవలయున్॥
క. కీడువ్రైరయ కెవ్వరికిని । కీడుదలంపక దొలంగి కేవల విజ్ఞా । నాడం

బరరతి దిరుగక । నోడక వర్తింపవలయు నున్నతినడరిన్॥ వ. పౌర్ణమా
యమావాస్యలయందు వేదంబులు జదువక నగ్నిహోత్రక్రియలు మా
త్రంబు నెలయించి పితృతర్పణంబులు సేయుటయు వాసంత శరదృతు
వులయందు మొలచి యభివృద్ధిబొందిన వ్రీహ్యాద్యరణ్యధాన్యంబు లేరికొ
నుచు పురోడాశంబులును చరువులును హోమార్థంబు సంపాదించు
టయు సంపాదించిననీవారాది ధాన్యంబులతో స్వయంకృత యామర
లవణంబు ససంశుద్ధికొరకుగూర్చి యజ్ఞంబుచేసి హవిర్భాగంబు సురలకొ
సగి తచ్ఛేషంబు భుజించుటయు నాతనికి ముఖ్యకర్మంబులు మఱియును
చ. స్థలజలసంభవంబులగు శాకములున్ కుసుమంబులున్ ఫలం । బు
లు మృదుకందమూలములు పుణ్యతరోత్తమ జాతమాత్రతన్ । వెల
యు పదార్థముల్ గొనుచు వేదహితంబగు [illegible]మకర్మముల్ । వల
యు సమాచరింపగ వనశ్యమరణ్య నివాసుడోపికన్॥ గీ. మధువు
మాంసంబు మాక్షికమాంసము నురు । కవకమును భూస్తృణము శి
గ్రుకంబు గుధము । గండకంబును శ్లేష్మాతకఫలములు వి । వర్జనీయం
బులట వీనివాసకునకు॥ గీ. పూర్వసంచితముగ బొంచిన మున్నన్న ।
మునుఫలములు మూలములును శాక । ములును జీర్ణవస్త్రములు నా
శ్వయుజమాస । మున విడువవలయునమోఘునిష్ఠ॥ గీ. ఫాలకృష్టము
లు నపక్వంబులును గ్రామ । జాతములు విశీర్ణసంచయములు । నైనత
రుల తాదులందు పండ్లును మూల । ములును పుష్పములును వలవ
దుగాన॥ చ. అనలముచేత పక్వమగునన్నము కాలవిపక్వభూతిసం ।
జనితములైన వస్తువులు సౌఖ్యకరంబులు ఖాఖలంబు చే । నెనసిన
కాయగూరలు సమృద్ధములై సులభంబుగా లభిం । చిన ఫలమూలజా
తులు భుజించిననాయువు పుష్కలంబగున్॥ ఉ. కాననమందు నెల్లెడల
గల్గిన బ్రాకులుపూచికాచి సం । తానవతీజనంబుల విధంబున భ
వ్యతరంబులై దగం । గానవియెల్లనొక్క తరిగాదుగొనం ఫలపుష్పజా
తుల, నైన సమస్త భూతములు నాతనినిచ్చలు సేయునిత్యమున్॥

ఉ. పుట్టలసందునఁ బెరిగిపూఁచి ఫలించి మనోహరంబుగా । దట్టములై
నవృక్షముల దాపునదానివసించు టొప్పదే। చెట్టునకృష్ణసర్పము వసిం
చునిరంతరముగ్రభంగి నా । చెట్టుఫలంబులఁ గొన గృశించుచుతండో
క వత్సరంబునఁ॥ ఉ పిచ్చుకలుఁ శుకంబులును బ్రీతివసించెడి చెట్టు
పండ్లు దా । నెచ్చటనుండు నైన తగ దేరిభుజింప సమున్నతంబులై । ప
చ్చికబీడులందొరిగి పండిన చెట్టులపండ్లు రాలినఁ । నచ్చుగొనంగ తా
పసుడవశ్యము పుష్పకులంట గీడగుఁ॥ ఉ పూచిమనోహరంబులగు
భూజములుఁ కడుజొంపలింపులై । కాచినచెట్టులుఁ విగలుకాయలు
పండ్లును గల్గువృక్షముల్ । జూచి నమస్కరించి యెదచోద్యముబొంద
క క్రిందజేరి చే। చాచి ఫలంబులుఁ సుమనసంబులు నాకులు గోయు
టొప్పగుఁ॥ ఉ. కాయలుసంగ్రహించి కొనగాదు ఫలంబులు లేమినైన
న నా । మ్నాయవిదుండు బంధనభయంబు ద్రోలంగినవానికంచు నా ।
రాయణమూర్తి నైష్ఠిక పరాయణవృత్తి జరించు పీరశా । ద్రేయుని
తోడ జెప్పెమును బుత్విజులైయతడర్ధ వేడినఁ॥ ఉ. రాలినపూవులేరి
కొనరాదనికొందరు జెప్పిరార్యులు । త్రాలమహీజమెక్కుట వృధాయ
గుగావున గుజ్జుమ్రాకులఁ । పూలుఫలంబులుఁ గొనుటబోలు జెలం
గుచు పూవుదేనియల్ । గ్రోలుచునున్న తుమ్మెదల గొప్పినవానికి గ
ల్గుపాపముల్॥ ఉ. కోయిలలుఁ శుకంబులును గుంపులుగూడి మనో
హరంబుగా । గూయుచునుండుతావులను గూర్చుని పెద్దయెలుంగుపు
ట్ట నా । ధ్యాయము సేయుటొప్పదు పతంగసమూహము లిచ్చలార
గఁ।బాయకనుండు చెట్టునికిపట్టుగగై కొనగూడ దెందునఁ॥ వ. నీవార
కాదిధాన్యములు దానువలయునప్పుడెల్ల గొనుటకై సంగ్రహించుటయు
ఫలమూలంబు లొక్కదినంబునకు మాత్రము గొనుటయు బ్రాతస్సా
యంసమయంబులందన్నంబు గొనుట నిషేధంబుగాదని కొందరునుడివిరి
గావున నుపవాసంబు లాచరించుచుండువాడుదయంబున భుజించి మరల
సుస్నాతకుండై సాయంతంబున గుడుచుటయు సాయంతంబున భుజించి
మరునాటిసాయంతంబుదనుక నుపవసించుటయు దినంబున కొక్కసారి

గుడుచుటయతిమాత్రంబనియు నాల్గుదినంబుల కొక్కతడవు భుజించుట
మహామాత్రంబనియు జెప్పంబడుగావున నవియు నడపుటయు వానప్రస్థు
నికి యోగవ్రతంబులు మరియును॥ గీ. పుష్పఫలమూలములు నిచ్ఛబో
రయునప్పు। డెల్లగొనక వినియమితవృత్తి గడుపుటు త్తమంబు వానప్రస్థు
నికెల్లెరగులు। వానిసరిగావనిరి భవ్యులైనబుధులు॥ క. ఈనియమములవి
డువక వై। ఖానసమతశిద్ధి వారసికల్యాణగుణ। శ్రీసిధిన్నొయతడుండం।
గానగువనమందు నొక్కకడ నిశ్చలుడై॥ ఉ. స్నానము నిర్మలాసనమనం
దగురెండును మంత్రముల్ సభి। ధ్యానము నైష్ఠికవ్రతమనందగు మూ
డును ముఖ్యకర్మముల్। గానొనరింప బెంపగు మఖంబులు హోమము
లాద్యభావముల్। మానసపక్వశుద్ధియు సమాహిత తత్వము వానిసార
యుల్॥ క. స్నానము భోజనమును నియ। మానుష్ఠానములు లేక నాతడు
శుద్ధ। జ్ఞానముగల్గినొనర్పం। గానగుభూశయనుడైదగకాలునితాపుల్॥

—*వానప్రస్థుని నిష్ఠాక్రమము*—

సీ. ఇంద్రియవర్గంబునెగ జిక్కపట్టి జిత్తము పరబ్రహ్మసూత్రముగ జేర్చి।
యాసనస్థితుడుని రాలంబనాఖ్యుండునై చతుర్దిక్కులయందు నాలు। గగ్ను
లువెలయించి యర్కాతపంబున గోపిదపించుచునుండుటయును। గ్రీ
ష్మర్తువందు ప్రావృట్కాలమంతయు వానలదడియుచువరలుటయు స,
మార్ద్రవస్త్రధారియై యగ్నివెలిగించు। టుశిగిమంచుగురియుచుండు
చోట। సీతుకాలమెల్ల సెల్లించుటయు మహా। మాత్రములతనికి బ
విత్రులార॥ గీ. దేవపితృతర్పణంబులు త్రిషవణంబు। చేసిసేయుటదను
వు గృశింప నుగ్ర। తపముసల్పుచు బిత్రుదినత్రయమునందు। మనలత
ర్పణములు సేతమాన్యతమము॥ క. ఫలమూలాశనుడై ని। ర్మలమతము
దగంగ నారుమాసములత్యు। జ్వలతప మొనరింపంగా వలయుగరము
తాకికాగ్నివర్జితనిష్ఠ॥ క. శ్రౌతాగ్నిమానసాంత। ర్జ్యోతివిలీనంబుచే
సి శుద్ధుడుని యమా। తీతుండై నెలలారు మ। హాతపమొనరింపవలయు
నాతండర్థి॥ గీ. స్వాదుఫలభక్షణాసక్తి జనకవర్గ। వాతశీతాతపంబు
లవశ్యమోపి। కొనుటకైగాక నాయదియనక వృక్ష। మూలమతడా

శ్రయించుటముఖ్యతమము॥ క. వనవాసులవిప్రుల గ్రామునివాసకులైన
యుత్తమగృహస్థులయా । జనముఖ్యులనన్నమడిగి । కొనిభుజియించునది
యతడకుంఠితనిష్ఠ॥ గీ. పాణిసాచియైన పత్రఖండమునబట్టి । యైనగ్రా
మమందు నన్నమడిగి । కొని భుజించియపుడవనముప్రవేశించు । నదియ
రణ్యవాసుడదిఘనంబు॥ క. పరమేశ్వరైక్యతత్వము । బొరయంగాజేయ
జాలు భూనుతమత బ । ధురములగు శాస్త్రములువే । దరహస్యార్థ
ములతండు దగుజదువంగ॥ క॥ మానితబ్రహ్మాద్వైత । జ్ఞానకళాశ్ర
యములగు వచనములు వెలయం । గానెఱిగింపగనేర్చిన । వానినడిగి
తెలిసికొనుటవశ్యమతనికి॥ క॥ కేవలమీనియమంబులు । గావించిన
వాడు విగతకల్మషచయుడై । దేవ్రనిఃకారయువిముక్తుద । శావృద్ధిత్వస్ఫు
రణ మొసగనిత్యుండై॥ క॥ ఆయుర్భాగములందు తృ । తీయంబునవనము
జేరి దృఢమతియైయ । త్యాయతముగయజ్ఞాదులు । సేయవలయుపరమ
మతముశిద్ధింపంగ॥ క॥ ఆయుఃపరిమాణములగు హాయనములలోజతు
ర్థమగుభాగమునను । ధీయుతుడునిర్మలుండన । హాయుడు
నై మెలగు నదిమహామతముగను॥ క॥ అమరంగయధోచిత క । ర్మ
ములిమ్మగ జేసియాశ్రమత్రయము సబా । త్రములుగ నడపి చతు
ర్థా । శ్రమమునసవి మానిముక్తసంగుండగుచు॥ క॥ జ్ఞానముకే

—*సన్యాసప్రకారము*—

వలమాశ్రయ । మైనెగడగబ్రహ్మ మందువాత్మనిలిపి ని । త్యానందంబు
న దేలుచు । మేనువిడచి యుకురుండమృత తత్వుడగును॥ ఉ. ఇంద్రి
యపంజరంబున గృశించు మనశ్శుక మెట్లుబొందనే । ర్చుంద్రిపిలాసమో
క్షపదచూతఫలంబు తనంతనర్థిమై । సాంద్రవికారకంటకిత సంసరణాటవి
గాననోపి యో । గీంద్రుడుడు ముక్తసంగతి జితేంద్రియవృత్తి జరింపగాద
గును॥ గీ. ఓపిరుణబంధనములన నొప్పునాశ్ర । మత్రయమునడపు ట
త్యుత్తమంబు దాన । కలుషములు వాయుశుద్ధ ముక్తత్వశిద్ధి । బరగు
నాల్గవయాశ్రమ పథమునడుప॥ గీ. శుద్ధమఖములు సంతానశిద్ధి వేద ।
పాఠకలనంబుననుమూడు బాత్రములవి । ప్రియముపైరయించు సురల

ను పితృగణముల । ఋషులనివ్విధములు సేత ఋణవిముక్తి॥ క. జ్ఞానం
బుగలిగిభవ । ధ్యానము గావించుటదియు దాత్త్వంబును బ్ర । హ్మానంద
మయంబునగుఁ । దానఁ బరమేశ్వరుని ఋణము వాయు నిలఁ॥ క.
వేదముజదువక పుత్త్రో । త్పాదనగరిమంబు లేక పంచమఖముల । త్యా
దరమతిగావింపక । నాదిమనఘుండు మోక్షమునపాపమగుఁ॥ గీ. బ్ర
హ్మజిజ్ఞాసకుండన బరగి సర్వ । మర్థమతిపాత్రులకు దక్షిణాప్తినొసగి ।
యజ్ఞమొక్కఁడు జేసిగృహంబు వెడలి । బ్రాహ్మణుడు సేయవలయును
వ్రతపమడవి॥ ఉ. ఏనరుఁడొపిశాంతుడు జితేంద్రియుడుత్తమ పాత్రు
డైదగం । గానభయప్రదానము జగంబున చేతనకోట్లకిచ్చుస । న్మాని
త వృత్తి పెంపలర మానుగ నాతని కాంతిజేసి జె । ల్వైనెగడుఁ జగం
బులు మహాత్ముఁడతండ జగన్మయుండగుఁ॥ గీ. ఏమహాత్మ్మువలన నిం
చుకయునుభీతి । భూతసంఘములకు బొరయకుండు । తనువువిడచిశా
శ్వత పదంబునడయు నా । తండు పరమముక్తతత్త్వుడగుచు॥ ఉ. మాట
లుమాని దండముకమండలువుఁ గొని నిశ్చలాత్ముడై । పాటసెలంగమం
దిరము బాసిదృఢస్థితి నెక్కఁగొండ యె । చ్చోటులకైనబోవనగు చోద్య
ము బొందక బంధనంబు ము । న్మాటికి వాసెనేయను సమాహితభావ
ము శిద్ధిబొందగఁ॥ మ. మునినిష్ఠాపరుఁడాద్వతత్త్వవిదితాత్ముండ ప్రకా
శుండనగ్నినికాయుండు నుపేక్షకుండునగుచుఁ నిష్కామతంత్రస్థితిఁ ।
వనవాసంబొనరింపగావలయు నానందంబునఁ నూరు జొ । చ్చినిమేషం
బులుబుచ్చుకున్నతమత స్థేమంబు భూమంబుగఁ॥ గీ. వృక్షమూలాశ్ర
యుండు వివేకభూతి । పరమసిద్ధారతుండు కపాలపాణి । జీర్ణవస్త్రాన్వి
తుండు విశిష్టమాత్రు । డైసదాముక్తుడగను బ్రహ్మాశ్రమంబు॥ క. మ
రణముజీవనమిచ్ఛలు । నరయక కాలమునిరీక్షితా వాప్తిగ బ్ర । హ్మార
తానందమయుండై । బరగియతడు కూలివానిపగిది జెలంగుఁ॥ గీ. దృ
ష్టిపూతంబుగా పాదమిడుట వస్త్ర । పూతముగనీరు ద్రాగుట భూరిస
త్య । పూతముగమాట లాడుట బ్రీతి వెలయు । హృదయపూతంబుగా
సేయుటదగునరయ॥ క॥ వాదము సేయక నెరుపరి । వాదముగావింపకె

ట్టివారలలిగినఁ । గాదనక నిచ్చు నెదలో । నూదక నిరపేక్షవృత్తినుండఁగ
వలయుఁ॥ క॥ ఒరుడలిగిన దానలుగక । నొరుభద్రము సెప్పి నిందలుడిగి
యనృతమే । పెరవునబలుకకనిత్యము । పరాయణము సేయవలయుప
రమపదంబుఁ॥ క॥ నిరపేక్షుండును సదాధ్యా । త్మరతుండు జితేంద్రియుం
డుతన్మయతత్వా । దరభావుండసహాయుడు । బరఁడు నగుచు యోగసిద్ధి
బడయగవలయున్॥ గీ॥ వెలయుతారకాంగసద్వ్యచేతనుమహాం । త్పా
తకారణములు బలుకుటను మ । హాపథంబులిట్టి వనుచుశాశించుట । వ
లన భిక్షుబడయవలదతడు॥ గీ. బ్రాహ్మణాదులు భక్షించుపక్షిగణ
ము । గుక్కలును యూరబందులగుంపుగలసి । మెలసివర్తించు గృహ
ములవలవదర్థి । భిక్షసేయంగ కాలనిరీక్షకునకు॥ గీ. క్లిప్తకేశనఖశ్మ
శ్రుడాస్తరహితు । డాత్మనిష్ఠుండుదండియు నమలపాత్ర । ధరుడునుక
మండలియునునై బరగుభూత । హింస సేయకనతడు నిజేచ్ఛదిరుగ॥ క.
బిలములులేకవిశుద్ధం । బులతైజంములగు పాత్రములుధరియింపఁ । వ
లయుపరివ్రాజకులా । జలముల శుద్ధిగను యజ్ఞసమయంబులలోఁ॥ గీ.
దారువులచేత మంటిచేతను తరువుల । చర్మముల దృషము ష్ఠినిర్మితంబు।
లైనపాత్రవిశేషంబులమరుయతుల । కనియెమనువు దయానిధి
యార్యులారః॥ సీ. ఏకకాలముబిక్షకేగుట దగుకాదు పలుమార్లుబహు
బిక్షబడయజనట । భిక్షాధికంబునపేక్షించుయతికండ బట్టిక్రొవ్విజె
లంగి పాడిదప్పు । గావున పాణరక్షామాత్రమగుభిక్షవలననపరితుష్టి
నెలయవలయు । బాకధూమంబెడ లేకయుండునపుడు ముసలముల్
మూలల నెసగునపుడు । సతులు బతులును గుడువకసరవినుండు । న
పుడు భిక్షాటనము సేయనగుమెలంగి । బాత్రముధరించి యిచ్చులుమా
త్రములుమ । నంబునఁ లేక భైక్ష్యచర్యవ్రతుండు॥ క. ఎనయంగభిక్ష
గాకుం । డినవేళవిషాదమును విడిసినట్లులభిం । చినవేళసంతసంబును ।
మనమునజెందంగరా దమాన్యుడు వ్రేలెఁ॥ క. మిగిలినపూజాపూర్వ
క । మగు భిక్షాన్నంబు నింద్యమాతనికటుగా । క గుడిచెనేని విము
క్తుం । డగునె ననుజన్మబంధనాదులు బాయుః॥ క. ఒనరంగనతడుల

ఘు భో । జపముఁ దీర్థస్థలములు జను సేయఁగ గా । దనుకూలించుచుం
చులఁ । గొనియిచ్చలు బెచ్చుపెఱుఁగ గుడువనొకఁ డిష్టుఁ॥ గీ. ఇంద్రియ
ములగెలచి హింసాగతులు మాని, సంగముడిగి యంతరంగమందు, భ
వ్యయోగతత్వ పరిణామము బొరసి । యోగియమృతుఁడగు విరాగవృ
త్తి॥ గీ. పాపకర్మవృత్తి బాటించు మనుజుండు । జచ్చి ఘోరనరక సాధ
నముల । మ్రగ్గిమ్రగ్గి కాంతిమలయుంగ హీనజం । తువుల యోనులందు
దగిలిపుట్టు॥ గీ. విప్రయోగంబు సంయోగమప్రియంబు । ప్రియము
బొందుచు తన్ను జరయును రోగ । ములును బొందువని చావున మెలగిమె
లగి । జచ్చునజ్ఞాని సద్ధర్మసరణి లేక॥ గీ. పాపవర్తనుండు ప్రాణంబు తనువు
లోఁ, నుండి విడచి నరకమొందు పెక్కు । వత్సరములు బ్రాలువడి శత
కోటియో । నుల జనించు బాధనుండు వాఁడు॥ గీ. ధర్మపథము పాడి దప్ప

—*సంసారబంధన విముక్తిప్రకారము*—.

కనడచిన, వాడు సౌఖ్యలీల గూడియుండు। ధర్మపథము పాడి దప్పి వర్తించి
న । వాడు దుఃఖగతుల మాడియుండు॥ గీ. సూక్ష్మబుద్ధితోడ జూచి స
మస్తంబు । నణచు తెరవు దెలిసి యార్యుడింద్రి , యములజిక్కబట్టియ
మలపరబ్రహ్మ । మాశ్రయించి వడయు నమృతపదము॥ క. కేవలలింగవిశి
ష్టిత । కైవల్యపదంబు బడయగారాదు మనం । బావేశింపుచు బ్రహ్మద।
శావిర్భూతంబు గాని యన్నిదినంబుల్॥ క. ఏయాశ్రమంబు జగతీ । శ్రే
యస్కరమతుల ధర్మసిద్ధిదము మహా । పాయము నై వెలయుబుధుం ।
డాయాశ్రమమాశ్రయింపనగు ననిరిబుధుల్॥ క॥ వెలయంగ గతకవృత్త
ము । ఫలము మలినజలము శుద్ధిబరగించెడి పెం । పలవడునది లేకుండిన,
వెలయుసిగతిలింగమాత్ర విధులు త్తవగుఁ॥ క॥ చీమలు కీటకజాతులు ।
భూమిదిరుగుచుండు గాన బుధుడడుగిడున, క్షేమరక గ్రిందు జూచుచు ,
దామార్గము నడచునది మతము వెలయుంగఁ॥ క॥ తానెరుగకుండియైనను।
హీనములగు జంతుగణము హింసించినచో । స్నానంబు చేసియప్పుడ ,
ప్రాణాయామంబులారు బరగింపదగుఁ॥ గీ॥ రేచకత్రయంబు రెట్టించి వే
దమోం , కారసహితముగ దగంగజదివి । వినియతిఁ జెలంగి

దినమొక్కఁడేకాంత । వాసుఁడగుచు నుండవలయు ద్విజుఁడు॥ వ. ఇట్లు సేయు నేని యజ్ఞానంబున హీనజంతువ్రల వధించిన పాపం బులు వాపికొనుచుండగు వెండియు॥ గీ. ప్రాణనిగ్రహంబు బాటించి యింద్రియం । బులనణంచి మననుమలము వాపి । కొనగవచ్చు నగ్ని నెనయించి గ్రాగింప । మలముకనకరేఖ దొలగునట్లు॥ సీ. వెల యుప్రాణాయామములచేతదోష సంఘములు దహించుచు గల్మష ములు । ధారణావశమున దలగించి సంసర్గమనఘు ప్రత్యాహారమునన ణంచి । పరమేశ్వరధ్యానపారీణవృత్తి జిదానందరసము దివ్యగతినించి। పురుషుండు సద్గతిబొరయు బ్రహ్మజ్ఞాననిష్ఠాపరతుండగు నిర్మలుండు । క ర్మబంధనమున గలగడుగాన జ। న్మరహితుండు విబుధ మాన్యతముడు । నతులుండు భవ్యుడమృతుండమేయుండు । నీశ్వరాశ్రయుండు విశ్వుడ యగు॥ గీ॥ హింసలేక నింద్రియేచ్ఛజెలంగక వేదవిహితకర్మవృత్తినడపి। తపముచేసి సూనృతవ్రతధారియై । నమృతపదము వడయు నార్యజను డు॥ క॥ నరములు మాంసమురక్త । స్ఫురణము కఫవాతవాంతి భూయి ష్ఠము న । శ్వరమునిరాలంబముగు । శరీరమునరుని కెట్లు శాశ్వతము భువిన్॥ ఉ॥ కావున బుద్ధిమంతుడొకకైవడికాలము జూచుచున్ నిమే । షావలివత్సరంబులుగ నాత్మదలంచి జగద్ధితంబుగా । పావనకర్మముల్ న డిపి భవ్యపదంబు విలీలబొందు ని । చ్ఛావిధ సంచరించునది చావుధృ వంబను భీతిగుందుచున్॥ క॥ పరగ తెరంగున నేచి యొ । సగురోగములు గ్రతవులి చందంబున దృ । ష్టిగతంబుగాక మృత్యువు । దెగనణపగజూ చుచుండుదివిని మనుష్యున్॥ క॥ గాన బహుభయాస్పదమగు , మేనిప యిన్ దీపుమాని మేదిని భవ్య । జ్ఞానావల బనస్థితి । మానవుడు చరిం పవలయు మానితులారా॥ గీ॥ పిట్టయిచ్చవిట్టి చెట్టువిడచిపోవు। కరణిపం డితుండు కాయ మిచ్చ । పుట్టినట్టవిడచిపోవునపండితు । డుంద్రభ్రమసి ముక్తి జెందకుండ॥ గీ॥ ఏటియొడ్డునున్న వృక్షమత్యధిక వి । స్తారభంగి పెరిగి సమయమెట్టు । వేమహాప్రవాహవేగవశంబున । గూలునట్లు బొలచు కజనువనుషు॥ గీ॥ పులిభయంబుదవిలియులుకు మనుష్యుండు ।

వేటకానిమరుగు వేగజొచ్చి । భయము వాయుపగిది ప్రాజ్ఞుండు జ్ఞాన
మా । శ్రయముగాగ మృత్యుభయము దొరగు॥ గీ॥ గ్రాహములు భ
యంబుగదుర జలాశయ । మ్మద్దవిడచి యుచ్చనరుగునట్లు । సజ్జనుండు
విడచు సంసారబంధన । మాత్మనెఱుకనూది యధిగమించి॥ గీ॥ నూత
వడినపురుషుడే తెరంగున నైన । నొడ్డుసేరయత్నమూదుభంగి । సజ్జనుం
డెఱింగి సంసారమోహంబు । వాయువలయు నొకయుపాయమూని
చ॥ మొనసియపారమైదగుసముద్రమునన్ వడినట్టివాడు దో । ననెగడి
యాదులాడుచు జసంగలడేదరికోడలేనిచో । వినుడటు నిత్యసంసరణ
వృత్తిజెలంగుచు శుద్ధకర్మము। లొనరించికాడుముక్తుడతివ్రుడగు జ్ఞానము
బూనకుండినన్॥ క॥ ఒరులకు తనవలనను తన । కొరులవలన భయము
గలుగకుండనడచు స । త్పురుషుండు దివిరిచిత్తము । పరమాత్ముని
యందు సతము బాటింపదగున్॥ క॥ ఎనసినవిజ్ఞానవశం । బున నిష్ప్ర
హాతన్ జెలంగు పురుషుడు నిత్యం । బును పరమానందరసా । బ్ధి నిమ
గ్నుండగు నతండనీరుండఖరయన్॥ గీ॥ రెంటువిడచిమూడు ఖండించినాలు
గు । నియతిజేర్చియైదు నిగ్రహించి । యారుగెలిచియొక్క డాశ్రి
యించినవాడు । నిత్యముక్తుడగునని బుధులు॥ క॥ జ్ఞానంబుగలిగి
భగవ । ధ్యానముగావించువాడు ధన్యుడు శుద్ధ । జ్ఞానముగలిగియు
భగవద్ధ్యానము లేకుండువాడధన్యుండు భువిన్॥ క॥ వేదాంతసారమె
రిగి స । మాదరగతిలోనయజ్ఞ మలరించి మమ । త్వాదులుడిగి బ్ర
హ్మముగను । పాదరసిభజింపవలయు బ్రహ్మఫణితులన్॥ క॥ జ్ఞానంబు
నకిది పాద । జ్ఞానంబునకిది నెలవని గడకనరసి బ్ర । హ్మానందరసజ్ఞుడు
గను । లోన సమస్తంబు నిశ్చలుండైమరియున్॥ క. ఏనరుడు యోగ
మార్గము । బూనిప్రవర్తించు విమలబోధాసార । శ్రీనిధియైయతడుప
రం । బైనపదవి బొరయు బాధనాములు వాయున్॥ గీ॥ మూటిలోన
నొకటి మూలంబుగాగొని । రెండునడుపనేర్చి పండితుండు । గాలుగింట
నొకటి బాలించి యిరునది । యారులోన బొరయునాప్తులార। క॥ ఏని
పుడు దేటపరచిన । యీనిర్మలవాక్యసరణి నెరిగింపుము వి । జ్ఞానావ

లంబనముగల । వానికి ఋషులార సెప్పవలదన్యునికిన్॥ క॥ ఏయది యొనరింపగ శా । స్త్రీయం బగునట్టి చెయువు సేయవలయు ధీ । ధ్యా యువు గోరినపురుషుడు । సేయవలదు నింద్యములగు సేత లోకప్రద్దన్॥ క. ఆశ్రమములలోనగృహ, స్థాశ్రమముత్యుత్తమం బనఘగతుడగు ప్రా । జ్ఞశ్రేష్ఠునికనిరిసమ । స్తశ్రుతిపారగులు శాస్త్రతతములుగుపు మెయిన్॥ క. కదలిమహాసాగరమున । నదులన్నియు నిలచుగతి గృహస్థాశ్రమ ము । దొదవిసమస్థాశ్రమములు । విదితములగు జుండులోక విప్రశుతులారా॥ గీ. నాలుగాశ్రమములు నడపినవాడయ్యు । నరుడు బోధిలేక బొరయు జాల । డమృతపదముబోధ యలవడిముక్తి భా । వంబు నెలయునట్టి వాని పగిది॥ గీ. బ్రాహ్మణోత్తముండు బాగంగ దశలక్ష । ణముల బొలచి

—*దశలక్షణప్రకారము*.—

యాశ్రమములునాల్గు। నడుపవలయునట్లు నడపినవాడు శా। శ్వతపదంబు వొరయజాలునిజము॥ గీ. ధృతియుశమము దమమునింద్రియనిగ్రహ । స్తేయసత్యశౌచ ధీబలములు । విద్యయునుననోపవృత్తియుననువివి । లక్ష ణములు పదియిలాతలమున॥ క. దశలక్షణ ధర్మంబులు । విశదంబుగన డపినట్టివిప్రుడు పరయున్ । యశమును తేజంబునునస । దృశలీలాసౌ ఖ్యగతు లమృతతత్వంబుల్॥ గీ. మరియుదశలక్షణములధర్మములునడపి, నియతివేదాంత మార్గంబు నెరిగమించి । సన్యసింపంగవలయు సన్మా న్యతముడు । బ్రాహ్మణోత్తముడాప్త పరాయణుండు॥ గీ. సన్యసించితె రవుసాధించిమోహాంబు । దూరమొగయ జిమ్మిసారమతియు । సంగబా లచి బంధనమువాసిసుఖలీల । గడుపవలయుబ్రదుకుకాలమెల్ల॥ క. తా నంతకుపూర్వంబ । జ్ఞానంబున జేసినట్టికలుషవ్రజముల్ , భూనుతమతి వాపికొనం । గానేర్చున్ సన్యసించి ఘనుడురుప్రీమెయిన్॥ గీ. బ్రాహ్మ ణుండుసేయబరగిన నాల్గుధ । ర్మములవిధమువిూకు సముచితముగ । నెలుగబల్కితింకనృపతి ధర్మంబులు । తేటపరతువినుడు ధీరులార॥ వ॥ అనిచెప్పెనని.

ఉ. శ్రీయుతసర్వలోకమయు చిన్మయతత్త్వ విలాస మాదినా
రాయణదీనజీవన పరాయణ సాధుజనైక వేద్య దీ
ప్తాయుతభక్తహృత్కమల సౌధ విహారవినోదసంతత
స్థాయమహాత్మ్యభవ్యపరిపాక కళాఘక సిద్ధ్వయస్థితా.

క. పరమాణుమాత్ర భావ్య
ద్విరమాధికదృశ్యపంచ వింశతితత్త్వ
స్ఫురితప్రకారభాసుర
పరమనిధి సమాభిధేయ పండితగేయా.

మాలిని. సదమలశుభమూర్తీ సాధురక్షప్రవర్తీ
త్రిదశవినుతకీర్తీ దివ్యబోధాప్రపూర్తీ
ముదితసుజనవర్గా మూల తత్త్వావిసర్గా
హృదయగతత్రివర్గా హేలభావాధదుర్గా.

గద్య.

ఇది శ్రీమత్పరమేశ్వర లీలా విచిత్ర ప్రపంచ సేవాపాత్ర శ్రీమద్భాగపురెడ్డి
పాపినాయక పుత్ర నిఖిలబుధజనవిధేయ యప్పలనాయక
నామధేయ ప్రణీతంబైన శ్రీమదాంధ్ర మనుధర్మ
శాస్త్రంబునందు షష్ఠాధ్యాయమ్
సంపూర్ణమ్.





శ్రీ ర స్తు.

శ్రీమద్వితీయరామకృష్ణపరమహంససద్గురుస్వామి నేనమః.

# శ్రీమదాంధ్ర మనుధర్మశాస్త్రము.



## స ప్త మో ధ్యా య ము.

శ్రీసచ్చిన్మయతత్త్వవి । లాసాజగదాది పురుషలాలితభక్తా । గ్రేసర వరనిగమవేద । వ్యాసార్చిత భూతభావనా పరమేశా॥ వ. దేవా యవధరింపుము మహర్షి సమాజంబులతో భృగుమహర్షీంద్రుం డిట్లనియె।

— * రాజానతారప్రకారము * —

క. ఏయది సేయుట నరపతి । యాయువు తేజంబు బలము నైశ్వర్యకళా । శ్రేయస్సిద్ధులు వడయుప । దాయది యెఱింగింతు వినుడు తాపసులారా॥ వ. అని పల్కి మఱియు నిట్లనియె॥ గీ. బ్రాహ్మణాది సమస్తవర్ణములవార । లురుకనాచారమును ధర్మముడుగకుండ । నాగి శాసించుటను నృపుడవిదగంగ । జేసినట్టి ఫలప్రాప్తి జెందు నిజము॥ సీ. శాసింపగలుగు రాజన్యుండు లేనిచో జగము సమస్తంబు చంచ మెడలి, బహుళసంకుల భయాస్పద మగుగావున కరమర్థిలోకరక్షణము సేయు । రాజు గల్పించె నా బ్రహ్మదేవుం డింద్రయమశశి సూర్యవహ్న్యఃపతిధన । పతులసారాంశంబు లతిశయంబుగ గూర్చి యమరేశ్వరాదుల యంశములు జె । లంగు నేగతి నృపతి విలాసములయి । భూతకోటుల తేజముల్ బొరయు నట్లు । పార్థివుని సూర్యునిగాలె నృపాలుడెల్ల । యెడలగనుచు దపించు నిజ్జగంబు॥ క. స్ఫురితప్రతాపలీలా । పరిణామము జెలగి సూర్యుపగిది వెలయు భూ । వరుని ముందు మొగముగన నె । వ్వరు శక్తులు జక్కని లచివసుధ నరయగా॥ గీ. అగ్నియును వాయువును శశియుర్కుడును

కు । బేరుడును వరుణదేవుండును పితృపతియు న । తండయగునృపతి
యమ్మహాత్ముండ నిత్య । నిర్మలుండు జగత్పతిధర్మకర్త॥ క. మనుజుండీ
తండెవ్వం । డని బాలుండయ్యును నృపతిననవమానింపఁ । జనదతఁడుమ
ర్త్యరూపం । బునబొల్చిన దేవతాప్రభువుజుండు భువినిఁ॥ చ. అనల
మునిర్దహించువినుడంటిన నొక్కమనుష్యుదీప్తమై । జనపతికోపవహ్ని
నిమిషంబున గాల్పగనోపునెగ్గుచే । సినసరుపుత్రమిత్ర ధనసీమవధూ
గృహాసర్వవిత్తవ । స్తునిచయమొక్కతూటున బుధు డిదియూహిసిసేయ
డెగ్గులఁ॥ గీ కార్యసాధనములు గాంచుచుమరిదేశ । కాలతత్త్వములు
దగంగధర్మ । సిద్ధికొఱకునృపుడుసేయు శాసనము ని । ష్పాపవృత్తి విశ్వ
రూపుడు బలె॥ చ. సముచితవృత్తినెవ్వని ప్రసాదవశంబున లక్ష్మియుఁ
పరా । క్రమముజయంబునింపలగగాంచునెకండు మహోక్కటోడకు ।
క్కమిగిలిజేసియోఘునుని కోపవశంబునజచ్చునట్టి ధ । ర్మమయ శరీరు
డుత్తముడు రాజును నీశ్వరుడెట్లు వేరగుఁ॥ తోదకవృత్తము॥ ఎఱుగ
కనట్టి మహీపతితో ను । క్కఅపగవ్టినయాతడు జచ్చుఁ । బఱచి
జెలంగినపార్థివుకోపం । బఱిముఱిగాదెట్లట్లొనరించుఁ॥ మదనవృత్త
ము॥ భూపాలుడారసి సదాబుధులెల్లమెచ్చం । గాపాపపుణ్యములు
వేగనిశాస్త్రబోధా । వ్యాపారిమున్నతిదగఁ వలయుఁ ప్రసండా ।
టోపంబు జూపగ ఖలుండుసఖుండునైనఁ॥ క॥ ఒనరంగ సర్వభూ
తము । లనిశంబుయథాసుఖాప్తి నలరిజెలంగఁ । జనపతికి నొసగెనీశ్వ
రు । డనుపమతేజోవిశిష్టమగుదండంబుఁ॥ పంచచామరవృత్తము॥
ధరాధిపుండు దేశకాలతత్త్వమార్గముల్ నిరం । తరంబు జూపుచుఁ
సమస్తతంత్రసాధనజ్ఞుడై । తిరంబుదక్కి ధర్మమార్గ దీక్షబూనకుండు
ము । ష్కరాళిదండనంబు సేయగానగుఁ మహాదశల్॥ క. నర
పాలకు భీతిచరా । చరచేతనకోట్లు నిత్య సంతోషగతుల్ । వొర
యు నిజధర్మపథములః । దొరగక సామీప్యమందు దూరమునందుఁ॥
క. పురుషుండు శాశకుడు క । ర్మరతుడు దండధరుడనగ రాజువెలయు
నీ । శ్వరుడు చతురాశ్రమములకు । నరయంగానతడధర్మ ములవడుక

తనర్॥ గీ. ప్రజలనందర దండంబు బరగఁజేయు। శాస్త్రియైమరియురక్షిం
చు సంతతంబు। జాగరూకతనుండిన సమయమందు। నిద్రబొందినయ
పుడును నిశ్చలాప్తి॥ నరపాలకుదండము ధ। ర్మరతులగు మనుజులనెల్ల

—*రాజదండప్రకారము.*—

రంజిలఁజేయుఁ। నిరతము నాశముసేయుఁ। దురితరతుల భీతినెందు
దూరినసైరఁ॥ క. బలముసెడి నృపుఁడుదండము। వెలయింపకనున్న న
దను వేచిదివిరి దు। ర్బలుర బలవంతులణఁతురు। బొలియింతురుమీాల
శూలమునగ్రుచ్చుగతిఁ॥ గీ. అరయుకాకిపురోడాశమాహరించు। కు
క్క గుడుచు హవిస్సు పెంపెక్కియాగ। ములనరేంద్రుండు దండం
బు వెలయఁజేయ। కున్న శూద్రులు విప్రుల నోలియణచు॥ మానినీవృ
త్తము॥ కావునదండము గైకొని రాజుజగంబలరించుట ముఖ్యముభూ।
తావలినైజముతైనపథంబుల నంచితమాఢిమెలంగి సుఖ। శ్రీవెలయంగ
రహించునరాఘపుసేతలభీతిలి దీక్షుదగం। గావిభుడట్టివిధంబెనయించు
ట గాంచు మహాసుఖసందలఁ॥ చ. నరపతిసేయుదండము భయంబెన
యింపగనెల్లవారలున్। పరమనిధానమైవెలయు పద్ధతివాయరు గావు
నఁచరా, చరబహుజంతుజాలములు సంతసమారసుఖించుదానను।
ర్వ్యరఘలితార్థమైవెలయు వర్షములఁగురియింతురాసురల్॥ గీ. వాయు
దేవునివలన పావకునివలన। జలజహితువలన నింద్రునివలన భూత।
గణములవలన నుగ్రపుఘనులవలన। భయముబొరయదు దండంబుబర
గునెడల॥ గీ. దండము ఉకపాడిదప్పిన సర్వవ। ర్ణములు దూషితముల
గుమరిదివుట। మేరలేకప్రజలు మెలగుదుర్విచ్చ వ। చ్చిన తెరంగులను
నశించుజగము॥ గీ. శ్యామవర్ణంబులోహితాక్షుంబునగుచు। దండ
మెక్కడమెలగు నుద్దండభంగి। నచ్చటిజైనంబులెల్ల నవ్యాకులాత్మ।
లగుచుసుఖముందుదురు నీతిదగిసతంబు॥ ఉ. సత్యముతేజముఁ బలము
శాంతము శౌచముధర్మశాస్త్ర పాం। డిత్యము వేదముల్దగబఠించు
టయుఁ ధృతిశక్తియార్యసాం, గత్యముతర్కవాదమును గల్గినపార్థివ
సింహముక్కఁట। నిత్యముదండనంబు వెలయింపసమర్థుఁడుదేవుడార

యర్॥ క. అమరంగనృపతి ధర్మప, థంబుదప్పక సముచితమగు దం, డము సేయం । గ మహీతలమంతయు వెల, యు మహాసౌఖ్యాభివృద్ధు లొనగూడంగ౯॥ చ. అనుచితవర్తనంబు పరిహాసము చుల్కదనంబు నిచ్చమె, చ్చని విషయాభిలాషయు నసారవిచారము సాధులోకపీ । డనిరతిఘోరకృత్యము విడంబనముగల్గుమహీశ్వరుండు దం, డనమొన రింపగాడు విగటంబగునట్లొనరించు నేనియు౯॥ క. జనపాలుడు దుర్మతి దం । డనమొనరింపంగ బూనుటవినాశము బొం । దునతని ప్రజలందరు తీ । రనిదుఃఖమునాపదలు బొరయుదురుమిగుల౯॥ క. తగునిదితగదిది యనిమది, వగచిక దాదండనంబవశ్యముసేయ౯, తగునృపతికట్లుగాక నె । సగియిచ్ఛలు సేయుబెట్టి చందముననగు౯॥ గీ॥ తగనిదండనంబ ధర్మతత్పరబుద్ధి, నృపతిసేయునేని నిశ్చయముగ । పుత్రపౌత్రబంధుమి త్రభృత్యపరిజ, నములతోడగడు వినాశనమగు॥ క. నరపతిదుర్గరాష్ట్ర ము । పరిచారకగణము నశ్యభావమువొరయు౯ । దిరుగుడువడుపితృ వర్గము । సురలుబుషులు దండనంబశోభనమైన౯॥ క. హితులును మంత్రులు సేనా । పతులు పురోహితులు నిష్టపరిచారకులో । క్క తెగువ దన్నువిడువగ గు।మతియూనరపాలుడు సెడుమాన్యత్వగతుల్॥ ఉ శౌచమునాప్తవర్గమును సత్యము నిద్ధసహాయమార్య సే । వాచ రణంబుబేర్మి చతురంగబలంబులుశాస్త్రశుద్ధి యా । లోచనశక్తిగల్గి తనులోకముమెచ్చగదండనంబు వి । ద్యాచతురుండు పార్థివుడొనర్చుట సర్వజగద్ధితంబగు౯॥ మ. కలయంగాతనరాష్ట్రమందు నహితోర్వీ పాలకుల్ పెక్కుభం । గులయత్నంబులు సేయుచాన్ప్వరిగి యుగ్రుండై ప్రతాపంబు మి । క్కిలిజూపించి వశంబుచేసికొని యేకీభావము౯బొం దివా । రలతోడ౯ విహరించుటొప్పగు సజాగ్రద్వృత్తివాటిల్లగ౯॥ క. పరిశుద్ధాంతఃకరణులు । పరహితసత్కార్యరతులు బ్రహ్మజ్ఞాన । స్థి రమూర్తులొకప్పుడుగుక । పొరపడిగావించుదోషములు గావనగు౯॥ క. జలమందు తైలబిందువు । లులిమిసెడక వెలయుపగిదినూర్జిత సత్కీ ర్తిలసితుడైభావింప౯ । వలయునృపుడు రాష్ట్రమనుచితవర్తనముదగ౯॥

క. కోశత్రయమైననుబా । హాశక్తిదొలంగినను మహాసంతోష, శ్రీ
శిష్టత్వము వెలయ మ । హీశుడుధర్మంబుసెడక నెలమిమనదగున్॥
క. విపరీతకర్మరుండగు । నృపాలునికీర్తిదినము గృశతబొరయుశా । దు
పరమసూత్రముజలముల । ప్రపడియుడంగుఘృతబిందువుగ బోలెకడున్
చ. తమతమ ధర్మమార్గములు దప్పకనుండు తెరంగుసర్వవ। ర్ణములకు
నాశ్రమంబులకునైజముగా గనుపట్టినట్టి చం। దమునన్నృపుండుశాసన
ముదాత్తమతంబునసేయుటొప్పు దా । నమహితకీర్తివైభవమహాసుఖ
హేతువదోన్నతొండగున్॥ క. ఏమహనీయులగొలచి మ । హామతి

—*రాజమహాసభ్యజన ప్రకారము.*—

మంతుడయి నృపతియాయుస్సద్వి । ద్యామాన్యపదమువడయు మ ।
హామునులార వినుడాజనంబులతెరవ్రుల్॥ క. వేదములుమూడుజదివిస।
మాదరగతివిప్పిసెప్పనగు విప్రుల వి । ద్యాదయతులగొలువందగు ।
మేదురసత్కీర్తినృపుడ మేయచరితుడై॥ వ. ఇట్లుసేవించి॥ క. వారలివి
సేయుమయ్య మ । హీరమణాయనుచు జెప్పనేపనులవి స । ద్గౌరవ
రతిసేయవలయు । సారవిచారుడగు నృపుడసంశయమతియై॥ క. జ్ఞానవ
యోవృద్ధులు స । న్మానార్హులు వేదవిదులు మహితమతులసం । గానెగ
డినబ్రాహ్మణుల మ। హీనాధుడుగొల్వవలయు నిర్మలమతియై॥ క. వార
లయొడవినయంబును । గౌరవమునుజూపి మెలగగానగుపతినో। ష్ఠీరతియ
ట్లునడచిన మ।హీరమణుడుబడయు నిజమనేకశుభంబుల్॥ క. ఘనులగు
విప్రోత్తముల క।వినయముగావించి చెడిరివిభవాయుస్సు।ధనరాష్ట్రదుర్గ
హితపరి। జనములతోమున్నునృపులసంఖ్యాకులిలన్॥ క॥ నిమియుసుదా
సుడు నహుషుడు। సుముఖుడు వేనుండు బలయశోవిభవసమ । గ్రమ
హీపాలురువిప్రో । త్తములకవి నయంబుజేసి దరిగిరనేకుల్॥ క. మను
వునుపృథునును రాజ్యము। లను ధనధుండధికవిభవ లక్ష్మియుబ్రా
హ్మణ్యం । బనఘుడు విశ్వామిత్రుడు । వినయంబున బడసిరెల్ల విప్రులార
యగన్॥ గీ మూడువిద్యలు తర్కంబమూల్యవిద్య । దండనీతియు లో
కవార్తావిశేష । సారతరమార్గములు ధరిత్రీరమణు డ । పారమతిశిద్ధియు

ను మున్న బడయవలయు॥ క. వెలయంగా సర్వేంద్రియ । ములగెలచి సమర్థుడైన భూపతియేలన్ । గలడుమహీతలమంతయు । గొలుతురు ప్రజలెల్లనతని కుతుకంబలరన్॥ సీ. వసుధాధి నాథుండవశ్యంబుయ త్నించి చెలరేగుకామజంబులు పదియును । క్రోధజాష్టకమును గోసిని వర్జించునది కామజవ్యసనంబులందు । నభిరుచి గల్గిన నర్థధర్మంబులు గోల్పడుమానక. కోపజముల । సంగతిబొరసి నాశనమగు వేటయు జూ దమప్రియపరివాదనంబు । బవల నిద్రించుటయు నాటపాటలందు, ద గులమియు దుర్మదంబశుద్ధరసపాన । మంగనా సంగమంబు వృథాతురత్వ। మనునివియ కామజములు రెండైదులుర్వి॥ గీ. సాహసంబు నసూయయు ద్రోహమీర్ష్య । యర్థహారణంబు పైశున్య మధికపరుష । భాషణంబు లు గర్వంబుబరగు క్రోధ । జాష్టకంబన నివితపోత్కృష్టులార॥ క. కామ క్రోధజములు ది । నేమంకజయింపగలుగునేని యణగు ను । ద్దామం బగు లోభంబది, బోమాన్యతముండగున్ నృపుడు ఋషులారా॥ గీ. పానమునుజూదమును మృగయానిరతియు, కామినీసంగమంబును కా మజముల । లోన కష్టతరంబులు హీనములు ని । రంతరాపన్నిలయములు నరయనాల్గు॥ క. పరుషములగు వచనంబులు । పరధనహారణంబుదండ పాతనమీమూ । డిరువుర క్రోధజములలో । గురుకష్టతరములు వేద కోవిదులారా॥ క. కామక్రోధజములను । ద్దామవ్యసనార్థము లనదగు నియ్యేడున్ । భూమిపుడువిసర్జించి ని । రామయచిత్తుండు గాత్రతుష్టి వెల యదగున్॥ గీ. కష్టములు మరణములును నికృష్టమార్గ । ములునధో గతులును దుఃఖములునువారయు । నరులు దుర్వ్యసనముల మనములు దివిచి । రేనినవిమాన్పికొను బుధులైనవారు॥ సీ శాస్త్రవేదుల శుద్ధ జాతిసంభవుల వృద్ధజనసేవా విశుద్ధవ్రతప్ర । ధానకర్మఠుల శస్త్రధర వర్యుల శూరులయశోవిశాల విలాసగతుల । సచివులగూర్పంగ జను

—*రాజసచివ వర్గ ప్రకారము.*—

నేడువురనైన నార్వురనైనన రాధిపుండు । పలువుర చేనగు పనులొక్క రుండెట్లు సేయుంవాడెంతయుపాయవేది । యైననదిగాన పార్థివుండధికస

చివ| సంయుతంబుగ బనులెల్లజక్క జేసి , కొనునదియవశ్యమని తొల్లి
మనువుజెప్పె| రాజధర్మార్థవేదిభూరమణులువిన|| గీ. సంధివిగ్రహములు
సముదయస్థానముల్, గుప్తలబ్ధములునిగూఢములు న| రాధిపుండు స
చివులందరితోడనో | చించివలసినట్లు సేయవలయు|| వ. మఱియు నె
ద్దియేని కార్యంబు సేయవలసివచ్చినప్పుడు నృపాలుండది సచివులందర
తో నెఱింగించి మీఁదిది జక్కగావిచారించి యేకాంతంబున నొక్క
రొకరు నాకు తేటపఱుపవలయు జుండీయని రెండుగడియలు తానాగి వా
రలదివిచారించినపిదప రహస్యంబున నొక్కొక్కరి యభిప్రాయంబులర
సియందుల బలిష్ఠసారాంశంబు గొని యప్పనిదప్పకనడుప వలయు సచి
వులందరయభిప్రాయంబులు పరస్పరవిరుద్ధంబులగు నేని తానును వారు
నుసముచిత చర్చావిశేషంబులు జరపి మేలైనదియు గీడైనదియు దెలిసి
కొనవలయునని సెప్పివెండియు నిట్లనియె. గీ బ్రాహ్మణుండు శాస్త్ర
పారంగతుడు షడ్గు| ణాశ్రయుండు సచివులందునొక్క | డెల్లసెప్పద
గనరేంద్రుడవశ్యంబు | నట్లుసేయవలయు ననిరి బుధులు|| శా. సత్యా
ర్థాదివితర్కవాదులు మనీషాపాగరుల్ స్వార్జితా | ర్థత్యాగుల్ సుపరీ
క్షకుల్ వినయవిద్యామాన్యులైనట్టి వా, రత్యంతంబు సమర్థులై నెగడు
కార్యాకార్యవేదుల్ సదా | మాత్యుల్ వారలతోడజెప్పునది సామా
న్యంబుగా యత్నముల్|| సీ. అర్థార్జనమున సమర్థుండు గంభీరుడగు వా
నినర్థకోశాదులందు | నోపికగలవాడు నుత్తముండగువాని ధాన్యాది
సంగ్రహార్థంబులందు | నియతేంద్రియుండు వినయభయశీలుండు నగు
వానినంతర్గృహంబులందు ! పరిచయంబును ననుభవమునుగలవానిహ
స్త్యశ్వగోగణ మరయుటందు | నధికశూరుని శస్త్రాలయంబులందు ,
మానితోపాయవేది నాస్థానమందు | నిలుపునదితద్దభివృద్ధి తెలమి
బాదల| పార్థివుండు శ్రద్ధాగుణాభవ్యతముడు|| మ. అనురక్తుండతికౌశ
లుండు శుచికార్యాకార్య జ్ఞానకుం| డునిరస్తవ్యసనాభిలాషి స్మృత
కుండుర్ నింగితాకారచే | ష్టనిరూఢజ్ఞుడు. సాధుశీలుడు వపుష్మంతుండు
ధీరుండుశో | భనచారిత్రుడునైనదూత ధరణీపాలుండు గూర్పంజనుర్||

క. భూపతికిదూతయును సే । నాపతియు నమాత్యుడును ధనగృహవిని
యుత । వ్యాపారియు సచివులును స । దాపరిచయరతులుగాగ దగున
నిరిబుధుల్. సీ. వినియతంబుగసంధి విగ్రహములలోన నేయదిపూర్వం
బు సేయవలయు। నదిజక్క జేయ ధరాధినాధుడుబన్ప నతివేగమున దూ
తయరిగి శత్రు । రాజులతోడగౌరవము వాయక తనయేలిక జెప్పిన వెల్ల జె
ప్పి । యాసమయోచితమైన మాటలుకొన్ని ధర్మమాత్రములుగ దాను
బలికి । వారలేమను వారలవడువులెన్ని, యవిసమగ్రంబుగా తనయా
త్మనెరిగి । మరచిపోవక వెరువక బరచివచ్చి । సెప్పవలయునృపునితో
డ సేమమరసి॥ చ. జనపతిదూతజెప్పినవి సభ్యులతోనెరిగించి వారి లే।
మనునొకభంగినందరు గ్రమంబునదా నదిచర్చజేసి సే, యునదియు సే
యకుండునదియున్ నిరువారగ నిశ్చయించి మం । తనమున సెప్పగావ
లయు దాచకమంత్రులతోహితంబుగన్॥ ఉ స్వాదుజలప్రవాహమును
సస్యసమృద్ధికరంబు నిత్య వృ । ద్ధ్యోదయ హేతుభూతమును యోగ్య

—*రాజదుర్గ నిర్మాణ ప్రకారము.*—

ము నార్యసనాతనంబర, ణ్యాదివిలాస శిష్టతరమై దగుజాంగల దే
శమందు ను, న్నోదయతుండు దుర్గమొనరించి వసించుట జాలమే
లగున్॥ వ. మరియు పంచయోజనా యతంబుగా చతుర్దిక్కుల
యందును మనోహరంబగు మధ్యప్రదేశంబును పాషాణంబులచేతనైన
నిష్టకంబులతోడనైన నిర్మింపబడి గవాక్షావరణవిశాలంబును దృఢంబు
నుబాహ్రెండు చేతులపొడవునుమీాద నడువదగినదనియు నగు కోటయును
బహ్వగాధజలావరణంబును బహిఃప్రదేశంబాక యోజనమాత్రంబున
దట్టంబులు కంటకితంబులునగు మహావృక్షగుల్మలతాతృణ నీరంధ్రభ
యంకరంబును హస్త్యశ్వరథసమన్వితబహుపదాతివర్గరక్షితంబును గిరి
దుర్గంబునగు మధ్యప్రదేశంబున పురంబు నిర్మించి యందువసింపవలయు
ధనుర్దుర్గంబు మృగంబులకును మహీదుర్గంబు గర్తాశ్రయంబులగు మూ
షకాదులకును జలదుర్గంబు నక్రగ్రాహాదివారి చరంబులకును వృక్షదు
ర్గంబు శాఖామృగాదులకును నరదుర్గంబు మనుష్యులకును గిరిదుర్గంబు

సురలకును సదాశ్రయభూతంబులై యుండు నీదుర్గంబులలో దేవతాశ్ర
యంబును శత్రువులు ప్రాకరానిదియునగు గిరిదుర్గంబుత్తమంబని సె
ప్పి మఱియు నిట్లనియె॥ గీ. దుర్గములనాశ్రయించి సంతోషమలరు । ఖ
గమృగాదులు నెఱి వేటకాండ్రవలన । భయముఁబొరయని పగిది భూభర్త
పగర । కనువుగాఁడు దుర్గంబులనాశ్రయించి॥ గీ. ఒకఁడు ధనువుఁబూని
యుద్ధతిసాలస్థు । డైదెరల్చు పగరనాఁగి చంపు । నూరువురమఁగియు ధను
ర్ధరుల్ నూర్వురు । దశసహస్రపగ వితతులఁగూల్చు॥ వ. కావున॥ క॥ అ
నుపమవివిధాయుధవా । హనసము పేతంబు శిల్పినైపుణ్యంబున్ । ధన
ధాన్యవస్తుశోభన । మునునగు దుర్గంబు రాజ్యముఖ్యునికొప్పున్॥ క. జ
లములు ననేకతరువులు । గలిగి సుపర్యాప్తమై ప్రకాశింపుచు ని । ర్మల
మతిగోప్యంబును నగు । నిలయము దుర్గాంతరమున నృపునకు వలయున్॥
క. ఆగృహమున నివసించి మ । హాగుణవతి రూపలక్షణాన్వితనిత్య । శ్రీ
గరిమ సతి లసన్మతి । పూఁగవరింపన్వలయు నృపుఁడు శమశీలన్॥ క. ఋత్వి
జులఁ బురోహితుల మ । హాత్మ్యాపాదకుల నిర్మలాత్ములఁగొని స । త్తత్వ
ప్రసిద్ధిదగ గ । ర్తృత్వంబున సేయుచది సుకృతకర్మంబుల్॥ భుజంగప్ర
యాతము॥ నరేంద్రుండు పెంపారి యాగంబులత్యా । దరంబున్ జెలం
గన్ సదాశ్లాఘ్యభూతిన్ । ధరాదేవతప్రీతి దస్ఫూర్తిసేయన్ । సు
రల్ మెచ్చు దానన్ విశుద్ధాప్తిఁ గొల్చున్॥ చ. ధనము ననేకవస్తువులు
ధర్మముగోరి సతంబు దీన జీ । వనులకు నగ్రజన్ములకవశ్యమొసంగుట
యున్ తదాప్తిహా । యనమున కొక్కసారి ప్రజలందరు పుత్రులుగాఁద
లంచి వ । స్తునిచయ ధాన్యజాతులు విశుద్ధత నిచ్చుటయున్ మతంబగున్॥
క. భూదయతుఁ డక్కడక్కడ । మేదుర విద్యాయశో సమేతుల నినుపం।
గాదగు నధ్యక్షులుగా । సాదరమతి ధర్మమతి ప్రశస్తముగాఁగన్॥ క. వేద
జ్ఞులు మతిమంతులు । సాదరణీయులు మహావిషయశీలురనం । గాద
గు బ్రాహ్మణులకు ధా । న్యాదులొసఁగి పూజలు సేయుటర్వాముపతికిన్॥

—*రాజాశ్రిత మహా బ్రాహ్మణజనపాత్ర విశేషము.*—

క. వారలు బ్రాహ్మణ్యముగల । వారలగుట బ్రహ్మదేవువడువగుగా

వర్ | భూరమణునినిధులెల్ల న | పారము లక్షయము లగు సభాసదులా, రా॥ క॥ ఎనసినయానిధులన్నియు | గనరాఫు వినాశనములు గావుహరింపం| గ నగయుతస్కంరశాత్రవ | జనములకదిగాన నృపతిజనునటుసేయర్॥ గీ ॥అగ్నిహోత్రంబునందు బ్రాహ్మణునిముఖము | నందునిడిన పదార్థంబులరయుచెడవు | బాధితంబులుగానెందు బడవొకప్డు , నింత గావునవిప్రునికీగుటరువు॥ వ॥ సామాన్యబ్రాహ్మణునియందు సమంబుగను బ్రాహ్మణబ్రువునందుద్విగుణంబుగను బ్రాధీతునియందు వేయి మడుంగులుగను వేదపారగునందు ననంతంబుగను దానంబువెలయుచుండు॥ క. పాత్రమెరిగిశ్రద్ధారతి|మైత్రికరణశుద్ధిజేసినట్టి సుదానం| బేత్రైలోక్య హితంబును , పాత్రమునగునల్పమయ్యు ఫలబహుళంబై॥ క. సముడైనన త్యధికుడైన మహీపతిగదసి బహుజనముతో తను యు | ద్ధమునకు బిలువంగ ప్రజా | సముదాయముతోడ వెళల జనునుగ్రుండై॥ క. క్షాత్రంబగుధర్మంబతి | పాత్రంబుగనిర్వహించి ప్రజలనుచితమా | గత్రయరంజితభూతిర్ | ధాత్రీపతిబోవవలయు తం డ్రివిధమునర్॥ క. అన్యోన్యవధాపేక్షులు | మాన్యములై వెలయనొక్క మాడ్కిదివిని రా | జన్యుల నిచేసిమృతులై | ధన్యులగుదురమరసేవితస్వాప్తి మెయిర్॥ గీ. కర్ణిరూపంబులగు ఫలకంబులగ్ని | దీప్తఫలకంబులుచు విషదిగ్ధశరము | లధిక కూటాయుధములు బెంపరధరించి | యుద్ధమునశాత్రవుల నేయుటొప్పదరయు॥ సీ. స్యందనంబుడిగి భూస్థలరూఢుడగువాని పడినకొప్పుతోడ వెడలువాని | జేతులుజోడించి భీతిదూరినవాని నాసీనుడగువానినయ్యనన్ను | గావవేయనువాని గంపమొందినవాని పందునివిగతాస్త్ర శస్త్రమూర్తి | నిద్రబొందినవాని నిష్వొరపడువాని నార్తుదిగంబరుమూర్తి మాత్రు | నోడిపరచువాని యుద్ధంబుమానిన | వానినేయగాదుమానకుటుక | నేయువాడుబొరయ నెంతయుదుర్గతుల్ | క్షాత్రధర్మ మప్రశస్తమునగు॥ గీ. భీతివణకిపరాఙ్ముఖుడై తొలంగు | వానినేసినపాపంబు సుమతీశ్వ , రునకు బ్రాపించు నెంతనిరూఢివెలయ | నది యెరింగింతు వినుడు మహాత్ములార॥ క. ఏనృపతి భటుడుయుద్ధము | మానివె

అచి బలిచుశత్రుమనుజ పతిభటుల్ । మానక వధించు దెగవున । నా నృపతి వినాశమగు జయమయినను తుదిల్॥ వ. మఱియు నేరాజభటుం డు నిరాయుధుండై శాత్రవరాజన్యుని భటునిచే వధింపంబడు నాన రేంద్రుం డవ్విరోధ మహీపాలుని సుకృతంబులుగొని తనపాపంబులత ని కొసంగువాడగు నిట్లయ్యుభయసైన్యంబులంగల భటులును పు ణ్యాపాపంబులు వొందయుదురని చెప్పి మరియు నిట్లనియె॥ చ. నరపతి ధర్మసంగరమునన్ బరిమార్చు గడంక పెంపుమై । పరనరపాలు నెవ్వడ నపాయత నాతడు బొందునమ్మహీ । శ్వరుసకలార్థముల్ విపుల సైన్య పు రాజ్యము మాన్యభూతిగా । న రణమునందు దెంపును మహాభుజశ క్తియు జూపుటొప్పగున్॥ శా. భూపాలుండురణంబులోన గడు తెంపున్ బెంపునుత్సాహమున్ । కోపాటోపము సాహసంబు బలమున్ గ్రూ రత్వమున్ ధైర్యమున్ । జూపింపందగు నిచ్చలుండగుచు నీచుండైద గన్ ప్రాణమున్ ! డాపంబోలదు డాచెనేనియును కష్టంబుల్ విప త్తుల్ గనున్॥ క. క్షత్రియుడుధర్మయుద్ధము। పాత్రంబుగ జేయునట్టిపలు భంగులు సన్మాత్రంబులుగా జెప్పితి । పాత్రతమస్ఫురితదివ్య భావితు లారా॥ గీ. అజితులైనపగర నాగిజయింప ను। పేక్ష సేయుటయు జయిం పబడిన। రాజ్యములుదగంగ రక్షించికొనుటయు । వృద్ధిసేయుటయును నృపతిపనులు॥ గీ. వృద్ధిసేయబడి యనేకపదార్థవి। రాజమానమైన రా జ్యమందు । పేదవారలకును పీడితులకును । ధనములొసగవలయుసుమత

—*రాజావశ్యోపాయవిధులు.*—

ముదగ॥ మణిరంగవృత్తము॥ ఈచతుర్విధులెవ్వడు సేయున్ । వాచకుండున వశ్యము రాజై । ట్లాచియైననయాప్తిగనాతం। డేచునెట్టిమహీశ్వరుడైనన్॥ వనమయూరవృత్తము॥ గౌరవముదాత్తముగ గావనగుతన్నున్ , జేరి కొనినిత్యము వశీకృతుడునై యొ , ప్పారుపగరాజు మఱియాతడును దానున్ । స్వైరరతి నుండుటయు శాస్త్రిమతముర్విన్ ॥ భద్రకవృత్త ము ॥ శాంతిబొందిజెలంగియున్ । స్వాంతమందు నొకింతను । ద్దాంతకో పముబూనుట। త్యంతకార్యమువైరిపై ॥ ఇంద్రవంశస్థవృత్తము॥ జాగ్ర

ధ్విచ్ఛాదంబునిశంబు యోగ్యమా। త్రగాత్రిహ్యమైనసౌఖ్య పదంబుధారు
ణీ। శ్రీగ్రామశతిఁ బొందగసంభ్రమాప్తిమై। యగ్రస్థితిఁ జేయునయంబు
నొప్పగుఁ॥ క॥ పౌరుషమలరించుటయు। నపారంబగుబలముగూర్చ పాటు
పడుటయుఁ। వైరినృపతులవధింపం। గారణమున కేగుటయును ఘన
మునృపతికిఁ॥ క॥ జనపతినిత్యము దండము। గొనిపగరనణంచిజయము
గూర్చికొనిన జే। తనకోటులువశములునై। యనుపమసౌఖ్యంబుగను
మహాశయులారా॥ క॥ మాయారతివాటింప కు। పాయజ్ఞుండగుచునీతి
పథమెయ్యెడలఁ। బాయకశత్రునృపాలుర। మాయలెఱిగి పార్థివుండు
మనుటొప్పునిలఁ॥ క॥ కమఠంబుదివ్వుట సకలాం। గములునుగుదియిం
చియుడరుగాచికొనెడిచం। దమునన్నృపాలుండుపరా। క్రమమొకపన్ని
దమ్ముపన్ని గాచికొనదగుఁ॥ గీ॥ కొంగబలెనిష్టసిద్ధులుగూర్చిచింత।
సేయుటయు నాక్రమించుచు సింగముబలె। నాచుటయువృతముబలె
తరివేచుటయు శ। శంబుబలెన్నృపతి యడరునజనుటయు దగు॥ క॥ ఈ
పగిదిమపాయజ్ఞం। డైపరరాజుల జయించి యనిశమువారిఁ, దీపారు
మాటలాడుచు। నేపరశాసింపవలయు హితమువిడువకఁ॥ క॥ భూప
తి యుపాయములచే। నోపివశీకృతులుగాకనుండు పగర ను। ద్దీపితదం
డోపాయము। జూపుచుశాసింపవలయు శూరత్వమునఁ॥ క॥ సామా
ద్యు పాయములలో। సామముదండంబు గడుబ్రశంసింతురు ప్ర। జ్ఞామ
హితులు తక్కిన రెం। డేమియు కొరగావు వినుడహితజయ మున
కుఁ॥ గీ॥ వాయువేగమందు వరపితృణాదుల। నెగరజేసిధాన్య మిల్లుజేర్చి।
గాచుకొనెడి పగిది ఖలులవధించి శి। ష్టమగురాజ్యముపతి జనునుగా
వ॥ క॥ తనరాష్ట్రము నిత్యము। పాలనమొనరింపక వృథాజెలగియెవడు
వుల్ । గనుగొనకుండునరేంద్రుడు। వినాశముబొందు సకలవిభవం
బులతోఁ॥ క॥ వెలయంగ కాయకర్మము, వలనఁ మృతిబొందు
ప్రాణివడువునధరణి। తలనాథుడు మృతిబొందఁ, గలడుదినము దిన
మురాష్ట్రకర్మము వలనఁ॥ చ॥ జనపతి కార్యశీలుడు విశారదబుద్ధియు
పాయవేది నా। డనరిసమస్తరాజ్యపద తంత్రములోపిక తోడసేయు

చుం। డినబడయుఁ సుఖంబులు గడిందివిహీనుడు ప్రొలెనూరకుం। డినజెము వైరివర్గము నటించి హరింతురు రాష్ట్రసందల్॥ గీ॥ గ్రామమొకటి కిబదికినిర్వదికి నూటి। కరయ వేయింటి కధకమాన్యత ముల్లైన, వారల కు నాధిపత్యముల్ భూరమను డో। సంగవలయు యధాప్తిశాసనము

—*గ్రామపాలకాది వర్గ ప్రకారము*—

సేయు॥ సీ॥ గ్రామాధిపతితనగ్రామంబునంగల జనములు సేయువిరోషం బులరసి। పదిగ్రామములు పరిపాలించునతనితో స్వయముగా జెప్పవ లయు నతండు। వారలతప్పులనశ్యంబుజర్చించి సేతలకనువగు శిక్షసే యు। నదియివ్విధంబున బదిగ్రామములవాడు నిర్వదిగ్రామంబులేలు నతని। తోడనూరూళ్ళుగలవానితోడ నాత। డాతడును వేయిగ్రామం బు లరయువాని। తోడ నాతండు నృపమంత్రితోడజెప్ప। వలయు నా తండు శిక్షింపవచ్చునిచ్చ॥ క॥ ఏయువిగ్రామనివాసు లు। పాయనము లుగా నృపతికి బనుపుదురవి। యత్యాయతమతి దానును గొన, గా యోగ్యుండొక్కపాలు గ్రామపతిదగఁ॥ క॥ ఎనిమిదిభాగంబులలో। తనకొకభాగంబుగొన నతండర్హుడు ద। క్కినవేడుపాళ్ళునృపతికి। బను పవలయు ననిరి మున్ను పాయన వేదుల్॥ సీ॥ పదిగ్రామములుపరిపాలిం చునాతండు రెండునాగళ్ళతో రేపుమాపు। పొలములుదున్ని పైరులునా టి పండించుకొనుచు నిత్యంబు జీవనముసేయు। హాలికుండుబతికీయవ లసియున్న ధాన్యంబైనయర్థంబునైనగొనుట। యిరువది గ్రామంబు లేలు నతండు పంచకృషీవలులచేనవికలభంగి। సంగ్రహించుటయు ను గ్రామశతమరయు న। తండునొకయూరు వేయి కధ్యక్షుడైన, యూతడొకపట్టణమును మాన్యములుగా గొ। నుటయునర్హతమంబు మిక్కుటము గాదు॥ వ॥ ఇట్లుతనరాష్ట్రంబున నెల్లెడల గ్రామశిక్షాస్థా నంబులేర్పరచి యప్పుడప్పుడు సచివులతోగూడ నరేంద్రుండు రాష్ట్ర సంచారంబు సేయుచు బరీక్షించుచుండునేని రాజ్యంబు పూజ్యంబగువెం డియు॥ క॥ జనసంకులంబుబహు కా। ర్యనిరతమైదగుటనొక పురంబున కొకనిఁ। జనపతి నియమింపవలయు। ఘనపతినక్షత్రమధ్య గతగ్రహ

ముబలెర్॥ క. వారలవలననుపాలన । గౌరవము నెలంగ స్వీయముగా
దానును ధా । త్రీరమణుం డరయుచు నిరు । వారర్ రాజ్యంబు సేయుట
స్వాతమమగుర్॥ క॥ రక్షాధికార మొందున । దక్షుండును ప్రజలవలన
ధనముగొను దురా । పేక్షుడు క్రమక్రమంబున । పక్షము సెడి భృత్యు
లగునృపాలునిచేతన్॥ క॥ అధికారముబడసిన వా । డధముండై ప్రజ
లవలననర్థముగొనఁగా । నిధనంబంతయుగొని దు । ర్వ్యధలంబడశిక్ష సే
యవలయు నృపుఁడొగిన్॥ గీ॥ రాచకర్మంబు లొనరింప రహిఁ జెలంగు ।
కామినుల భృత్యజనులదగంగ నుత్త । మాధమస్థానముల నిల్పుటగు నృ
పుండు । శాస్త్రమెరిగిజనస్తుతపథము వెలయ॥ వ॥ గృహసమ్మార్జనాదు
లొనరించువాండ్రకును జలవాహకులకును యూడిగంబులు సేయువార
లకును ప్రతిదినంబును భృతిరూపంబుగా పణంబులును నారుమాసం
బులకొకసారి రెండేసివస్త్రంబులును మాసంబున కొకసారి ద్రోణపరి
మితధాన్యంబును దయచేయించవలయు మాసంబునకు ద్రోణత్రయము
నియు నుత్కృష్టకర్మకారకులకు పణషట్కంబును నిప్పింప వలయునని
కొందఱుమతంబు॥ క॥ క్రయవిక్రయములు సేయుచు । వ్యయమల్పంబా
యమధిక మగుడధికధనా । శ్రయులగు వణిజులకేభయ । రయములు
బొందంగనీకరక్షింపుచొగిన్॥ క॥ వారలవలననుచితధన । మారయగొని
పేదవారికవ్విత్తముధా । త్రీరమణుఁడొసగుచుండం । గారాజ్యముపూజ్యమై
జగంబున వెలయుర్॥ క. కార్షికవణిజమహాదుల । హర్షము సెడనీకనుచిత
మగునర్థము లా । కర్షింపవలయు కూడద । మర్షముజూపించిగొన విమలమ
తులారా॥ గీ. అల్పమైననధికమైనరక్తంబు మ । రందరసముగ్రోలు రక్త
పంబు । షట్పదంబువోలె జనపతిగొనునది । యల్పమైననధికమైనకరము॥

—*ప్రజలవలన రాజుగ్రహింపందగు కరవిశేషములు*—

క. పంచాశద్భాగములు స । మంచితమతి పశుహిరణ్య మహితా
ర్థములన్ । మించకగొనునది వారిన్ । కాంచనమధికంబు గొనదగననిరి
పెద్దల్॥ వ. మరియు కర్షకులవలన॥ క. ఎనిమిదియైనను నారై । నను
బండ్రెండైనపాళ్ళు నరపతిగొనగా । జనుననిరి కొందరిర్వది । యునొకడు

భాగములుగొన జనుననియెమనువిలన్॥ క. రసగంధద్రవ్యములకు। కుసుమములకుఫలములకును కూరలకును నీ। రసవస్తువ్రలకుషడ్భా। గసమానాంశములుగొనుట కరముపతికగున్॥ క. దధిఘృతదుగ్ధంబులకును। మధుమాంసంబులకు సకలమద్యంబులకున్। పృథివీపతిగొనవలయు వి। బుధమతముగ మూడుభాగములునాల్గైనన్॥ క. గుడశర్కరాదులకును న్రు। పుడుపదిభాగములు లోహములకిర్వది యొ। క్కడుపాల్గ్రగహింపంగా। వడువగువృక్షములకట్ల వచ్చుగొనంగన్॥ క. స్ఫటికాద్యశ్మమయములకు। ఘటముఖమృణ్మయములకు నొకడుభాగము మి। క్కుటముగనైననునృపతి గొ। నుటయుక్తంబగుననియె మనువురాజసభన్॥ క. శాకంబులుపూవులు పం। డ్లాకులుమూలములు హీనమగు వస్తువులున్। గైకొనియుమ్మ్చుచుబ్రదుకు ని। రాకృతులను కరములొసగుడనరాదెందున్॥ వ. ఇది కొందరమతంబు॥ క. కారులకుసూపకారుల। భారవహులమరియుకూలి పనులొసరింపం। గా రాత్రియుబవలుదిరుగు। వారివలనకరములుగొన వలవదుపతికిన్॥ వ. మాసంబునకొక్కసారి వారలచే యథోచితంబులగు పనులు సేయించుకొనుచుండవలయు॥ గీ. వేదవిదుడులోక విశ్రుతుండగు మహీ। సురునివలననృపతి సొరది నొక్క। గవ్వయైననుగొనుట గాదుకోశం బన। ర్థముగనుండునైన తగవుదప్పి॥ క. ఏనరపతిరాజ్యంబున। దీనుండై బ్రాహ్మణుండతిక్షుధనెరయుం। గానుండునట్లయగు న। మ్మానవపతిరాజ్యమొక్క మాసములోనన్॥ మలయుజవృత్తము. జనపతి వేదము జదివిమహోమతి సదమలమూర్తియు సముడగు వి। ప్రునికడునాదరమునుభయభక్తులు పురుషవిశుద్ధియు బొరలగ దా। ననయము బ్రోవగ నగునటుగాకరయమగువిధంబున నడకువ ద। ప్పినజెడురాజ్యము బిలుకరిశత్రులు బెలుచగొనంగనపృథుతరకీర్తిన్॥ గీ. ప్రజలనందరసంతోష పరుపనెంచి। నెయిదికరములుగొనకుండుటయునుదగ్ర। వృత్తినధికంబుగొనుకోర్కె నెత్తుటయు వి। నాశకారణములురెండు నరపతులకు॥ క. మృగువొక్కయెడలకఠనం। బదనుదేల

సిరియొక్కయెడల నధిపుడు జూపిం । పదగుమహాకార్యంబుల । నదిరాజ్య
సమృద్ధకారణావాప్తమగుర్॥ క. ప్రాజ్ఞుండతిదాంతుడు ధ । ర్మజ్ఞుండు
కులీనుడగు నమాత్యునిఘనకా। ర్యజ్ఞుడునృపతివరించుట। యజ్ఞంబున వే
ల్పువ్రాలెనతిపూజ్యమగుర్॥ గీ. మేదినీపతియిట్లప్రమాదవర్తి। నంబు
నదవికిసకలజనంబులుం తన। పుత్రులట్లభావింపుచు పూజ్యమైన। రాజ్య
మొనరింపవలయుపూర్ణసుఖలీల॥ క. ఏవానిరాష్ట్రమతి భీ । తావహము
గుధూర్తతస్కరాదులవలనర్। శ్రీవెలయుపాలనముసెడి। జీవన్మృతుడా
నృపుఁడు చింతింపంగర్॥ క. ప్రజలనుపాలించుటయును । ప్రజలవలన
నుచితమగు కరములుగొనుటయుర్। నిజకర్మంబులునెరపుట । యు జన

—*రాజమంత్రాలోచన క్రమము*—

పతులకుర్వీమూఁడు యోగ్యతమంబుల్॥ సాధ్వవృత్తము పాలనమతి
నిరపాయమునుకరము హయభరితమును బాహ్యమునై । జాలజెలగగ
ప్రజాబహు శుభకరసాధ్యుడువిమలుడు సత్తముడుర్ । బాలిశజనకుల
భంగవిలసన విభావనిరతగుణ భద్రగుడుర్ । నైలలినరపతి యన్వయప
దమొనయం గలడురుపుగ నంత్యమునర్॥ సీ. సూర్యోదయముపొడసూ
పకమున్న శయనగృహంబువెడలి యధిపుడుచిత । శౌచకర్మములెల్ల
జక్కజేసిహుతాగ్ని వెలయించియుత్తమ విప్రవరుల । నర్చించివస్త్ర
మాల్యములులేపనములు గైకొనిసభకుదగంగవచ్చి । సింహాసనమున
నాశీనుడైదర్శింప వచ్చినప్రజలతోమచ్చికదగ । మాటలాడిజాలమన్నిం
చి పిదప గీ। డ్కాలిపిమంత్రిగణముగొలువ మంత । నమునరాష్ట్రవా
ర్తలమర మంత్రాలోచనంబు। సేయునది దినంబుదినము॥ క. గిరిపృష్ఠం
బెక్కియునై ।నరహస్యస్థలములందు ననయినపతిబెం। పొరయగమంత్రా
లోచన। పరాయణతజెలగవలయు పండితులారా॥ క. మానితమంత్రా
లోచన। తానిపుణతలేకదుర్మదము బెంపరు ధా । త్రీనాథుడుసెడుప్రజ
లకు। నానందకరుండుగాక సతిహీనుండై॥ వ మనోబుద్ధివాక్చక్షుశ్శ్రో
త్రవికలురను తిర్యగ్యోనిసంభవంబులగు శుకశారికాదులను వృద్ధులను
మ్లేచ్ఛులను స్త్రీలను బాలురను రోగగ్రస్తులను కొండెగాండ్రను జేర

నీయక మధ్యందినమందైన నర్ధరాత్రియందైన విశ్రాంతియగునెడల మంత్రాలోచనంబు సేయువలయు॥ క. పుత్రులకువినయవిద్యయు । బాత్రతయుఁబ్రజలనుబరిపాలించు నుపా । యత్రైవిద్యలు ఘనచారిత్రంబులు గరపవలయున్నృపతిదగంగన్॥ క. సేయమొదలిడినకార్యము । వాయక దూతలనెరుగుచు బహుగతుల నిజ । స్త్రీయుద్దేశములరయుచు । న్యాయముసెడకుండన్నృపతినడువగవలయున్॥ క. వెలయంగపంచవర్గం । బులు మరియష్టవిధకర్మములు సముచితభం । గులనడపుచు భూపాలుఁడు । వలయున్ కర్తవ్యగౌరవమునిల్పికొనన్॥ క. సతతమువిజిగీషుని చే । ష్టితమునుమధ్యమునినడువడియుసముదాసీ । నతనుండువానియత్నము । మతినరయుచు పార్థివుండు మనుటయుఁ దగున్॥ గీ. మండలమునకు కారణ మహితములగు మూఁడు జింతింపుచును జాలముఖ్యమైన । యొక్కఁడో పుచు నెనిమిదియుడిగియేను । విడచిననృపాలుఁడతిసౌఖ్యవృత్తిబడయు॥ వ. అమాత్యరాష్ట్రదుర్గార్థదండంబులను నివియైదు మూలప్రకృత్యాదులగు ద్వీపప్తతియందు ప్రత్యేకంబు సెప్పంబడు నిట్లప్రమాదుండై నరేంద్రుండనంతరశత్రురాజులను వారి నెడనాయకుండు మహీపతులను వారికంతఃకలహామాత్రంబులుగల పార్థివులను వారికి హితులగు వారలను స్వామిత్రవర్గంబులనువిచారించుచుండవలయునిట్లు॥ క. ఆయతమతియైచతురో । పాయంబులు నడిపిదివుట పార్థివుడుధృతిన్ । వాయకవశీకృతులుగా । భూయిష్ఠతచేసికొనగబోలున్వారిన్॥ సీ. అరయసంధియువిగ్రహంబు యానంబు

—*సంధివిగ్రహాది క్రమము*—

నాసనముద్వైధీభావసంశ్రయంబు । లననొప్పునాఱు గుణాదులుచింతించునదిసంతతము నాసనంబుయాన । మును సంధివిగ్రహములు నాల్గు ద్వైధసంశ్రయములలోనివై జక్కవెలయు । సంధివిగ్రహముఖ్యషడ్గుణంబులు ద్వివిధంబులు వర్తించుధర్మ్మవుడగ । నడరితత్కాలికఫలలాభార్థియగుచు । నృపుడుప్రతియానకృత్యంబునెనపుటది స । మానయానక్రియాసంధనాలెసంగు । నపుడువచ్చెదనని పల్కుటట్లుగాదు॥ వ. అసమానక్రియాసంధ నాయదివెలయు॥ క. స్వాయముగనని కేగుటయది ।

స్వయంకృతమనియు మిత్రసాహాయ్యార్థం । బయిధృతినరుగు టపకృత
మ । నియుని గ్రహమిట్లు ద్వివిధనీతిఁ వెలయున్॥ క. నీకనొకడయని కే
గుట , యేకాకినమనియునాప్తు లెల్లరుతనతో । రాకదలుటసంఘమని
యు । నీకరణిఁ ద్వివిధమయ్యె నిలయానంబుఁ॥ సీ. పృథివీశ్వరుడు
పురాకృతకర్మములనైన మిత్రానురోధనా పాత్రుగతుల । నైనక్షీణిం
చుటయదిలెస్స జేసికొనంగ జూచుటయాసనంబువెలసె , ద్వివిధంబులం
చితోద్వేలబలాధికుం డై దాజెలంగుటనధికబలము । గలవానియిష్టసాం
గత్యంబుపడయుట ద్వైధంబురెండువిధంబులయ్యె । బగరచేసతము బీ
డింపబడుచునుండు । వాసికినియధికునామంబువలికికొనుచు । హాని
బొందనివానికి నాశ్రయమయి । సంశ్రయము రెండువిధములై జగతి
బరగె॥ క. బలవంతుడయ్యునరపతి , బలహీననృపాలగణము భంగిం
పక వి , చ్చలవిడిసంధినడపి మరి , వలయువశీకృతులుగాఁ వారిఁ
గూర్పఁ॥ క. పృథివీపతియెప్పుడుతన! కధికబలము వెలయునప్పు డత్యు
జ్జ్వల ధై! ర్యధురంధరుడై విగ్రహ । విధముంబాటింపవలయు విఖ్యా
తిదగఁ॥ క. తనబలమెప్పుడుపుష్టం । బును దుష్టమునగుచు జెలగు
భూపతియపుడో , య్యానయానముగావింపఁ । జనుపగరబలంబు లతి
కృశములై యుండఁ॥ క. తనబలమెప్పుడుక్షీణం , బున తుష్టమునగు
చునెరసి బొలచినపుడు సాం , త్వనవచనంబులుసెప్పుచు , జనపతియా
సనముసేయ జనుఋషులారా॥ చ తనబలముఁ విరోధి సముదారత
యుఁసరియైనజూచి దా , ననువుగకొంతసైన్యమురయంబున యుద్ధ
ముసేయుబంచి తక్కినబలమోరగూర్చికొని కేవలధైర్యసమగ్రమూ
ర్తియై । జనపతిదుర్గమెక్కి పరసైన్యములఁ నణగించుటొప్పగుఁ॥
వ. ద్వివిధాచరణీయంబై యుండు॥ క. బలవంతుడు పైనెత్తగ , బలహీ
నుండైనదాను పార్థివుడు మహా । బలవంతునాశ్రయించి య । ఖిలసై
న్యముతోడ పరగగెలువగ వలయుఁ॥ వ. ఇదిసంశ్రయప్రకారంబు॥
చ. తనకు సహాయుడై బహువిధంబుల జేర్చి విరోధి సేనలఁ । దుని
మి ప్రియంబుసేయు పరితుష్టి జెలంగగ నెవ్వడోపి యా । తని గురు

మూర్తిగాదలచి తానెడవాయక సంతతంబు సే । వనమొనరింపగాదను
నవశ్యము దుర్బలభూవిభుండొగిన్॥ క. జయముగొనిన సత్కీర్తిబొ ।
రయునని జచ్చిన సదాపరమ సౌఖ్యసమృ । ద్ధయుతుండగు నాకం
బున । నయమహితాత్ముండు నరాధిపుడరయన్॥ మ. నరపాలుండు
సమసస్యైన్యముల నాయతంబుగావించి ని । ర్భరసూరత్వముపాటిమీ
రబగ్గరంభంజింతు నేనెప్డునా । కరియేమాత్రమువాడు జూడనని ధైర్యం
బూదివర్తించినన్ । బరగున్ రాజ్యముపూజ్యమై బహుభయభ్రాంతిన్
విరోధుల్ చనన్॥ గీ. భావికాలమందు బాటించునదియును । వర్తమా
నమందవశ్యమాచ । రించునదియు నాచరింపబోవునదియు । కార్యకర

—*పార్థివుని యుద్ధయాత్రాక్రమము.*—

ణభంగిగనుటయుదగు॥ క. ఏవాక్యంబునమిత్రుల । నేకులు బ్రియ
మారతన్ను నెనసికొలచు న । వ్యాకులమతియై నృపుడది । గైకొనసేయు
నదిపరమగౌరవముదగన్॥ శా. సేనాకీర్ణము సంశ్రయంబుబలమక్షీణ
ప్రతాపంబు తే । జోనైర్మల్యతయున్ దగంగనధికస్ఫూర్తిన్విజృంభించి
ధా । త్రీనాథుండు విరోధివర్గములసాధింపంగ బోవంజనున్ । నానా
శోభనహేతుకాలముల నానందంబురంజిల్లగన్॥ క. ఒనరంగమార్గ
శీర్షం । బును ఫాల్గుణచైత్రమాసములు రెండును శో । భనములురణ
యాత్రారతి । జనురాజులకనిరి పరమశాస్త్రార్థవిదుల్॥ చ. తనకుజయం
బవశ్యము నుదారతరంబుగగల్గునంచు దో । చినసమయంబులున్ గ
దువిశిష్టవిజృంభిత సంశ్రయంబు బెం । పెనసిన వేళలున్ గర మనేకవిధం
బులలెస్సవైరులన్ । జెనకివధింపయత్నములు సేయునృపాలుని యుద్ధ
యాత్రకున్॥ సీ. వైరిరాజన్యుల వార్తలారసియెఱింగింపంగ దూతలకృ
త్రిమాత్మ । లధికవిశ్వాసంబున ధృతిమెలంగెడి పరిచారకులు శూర
వరులుహితులు । చతురంగబలములౌషధములాహార పదార్థములు
వైద్యులుతంత్రకరులు । గదలిరాత్రివిధమార్గంబులు రూఢికావించుచు
నన్యోన్యవిహితసరణి । భటులకానతిజేయుచు పార్థివుండు । మార్గవశము
ననెదురగుమండలాధి । పతులనత్యంతసాత్వన భాషణములు । నెరపి

సత్యంబుగాఁ గాంచు నురువృతెస్స॥ క. వారలుతనతోఁగూడ మ। హారం
భము వెలయ యుద్ధయాత్రలు సేయం, గోరినవట్టియ్యకొని మ, హీ
రమణుండధిక ప్రీతినెరపఁగవలయుఁ॥ వ. ఇట్లపరిమితబలసమేతుండై చ
నిశత్రు రాజుపురంబునిరోధింపవలయు మరియుశాత్రవులకుపరమమిత్రు
లగువారుకొందరు గూఢంబుగాతనతో మైత్రతనెరపి వంచింపజూతురు
గావున వారలనెరుంగటయు కపటధర్మకంచుకులయెడ జాగరూకతకలిగి
యుండుటయు జయశీలుండగునృపాలకుని స్వభావికంబులని చెప్పి మరియు
నిట్లనియె॥ క॥ గరుడముదండము మకరము।వరాహము శరభము ననవర
గుమహా మో। హారములలో తరిగ గునది। పరులకసాధ్యముగనృపుడు
బన్నింపదగున్॥ క॥ అమరునరసూచ్యమధిక భ।యమసంభ్రమమొచ్చట
తనకగునచ్చటయో।ధముఖంబుగపద్మవ్యూ।హము బన్నింపంగవలయు
నరపతిమరియున్॥ గీ. సైన్యపతుల మహాబలమాన్యతముల।మోహారము
నకు నెనిమిదిమూలలందు। నిలుపునదిమిగులభయమెందు నెగడునందు।
యోధవర్గంబుగూర్చుటత్యుత్తమంబు॥ క॥ శూరులుధృతిమంతులునవి।
కాలు నిర్భయులువడువుగలవారలు నా, నారణకోవిదులైదగు। వా
రలగుల్మముగ నిలుపవలయు గడకమై॥ క॥ మొగ్గరము సమీపంబున।
దిగ్గజములబోలునధికధీరులబల స। మ్యగ్గతుల శత్రుసేనల। మ్రగ్గిం
పగ నిలుపవలయు రణకోవిదులన్॥ ఉ॥ పాటిసెలంగు మొగ్గరము బా
హ్యతలంబుననాల్గుదిక్కులన్। కూటమునైతె జెలంగి తమకున్ విజయం
బొనగూడునంతకే। పాటియుజూడ మేమనుచు బాహువులెత్తుచుహుం
కరింపుచున్। మాటికినిక్కుశూరులసమాజములొయ్యన నిల్పుటొప్ప
గున్॥ వ॥ వ్యూహంబులన్నిటిలో దుర్భేద్యంబులనంబరగు సూచ్యావ
జ్రవ్యూహంబులధికబలంబులతో బన్నంచుటయు సమప్రదేశంబులందు
రథతురంగంబులతోడను జలప్రదేశంబులందు నోడలు నేనుంగులతోడ
ను తరుగుల్మలతావృతంబులగు చోటులందు ధనుర్బాణాసారంబులతో
డను గర్తాకంటకపాషాణస్థలంబులందు నాయుధంబులతోడను యుద్ధం
బుసేయుటయు గురుక్షేత్రమత్స్యపాంచాల శూరసేనమగధత్రిలింగ బం

గాళాదిదేశసంభవులు దీర్ఘదేహసౌష్ఠవసమన్వితులు శూరులునగువార
ల నగ్రయోధులుగా నిలుపుటయు వ్యూహంబుగానిలచియున్న బలం
బులచేష్టితంబులు స్థానక్రమంబులు స్వయముగా బరీక్షించుటయు స్వ
బలపరబలతారతమ్యంబు విచారించుటయు శత్రువులు దుర్గాశ్రయులై
యుండుటయు గాకుండుటయు చారులవలన నెరుంగుటయు విరోధిరా
ష్ట్రంబునంగల సర్వపదార్థంబులు దూషించి తనకు జయంబగుదనుక
నవియెవ్వరును గొనకుండ నాజ్ఞాపించుటయు వైరిసైన్యంబులనాపి తటా
కంబులు భిన్నముసేయించుటయు ప్రాకారంబులు బడగూల్చియు పరి
ఘంబులు బూడ్చియు దుర్గంబుభేదించుటయు బగరగుండె కాయలవియ
రాత్రులందు శంఖకాహళభేరీమృదంగాది రావంబులు దిక్కులుమారు
మ్రోగ సెలంగించుటయు తనకు మంగళ చిహ్నంబులు శుభగ్రహ
యోగంబులు దోచునప్పుడు నిర్భయంబుగా యుద్ధంబుసేయుటయు
జతుర్విధోపాయంబులు దరియగునప్పుడు జూపి శాత్రవనృపాలుర వశీకృ
తులుగా జేసికొనుటయు రాజనీతిలక్షణలక్షితుండగు మహీపాలుని కర
ర్తవ్యంబుమరియును॥ గీ॥ ఒక్కచోటగెలుచు నొక్కచోనోడి క్రొ । వ్వేది
వారులోక విశ్రుతుండు । సధిక బలసమగ్రుడయ్యు నృపాలుండు । గాన
సంగరంబు కాదుకాదు॥ క॥ ఉలుకక పూర్వముపాయం । బులుమూడు
నుజూపి యవియు బొల్లులగుడు దా । నలుకగొని నృపతియుద్ధం । బ
లఘుగతింజేసి గెలువనగు శాత్రవులన్॥ క॥ వ్యాజ్యములు పన్నియూ
రక । రాజ్యంబులు గొనదలంచి రాజులు జంపున్ । పూజ్యులప్రజల
కటా లో । క జ్యేష్ఠులెవారలవినెగడునె సదాప్తిన్॥ చ॥ నృపుడు మ
హోగ్రయుద్ధ మొనరించి విరోధిజయించివాని రా । జ్యపదము సర్వ
మున్ గొని మహామతులార్యులనుత్తముల్ విశి । ష్టపరులునైన విప్రు
లకు సాధుజనంబులకెల్ల వారికిన్ । గృపదళుకొత్తగానభయమిచ్చి పా
లనసేయుటొప్పగున్॥ వ॥ ఇది కొందఱిమతంబు॥ చ॥ అరుదుగ వైరి
జంపి తగనాతని రాజ్యముదానుబొందగా । బరగదు వానిపుత్రునకు
బట్టముగట్టి భయంబుసెప్పి భూ । సురులకుపేదవారలకు సూరిజనంబుల

కుఁ ధనాంబరా । భరణములిచ్చి పోవునది భద్రముగా తన రాజ్యసీమ

—* రాజులకు పాత్రములగు సూక్ష్మోపాయంబులు *—

కుఁ॥ చ॥ మరియును శత్రుభూపతికుమార విహీనుడవంశుడు గ్రుడ్డే । తెరవును లేని వాడునయి దెంపఱయుద్ధము చేసిచచ్చినఁ । దరిగని వాని రాజ్యము ముదంబున గెల్చినపార్థివుండు బెం । పఱుగొనుటొప్పు సద్బుధ జనానుమతంబువిశిష్టమెదగఁ॥ వ॥ వెండియునా రాజ్యంబున॥ క॥ ప్రియ మొనరింపనివారికి । భయముగరపి పేదవారు బ్రాహ్మణులు నిజా । శ్రయులు విధవలుకులీనులు । ప్రియము బొరయనిచ్చునది యభీష్టార్థంబుల్॥ క॥ మానుషమును దైవమును స । మానంబులుగావు పుడమి మానుషమువృథా । యై నిలుచు దైవమొకవక । గాననరయవలయు దైవకారణము లెదఁ॥ క॥ జయముగొనుటయును సఖ్యము । భయమును వడయుటయు దగును పాయనములు గాం । చి యలరుట యు సంగ్రామ । ప్రయాణ ఫలములుమూడు బరికింపంగఁ॥ క॥ పగవాని గెలిచి యాతడు । తగతనపార్శ్వమునవిష్టతముడైనడునఁ । నెగడుట దేశంబులు పా । రగజూచుట రెండునగు నరపతికి బిరుముల్॥ క॥ మిత్రప్రాప్తిజెలంగియు । మిత్రులుతనుగొలుచుకన్న మేలుగలదె లో । కత్రయమున విశ్రుతచా । రిత్రుండు కృపాళుడగు నరేంద్రీపతికిఁ॥ క॥ ఆరయ రాజ్యధనంబుల । పారంబుగ గొనదలంచి పార్థివుడురుకఁ । నైరులజంపుటకంటెను । వారలవచించుటొప్పువశమూర్తులుగఁ॥ క॥ ధర్మజ్ఞుండు జగద్ధిత । కర్మపరాయణుడు మరితగవుసత్యంబుఁ । బేర్మిగలవాడు నగు రిపు । నర్మిలిప్రియుజేసికొనజనాధిపునికగుఁ॥ క॥ నీతిగలవాడు శూరుడు । దాతకులీనుండు బహుకృతజ్ఞుడు జగతీ । ఖ్యాతపరుండై యొప్పన । రాతిఁ మెచ్చునది హితపరాయణదీక్షఁ॥ క॥ పురుషజ్ఞానము శౌర్యము । కరుణయు నార్జవము సేవిగాంభీర్యంబుఁ । బరగునుదాసీనుని తో । బరమ హితముచేసి బగరబరిమార్పజనుఁ॥ క॥ క్షేమము సస్యప్రదము సు । గోమహితము సర్వరత్న కూటంబయ్యుఁ । భూమిూశుడు విడుచునది మ । హీమండలమాపదలగునెడ నొకభంగిఁ॥ క॥ ఆయత

మఱి నరపాలుఁడ । పాయంబగునెడలఁదివుట బఱచి స్వరక్షో । భూయిష్ఠస
మాధారో । పాయంబుననుండవలయు పండితులారా॥ గీ॥ ఆపదలకొఱ
కు ధనము నయ్యర్థమాలి । రక్షసేయుటయందునర్థంబుసతియు । దన్ను
గాపాడుకొనుటయందున్నతమతు। లరయుదురదియ సర్వమాన్యమగుపథ
ము॥ క॥ చేయునది బహుసమర్థం । బై యత్నము లర్థసిద్ధియగు నంత
కు దీ । ర్ఘాయుక్తచిత్తవృత్తి ను । పాయజ్ఞుండగు నృపుండపాయము దొ
లఁగన్॥ క॥ ఆపదలుగల్గుతఱిమో । హాపగతజ్ఞానవృత్తి సడలక ధీర । వ్యా
పారవిజృంభితుఁడై । భూపతిసౌఖ్యములు బొరయుఁబోలు నెలమిమై॥ క॥ కృ
త్రిమసాంగత్యంబున । పాత్రములగు దానములనుభయవిద్యా చా । రి
త్రవిహీనతయునుగల । ధాత్రీపతిదఱగు దగరుధైర్యమువోలెన్॥ క॥ గో
ఱియుబలెమున్మదంబున । నుఱుకుటయును మీనము బలెనులుకుటయు
ను బెం । పఱినక్కవోలె హీనత । గఱచుటయునుగల నృపుండ కాలము
నదెగున్॥ క॥ శాంతమయంబగు శుద్ధ । స్వాంతము తార్క్ష్యప్రకారసరణి
యునతిమ । ర్దాంతబలంబునుగల భూ । కాంతుఁడు లోకంబునకుఁ బ్రకాశము దె
చ్చున్॥ వ. ఇంక రాజధర్మంబు లనేకంబులు పిదపఁ జెప్పంబడు వినుండు
మంత్రాలోచనంబుచేసి రెండు యామంబులగుడు నంతఃపురంబునకు
వెల్లనంబోయి స్నానంబుచేసి భోజనపీఠపైఁగూర్చుండి సిద్ధంబులగు భో
జనపదార్థంబులు బరీక్షించుచు సర్వవిషఘ్నంబగు మంత్రంబుజపించి
భోజనంబుసేయవలయు॥ క. వెలయువిషఘ్నంబులు ని । ర్మలములున
గునౌషధములు మానితరత్నం । బులును ధరింపవలయు ను । జ్జ్వలశ్ర
ద్ధాయుక్తుఁడగుచు జనపతిసతతమున్॥ క. నరపాలకుండు కాంతల । బరిశీ
లించునది తత్స్వభావంబులు నం । బరమాల్యలేపనము లా । భరణం
బులు మున్నయేయుపాయములేకన్॥ చ. నృపుడిటు కామినీజనపరీక్ష
యొనర్చిదగంగ వారితో । నపరిమితానురాగమున నాసనతల్పవిహార
ముల్ వినో । ద పురుషసంగమాదులు చితంబుగఁజేసి ప్రియంబు సెప్పి నే ।
ర్పు వెలయించిపోవునదిమాఢి సభాభవనంబులోనికిన్॥ సీ. ఇట్లుసభాస్థలి
కేతెంచి యాసనంబునఁబొల్చి యొకకొంతప్రొద్దుపుచ్చి । సాయంతమగు

దుహ స్త్యశ్వరథాయుధ గృహములన్నియుబరిక్షించిపిదప । శౌచకర్మం బులుజక్క జేసి సమస్త దాసదాసీజనతతులు సేయు । పనులువిచారించి పరిచారకస్త్రీలు రాలీలనంతఃపురంబుసే । యాటపాటలు వాద్యంబు లందుజేయు । వారకాంతలబుచ్చి పెంపావు వేడ్క । సతియుదానును గూడిచి యిచ్చారతులు సె । లంగసుఖనిద్ర సేయవలయు దగంగ॥ క. ఈ లీలబ్రవర్తించు న్న్ర ! పాలుండునిరామకుండు బహుజీవను డు । క్ష్వేలల నాప్రియతము డను । పాలంభోద్యముడునగుచు బడయుసుఖంబుల్॥

వ. అనిచెప్పెనని.

మేఘవిస్ఫూర్జితవృత్తము.

చిరానందాకారా శ్రితజనభయవిచ్ఛేదరమ్యప్రకారా
సదాతీతావ్యక్తా భరితసుమనస్సంగసమ్యక్ప్రయుక్తా
విదూరోద్యద్పాపా ప్రకృతిమయసంవిత్ప్రగల్భ్యాభిదీపా
నిదానాద్యానంతా ప్రకటచరితానిశ్చలైకప్రశాంతా.

క. భక్తహృదయప్రదీపా
వ్యక్తావ్యక్తాదికారణాంత స్థితాప్వ
ముక్తప్రసంగయోగ వి
రక్తిప్రకరణసదానురతశుభమూర్తీ.

మాలినీ. నిగమవినుతలీలా నిశ్చలధ్యానమూలా
జగదుపకృతశీలా సాధుసద్భక్తలోలా
పగతకలుషవర్గా భవ్యబోధా విసర్గా
సృగుపరిపరమార్గా సూక్ష్మభావాధిదుర్గా.

గద్య.

ఇది శ్రీమత్పరమేశ్వర లీలా విచిత్ర ప్రపంచ సేవాపాత్ర శ్రీమద్వారపురెడ్డి
పాపినాయక పుత్ర నిఖిలబుధజనవిధేయ యప్పలనాయక
నామధేయ ప్రణీతంబైన శ్రీమదాంధ్ర మనుధర్మ
శాస్త్రంబునందు సప్తమోధ్యాయమ్
సంపూర్ణమ్.



శ్రీ ర స్తు.

శ్రీమద్వితీయరామకృష్ణపరమహంసగురుస్వామినే నమః.

# శ్రీమదాంధ్ర మనుధర్మశాస్త్రము.

## అష్టమాధ్యాయము.

శ్రీధారేయ వినిర్మల । బోధామయ సర్వలోక పూర్ణపరత్వో । పాధిప్రశస్తరహిత । వ్యాధిజననమరణభయయయనఘ పరమేశా॥ వ. దేవా యవధరింపు మమ్మహర్షిసమాజంబులతో భృగుమహర్షీంద్రుడిట్లనియె॥ క. వెలయగ మంత్రులమంత్రి । జ్ఞుల విప్రులతోడ నిండు కొలువుండంగా వలయు నరేంద్రుడు కార్యం । బుల తెరవులు దప్పకుండ భూనుతకీర్తీ॥

—*రాజనియుక్త ధర్మాధికారివర్గప్రకారము.*—

చ. ప్రచురవినీతవేషము తిరంబుగ దక్షిణపాణి నుద్యమిం । చుచు దగ నెల్ల కార్యములు జూచుచు నార్యులతోడ గోష్ఠి సే । యుచు బహువార్తలన్వినుచు యుక్తపథంబవలంబనంబుగా । నుచితగతిన్ సభాంతరమునుండుట లెస్స నృపాలుడిమ్ములన్॥ క. దినమును శాస్త్రవివేచనమును జగదనుభవవిశేషమును వెలయంగా, జనపతి నడువందగు పదు । నెనిమిది మార్గంబులందు నెలమిబాలుచుచున్॥ సీ. ఋణములీగుట దాచనిచ్చుట నవిబతిచేగాని విక్రయస్థితులునిచ్చి । మరల జేకొనుటయు మరచియిచ్చుటయు వేతనమదానంబు నింద్యమగు సేత । క్రయవిక్రయాదులారయక పశ్చాత్తాపమొందుట పతికిదానొప్పకుండి । పశుపాలకుడు బహుభంగులవాదంబు సేయుట జూదంబు సెలగుటయు బ । రాంగనాసంగమంబు సీమాదివాద । మధికసాహసమును జౌర్యమప్రియంబు । పరుషదండం

బు బలహీనుపరిభవంబు, ననగవ్యవహారములు పదునెనిమిదితగు॥ క. ప్రజలీవ్యవహారాదుల। నిజధర్మాచరణవిధులు నెరపకనిచ్చా। ప్తి జెలంగించుదువారి మ। నుజపతిశిక్షించిదానును విడుచుటచగుఁ॥ క. ఒనరంగకార్యదర్శన। మొనరింపగననువుగాక నుండునెడల దా। ననఘమతిమైనవిద్వాం, సునియోగించునది నృపుడసూయారహి తుఁ॥ చ. నృపతినియోగగౌరవము నెమ్మివహించున ధర్మమూర్తి నే। రుపుగలవారుసాధువు లురుప్రతిభాధ్యులు కార్యదర్శనుల్। విపులమన స్కులుంగొలువ వేగసభాంతరమందు సర్వదా। ర్యపరమభాగనిశ్చల ధురంధరవృత్తిజెలంగుటొప్పగుఁ॥ క. ఏదేశమందువిప్రులు। వేదవిదు లుయజ్ఞరతులు విద్వాంసులనం। గాదగువారల నృపుడ। త్యాదరమున బిలచికొలువునందునుపదగుఁ॥ క. ఏసభయందునధర్మము మోసముగా వించుధర్మమునణంచి సముల్లాసగతులు సెడినిత్యము। నాసభ వారలతి పీడ లందితుదిజెడుఁ॥ క. పలుమారులు సభకేగఁ। వలవదుచనె నేని నిజము పలుకవలయు నిర్మలమతిసభ కేగినిజము। వలుక కన్నృతములు వలుకువాడు నశించుఁ॥ క. అన్నృతంబుల చేత సత్యంబునధర్మము చేతధర్మమును నేసభ నాశనమగు నాసభవారలు। నినుడుగతాయు ప్రలగుదురు విపరీతముగఁ॥ క. ధర్మమునాశనమైన న। ధర్మమున్మృతిబొందజేయు తమ్మదిగానఁ॥ నిర్మలమతులగుసభికులు, ధర్మముపేక్షించునదిసతము బుషులారా॥ గీ. ధర్మమెవ్వాడువారించు దానదరిగు। వానిశూద్రుండు వోలెదై వంబుజూచు। గానసద్ధర్మమునకుగీడైనసేత। లాచరింపక సెప్పకనాగవలయు క. కాయంటుదొరగువేళన। పాయంబగు నస్మమిత్రు భంగినొకండే। సేయు మహాధర్మంబున। హాయము బహుసౌఖ్య పదవులందంగదగఁ। గీ. గానమిత్రులనగ గారనేకులుధర్మ। మొక్కనొకడమిత్రుడింతనిజము। పాత్రతముడుధర్మ మిత్రుండు వారియు ల। నేక సత్వధములనిరి విబు ధులు॥ క. పాదంబు ధర్మకర్తకు। పాదముసాక్షులకు మరి సభావాసులకుఁ। పాదమ్ముమహీభర్తకు। పాదమనీ గతినధర్మభాగము లొదవుఁ॥ గీ. అధముడొకడు ధర్మహానివాటించిన। వాడుసేయుపాపవర్తనంబు।

దానదెలసిదివుట దండించున్నృపుఁడు స । భాసదులును పరమపాత్రతములు॥ క. ధర్మమునకు కీడగుదు । ష్కర్మంబులు సేయునధము గదసిన్నృపుఁడు న । ధర్మము వాడుసదాగతి । బేర్మిన్ సేయుదనుకణచి పీడింపదగున్॥ గీ. జాతిమాత్రోప జీవితుఁడైతనర్చు । నాతఁడయ్యును బ్రాహ్మణుండర్హతముఁడు । సభలధర్మంబుఁజెప్ప నిజంబు సెప్ప । చుండువాడయ్యునట్లు శూద్రుండుగాడు॥ వ. ఇదికొందర సామాన్యుల మతంబు॥ క. జనపాలుఁడుధర్మవివేచనమున కెవ్వాడు శూద్రజాతినియోగిం । చునతండునుతద్రాజ్యము । వినాశనమగును లోకవిశ్రుతులారా॥ క. ఏరాష్ట్రముశూద్రజనా । పారంబుగ వెలయుచుండు బ్రాహ్మణరహితం । బైరోగక్షుత్పీడల । నారాష్ట్రముదరుగు సెడు మహాపదల బడున్॥ ఉ. గాననృపాలకుండు బహుకార్యధురంధరుఁ డాప్తుఁడుజ్వలుం । డైనను ధర్మభాగమెనయంగ విచారముసేయుశూద్రునిన్ । దానువరింపకున్నతమతంబుసెలంగగ నుత్తముండు స । న్మానధనుండు ధీరుఁడగు మాన్యుని విప్రునినిల్పుటొప్పగున్॥ గీ రాజుపేర్మివెలయు రాజితధర్మాస । నమునఁగూరుచుండి విమలభక్తి । లోకపాలకులకనేక నమస్కృతు । లాచరించిధర్మమరయవలయు॥ గీ. ధర్మమునధర్మము జ్వలార్థంబనర్థ । మరయవలయు సమాహితుఁడైన నృపుఁడు । వివిధవర్ణక్రమంబులు విస్త

—*ధర్మాధర్మ విచారణ క్రమము.*—

రించి। కాదవర్ణక్రమము సేయగాదిపురుట॥ గీ. బాహ్యభావంబులెదలోనిభావ మింగి । తంబుచేష్టలు రూపవర్ణంబులునుస్వరములులోచనకాంతియు రాజుగడు సమాహితంబుగ దోషుల నరయవలయు ॥ గీ. నేత్రవికృతియు ముఖకాంతి గాత్రవర్ణ। మంగచలనంబుస్వరభేధ మరయునేని । దోషమొనరించువాఁడు నిర్దోషియునునె । ఱుంగబడు పార్థివునకిత్తెరంగువలయు॥ సీ. జననీజనకులు లేకననాథుడగు బాలకునిబుత్రహీననగోత్రవతిన । నాథరోగగ్రస్తవేధబోషింపగా నెవ్వారలునులేని వృద్ధవెట్టియును బిచ్చియునుబట్టితనయిచ్చదిరుగు నంగనపతివ్రత మహావినయశీల । భూపాలకుండర్థిబోషింపవలయు బతియును బుత్రులులేకవయసు

మీఁది । యున్న భూమిని నమ్మించి యురుక తర్థ । నంబు గొనిచనిన ధూర్త
జనంబుల నర । పతి వధించుటయొనను బలిమి ద్రోరు । లెదండించుటై
నను బోలు సేయు॥ సీ. ధనము గోల్పడిన యతండాస చాలించుకొని యుం
డు తెరుగ వచ్చిన నృపుండు । వివిధస్థలంబుల వెదకించి చిక్కిన యాధనం
బదిక సమాదరంబు । దనర రాజద్వారమున భద్రపఱచి యెవ్వాడు ధనం
బు గోల్పడియె నేను । యని పటహాది మహాస్వనంబులు గూడ జనులంద
రును వినజాట్టించునప । నెవడు ధనము గోలుపడిన వాడాలించి । వచ్చు
నేని బతియు నశ్యమతని । బోలనగని యొసగి పొమ్మనవలయుగా । డేని
యద్ధనంబు నూనితగతి॥ వ మూడు సంవత్సరంబులు దనుక నట్లు భద్ర
పఱచి మరియు మరియు జాటించుచు నెవ్వండును రాకున్న యెడ నవ్వి
త్తంబు బీదసాదులకు బంచి పెట్టవలయు. నష్టధనుండు గాక నాతతాయి
యొక్కండా ధనంబు దానుగడించినదనియు నైవనశ్రాయ గోల్పడితినని
యు నిప్పింపుమనియు విన్నవించుకొనునేని వానిని జక్కగా బరీక్షించి యె
ఱింగిక నసదండనంబు సేయుటయు రాజద్వారంబున భద్రపఱచియున్న య
ధనంబు రక్షించుచుండు గింకరు లేమరు తఱినేచియపహరించి కొనిపోయిన
తస్కరులు తెలియంగవచ్చునేని వధించుటయు రాజన్యుని కవశ్యకర్మంబులు॥
గీ. ఒకనివలన పూర్వమువ్వాని శిక్షింప । బడినధనము మనుజపాలకుండు ।
మైనవశము పేర్మి తనకులస్థంబుకు । నేని యొసగునది మహీసురులకు॥ గీ.
పూర్వమొరునివలన నుర్వీశ శిక్షింప । బడినధనమొకప్పు ప్రజలకొదవు ।
నంశము కుడుదాన నష్టభాగము గొన । వలయు భూమిభుండవశ్య మనసి॥
గీ. ఏధనములు ప్రజలనెఱవేచి గొనిచను । తస్కరులనుదగ్రదండనంబు
లంచరించెగొనియె నపుడాధనములు । నష్టధనులకొసగు నదికగంగ॥
గీ. జాతిధర్మములును జనపదధర్మముల్ । వంశధర్మములును వర్గధర్మ ।
ములు నిరంతరంబు వెలయించినసుపంగ । ప్రజలకాజ్ఞ సేయవలయు నృ
పుడు॥ క. వారికి వారికి దగు నా । చారంబులు కర్మములును సలుపున
టుల ను । ధీరమణుడు ప్రజలందర । కారూఢిగ నాజ్ఞసేయుటగు ని
త్యంబుగ॥ గీ. ఐకమత్యంబునెడి ప్రజలందరును వి । వాదములు వం

చనంబుల నాదరగతి । జేసికొనుచుండునేని శిక్షింపవలయు । పాపవర్త
నులనుదూరి పార్థివుండు॥ గీ. దేశకాలోచితంబుగా దినృట సత్య । మ
నృతము నెఱుంగవలయు నరాధిపుండు । సాక్షులు సభాసదులు సెప్పు
సరణినాత్మ । నతివితర్కించి ధర్మ యుంబదియగు॥ గీ. సజ్జనుడు ధార్మి
కుండును శాస్త్రవేది । యోపనులు సేయుధర్మంబు నిచ్చజేసి । యట్టికా
ర్యంబులొనరింపు డందరునని । ప్రజలశాసింపవలయు నృపాలకుండు॥
సీ. ఋణదాత తనయర్థ మీయడెప్పుడు ఋణస్థుండని సెప్పనృపుండు ది
శరి । వ్రాలుమూలంబులు హజ్జాలములును సత్సాక్ష్యవిస్తారంబుజక్కన
తని। పక్షంబెరింగి యుపేక్షించియున్న ఋణస్థులవలన మాన్యమగువృద్ధి।
గలపియిప్పింపగావలయునే వడువాచరెంచినైన నిజముఋణముగొనిన।
వాడుతరివేచి దబ్బరలాడునేని । సాక్ష్యవిస్తారమధికవిచారణంబు । సే
యునదిసాక్ష్యమును వ్రాలుసెప్పుటయును । లేనిచోనతివితర్కంబుబూ
నుటొప్పు॥ గీ. ఋణముగొనినవాడు ఋణదాతనణచ ప । రాక్ర
మించిధనమనక్రభంగి । గొనినయోలసిట్టిపనియనివారింప । నలయువాని
సతమువశ్యముపతి॥ క. ధనవంతుండుదివిరి వం।చనశీలుండగుచు రాజస
భలో ఋణముల్ । గొనియీయడాతడని యొ । క్కనిపైనేరంబు
బూని కల్లలునలుకల్ । వ. నరేంద్రుండది జక్కగావిచారించి యవ్వం
చనాంతు మాయకనునగునట్లు వానిసర్వధనంబును బలిమిమెయిఁగొ
నవలయు నెండియు॥ గీ. ఋణముగొనినవాడు మృతిబొందెనేని త ।
త్సుతుడు దీర్చుకొనుట మతము పుత్ర । హీనుడాతడయ్యెనేని సోదరు
లైన । నాలిమైనబుచ్చుటర్హతమమౌ॥ క. ఋణపత్రంబులుసాక్షులు ।
ఋణదాతకులేనిచోనయింప దతి పచా । రిణసేయవలయు భూపతి ।
ఋణస్థుడు ధూర్తుడైననిదికల్లయగుల్॥ వ. మరియు ఋణపత్రసాక్ష్య
రూపకంబు లెవ్వియు లేకనుండునెడల ఋణదాతసత్యంబనియు నాతతా
యియగు ఋణస్థుండసత్యంబనియు వివాదింపుచుండురుగావున నృ
పుండు సభాసదులతో నేకీభవించి యయ్యిరువుర రూపలక్షణాదులు

—*సాక్ష్య ప్రకారము*—

**మున్ను** విచారించి పిదప నీతండ్రీతనికి ఋణంబిచ్చు టెఱుంగుదేయనియు నెంతయర్థంబొసంగె నెన్నివత్సరంబులు చనియెననియు నీకితండు ప్రియుం డితండు ప్రియుండై యుండుగదాయనియు సాక్షిఁ బ్రశ్నించి జలంబులు విడిచి పాలుగొను రాయంచ చందంబున యసత్యంబునందు సత్యంబు దేటపఱచి యుచితకార్యసాధనంబు జేయుటయు రాజదర్శనమాత్రంబున భీతిం గంపించు స్వభావంబుగలవారలు కొందఱసత్యంబయ్యును జెప్ప నేరక దడపడుచు నపరాధుల చందంబుఁ జూపింతు రట్టివారల శాంతుం డై విచారించుటయు కొందరు స్ఫుటవర్తకులుగాక నిజంబ దడవుచుందు రట్టితరి దీర్ఘాలోచనంబు సేయుటయు వంచనాంతులు కొందఱపరాధం బులుచేసియు చేయనివారిఁ బోలె నిర్భయంబుగా బల్కుచుందు రట్టియె డ జాగ్రద్విచారపరిశిష్టుండగుటయు వివిధ వేషభాషాప్రవీణులై జనంబు ల మోసపుచ్చువారల నెఱింగి శిక్షించుటయు పాలనాధికారుండగు నృ పాలుని లక్షణంబులై యుండు॥ గీ. మాటసాక్షుల నొకనొక పాటిగొనక। ననృతములుబల్కి వాని ధనాశలుగొన । యత్నములు సేయువారల నరసి నృపుడు । కఠినదండన మొనరింప గడఁగవలయు॥ క. అనృతముసత్య ముసత్యం । బనృతముగా బలుకు శత్రువునైన నవధింపన్ । జనుభూపతిసత్య ముప । ల్కినశూద్రుడైన నగసి భరియింపవలయున్॥ గీ. ఎట్టివారు సా క్ష్యమెఱిగినయంతయు । బలుకనిశ్చయింపపాత్రతములు । నధిపుఁడెద్దియున డుగనట్టివారల నేఁ । గింతువినుడు లోకగేయులారా॥ గీ. గృహిణియును నుపుత్రవంతుండు కృత్రిముండు । దేశవాసుండు బుధుడు క్షత్రియుఁడు వైశ్యు । డంఘ్రిభవుడును బరగు సాక్ష్యంబు సెప్ప । కారు వృలి వ్రాసి తక్కినవారలరయ॥ గీ. సర్వధర్మవేదియు నిత్యసత్యరతుడు । నైనవాడె వ్వడగునైన నతడ బరగు । సాక్షమొఱఁగింప నన్యులే సగణివార । లనియెము నువది యుత్తమంబైన తెఱవు॥ సీ. పాపరోగంబుల బఱితపించెడివారలు నుఋణస్థుని మిత్రులును సహాయులును కష్టబాంధవులును సత్యహాని వాటించువారలును బాటించి యొరుల । వంచింపయత్నించువారును

గారుకుల్ నాట్యసంగతులును నామధేయులును నసంగతులుగ్రులును శ్రోత్రియులుదొంగలుననధీతులు వృద్ధులును శిశువులు, మత్తులున్మత్తుల ధికశ్రమంబుదోడరు । వారలునుకుపితులును గానివారును వికలేంద్రియుల లక్షితులునార్తులెన్విధముల । నైనసాక్షంబుసెప్ప ననర్హులములు॥ గీ. బ్రాహ్మణోత్తమునకు బ్రాహ్మణుండింతికి, యింతిపాదజునకు నెలయుపాద । జుండు సాక్ష్యవిధులుసూచింపనిది యొల్ల । వారలకు సమానగౌరవంబు॥ క. చోరాదులచేనొకడు గృ, హారణ్యాదుల లుపద్రవాధీనగతుం । డై రూపరుగాజూచిన । పూరుషుడదిసెప్ప భూపాలుసభ౯॥ క. ఆయడగుజూచుచు డిన । స్త్రీయైనంబాలుడైన వృద్ధుండైనన్, బాయక నెవ్వండైన౯ । వోయియపుడ సెప్పవలయు భూపాలుసభ౯॥ క. బాలుడువృద్ధాతురులు నృ, పాలు నెదుట మొఱిగినంతబలికిన బలుకం । గాలేకయుండినను దీ, ర్ఘాలోచనసేయవలయు నందరునుసభ౯॥ క. పారుష్యంబున సంగ్రహ । ారంభంబునను భద్రవాచరణమునం । దారయసాహసకృత్యో । దారాదులనధికచర్చ తగదునృపతికి౯॥ క. ఆచెడుగుసేతలెరిగిన, నీచుండును సాక్ష్యమీయ నెరియనుటయు నా । లోచనయును వలవదుపతి, కేచందమునైనదోషమొసగనగుతగ౯॥ క. ఇసుపక్షంబులసాక్షులు, పరస్పరవిరుద్ధములగు భాషణములుమీ । దరసిసభవల్కు నేనియు, నరపతితర్కంబు సేయు నదిదీర్ఘముగ౯॥ క. కనుటయు వినుటయుగల్గిన, జనములుసాక్ష్యంబు సెప్ప జనుసత్యముగా । దనృతముసత్యముజెప్పిన । జనుడుపడయుసందునందు సౌఖ్యస్ఫూర్తుల్॥ క. కనుటయువినుటయు లేకే, యనుప్రనసాక్ష్యంబు సెప్పనగునట్లెవ్వండనృతంబు సెప్పువాడు, గ్రనరకకూపమునబడు బ్రకాశంబుసెడు౯॥ క. కనినయదియువినినయదియు, జనపతిసభజెప్పవలయు సాక్షియొరులవం । చనసేయబూంకెనేనియు । జనుదుర్గతికాతడెట్టి సభ్యుండైన౯॥ క. జనబుధుడొకపురుషు డ, య్యును సాక్ష్యముసెప్పగారుయోగ్యతదగునై । నను గాంతలుచపలమతులు, ననుమానాస్పదులు గాననవనీపతికి౯॥ వ. ఈచెప్పినవాక్యంబులు ఋణాదులందు వర్తించు

నెవ్వండు స్వభావస్ఫూర్తిగా సాక్ష్యంబు సెప్పునది యంగీకరించుటయు
నస్వభావంబుగా సెప్పునది నమ్మకుండుటయు నరేంద్రునకువలయు॥
క. వెలయఁగ నర్థిప్రత్యర్థునసన్నిధిధర్మమూర్తిరూపించుచు, సాక్షులను

—*సత్యాసత్య ఫలప్రకారము.*—

విచారింపంగా।వలయున్విపరీతములు వివరించిగడుఁగ॥ క. అర్థిప్రత్యర్థు
లును య। థార్థము మాత్రంబుసెప్పుడని సాక్షులన, స్పర్థముగ.
బలుకవలయు న, నర్థములగు మాటలుడిగి యధికారిసభఁగ॥ వ. ఆ
సాక్షులును సత్యంబుమాత్రము సెప్పవలయు॥ క. సూనృతము మాత్ర
మెవ్వడు। మానవపతి మ్రోలజెప్పు మహినాతడు సన్మానితుడగు ని
హాపరముల, గానబలుకవలయు నిజము కల్లలుడుగుచుఁగ॥ చ. అనృ
తము సెప్పునెవ్వడు నరాధిపుసత్సభసాక్షియై మనం। బున గడు శంక
లేక మృతిఁబొందిన పిమ్మటవాడు పాశబం। ధనముల జిక్కియుత్కటమ
దంబు సెలంగగ కాలకింకరుల్। గినిసివధింపుచుఁగ తనువుగీఱులు ను
క్కఱబ్రోవుసేయుగఁగ॥ గీ. సత్యమున నిర్మలుండగు సాక్షిధర్మ। వృద్ధి
కారణమదిగాన యింతయెఱిగి, యెరిగినంత యు సత్యంబయెరుగ జె
ప్ప। వలయు భూపతిసభ నెట్టివాడునైన॥ గీ ఆత్మకాత్మయసాక్షిమా
న్యమగుగతికి। కారణము శాశ్వతమునగుగాన యెఱిగి। నంతపట్టును
దాచక నరసిసత్య, మధిపుసభజెప్పునది సాక్షియైనవాడు॥ గీ. అనృత
మే పూరుషుడు సాక్షియైవచించు। వానిజూడరు దేవతల్ సూనృతం
బు, సెప్పునాతని గడువిశ్వసింతురు బ్రియు। బ్రియులు రెండు
తెఱగులనైనవారు॥ గీ. పంచభూతంబులాత్మయు బవలురాత్రి।
సూర్యచంద్రులు యముడును జూచుచుండు। నరుడుసేయుసమస్త
కార్యములు నిత్య, మట్లుగావున వలయు సత్యంబుసెప్ప॥ వ॥ దేవబ్రా
హ్మణ జనంబుల సన్నిధి నుత్తరాభిముఖులుగానైనను పూర్వాభిముఖు
లుగానైనను నిలచియుండ సాక్షులనియమించి మీరెరుంగునది సెప్పు
డనుటయు బ్రాహ్మణుండు సాక్షియయ్యెనేని సెప్పుము సెప్పుమనుట
యు క్షత్రియుండయ్యెనేని సత్యముసెప్పుమనుటయు వైశ్యుండయ్యెనేని

గోవులు బీజంబులు సువర్ణాదులు హరించిన పాపంబనృతంబు సెప్పిన
బొరయుదు నృగావున సత్యంబుమాత్రము సెప్పుమనుటయు శూద్రుండ
య్యేనేని యుట్లయనుటయు ధర్మాధికారి కవశ్యంబుమరియును॥
గీ॥ బ్రాహ్మణుని గోవునంగనబాలుజంపి । నట్టివారల కుపకారికపకృతం
బు । సేయువానికి పాపంబు జెందునెంత । బొరయునన్నృతంబు సెప్పిన
పురుషునంత॥ గీ॥ ఓయి జన్మప్రభృతి నీవు వాయకెంత । పుణ్యము
నరించితోయది బూదెగలయు । నూవెబొంకిన యునిమున్ను సూచనం
బు । సేయునది సాక్షితోడ జన్మించునతడు॥ క॥ ఏనొక్కరుండనన్యుడ।
గాననుచున్ నీవు సుప్రకాశితమగు వి । జ్ఞానరతి నాత్మనెరిగిన । దా
నన్ సుకృతములు దుష్కృతంబులు వాయున్॥ క॥ ఒరుడెట్లగుతాను
చరా । చరచేతనకోటులందు జన్మించుచు నె । వ్వరిగైకొనందు జీవుం।
డిరువుగ నదిగాన దెలియుమీశ్వరు లీలల్॥ ఉ॥ పాయకనీయెదన్ య
ముడు పాటిసెలంగగనున్న వాడు నీ । వేయెడ నాతనిందొడరి యొగ్గులు
బొంకులు వల్కవేని య । త్యాయతపుణ్యశీలుడవనంబడు దట్లుచరింప
గల్గినన్। సేయకు పుణ్యతీర్థముల సేవలుచేసిన నేమిమేలగున్॥ గీ॥ అం
బరములేక బోడియునంధుడును ని । రాశ్రయుండునగుచు నిత్యమాకలి
యును । డప్పియునుగదుర కర్పర మొప్పబట్టి । దిరుగుబొంకినవాడతి
దీనవృత్తి॥ క॥ సూనృతముసెప్పుమనృతము । మానియనుచు నుత్తిసె
ప్పు మనుజేంద్రుసభన్ । యేనరుడుబొంకువాడు మ । హానరకనివా
సుడునుసదాతురుడునగున్॥ గీ॥ సత్యమునకు వికల్పంబు జనగనెవ్వ ।
డోడక సభాంతరమున బొంకాడువాడు । కంటకంబులంగంబులగాడ
నంధ, కూపమునునుండు యమపురిచేపలుదిను॥ గీ. అధముడొక్క
డోడకనృతంబు వలుక దా, ననగు ఫలము సూచనంబుగాగ । దుర్గ
తులను బంధువర్గంబుబడు నెంద । రదినినుండు మీరలార్యులార॥
గీ॥ గోవొకటి గోరిబొంకిననేవురను న । నేక గోవులకొరకగు నేసి పదు
వు । రను మరియు నూర్వురనొకతురంగమును గు । రించిమైనను
బాంధవ బృందమణగు॥ గీ. తనకులంబునంగు జనియించువారల । బు

ట్టవలసియుండునట్టివార । ల నతఁడొక్కఁడనుచు కనకంబుగోరి బొం । కిన ఖలుండు దారుణ నరకముల॥ గీ॥ ఒక్క పురుషుఁగోరి యొక్కసారి యసత్య । మాడువాఁడు నరకమందుఁద్రోయు । వేయిజనులదివుట వెం డిగోరకు బొంకు । వాఁడు మూఁడునూర్లు వారిననుచు॥ క॥ నరుఁడెవ్వఁడు భూమికొరకు । పరుషంబునసత్యమురుకబలుకు భువిచరా । చరచేతన జాలంబులు । బోరిగొనువాఁడగునతండు భూనుతులారా॥ క॥ జలములు భోగమురత్నం । బులును శిలామయపదార్థములు గోరి యస । త్యల పితుఁడగువాఁడు పుడమి । వలసియనృతమాడినట్టి వానికి సరియా॥ క. అనృతఫలమింతలగు గా । వున పురుషుండు మిగుల కీడుబొరయు ననుచు దో । చిన వేళనైన బలుకఁ । జనదనృతంబనిరి బుధులు సంయములారా॥ క॥ గోరక్షయువాణిజ్యము । కారుకుశీలవుల వృత్తి గైకొనుటయు నే । ర్పారగొలువుండుటయుగల । పారుని శూద్రుబలె బలుకబరగు సభలలోఁ॥ క. ఏనరుడసత్యమార్గము । గాని వడువు బల్కు బల్కగానగు నతనిఁ । మానితభూదేవుండని । నైన సధర్మ స్వరూపుఁడని యైనదగఁ॥ గీ. ధర్మపథమునడచి ధనవంతుఁడయ్యు ద । రిద్రుఁడయ్యు నెవ్వరికిని గీడు । గలుగకుండ నిజమువలుకు నేపురుషుం డు । వాఁడ బ్రాహ్మణుండు కాడు పరుడు॥ చ॥ అనృతములాడుచుఁ పరధనాదులఁగోరుచు ధర్మమన్న దే । యనుప్రసన్నైన గైకొనగ నాగి యెరుంగనివాని బ్రాహ్మణుం । డన జనునే విశుద్ధకులమందు జనించిన నింతవట్టుగా । వునన్నృతవాదియైననను భూసురుసత్తముఁడంట యొప్ప గుఁ॥ క. ఆరయప్రాణోపద్రవ । కారములగు సమయములను గల్లలు వలుకం । గా రెండు తెరంగుల జను । పూరుషులకు ననిరె మనువ్రు భూనుతముదగఁ॥ క॥ తన ప్రాణముగాచి కొనం । గనుపాయమ్మాబది వలుకుగల్లలఫలముల్ । జెనకి కొనగ పురుషుఁడు నే । ర్చిన ప్రాయశ్చిత్త విధులుచేసికొనదగుఁ॥ వ॥ అవ్విధులెట్లనిన॥ సీ॥ చరువులగ్నియం దు బరగించివ గ్దేవ । తార్చనాది విధులనలరుటయును । మంత్రము ను జపించి మానిత హోమాగ్ని । యందునేయి పోయుటనఘుతరము॥

వ॥ ఋణాదులయందు సాక్షియగు వాఁడారోగ్యవంతుండై యుండియు
సాక్ష్యంబు సెప్ప మూఁడుపక్షంబులేగకమున్న సభకురాఁడేని వాని ఋ
ణదాతకు ఋణగ్రస్తుఁడీయవలసియున్న ధనంబర్పించుకొనువాఁడుగా శా
సించి యయ్యర్థంబునందు పదియవభాగంబు దండనార్థంబుగాఁగొనుట
యు నేసాక్షి ఋణాది వ్యవహారంబులందు సత్యంబునణచిపుచ్చి యనృ
తంబువలుకు నయ్యనృతఫలసూచకంబుగా నేఁడుదినంబులేగకమున్నతీ
వ్రరోగమైన జ్ఞాతిమరణంబైన నగ్నిదాహంబైన ననశ్యంబుగలుగు గా
వున వానివలన దండనార్థంబుగా నధికవిత్తంబు గొనుటయైన శిక్షించు
టయైన సేయుటయు నేవ్యవహారంబున వ్రాలుమూలంబులును సాక్షు
లునులేక యర్థిప్రత్యర్థులు పరస్పర విరుద్ధోక్తులాడుకొనుచుండు రాతగ
వునఁ దయ్యిరువురిలో దైవంబు సాక్షిగా శపథంబుసేయించికొనుటయు
ధర్మాధికారి కర్మంబులు మఱియును॥ క॥ వెలయంగ ననృతకార్యం।
బుల శపథము సేయనుత్తముండు వృథా యై। ట్టులిడికొనంగ దివ్యగు
వా। రలు గోల్పడువారలిహపరసుఖార్థంబుల్॥ గీ. అంగనలయందు
బెండ్లియందు బ్రాహ్మ। ణోత్తములఁబ్రోచుటందు నత్యుత్తమమగు।
నర్థములయందు గోగ్రాసమందు వెలయు। శపథమిడుటమన్వాదుల స
మ్మతమిది॥ గీ॥ బ్రాహ్మణుండు సత్యముతోడ పార్థివుండు। వాహనాయు
ధములతోడ వైశ్యుఁడు పశు। బీజకాంచనములతోడ వృథివిబగు।
పాపములతో వృషలుఁడుశపథములిడుట॥ వ॥ సంకరజాతులును శూద్రు
నట్లు శపథము లిడవలయు నిర్వాదిమైదంగుళంబులు సర్వప్రమాణంబుగ
ల తప్తాయఃపిండంబు రెండుచేతులం బట్టుటయు నగాధజలంబులంబడుట
యు పెండ్లాము శిరంబునంపైన పుత్రునితలయంపైన జేయుడి సెప్పుట
యు మహాశపథంబులగు నెవ్వనికట్టియగ్నివలన జేతులబొబ్బలెక్క
కుండు నెవ్వండయ్యగాధజలంబున మునుంగకుండు నెవ్వనిదారాపుత్రా
దుల కేహానియుఁ బొరయకుండువారలు శుద్ధశపథంబులఁ జేసినవారలనం
బడునైనను పూర్వజన్మ విశేషంబుల వత్సంబను ఋషిస్త్రంబుముప్ప
దిమూఁడుసంవత్సరంబులు నగ్నియ సాదగంబునగడపునతనికిశపథాదిసమ

యంబులందగ్ని శీతలంబగు వెండియు నేవ్యవహారంబుల కూటసాక్ష్యం
బులురవగు నావ్యవహారంబులు సమాప్తంబులయ్యుధర్మాధికారి మరి
యు విచారింపవచ్చునిట్లు॥ గీ॥ కామమున కోపముననార్తి కారణమున,
భయమున విమోహమునను లోభంబునను యె । ఱుంగలేమిబాల్యా
వస్థభంగిమైత్రి । తను వితథమగుసాక్ష్యంబు ధర్మసభల॥ క. ఏయేనిమి
త్తములవడి । వాయక సనృతంబుదివుటపలుకు సభల న, న్యాయపరు
లట్టివారల । ఛీయని దండించువిధము జెప్పుదునుదగన్॥ వ॥ వినుండని
యిట్లనియె లోభంబున బొంకైన సహస్రదండంబును ప్రథమమధ్యమా
పరసాహసంబులగు మోహభయమైత్రతలసనృతంబులాడిన నంతకుచతు
ర్గుణంబులుగను కామంబుననైన దశగుణంబులుగను యెఱుంగమినైన ని
న్నూరులును బాల్యావస్థనైననూటను దండంబుగొనవలయు॥ చ॥ ఉలుకుచు
కూటసాక్ష్యమున యోగ్యరతిన్ సభపల్కినట్టివి, పుత్రిలనరపాలకుండుధ
న పూర్వకదండము జేసిపుచ్చులే । యలవుననొప్ప దెయ్యెడల నైనజనుం
డని సెప్పిబంపగా, వలయునువారు వేదవడు వారయినన్ నృపుడా పదన్
బడున్॥ క॥ అలుకన్ వధింపుటయుమే । నలయగగొట్టించుటయునబంధి
పునకుగా,దులుకుచు నెట్టివిసేయు।గలవాడయ్యున్ ద్విజన్మ కాదనవల
యున్॥ చ॥ చెరనిడియైనకాయము గృశింపగజేయుట చాలలెస్సయే, తె
రువును లేకబ్రాహ్మణు వధించుటగొట్టుట దూరనాడుటు, కర్కరిలుటగల్గు
దుర్మతిదగంగ మహీపతికాదు బ్రాహ్మణున్।బరచిపగాభవింపనని బ్రహ్మ
మునీంద్రులతోడ జెప్పుటన్॥ గీ. బ్రాహ్మణుండొరుల పరాభవింప జ
నదు । కాదుబ్రాహ్మణుని నగౌరవంబు । సేయనెల్లవారికే యెడనని
యె ము । పామహుండయిన బితామహుండు॥ క ఒరులనవమానపర
చిన । ధరణీసురుపార్థివుండు దండించుటగా । దరయుగ ఛీఛీయని యె।
ల్లరు వినగోపింపగావలయు సభలోనన్॥ చ. అనుచితమైనభంగివగన
న్యుడు బ్రాహ్మణునింబరాభవిం । చిననరపాలకుండు వధసేయుటయై
న సమస్తవిత్తమున్ । గొనిసభనుండి ద్రోచిపటుకోపముతో పరదేశ
మేగు బో। మ్మనియదలించునైన నయమారగవానిని బుచ్చుటొప్పగున్

గీ. బ్రాహ్మణుండెగ్గు జేసినపార్థివుండు। గినిసిపరదేశమునకు బొమ్మను
ట యొప్పు। క్షత్రియప్రభృతులొనరించు పాత్రమొరిగి। దాల్పవలయు
దశస్థానదండనంబు॥ క. కరచరణంబులు లింగము। దరముగ్ దృక్ఛ్రో
త్రములును దనువును నాసం। బుర సజ్ఞముధనమనునవి। బరగు దశ
స్థానములన పరమశ్రుతులన్॥ క. నరపాలకుండుదోషము।పరిశీలించి యు
చితమగు భంగినొనర్పన్। బరగుసదాగతిదండము। బరికింపక సేయు
నేని బడుసాపదలన్॥ క. అరయనధర్మదండమ, పారవినాశన కరంబ
పాత్రతమంబు। ర్వారమునుని కదియుదుగుట, గౌరవమగు నిహపరము
లకల కాలంబున్॥ క. దండింప తగనివారల। దండించుట దండనార్హ
తములనురువడిన్। దండింపక నుండుటనఘ। ముండైపార్థివుడు నరక
మున గూలునొగిన్॥ గీ. వాక్యదండనంబు వలయుపూర్వంబు ఛీ।
యనుచు దిట్టునది యనంతరంబు। నర్థదండనంబు నాపయివధ సేయు।
టొప్పనంత మీదనుక్కుమిగిలి॥ గీ వధముసేయదగని వానివాగ్దండా
ది। మూడుదండనముల వాడిదరుగ। నాచరించు టొప్పనఘపుండు వ
ధదండ। నంబు వేళసరయునది దగంగ॥ వ. జాలాంతర్గతుండగు సూ
ర్యుని రశ్మలయందు గానవగు రేణువులు ప్రప్రథమంబు నత్ర్యసరేణు
వులని జెప్పంబడునట్టి త్ర్యసరేణువు లెనిమిదియైన నొకలిక్షయనియు
లిక్షలుమూడైన నొకరాజసర్షపమనియు రాజసర్షపంబులు మూడైన
నొకగౌరసర్షపమనియు గౌరసర్షపంబులు మూడైన స్థూలసూక్ష్మర
హితమధ్యకృష్ణలంబనియు కృష్ణలంబులు మూడైననొక మాషంబని
యు మాషంబులు పదియారైననొక సువర్ణంబనియు సువర్ణంబులు నా
లైన నొకపలంబనియు పలంబులు పదిధరణంబనియు మరియుకృష్ణల
ద్వయంబుసరిచేసి తులయందు దూచగనొకరౌప్యమాషకంబగు పది
యారు రౌప్యమాషకంబు లొకరూప్యధరణంబగునది. తామ్రిక కార్షి
కపణంబులకు పరిమాణాస్పదంబగు రూప్యధరణంబులు పదిరౌప్యశత
మానంబనియు జతుస్సౌవర్ణంబులొక నిష్కప్రమాణాస్పదంబనియు

దెలియఁజేయుచున్నాఁడు॥ చ. అమరగ నుత్తమర్ణుని సదార్థము గన్వయు న
ప్పు లేక పూ। ర్వమతని కిచ్చియుండి తిదిరంబుగ నేనని శంక లేక ధ,
ర్మమహితమూర్తి తోడ నధమర్ణుడు బొంకులుపల్కు నేని పా। పమువి
నుమంచు వానిపణపంచ శతంబులు గైకొనందగున్॥ గీ. ఉత్తమర్ణుని
యొద్ద దానునిచినట్టి। వ్రాలుమూలంబులోక భంగివంచనంబు। చేసి
ధనమీయఁడేన్వఁడా చెనటివలన। పణసహస్రంబుగొనునది పార్థివుండు॥
గీ. ధనము వృద్ధికిచ్చి తన్మూలమున సజీ। వనము సేయుచుండు వాని
వలన। నృపుడశీతి భాగమేనియధిక మేని। గొనవలయు భయంబు జె
నగనీక॥ వ. రెండునూర్లు పణంబులు గొనునదియని కొందఱమతంబు
గీ. నూరొకటియు రెండునూర్లుమున్నూరులు। నాల్గునూర్లను గొనున
ది నృపుండు। బ్రాహ్మణాదినాల్గు వర్ణంబులందు మా। సంబుమాసమ
ధిక సంఖ్యదొట్టి॥ సీ॥ కూడును మాంసంబుకూరలు వస్త్రంబులాకులు
చర్మంబులాభరణము। లిలధనంబులును గోబంధనాదులు విక్రయించు
చునర్థిజీవించుచుండు। వారలవలన కాసారాదులందు పద్మాదినాళంబు
ల నమ్ముకొనెడి। వారలవలన నుర్వీరమణుండొక్క గన్వయైనను పరిగ్ర
హము సేయ। గాదనిరి కొందఱిష్టభోగంబుకొఱకు। భుక్తిమాత్రంబు
నకు మరి భూమికర్త। గాదులొనరించుటకు నిచ్చునర్థములకు। వృద్ధి
రాదు త్తమర్ణునికింతయైన॥ గీ॥ కర్షణక్రియలొనరింపగడగునట్టి। హాలికు
నికు త్తమర్ణుడ నంత విత్త। మిచ్చినను వృద్ధిరాదొక్క పెచ్చుగాదు।
మూలధనముమాత్రము నిల్చుబోలనరయ॥ క॥ ఒనరగ దశవత్సరములు।
దనుక భుజింపంగజాలు ధనమురువార్జిం। చినవానివలన నించుక।
యును గొనరాదని యె దగమనువురా జెలమిన్॥ క॥ బాలుండును జడ
బుద్ధియు। జాలధనముగల్గియున్న సంఖ్యాకులగున్। మూలధనము
నిల్పికొనం। గాలేమిన్ గాన పరమకారుణ్యమునన్॥ క॥ వారల సర్వ
స్వమ్ము మ। హీరమణుడుగొని దగంగ నిత్యంబును న। ద్ధారవరతి
బ్రోవందగు। చీరలు నన్నాదులిడుచు శిష్టత్వమునన్॥ గీ॥ మరియు వా
రలెప్పుడెరుకగల్గినవార। లగుదురప్డువారి యర్థములను। నొసగియు

చిత రీతినుంచుడు బొండని । పనుపవలయు మనుజపాలకుండు॥ చ॥ త
నయులు కూతులుల్ సముచితంబలరింపగ జాలుమిత్రులుల్ । వనితలు
జుట్టముల్ కులమువారలు నెవ్వరులేని వృద్ధుబ్రో । వనగః నతండు నిర్ధ
నుడవస్తు విశిష్టుడునైన పార్థివుం । డనవరతంబు దీనజనులట్లని రార్యులు
కొందరాపుత్రె ॥ క॥ ధనవంతుడయ్యు నెవ్వరు । తనకుల్ గాకుండు వృ
ద్ధుధనముగొని సుఖం । బునతండు బొరయుబ్రోవల్ । జనుభూపతి వా
ని కథిక సమ్మతమైనల్॥ గీ. ఎవ్వరును లేని వృద్ధుండింకేటిధనము। నా
కనుచు బీదసాదుజనంబులకు స । మాదరంబున నీగుటత్త్వర్థ్వాతమము।
వాని నృపుడు నివారింపవలదు మరియు॥ గీ॥ వృద్ధులను బీదసాదుల
వెఱ్ఱివాండ్ర । గ్రుడ్డివారల బాలురకుంటివాండ్ర । నెవ్వరును లేనివార
ల నృపుడు బ్రోచు । ట ఖిలశాస్త్రమతంబు మహాత్ములారా॥ చ॥ ఒన
రకుశీదవృత్తియతియోగ్యముగా నొనరించుచుండునై । ననరవిభుండు
గన్గొని గొనందగు నాతనిచేత జాలయొ । ప్పనిరతి గాని భంగి పణ
పంచ శతంబులు కాదు విప్రుచే । నగరొక కొందరార్యులు మహాత్ము
లు సర్వజగద్ధితంబుగన్॥ వ॥ నాకు మాసమాసంబునకైన రెండేసి నెల
లకైన మూడు మాసంబులకైన మూలధనంబును వృద్ధియునీయవలయు
జుమ్మీ యని నిర్ణయించికొని యుత్తమర్ణుండధమర్ణునికిచ్చిన ధనంబుకైన
వృద్ధినిర్ణయ కాలంబతిక్రమించి వత్సరంబు చనెనేనియుత్తమర్ణుండు మరి
గ్రహింపగూడదు. మూలధనంబును గొలదిమాత్రంబువృద్ధియు గ్రహిం
పవలయునని కొందరుజెప్పిరిట్లు కారికకాయిక చక్రాదివృద్ధులునుచనవు।
వెండియు నధమర్ణుండు ఋణంబువాసికొన న సమర్థుండగునేని యుచిత

—*మూలధనవృద్ధి ప్రకారము.*—

మగువృద్ధిజేర్చివ్రాలుమూలంబులుత్తమర్ణుని కొసంగవలయునవియతండు
గొనుటయుందగు. నధమర్ణుండు ఋణంబుదీర్చుపుచ్చుశక్తిజాలక సువర్ణాదు
లిచ్చునేని యుత్తమర్ణుండ విగ్రహించి యర్హ్వాక్రయంబు జూచుకొని ఋ
ణపత్రంబున ఋణంబుదరిగించునది యిట్లు॥ గీ. దేశకాలవ్యవస్థితుడు
నైజక్రవృద్ధియు మూడుకొనజేయుటయు ఘనంబు । కాదేనివేకమా

ష్ఠాదిపర్యంతంబు నడపుటమాయతనంబు నిక్క । మఱుగాక దేశకాలాను
రూపంబు దెరలిన జక్రవృద్ధియు నశించు । జక్రవృద్ధిప్రమాణ క్రమంబు
లు మున్ను సూచింపకయ యెట్టిసీచు నైన । బాడిబంధించుటొప్పని పనియు
దియగు । దేశకాలార్థదర్శనుండాశయుండు । నైనవణిజుండు నార్థియా
నాప్తినేగు । వానికిచ్చినవృద్ధి సమానమయగు॥ క. జలపథయానము సే
యం । గలవారలకిచ్చినట్టి కామనువృద్ధిన్ । వెలయించి గొనందగ దే
యలవున నైనను ధనికుడయ మహితులారా॥ క. ధనవంతుడు ఋణ
రూపము । గ నెవ్వనికైన ప్రియగానగు నర్థం । బనుకూలవృత్తి నీగి
యు । గొనరాదధికమగు వృద్ధిగూర్చియులసుడై ॥ చ. సముచిత వర్త
నంబున యశాలితయున్ ఋణబంధన వ్యథా । నుమతము సత్యమున్
గలమనుష్యుడొ కింతదరిద్రుడైన న । ర్థముగలవాడొ సంగునది తత్పర
బుద్ధి ఋణంబువృద్ధి యో । గ్యము జనసమ్మతంబుగ దగంగన పాత్రు
లకొప్పదెందునన్॥ గీ. జూదమునకు దండశుల్కంబునకు వృథా । రతు
లకును నయోగ్యగతులకు జన । కుండు ఋణముజేసికొనిన తత్సుతు
లది । దీర్పనొల్లకుండు రెంపు లెస్స॥ చ. తనయుడునప్పయున్ సఖుడు
తమ్ముడుకూతుఖ నాలిచ్చు చ్చులున్ । జననిపృథారతుల్మరిగి సందడిబె
క్కు ఋణంబులోడగా । జనదుగ్ధహాధినాధుడని శంబదియెల్ల యెరింగి
యుత్తమ । ర్ణునకి యొసంగిపుచ్చుట నరుండటు చేసిననిర్ధనుండగున్॥
క. అరయపుత్రుడుతండ్రి పృ । థారతులకు ఋణముసేయ తడ వెరిగి
నగ । న్నారంజూచిన త్వరుణ । భారము దానునువహింప బాత్రుం
డయగున్॥ చ. తనయుడెసంగకుండుగతి తండ్రిపృథారుణబద్ధుడైగతిం ।
చిన ఋణదాతనీవును భుజించితి నీజనకుండుచేసి పో । యిన ఋణవి
త్తమంచుగడుహీనతనాడుటకాదు భక్త్యుడై । నను నధమర్ణునందను
ఋణంబునకాతడు బద్ధుడెట్లగున్॥ క. ఒసరిగకుటుంబపోషణ । మునకై
దానరయ బాల్యమునునుండులేరిన్ । జనకుండు చేసినఋణము । తన
యుడు దీర్చికొననగునతడు మృతుడైనన్॥ క. తానెరుగని ఋణ
మైనను । సూనుడుతండ్రి మృతిబొందశోధించి దగం । గానీ

గవలయు నతడు మ । హానరకములందు బడకనానందింపఁ
క. తనతండ్రి వ్రాలుబోలె గు । జనుడొక్కఁడు కల్పనంబు సాగించి బుు
ణం । బు నొసగిపుచ్చుమనగ నం । దనుడుగడంకమయిన దివితర్కిఁపఁ
జనుఁ॥ క॥ మత్తుడ సంబంధుడును । న్మత్తుడు బాలుండు ముసలి మా
నిసిదెవ్వులఁ । జిత్తము చెదరినవాడును । బొత్తుగలిగివ్యవహరింప బోల
దొకప్పుఁ॥ మ॥ ఇది నాచేతలిఖింపగా బడినదే నెందైన బొంకాడ నం ।
చు దగఁ వ్రాలిడి యుత్తమర్ణు శితడక్షుద్రుండు నాజాల నె । మ్మది
నమ్మంగ బుుణంబు గైకొని యసన్మాత్రుండునై దుర్జనుం । డు దురా
లోచనచేసి. పొవ్వ నొకనాడుఁ గానరాకిచ్చులుఁ॥ వ॥ కావున వానివ్రా
లసత్యంబయగు నివ్విధంబు త్తమర్ణుండరయుచుండవలయు॥ క॥ చలవా
చ్యుడు క్రయవిక్రయ । ములు సేయుటనిధియొనర్పబూనుట దానం ।
బులయాజమానియై బెం । పలవరచుటగాదనిరి మహామతిమంతుల్॥
క॥ పతిదేశాంతరమేగిన । సతియుకుటుంబార్థము బుుణసంపర్కము
బూ । నుతెరంగు మాన్యతనుమగు । నతడింటికివచ్చుదనుక సతినేర్పు
మెయిఁ॥ వ॥ మగండైనను పుత్రులైనను సంబంధబాంధవులైనను సతి
చేసిన బుుణంబుదీర్చికొన బద్ధులైయుందురు మఱియును॥ క॥ బలవద్దత్త
ము నిచ్చలు । బలవద్భుక్తంబుదివ్వుట బలవల్లిఖితం । బులు బలవత్కా
ర్యంబులు । బలవద్వాక్యములుగావు పండితులారా॥ గీ॥ బ్రాహ్మణుండు
వాణిజ్యంబు బరగజేసి । క్షత్రియుండధికదానమత్సరత బూని । వైశ్యు
డారెండునుడిగి యవశ్యముకుల , కోశవస్తు సమృద్ధివినాశకులకు॥
క॥ ధనముపరీక్షింణం । బయ్యును బలవంతిమునగొనుటయును బెన్నిధు
లుం । డినను గుమనీవి సేయుట । యును గాని గుణంబులరయ నుర్వీప
తికిఁ॥ క॥ కొనరానికొనజూచుట । యును గొనబాత్రములగునవియు
డుగుటయును జే । సిన రాజుదుర్బలుండని । జనులందరు చిట్టనధముసా
మ్యుండయగుఁ॥ గీ॥ న్యాయధనసంగ్రహణము జాతీయ బంధు । భా
వమును దుర్బలు రనర్థబ్రోవజూచు । టయును గల్గిన నృపుని వేడ్కమె
యిప్రజలు । బొగడుదురతండు సౌఖ్యవిస్ఫూర్తినెలయు॥ గీ॥ కానవిజి

తేంద్రియ క్రోధుడై నృపుండు। ప్రియుడు నప్రియుడనుగూఢ భేదబుద్ధి। లేక సమవర్తియై తనులోకులెల్ల। బొగడయముని విధంబున నెగడవలయు॥ క॥ ఏనృపుడ ధర్మకృత్యము। మానక నొనరించు మోహమగ్నుండై యా, హీనమతియచిరకాలము। లోన వగరవశుడగు ప్రజలును దనురోయర్॥ గీ॥ ఏమహీపతి కోపంబు కామమును వ। శీకృతంబులుగా నాత్మ శిద్ధిబొలచి। ధర్మపథమున నడచునతండు బొరయు। నైహికాముష్మిక సుఖంబు లార్యులార॥ గీ॥ మఱియు నాతనిధర్మసమ్మతముగడిది। బ్రియము సేయుచు బ్రజలెల్లపెంపునెగడు। వారలను నుసముద్రంబుమేరవిడున, కెల్లనదులునుగూడి రహించునట్లు॥ గీ॥ ఏబుణస్థుండు దివ్పటగర్హితముచేసి। యుత్తమజ్ఞుని లెక్కింపకుండు నట్టి, వంచనారతునణచి భూవరుడుతద్రు। ణధనమిప్పింపవలయు దాన గనుఘనత॥ వ॥ దండ నార్థంబాబుణధనంబులో నాల్గవపాలుగొనవలయునని కొందఱమతంబు॥ గీ॥ ఉత్తమాధమ జాతులు నొక్కతెరగు, కర్మములుసేయుటయు ఫలకాంక్షదివురు। టయును బాత్రంబులగు గమతంబులును శ, శంబులును వోలెగాక ధర్మంబునెగడ॥ క॥ చీమల చందంబునను ము। హామీనములట్లు కరులయను నసింహ। స్తోమములభంగి నిత్యము। భూమిమెలగవలయు నెల్లపూరుషులుదగన్॥ క॥ నక్కలచాడ్పున క్రొవ్విన, కుక్కలచందమున పిల్లికూనలగతినే। చక్కటినైనన్ పురుషులు। ముక్కుమొనయులేక దిరుగ మూడుర్ గీభుల్॥ క॥ నరపాలకు డీయర్థము। పరాయణముసేయవలయు బహుభంగులని। స్థురికర్మాచరణము నా। దరమైతన మార్గమత్యుదాత్తముగాగన్॥ క. ఈ యర్థంబువెరుగు భూ। నాయకుడారింపకడగు నరనుతదండో। పాయముసమస్తలోక। శ్రేయస్కరముగసదా విశిష్టచరితుడై॥ గీ పరమకులజుండు వృత్తసంపన్నుడునృత। వాదిఘనపక్షుడనదగు

—*నిక్షేపార్హపురుషుని విధము.*—

వా నియుంద। నయమునిక్షేపసంస్థాప నంబుసేయు। వలయునిశ్శంకమెయి। మహీవల్లభుండు॥ క. ఏవడువునాదాయము। గావించుచునా

ర్యసమ్ముఖంబుననిచ్చుచో । భూవరుడవ్విత్తంబుయ । థావిధిసంస్థాప
నంబు । దగుసేయంగ॥ వ. ఇదిరాజపక్షంబు మరియును బ్రజల
యందు నట్లవేలయు నొక్కడొక్కనిచేతికి నిక్షేపంబుసేయనిచ్చిన
ధనంబు మరలనిప్పింపుమని వేడికొనిన యట్టియానిక్షేపధారి సమర్పిం
పవలయు. నియకయుక్తబుద్ధిదొడరి లేదు పొమ్మనునేని ధర్మాధికారి
సమ్ముఖంబున నిచ్చుటయు శిక్షింపబడుటయు నవశ్యంబు బొందు ని
క్షేపంబుచేసిన యర్థంబుకొఱకు నద్ధర్మవర్త్యగులు వివాదింతురేని కుల
వయోరూపగుణ సమన్వితులగు పురుషులావ్యవహారంబున సాక్ష్యంబు
సెప్ప బాత్రులగునిట్లు॥ సీ. నిక్షేపమొనరింప నేనెన్నడెరుగనా కీతండొ
సగెననుచెల్లకల్ల । యునియునీతఁడిక నాకును శత్రుభావంబు లెనసియు
న్నవిపూర్వ మొల్లొసంగు । ననియునీతడు వేడికొనినయర్పించితి ననియు
జోయెననియు నధపునెకట । నిక్షేపకుడు సెప్ప పక్షంబుసేయక నదియె
రింగినసాక్షులందరను వి । చారణముచేసి యవ్వంచనారతుని వ । ధిం
చువాడునుబోలె గర్జించివాని । వలననిప్పింపవలయు సర్వంబుధనము।
నమ్మియిచ్చినవానికి నరవిభుండు ॥ సీ. నిక్షేపమొనరింప నెమ్మియన్యు
నిచేతి ధనముగైకొనిన యతండుమరల । నీయకమున్నగతించెనేనియు
వానిపుత్రులైనమొసంగి పుచ్చవలయు । జనకుండునిక్షేపమొనరింప ప
రునిధనంబుజేకొనుట సర్వంబునెరిగి । యుండియుతండ్రి మృతుండగుమత
దాత్మజులువంచనము సేయ జూతురేని । బాత్రులగుకఠిన శిక్షాదిబంధ
నముల । పాలువడనధికారిచేపలువిధముల । నెరుగకుండిన వారగునేని
బొరయ । రీనిబంధనవిధులనిరెల్లబుధులు॥ సీ. ధనమునిక్షేపంబు వొన
రింప నిచ్చినవాడు మృతుండైన వానిసుతుల । కయ్యర్థము సమస్త
మర్పింపవలయు నిక్షేపంబుసేయు వాడా పదలను । నిక్షేపధనమెల్ల
నొతస్కరాగ్ని హెచ్చాత్ర ప్రమాదశమై దరిగెనేని , కాదు నిక్షేపం
బు గావింపధనమొసంగిన యాతడర్పింపుమనుటయురుక । ధారిధ
ర్మాధికారి సభాస్థలమున । సెప్పికొనుట । నన్వేషించుటొప్పు , నాత
డీతడునుగూడ । ననిరి విఖ్యాతమతులు । ఇదియసామాన్య పధము।మ

హాశ్వరునకు॥ గీ॥ నెమ్మిరయొనరుండు నిక్షేపమీయక, నపహరింపజూచు నాతడెవ్వ। డన్పృతమాడి బొందనరయు నిక్షేపంబు। వాడునుర్విదొంగ నాంధ్రునిజము॥ వ॥ నిక్షేపంబపహరించిన వానివలన నిక్షేపధనం బెంతయుందు, నంత దండనార్థంబుగా రాజుగ్రహించుటయు, నిక్షేపంబుసేయ నీగకయ నిచ్చితినను వానికి శరీరదండనంబుసేయుటయు నవశ్యంబు మరియును॥ క॥ ఏనరుడు పరద్రవ్యము। మానక గొనుత గవుదప్పి మనుజేంద్రుడాగిక। వానిగద సివధసేయం। గానగునది పెక్కజనులు గనుగొనుచుండక॥ క॥ నిక్షేపార్థంబెవ్వడు। సాక్షులెరుగని చ్చు నొక్క సఖునికి నతడా। సాక్షులు సెప్పినమాత్ర మ। దక్షతమెయిగొనుట చాల తగవనిరిబుధుల్॥ క॥ ఒరులెరుగకుండ నర్థము। నెరి నెవ్వడుదాచనిచ్చు నెమ్మినతని క। ట్లరహస్యంబున నీదగు। నరయక నిక్షేపధారియాదరముదగక॥ గీ. పరమభద్రాస్పదము నిరపాయకరము। నగుచు నిక్షేపవిత్తమేయనువులేక, నుండునేనియు కొన్ని నాళ్లుంచుటొప్పు। ధనమొసంగినవాను దెమ్మనుటకాదు॥ ఉ పాపరతుండు సోము రి యు పౌరుషవర్తనుడర్థమర్థని। క్షేపముసేయునిచ్చు తరికేవలమాన్యులుసాక్షులైగడుక। రూపరయుండుటొప్పు నపురూపముగాదటులైన నమ్మని। క్షేపముసేయునాతనికి జెందుభయంబటుగాక తక్కనక॥ క॥ పరధనపదార్థతతులప, హరించి యురువుగాధ నముగూరిచి ద। న్నొరులెరుగకుండ నతి గూ। ఢరహస్యస్ఫూర్తి నొక్కడచనిదగంగక॥ వ॥ నిక్షేపంబుసేయవలయునని ప్రార్థించు నేని వానివర్తనంబు పరీక్షించి బుద్ధిమంతుండుకాదు పొమ్మనవలయునట్లుగాక నొడంబడునేని గీడు మూడగు నెవ్వండు నిక్షేపంబుసేయ పరునివలన ధనంబుగైకొని వాని యనుమతిలేక యనుభవించువాడు మ్రుచ్చువోలె దండింప పాత్రుండు. మరియు నిక్షేపధారి ధనస్వామియను మతంబులేక వాని యవిభక్తపు సోదరులైన పుత్రులైన నవశ్య బంధుభావంబుగలవారలైన తనతోగూడ నవ్విత్తంబు భాగించు కొండురేని వాడు దొంగవోలె శిక్షింపంగాడు. దానొక్కరుండు మాత్రము హరించునేని యూరునూరులు పణంబులు,

దండనార్థంబుగా రాజసభ నర్పించుకొన బాత్రుండగునిట్లు॥ క॥ ధనపతి
యైదగునాతని । యనుమతి బొందక యవిక్రయము సేయుటయె । వ్వాని
కైన నొసగిపుచ్చుట । యనుగాదగ్గినదండయోగ్యుండయగుర్ ॥

క॥ భోగార్థమొరుని విత్తము । తాగైకొనుటేమి యొప్పిదంబదిగానర్ ।
వేగమదండించునది వృ । ధా గౌరవరహితు వానిధరణీశుడాగిర్ ॥
సీ॥ నెమ్మిమై దాచగానిచ్చినయర్థంబు నిక్షేపధారిగ్రహించివృద్ధి । బొం
దింప వాణిజ్యమును విక్రయము సేయుటెఱిగి ధనస్వామి బఱచి వచ్చి ।
ధనమిప్పుడయొసంగుమనుటయు నాతండు దగసమస్తంబు సత్యంబుసె
ప్పి । ఋచ్చుటైనను ధనంబిచ్చుటైనను తక్షణముసేయవలయు ఘనంబు
సెడక । నట్లుగాక నిత్తునసరాదనిన ధన । స్వామిపోయి రాజసమ్ముఖ
ంబున । జెప్పికొనినవచ్చుజేటు మిధ్యానాది । వోలె గాన తడవుబోల
దెందు॥ వ॥ నిక్షేపధారినిక్షేపంబు వృద్ధిపెంపొందజేయ వాణిజ్యంబు
సేయుటెఱిగి ధనస్వామి పార్థివునితో జెప్పికొనిన నృపాలుండా నిక్షేప
ధారిర్ శిక్షింపక తద్ధనంబిచ్చుకొనునట్లు శాశింపవలయు॥ సీ॥ దాచం
గనిచ్చిన నీచపదార్థంబులైన విక్రయము సేయంగ గాదు । తూచుట
యును దొడివేచుటయుదగదు ధనపతిమ్రోల నప్పనుటు వెలయు । నతి
హీనుడైన కన్యాశుల్కముల కాసజేయుటొప్పదు విశేషించియట్లు ।
గాక లోభమును ధనాకాంక్షయు దగి శుల్కంబుజేకొనువాడు కన్య
లిరువు । రిరువురకు నొసంగునెడ యేకశుల్కంబ । గొనవలయును కన్య
కుష్ఠరోగి । ణియును వెఱ్ఱిదియు ననేకవిధానర్హ । వతియునైన జెప్ప
వలయుమొదట॥ చ॥ అనుచితమైన వర్తనము నాసురి కృత్యము కాని
చేష్టలుర్ । గనలునిరీక్షణంబుగల కన్యయధాస్థితులెల్ల జెప్పగా । జను
వరుతోడ మున్న నయశాలితకన్నియనిచ్చు నాతడే, యనువును జెప్ప
డేనియు నరాధిపదండనపాత్ర భూతుడౌ॥ గీ. ఋత్విజుడు యాగమున

## *కర్మకారాది భృతిప్రకారము.*

కర్మమించుకంత । జేసి రోగాది పీడలజిక్కనేని । యదిసమాప్తంబుగా

వింప నర్హాంశముల । కీగునది సర్వదక్షిణ భాగములను॥ గీ॥ తనకు యజ్ఞ కర్తతగ నొసంగినదక్షి । ణాను లెల్ల యోగ్యులైన వార । లకు నొసంగగావలయు వారలాం కర్మ । శేషములు సమాప్తిసేయుటదగు॥ చ॥ తనరగయజ్ఞకార్యమున దక్షిణభాగములెల్లవారు గై । కొని యుచితక్రమంబు లోనగూడగ నెవ్వరికెవ్వియోగ్యమై । జనునవి సర్వకృత్యములు జక్కనొనర్చి జెలంగి యాజకుం । డనయము గౌరవింపగ మహాజనమైత్రతబొల్పుటొప్పగుర్॥ క॥ వారలలో నొక్కనికతి । గౌరవమున యజ్ఞకర్త కనకాదులు వి । స్తారముగ నీగనవి ముద । మారగ బంచికొనగూడ దందరు నొకటై॥ వ॥ ధర్మార్థము యజ్ఞకర్మంబులందు శాస్త్రోక్తంబులైన దక్షిణలుగాక ఋత్విజులందరిలో నొక్కనికి యజ్ఞకర్తయిచ్చునట్టి యన్యదానంబులు సేయునేని యవి వారలందరు విభాగించుకొనగాదనిజెప్పితి గావున నట్లువిభాగించుకొందురేని కనకరూపంబుగాన రేంద్రునకు దండనార్థంబిచ్చుకొనవలయు వారలగు నిట్లు ధర్మార్థమిచ్చుటయు బరిగ్రహించుటయు నాదిగానేక ధర్మంబులు తేటపరచితినింక॥ క॥ వేతనము నీగుటకునగు। రీతులునీకుండునెడ బరీక్షయొనర్పం। గా తగుమార్గములన్నియు । బ్రీతిఁ వివరింతు వినుడు ఋషులారదగర్॥ క॥ ఏయూయాసములేక య । వాయకతా జేయువలయు పనులతిమత్తుం । డై యొనరింపని నానికి । నీయవలదు కూలిదండనీయు డతడగుర్॥ వ॥ వానివలన కృష్టలంబులెనిమిది దండనార్థంబుగా రాజుగ్రహింపవలయు॥ చ॥ తనయజమానిసెప్పిన విధంబున నిక్కము సాధ్యమైన యప్పనులొనరింపగా జ్వరము పాల్పడిగుంది యశక్తుడయ్యుమెల్లన నొనరించు నేనియు విలంబముగాక సమృద్ధమైన వే । తనములు బొంద పాత్రుడగు దానొక చాడ్పున కూలివాడిలర్॥ క॥ ఆరోగ్యవంతుడైన మ । హారోగగ్రస్తుడైన యజమానిపనుల్ । గారవమున సేయనిచో । కారు భృతుల్ గొనగ మునిశిఖామణులారా॥ క. చేయించిన పనులకు భృతు । లీయనికృపణుండు కర్మహీనుండు శవ । ప్రాయుండ యనిరిబుధులు మ । హా యోగ్యతముల్ సనాతనపథంబుదగర్॥

గీ. వేతనంబులిచ్చు విధులనుకూలి వాం । డవి గొనంగ నొప్పనర్హాత యును । సెప్పనడియె మరియు జెప్పెద సంవిద్వ్య । తిక్రమప్రకార ధీరవిధులు॥ వ॥ వినుండనియిట్లనియె॥ గీ॥ కరము సంవిద్వ్యతిక్రమకారకులకు । వారలను పార్థివుండు ప్రవాసశిక్ష । సెయుటైన దండంబులుపాయ మెద్ది । గొనుటయైనగావింపంగ జనుగడంగి॥ గీ॥ బ్రాహ్మణుడు క్షత్రియుడు వైశ్యపాదభవులు । గడకసంవిద్వ్యతిక్రమకారులయిన । దండనంబులు గొనుటయుత్తమముగాదు । తీవ్రశిక్షలుసేయధాత్రీవరునకు॥ వ॥ ఇది సర్వసామాన్యపథంబని మన్వాదులమతంబు॥ క॥ సమయవ్యభిచారులు దు । ష్ట మనస్కులు క్రూరులగు ప్రజలనందరను । త్తమమధ్య మాధమచిరా । క్రమదండంబులనణంచిరాజు ఘనుడగుౕ॥ వ॥ ఒక్కవస్తువు విక్రయించి పశ్చాత్తాపంబునగలంగినవాడు పదిదినంబులేగకమున్న తత్క్రయధనంబు సర్వంబు నొసంగి మరలనది గైకొనుటయు కొనినవాడు నట్లచేసికొనుటయు సామాన్యపథంబు పదిదినంబులతిక్రమించెనేని యట్లుగాదు మరియును॥ క॥ చారిత్రరహితనిత్యమ। హారోగగ్రస్తకన్యయనువు దెలుపకే । పూరుషునికైన నొసగు న । గారవరతుదండనంబుగావింపజనుౕ॥ వ॥ షణ్ణవతిపణంబులైన నూరైన నృపాలుండు దండనార్థంబుగొనవలయు శిక్షించునదియని కొందరమతంబు॥ గీ॥ కన్యగాని దానికన్యయనుచుజెప్పి । యెవ్వడొకనికర్థినిచ్చువాని । వలనపార్థివుండవశ్యమునూరుప । ణంబులుగ్రుడ్డైగొనంగ వలయు॥ గీ॥ కన్యయందు లోకమాన్యతపాణిగ్ర । హణముసేయుటది మహామతంబు । కన్యగాని దానిగాను వరింప న । రించునేని ధర్మవృద్ధిదరుగు॥ క॥ ఆరయనిలపునరుద్వా । హారంభమువోలె నింద్యుడై చెడు కన్య । త్వారూఢిలేనిదాని స । గారవముదగౕవరింపగడగునతండున్॥ గీ॥ కన్యవార్తలరయకయ పెండ్లియాడిన । వాడు కన్యదోషవతియు రహిత । యగుట పిదప నెరుగనగునేని విడువగా । వచ్చుపదియునైదు వాసరములు॥ క॥ పదియైదుదినములేగిన । పిదప విడువగాదు కన్యపీడించుటయుౕ । పదతాడనంబుసేయుట । యుదగదు ప్రియమారనెమ్మి

నుండగవలయున్॥ క॥ గోవులుగాచెడివాడును । గోవులయజమానియు

—*గోపాలునిధర్మంబులు.*—

ను మిగులవాదంబుల్ । గావింప పరమధర్మము । లైవెలయువిధులు
వినుడు మహాశయులారా॥ సీ॥ అనిపల్కి యమ్మహామునిముఖ్యులనియె
గోపాలుండు నిత్యంబుపాలనంబు । సేయుచు గోవులకేయపాయములు
గల్గకనుండదివురుచు గఱికి జొంప । ములమేపి సాయాహ్నమున యజ
మాని గృహమునజేర్చి గోగణములుసేమ । ముగనున్న యవియని త
గజెప్పిదూడల బరికించి గుడిపించి పాలుదీసి । పాలకడవ జాలభద్రంబు
గాగొని । వచ్చి స్వామిచేతికిచ్చి మరల । వత్సములనుగట్ట వలయు
పిమ్మట తన । మందిరంబుసేరమాన్యులార॥ క॥ పదియావులపాలు ద
గన్ । బిదికెడిగోపాలకుండు బిదికికొనుట యొప్పిదమగు భద్రంబుగనొ
క । మొదవపొదుగుపాలుదూడమురియకనుండన్॥ క. గోపాలుడుగో
గణముల । గాపాడన్ గలడటంచు గాదరయక ని । ర్వ్యాపారస్థితినుం
డం । గా పశునాయకుని కెట్టిగతులలవడినన్॥ చ. నవనవలాడుచున్
దగుతృణంబులు పొట్టలనిండమేసి ప । ల్లవములజొక్కి నిర్మలజలంబు
లుద్రావుడు రోమకోటులు । క్కవొడచునట్టి చందమునుగన్గొనిగోవు
లగోపకుండు దో । లవలయుదొడ్డికిన్ మదిజెలంగుచు వేణునినాదమిం
పుగన్॥ సీ. నష్టమైనను క్రిమివ్యాకీర్ణగతులవి నష్టమైనన్ప్రయత్నం
బులేమి । పులులాదిగాసత్వములచేత హతమైనసర్పదష్టంబులై జచ్చినై
న । లాతిగోవులతోపలాయనంబైనచోరులప్రాలువడిన నొరులుహరించి
కొనివేగపోయిన గుంటలంబడి చిక్కినను నూతవడినవనంబులందు। గాన
రాకుండినను గిరిగహ్వరముల । నిరికికొనిననురుక బరుగెత్తివచ్చి ।
స్వామితో జెప్పవలయు సర్వంబుగోప । కుండుగోవునశింపకనుండునైన॥
చ. మనువువచించెపూర్వము ప్రమాదవశంబునగోవుమేపు చుం । డి
నతరిజచ్చెనేనియు గడిందిగదానియథార్థమంతయున్ । గనుగొనిస్వామి
నమ్ముటకు కర్ణయుగంబును కొమ్ములున్ గొనన్ । జనుఖురముల్ స
మాప్తమగు చర్మముగోపకుడెందునేనియున్॥ వ. ఇట్లు గొనిస్వామికవి

గుర్తించి చూపవలయు॥ క. గొఱియలు మేకల కదుపులు । బఱచు నెడ
లపాలనంబు బాటింపనిచో । దెఱపిగని వృకంబులు వెం । పురుక మె
యిన్ హాతము సేయు నొక్కెడొకండున్॥ వ. కావున॥ క. పాలనము
సేయకుండుట । పాలకునకు బొరయు దోష భరమతిజాగ్ర । ల్లీలనర
యువాడైనన్ । కాలము సేరంగ లేదు కల్మషమరయన్॥ సీ. అగుపరీహా
రంబు లందు ధనుశ్శత మాత్రదూరంబు గ్రామముల చెంత । నెలవు శ
మ్యాపాత ములు మూడు త్రిగుణీకృతము మహానగరాంతి కములయం
దు । పశువులు మేయంగ పచ్చికబయలుగా విడువగనది శాస్త్ర విదితమ
తము । హాలికులొకభంగి నట్లు విడువలేని గోపకుండేమఱి గూరుచుం
డు । నప్పుడాసీమ గోవొకండైన బెక్కు । లైన పరువెత్తి సస్యంబులంది
మేయు । నట్టి దోషంబు గోపాలునందు లేదు । గాన వానిని శిక్షింపగా
దు నృపతి॥ ఉ. కంచెలు వెట్టియాపొలము కాపులపాళ్యము నిత్యమున్
బరీ । క్షించుచునుండు టొప్పునటు సేయక నూరక నుండువారలై । నం
చెదు సస్యముల్ పశుగణంబులు నష్ట్రిములూరబందులున్ । కంచరగా
డిదల్ భయముగానక మేయగజొచ్చుగావునన్॥ చ. గవిసలు శిద్ధమె
వెలయ కంచెలు చుట్టును గాను పింపమా । గ్గవిధులు సెప్ప నె
ప్పిదముగాగ విశాలములైన నంజలూ । డ్పువొలచి సగ్వసస్యతృణ
పుంజమనోహర భాతిదోప దొ । ట్టిపిడ చిగాచుచున్ ప్రతిఘటింపక
హాలికులుండు టొప్పగున్॥ గీ. కంచెలు దెరల్చుకొని పశుగణము వారి ।
సస్యములు మేయుటయును గర్షకులుజూచి । పాలకుని వలన నొకపది
పణములు గొను । టొప్పు గోవులబంధించు టొప్పు దెందు॥ వ. గోవు
లు సస్యంబుల కెంత నష్టంబు గలిగించు నన్ని పణంబులు గోపాలుని వల
నంగాని గోస్వామి వలనంగాని గొనుటయు ననదుగా నష్టంబగునేని
గోపాలునికి భయంబు సెప్పి పుచ్చుటయు నీనినదినంబాదిగా పదిదినం
బులేగకుండు గోవును యెదమైన యాపును దాని వెనుదవిలి చను కోడె
లును శంఖచక్ర త్రిసూలాద్యంకితంబులగు వృషభంబులును దైవ
సంబంధంబులగు నావులును పాలకుండుండియున్నైన లేమినైన సస్యం

బులు మేయుటనుజూచియు బంధింపకుండుటయు గోపాలునిదండిం
పకుండుటయు ముఖ్యతమంబులు॥ నర్కుటవృత్తము॥ వలవదు పాల
కుఁడొడరి స్వామియనేకసము । జ్వలపరుషోక్తులాడ మరివాడొకకా
లములో పలతనయిచ్చవచ్చిన నెపంబుచేసిననై । నలఘుతరంబు
సేయుట మహానుమతంబగుఁ॥ శుద్ధవిరాటవృత్తము॥ సారాచారము
స్వామిసేయఁగా । పారంబైతగుపాటిదాను నిం । పారఁ పాలకుఁడాప్తవ
ర్తన । స్ఫారస్ఫూర్తినెసంగబెంపగుఁ॥ ప్రణవవృత్తము. గోపాలుండతి
కుటిలాచారుం । డైపాటింపకనతిస్వేచ్ఛా దు । ర్వ్యాపారంబుననలగం
గా స్వా । మ్యాపద్భంగికి ననుకూలుడగుఁ॥ జలధరవృత్తము. గోపరి
పాలకుండు తనకుంబ్రియమే , రూపునసేయఁడేనియునుప్రతిభఁ ।
భూపతితోడఁజెప్పకొనబోలు గరి , స్థాపరుడుఁ వివేకియగుస్వామిద
గఁ॥ మేదినీవృత్తము॥ తనునొకపాటిసేయక స , దానిజేచ్ఛవర్తిం ।
చినపశుబాలకుఁ విడువ చెల్వొసంఘటించుఁ । ననియెమహామతాప్తి
మనువంతకుండునెమ్మిఁ । వినభువిస్వామికీ విధులు వృద్ధిమైజెలంగుఁ॥
క. గోపాలకుండుస్వామియు । నేపారవివాదములు వహించిన ధర్మ ।
వ్యాపారరతుడు ఘనుడగు । భూపతిచర్చించి దోషములుగనుటొప్పుఁ।
క. సీమావివాదముల నిరు । గ్రామంబులవారు బేర్చికలహింపంగా ।

—*సీమావివాద పరిష్కార ప్రకారము.*—

దామహితహితాప్తిమెయిఁ । భూమీశుడు జ్యేష్టమాసమున దీర్పన
గుఁ॥ చ. మరిపొలిమేరగుర్తులను మఱియురావియు కింశుకంబులఁ ।
దరుచుగ నామ్రవృక్షములు తాలములుఁ బహుపంక్తిభేదమిం , పెర
యఁగనాటగావలయు నెందునువృద్ధి రహించుతీవెలుఁ , బరపగుచెట్టు
లుఁ పొదలుబంధురవంశ విశాలగుల్మముల్॥ వ. సాక్షరాంకిత భూ
యిష్ఠంబును లింగాకారంబునగు రాయియొకటిస్థాపించుటయు జాలతె
స్సయగు॥ క. మఱియును నూతులుబావులు । జెరువులును గొలంకులం
దు జేయింపనగుఁ , గురుతుగనస్థికఫాలపు । పరియలు భూగర్భమం
దు బ్రాతగవలయుఁ॥ సీ. సీమావివాదంబు జింతింపననువుగాకుండిన

వృద్ధులుసత్తములగు । వారలనడిగి ధాత్రీరమణుండాప్తి గుస్తులిడంగ
సంకోచమొదవ । దండసాక్ష్యము సెప్పనట్టివారలు శిరోజములు వ్రే
లాడంగ విమలరక్త । చేలధారులు పుష్పమాలావిరాజిత కంఠభాగులు
నమస్కారపరులు । నగుచుమంటి గడ్డలాత్మీయశిరముల । వెట్టికొనిగ
డంగిరొట్టులాడి । యనృతమెల్లమెన్నడైననుచు పొలి । మేరనిర్ణ
యించు దీరులెస్స॥ క. వారలునుడివినటుల పొలి । మేరలు నిర్ణయము
సేయమేలకునిల ను । ర్వీరమణునకునిజేచ్ఛ విచారింపగబోలదట్టిసమ
యంబులలోన్॥ క. ఆపొలిమేరలకధిక స । మీపములగు నూరులందు
మేటులనంగా । దీపించువారలేవ్వురు । రూపింపగవచ్చు భూవరునితో సం
ధుల్॥ నాలుగూరులందు నల్వురుపెద్దలు। సంధినిర్ణయంబు సలుపుటొప్పు।
ననిమెమనువు కారు సునయశూన్యులుదుష్టు । లోకక్రియూరనాప్తిగుం
డువారు॥ ఉ. బోయయుగోపకుండు ఫలపుష్పదళంబులు దారుఖండ
ముల్ । వాయక విక్రయించుకొనువారలు పాములవాడుగొల్లనున్ । జే
యుటజాలలెస్సయగు చేసువసంధినిర్ణయంబు వా । రేయెడకాననంబు
లజరింపుచునుండుదురింతగావునన్॥ క. వారలుసెప్పినయట్ల మ । హీర
మణుండరసి సంధినిర్ణయమతిగో । ష్ఠీరతులతోడ సేయం । గారెండుతె
రంగులందగవుపెంపొందన్॥ క. వాపీకూపతటాక స । మీపక్షేత్రము
లకొక్కమెయివాదంబుల్ । బ్రాపుకొనిసేయువారల । భూపతివారించి
ధర్మభూయిష్ఠగతిన్॥ క. ధీమహితులునుత్తములగు । సామంతులనడగి
సేయజనునిర్ణయమా । రామగృహతటాకాదుల । కేమెయివతుంబుడి
గిమహితమతులారా॥ క. అనృతంబులు సామంతులు । మనోనియ
మంబులేక బలికినపతి ఛీ । యనదండింపవలయు తీ । రని నిష్ఠురవాక్య
ములుబరగుననిరి బుధుల్॥ క॥ వెరపించి యింట్లతోటలు । జెరువులు
పొలములుగొనిన యశిష్టరతుల దా । వెరపించి దిట్టిగొనునది । యురు
కన్ పంచశతపణములు ర్వీశుడొగిన్॥ క॥ మరియును వార్తామాత్రం।
బెరుగమినన్యుని ధనంబు నెలమిగొను జనున్ । వెరపింపక ఛీయని
గ్ర। చ్చరతద్ధనమున్ గొనునది సభ్యులెరుంగన్॥ వ॥ ద్విశతపణంబు

లుఁగొనవలయు. ననికొందరమతంబు॥ క॥ పొలమేరలందు తోటలు । శిల
లును సంస్థాపనంబు సేయింపంగా । వలయు నరేంద్రుఁడు వాదం। బులు
డిగి ప్రజలెల్ల సౌఖ్యముగవర్తింపన్॥ క॥ సీమావినిర్ణయాదుల । సామా
న్యపథంబులెల్ల జక్కనుఁడివిత్తిన్ । నేమీరలువిన వెండియు । నేమముల
గు సూత్త్మవిధులు సెప్పెదు నెలమిన్॥ వ॥ అనిచెప్పియిట్లనియె॥ గీ॥ క్ష
త్రియుఁడు బ్రాహ్మణుని నిందసడియొనర్ప । శతపణంబులుగొనుటయు
సత్యవాది । యైన వైశ్యునినిందించు నంఘ్రిభవుని । వలన యేబదిగొ

—*దుర్వాక్యదండన ప్రకారము.*—

నుటయు వెలయుపలికి॥ క॥ గుణనిధియగుక్షత్రియు బ్రా । హ్మణుడవినీత
ములువలు కనటుపంచాశ । త్పణములుదండముగొనుట శ । రణరహితు
ని జేయుట సుకరము భూపతికిన్॥ సీ॥ ఇరువదియైనైన నిరువదియైనపణం
బులుగొనుట మహామతంబు। వైశ్యుండు శూద్రుగర్వముమీరి నిందింప
విప్రుండు వేరొక్కవిప్రునింద , బరిగింప షండ్రెండు పణములు వాదం
బులఁగైన నిర్వదియైదుపణము । లైన నిర్వదియైన మానక గొనునది
భవ్యతముండగు బ్రాహ్మణునిహా , సించి పరుషోక్తులాడిన చెనటిశూ
ద్రు । జింహగోయించుటైన నిష్ఠీవనంబు । నోటనురిలించియణచి తను
వుగ్రృశింప । జెలు నిడుఁట యైనదగునీతి మెరయుపలికి॥ క ॥ఆరంభము
సెడిబెంపురు ! వైరూపటుటేమి బ్రాహ్మణాధమయని గ । ర్వాయూఢివి
ప్రు పలికిన । క్రూరచరితు శూద్రునగ్ని గూరింపనగున్॥ వ॥ అగ్నితప్త
స్తంబగుతైలంబుకర్ణరంధ్రంబులందును నోటియందును బోయింపవల
యునని కొందరమతంబు॥ ఉ॥ పాయవునీవు నీచరతి బ్రాహ్మణధర్మప
థంబెరుంగ వో । హాయనిశుద్ధకర్మరతినుండుము ధీయని పేరులేని నీ ।
చాయయునైనసంటనని సాహసమొప్పగ విప్రునాడు న । త్యాయతబు
ద్ధినైన దెగటార్పదగున్ నరపాలుఁడంఘ్రిజున్॥ చ॥ పరమపవిత్రమూర్తి
యగు బ్రాహ్మణవర్యుడనేను గా ననా , చరణములొత్తుమీావని యు
సమ్మతి శూద్రుని బల్కు విప్రునిన్ । నరపతియుగ్రుడై కదసి నాలుక
గోసి యురంబుగ్రుద్ది చె , చ్చెరజనుమేలనింతలని సెప్పిదిరంబుగ బుచ్చు

టొప్పుగఁ॥ క॥ పారగమతినిర్మల వి। ద్యారతుఁడగు శూద్రుడును మహా
మహుఁడు సదా। చారమ్ములేక వ్రత సం। స్కారపరుడుగాని ద్విజుని
కన్న నరయఁగ॥ సీ॥ గ్రుడ్డియు బధిరుండు కుంటియు గుజ్జువాడును
గాన నయినచో జనువుచేసి। గ్రుడ్డివాడాయని గుజ్జువాడాయని బధిరు
డాయని కుంటివాడయని య। గౌరవరతివల్కు వారల దండింపవలయు
భూపతి గౌరవంబువరాని। యాత్మసంబంధుల నాలిబిడ్డల నన్నదమ్ము
ల మఱి తల్లిదండ్రులగు గు। రుల సదా చెడనాడిన తులువకతన। దండ
నము సేయునది యపాత్రతజెలంగు। వారలాగ్యుల మనివల్కువారలైన।
నాలుకలు గోసిపుచ్చుటర్హతమమయగు॥ క॥ అనుచిత వాక్పారుష్యం।
బునకగుదండన విధులను బోధించితి దం। డనపారుష్యమునకు సే।
య నయినవిధులింక వినుడనఘమతులారా॥ క॥ ఏయంత్యజుడంగంబు

—*దండనపారుష్యవిధులు.*—

లు। గాయపరచు నుత్తములుగానకనైనఁ। గోయందగువాని తను
వు। హేయాస్పదముగ నృపుండనిరి భవ్యతముల్॥ క॥ పాదంబుతోడ
దన్నిన। పాదంబును పాణినేయపాణినుదగ్రుం। డై దోడన ఖండింపం।
గాదగు భూవిభుడువాని గర్వంబణఁగ॥ వ॥ ఏనికృష్టవర్ణుండుత్కృష్ట
వర్ణునితో సమానాసనంబున నుపవిష్టుండగు వానికటిప్రదేశంబున త
ప్తంబగు లోహపిండంబుతోడ గురుతులిడవలయు వాడు గౌరవనీయుం
డగునేని యట్లుచనదు॥ మఱియును॥ గీ॥ ఉత్తముండనంగ నొప్పువానితని
మేన, నోడకిధముడురుకనుమియునేని। గదసి యణచివాని పెదవులు
రెండును। గోయునదినృపుఁడు కూరికూరి॥ గీ॥ విబుధుతనువున మూ
త్రంబు విడచునట్టి। యధముశిశ్నంబు గోయింపనగు పురీష। మైన
నుక్కరగొఱ్ఱ వేయంగవలయు। పరమధర్మరతుండగు పార్థివుండు॥
గీ. కేశపాశంబు మీసముల్ గ్రీవమువృష। ణములువట్టి దివిచిభవ్యత
మునిద్రోయు, నధము బాహుయుగంబు శితాసినరుక। వలయుభూపా
లకుండు గర్వంబుదరుగ॥ సీ॥ చర్మంబు ఛేదింప శతపణంబులు మాంసమ
ణచిఛేదింప సహస్రములును। నెత్తురువారంగ నొత్తివేయగ నాల్గునూ

ర్లుగొనఁ వలయును నృపుండు । గంటుపెంపరమేనకండలు దెగి శల్యము
లు విరుగంగనమోఘుదృష్టి । నేసినదుష్టు బ్రవాసశిక్ష కృశకాయుఁజే
యునది భోగంబుకొరకు । నరుకరాని చెట్లనరికిన గ్రూరచ । రిత్రు
బాత్రతము చరిత్రమెఱిగి , యెరిగి యుపహసించు గరదుమహాదండి ।
తులుగఁజేత నృపుని కలఘునీతి॥ వ॥ ఫలవృక్షంబులునఱికినవాని నుత్త
మంబుగను పూచినచెట్లగొట్టువాని మధ్యమంబుగను నల్లిగుల్మలతాము
లు ఛేదించినవాని నధమంబుగను నవాంకురంబులు వెరికినవాని నధ
మాధమంబుగను దండింపవలయు॥ గీ. నరులనైన పశుగణంబులనైన
నే । యంగ దిప్రుగు దుష్టుడణచి యెంత । లాచరించె తొల్లియంతలుపీ
డింప । వలయు నృపుడు ధర్మవర్తనుండు॥ సీ. హస్తాదిసర్వావయవముల
లోననే యంగంబునందు గాయంబు సేయు । పాపాత్ముదుగ్రశిక్ష పీడి
తునిజేయువలయు నావ్రణ మెన్ని వాసరముల । కగు పూర్ణస్వాస్థ్యమాయ
తముగ నన్నిసంవత్సరంబులు మహీవల్లభుండు । వానివెండియును ద్ర
వ్యంబు రత్నంబులు లోహపదార్థంబులును హరించు । వానివలన గో
లువడినవానికి గోలు । పడిన వస్తుతతులవశ్యమిచ్చు । నట్లు సేయుటో
ప్పునంత ధనంబు దం । డంబుగొని నృపుండడఁకువ సెప్పి॥ వ॥ హరించిన
పదార్థంబులు నష్టంబగునేని యోగ్యంబగు క్రయధనంబైన నిప్పించుట
యు రథంబైనబండియైన దోలుచుండువాడు నేర్పు చాలమిగుఱ్ఱంబుల
నైన నెద్దులనైననుఱుకనదలించుచుండు నెడ నవిమార్గంబుదప్పి గండ
శైలంబులపైఁబ్రాకియైన జెరువులకొలంకుల నేరులనూతుల బావులం
బడియైన గర్తంబులకాళులిఱికికొనియైన నింకనేయుపాయంబుల బ్రాలు
పడియైన జచ్చుట వికలాంగంబులగుట సంభవించునేని వాని మూల్యం
బుత్రిగుణంబుగా బెంచి యాసారథివలన తత్స్వామికిప్పించుటయు నార
థంబునందైన బండియందైన కొనిపోవంబడు పదార్థంబులు చెడునేని
వానిక్రయంబును రథంబైన బండియైన విరుగునేని తన్మూల్య ధనంబును
తత్స్వామికైన తదనుమతంబువడసిన వానికైన నిప్పించుటయు నారథం
బునందైన బండియందైన ప్రయాణంబు సేయుజనంబుల కపాయంబగు

నేనిశిక్షించుటయు రాజనీతిప్రకారంబు నెండియు॥ గీ. ఆలియైనపుత్రుడ
యినభృత్యుండైన, ననుజుడైన శిష్యుడైన తప్పి। దంబు సేయ వేఁడ
శమైనత్రాడైన। నెత్తికొట్టవలయునుత్తముండు ॥గీ మూపుమీఁదగొట్టు
టేపారుకాదు శి, రంబుమీఁద నాననంబుమీఁద। రొమ్ముమీఁద గను
నురుకసేయుటొప్పు మ, హాపరాధియైన పాపచరితు॥ వ. దండపారు
ష్య విధంబు సెప్పంబడియె నింకక్రముచ్చిలు వానికి సేయవలయు దండ
నాదివిధులు దేటపఱతు వినుండని యిట్లనియె॥ క చోరులవలన భ

—*తస్కరదండనాదివిధులు *—

యంబు మ, హీరమణుడు ప్రజలకొదవనీయక దృఢకా। ర్యారంభ
ము సేయవలయు। వారలపైదానగౌరవము చెలువునగుఁ॥ క. ఏన
రపతి ప్రజలక భయ। దానమొసగు తస్కరులవధము సేయుచు స,
న్మానితుడగు రాష్ట్రంబున। నానృపుడు యశంబు చెలువునతిశయము
దగుఁ॥ చ॥ నరపతి తస్కరాదులభయంబు జెలంగనిభంగి దండన।
స్ఫురణముదాల్చునేని బొలివోవక నిత్యసుఖానుకూలముల్। వారయు
దురెల్లవారలు విభూతియు నాజ్ఞవముఁ మహాజనా। దరతరపాత్ర
ముఁ పడయుఁదాన నతండు దొలంగుదుర్మతుల్॥ క. చోరులుధూ
ర్తజనంబులు। పారములేకిచ్చవిహగు భంగిరహింసం। గారాష్ట్రము
పాడగు ను। ర్వీరమణుడుదానవారయు విపరీతంబుల్॥ క. పాలన
మతిధర్మాస్పద। మైలాభముగోరకునికి నధిపుడువిభవ। శ్రీలా
భంబులువారయు క। శాలసితుడు శుద్ధమత విలాసుండగుచుఁ॥
గీ. ప్రజలనందరసద్ధర్మపథమునుండి, దొలగకుండంగ శాసింపదొడఁగ
వలయు। దానవారలు సేయుసద్ధర్మమందు। వారయుషడ్భాగమదియ
విపులమతంబు॥ గీ. పార్థివుండుయోగ్యపథమున ప్రజల శా। సింపకుం
డునేనిసేయువార। లురుకధర్మహానియొదవునధర్మ ష। డ్భాగమరయ
దానిభవ్యులార॥ గీ. పరమధర్మపథము బరగించిఘాతుక। జనులనణచి
దివుటసర్వభూత। రక్షణంబుసేయురాజవర్యుడు ప్రభు। వనగబరగున
న్యులట్లుగారు॥ క. న్యాయార్జితమగువిత్తము। పాయునములుగూడ

మనుజపతియాగంబుల్। సేయునదియు నేకము లత్యాయతదక్షిణ లొసం
గియనుకూలరతిఁ॥ క. ప్రతిభాగము శుల్కంబను। చితదండము ఖర
మురతు సేయకకొనుభూ। పతిరెండులోకముల న। ర్హితుడైనరకమునబ
డుననేకయుగంబుల్॥ క. పరిపాలనంబుభవ్యము। పరాయణముగుపు
గాకబలిషడ్భాగా। ప్రిరహించునరేంద్రుండిహ। పరములమలహారియ
నగబరగుసతంబుఁ॥ క. అనపేక్షితమర్యాదియు। జననింద్యతముండు
క్రూరచరితుడకౌ। ఘనుడతిలోభియు నాస్తికు। డునగున్నృపతినరక
మునబడుఁ బుధులారా॥ గీ. నధముచేసినైన వడినిరోధంబు గా।
వించినైననృపతివివిధగతుల। న్యాయపథముదప్పి నడచుదుర్మార్గుల।
నణచిపుచ్చవలయు నాస్యలలర॥ గీ దుష్టనిగ్రహంబు శిష్టజనానుగ్ర।
హంబునాచరితమహామఖక్రి। యాభిరతియు సజ్జనారాధనముగల, పా
ర్థివుండు పరమపావనుండు॥ గీ. బాలురకు వృద్ధులకు నయపారగులకు,
నాతురులకు బ్రియంబుసేయంగబూను। టయును పాపులదండించుట
యును ముఖ్య। కర్మములురెండు నృపతికి గణనసేయ॥ క. ఆపదలుగ
లుగువేళల నోపుటసద్గతియు కల్మియొనగూడుతరిఁ। కోపము గర్వం
బును దుర్వ్యాపారము సేయుట న్నరకము బొరయుఁ॥ క. కనకాదు
లపహరించిన। జనముల గోల్పడిన వారుసమ్మతి బొందం। గన్నృపతి
దండింపంగా। జనుదానంబొరయు నతడుసద్గతులెల్లఁ॥ క. బలవంతు
డు తనుగదిసిన। బలహీనుడు ధనముగోలు పడినయతడు ప్రము। చ్చు
లదాడిబొరయు వాడును, విలపింతురు పందమనుజ విభుడంచెదలఁ॥
క. జాగ్రత్పవర్తనము దగ, నిగ్రహమొనరింపవలయు నృపతివెదకి క।
ష్టగ్రాహకుల దురాత్ముల। నిగ్రహశీలుడఖలురనని యె మనువుదగఁ॥
క. తనువెల్లవారు పొగడగ। జనపతిదండంబు యోగ్యసరణి నడపు
చుఁ। ధనమొసగి బీదసాదుల। ననయము రక్షింపుచును మహాపద
ముగనుఁ॥ క॥ శాసింపవలయుచోరుడు।భూసురుడైనఁ దివుటనృపుం
డటు సేయం। గాసర్వజనంబులును। ల్లాసంబుననుండు భీతిలకనిత్యం
బుఁ॥ చ ॥తనయుడితండు భాంధవుడితండు గురుండితడీతడాప్తుడీ। త

నినెట్టుశిక్షసేయనగు ధర్మపరుండగు విప్రుడంచు దా , ననయము పంశ
యింపజన దారయభూపతి యేనరుండు దో । షవిరతినుండు వానిపరు
షంబుగ దండితుసేయుటొప్పగున్॥ గీ అడచియైన జిక్కువొడిచియైన
నృపుండు । దండనంబుసేయు టొండుతెరవు । ముచ్చిలించువానిజచ్చి
వాడట్టిదోషంబు వొరయకుండ సాధులారా॥ క. శాసనము భూవిభుం
డు స , దాసలుపకనున్న దుర్మదము నత్యధికో । ల్లాసమును వెలయ
దుష్టులు । శాసింపుదురెనుగు లేక సాధుజనములన్॥ క. సతిరయినరిం
చున ఘంబులు । పతిబొందిన భంగిప్రజలపాలింపని భూ । పతి వారలా
చరించు దు । రితములు సగబాలువొరయు రేపున్మాపున్॥ సీ. ధరణీ
శ్వరునిచేత దండిపనడినట్టి పాపాత్మకుడు తనపాపచయము । వాయుగా
వునన్ప్రమేయంబు వాటిల్లమనుజులందరికు నృపునకు దండ । మతిభ
వ్యతమనుకు మతియెవ్వడణచుధర్మము గోరిశుద్ధజలములునుప । వ
డినగేహంబు కూపములోని నీరుదీసికొనత్రాడును ఘటమొకడుతీర ।
మందిడగనది హరించు దురాత్మకనక , మాషదండింతు సేయుట
మనుజపతికి। వలయుధాన్యంబుముచ్చిలు వానిదశగు । ణములుబేరిచి శి
క్షించునది సతంబు ॥ గీ. ధాన్యముహరించువాని వధంబుసేయ । నగు
ననిరి కొందరిత్యల్పమైనట్లు । గాదుకోపింపవలయు రక్షణములేని । ధన
ముగొను వానివధసేత ధర్మపథము॥ గీ. కనకమును రత్నములు గోవు
లును సుచేల । ములును నూరుపణంబులు విలువసేయు । వానినెవ్వా
డుముచ్చిలు వానివధము , సేయునది కొలదియగునేని సేయరాదు॥
సీ. పంచాశతమునకు మించినవస్తువుల్ ముచ్చిలు నరుహస్తములనున
రుక । నగునంత సంఖ్యలోనైన విహరియించు వానివలన గోలుపడిన
వస్తు । వెంత మూల్యముసేయునంతలు పదియదుంగులు గొనునది మ
హాకులజులైన । పురుషుల తరుణులపుస్తకంబులు రత్నములు దొంగి
లించిన కలుషచరితు , వధముసేయంగవలయు నౌషధములస్త్ర । శ
స్త్రములుగోడ్రలును శుభ్రవస్త్రములు హ। రించువాని తెరవు విచారిం
చి దండనంబుగావించుటొప్ప మతంబుపేర్మి॥ సీ॥ ఫలములాకులు శాక

ములుపప్పుబెల్లంబుశర్కరయును గంధసారములు ల। వంగంబులునుమా. ష్టివంబులు గంధంబుపాలు పెరుగు నేయి పానకంబునుప్పుచర్మంశులునప్ప శంబులు పేటికలుధాన్య జాతులు కలశములును, పాత్రంబులును తేనెపా యసంబును తైలమామిషంబును కల్లునాలజున్ను। మొదలయిన యల్ప తరమూల్యములు హరించి.. పాపరతువలన నవిగోలుపడినవారి । కర్ధి నిప్పింపవలయును పార్థివుండు । గోల్పడిన వస్తువునకుద్విగుణము వెంచి॥ క. ఫలములుమూలంబులు కూ । రలు ధాన్యంబులు గొనంగరాదవి గలవా । రలు లేనిచోగొనిన శా । స్త్రులగుఁ శతదండమున కొరులు ఋషులారా॥ క. త్రేతాగ్నులుశుద్ధరస । వ్రాతంబులు శిద్ధమయి న న వస్తువు లెవ్వం । డాతతగతిమానిగొనుఁ । నాతనిదండింపవలయు న వ్వుడనివుటఁ॥ క. ఏయువయ వంబులనువుగ । స్తేయము గా వించునరుడు దివిరి నృపుడాగిఁ, గోయింపవలయు నప్పుడ । యాయంగములు రుక వానిననిరి మహాత్ముల్॥ చ. తనయులు తల్లిదండ్రులు హితవ్రజ ముఁ గురుడుఁ పురోహితుం । డును సతులుఁ సమానులుగడుఁ విగటింతురు రాజుతీవ్రశా । సనములరింపకున్న బలుసాహసకృత్యములా చరింతు రు । గ్రనిరితిమై జరింతురు పరస్పర వంచన కృత్యశీలురై॥ గీ॥ గాననెట్టివారినైన శాసింపగా । వలయు పార్థివుండవశ్యమనియె। మనువు నృపతి యాజ్ఞమన్నింప కపరాధ । మాచరించువాని నణచుటొప్పు॥ వ॥ అపరాధంబుచేసిన శూద్రునివలన నెనిమిదియు వైశ్యుని వలన పదియారును క్షత్రియునివలన ముప్పదిరెండును బ్రాహ్మణుని వలన యరువదినాలుగును పణంబులు దండంబుగొనవలయు నపరాధ మెంత నింద్యంబై యుండు నంతకుఁ దగినదండంబు ప్రాముఖ్యంబు॥ చ॥ అనుచితమైనవర్తన మహాయనరాదనలార్థ మెవ్వడిం । ధనములు సారమూలములు దారుఫలుఁ గొనిపోవునన్యుడై। న నతనిగూర్చి పూవులు తృణంబులు జేకొనువానిగూర్చి కా । దు నృపతితోడ జెప్పికొన దొంగలు వారలుగారు సత్తముల్॥ క॥ అయుతనియతిమెయితపము, సేయునతడు జేరువయగు జెట్టులఫలముల్ । గోయగమూలంబులుగొన ।

గాయోగ్యుడు దొంగయనుటకాదాఘనునిర్॥ గీ. యాజనాధ్యాపన
పరిగ్రహములనైన । కాదుదాత యొసంగనికాలమందు । బ్రాహ్మణుం
డర్థిగొనగ జౌర్యమగు నాకు । కర్మమాతడు దండింపగతగువాడు॥ క. తె
రువరి యాకటిజిచ్చుల । జెరుకుగడలురెండు గొనగజెల్లుద్విజుండ । త్రైర
వైనవాడ సమర్ । మరికొనగ రాదు పేదమానిసినైనన్॥ చ॥ పరు
లహయాదులన్ గడిగిపట్టుట చోరుడువోలెబోయి యె । వ్వరునటవిప్ప
గావనిన వానినివిప్పుట యాతతాయియై । పరులరథాశ్వయానముల భా
రవహంబులదాచి పుచ్చుటె । ప్పరు సునకాడ । చోరుడగు బ్రాతిగనప్ప
నులాచరించినన్॥ క. ఈధర్మపదములన్నియు।బోధాపూర్ణములు గాన్న
పుడు నడపి యశ । శ్రీధనధాన్యవిభవ వి। ద్యాధారేయుండగున్ మహాశ
యులారా॥ గీ. పరమసౌఖ్యపదము బడయగోరిన మహీ । వల్లభుండు
గౌరవంబు సెడక। ప్రజలనుచితభంగి పాలింపవలయు వి । ద్యాయశస్స

—*బలవద్వ్యభిచార దండనాదివిధులు.*—

మృద్ధిదగసతంబు॥ క. పారుష్యంబులు పలికిన । వారలకోపించుటయు
నవశ్యము కష్టా । చారపరాయణాంతులగు । వారలశాసించుటయును
వలయున్నృపతికిన్॥ గీ. హింససేయునరుల హింసించుటయు జౌర్య। వృ
త్తినుండువాండ్ర వెడలనణచు । టయు మహామతమువిడచిన విప్రులచె
డ । నాడుటయు నృపునకుమూడుపనులు॥ చ. మనుజుడొకండుసాహస
ము మానకసేయగ రానిసేత చే । సిన నరనాథుడొప్పదటుసేయగనీక
ని దూలనాడి దం । డనమొనరింపడేనియు గడంగుదురందరు నట్లజే
య దా। న నణగుకీర్తియున్ బలధనంబులు తేజమునల్లనల్లనన్॥ చ. అ
నుజుడితండుపుత్రుడిత డాప్తుడితండని పెద్దజూచియే । జనపతియాచరిం
పదురు శాసనముగ్రతసాహసక్రియల్ । వెనరుచు వానినాతడతివుండ
ననొప్పియు హీనుడైచెడున్ । దనుగను జుల్క నాడుచు వృథాప్రజలం
దరు గోలసేయగన్॥ క. పేదలకును గొప్పలకును । వేదపరాయణతవె
యు విప్రులకును బెం । పేదియడరుగాంచు న । నాదరణీయులవధింప
నగున్నృపునకున్॥ గీ. బ్రాహ్మణుండైనగురుడైన బంధువైన । వృద్ధు

డైనవెవ్వండైన నృపుడుదివిరి । వధముగావింపవలయు నవశ్యముఱక ।
సేయఁగారాని సేతలు సేయునేని॥ మ. పరదారాంతులిచ్చ జేసిన మహా
పాపాత్మునిబంధించి ని । ష్ఠురదండంబొనరించి గుర్తులిడి నీచుండీ దురా
త్ముండు క । ష్టరతుండంచు జనంబులెల్ల వినఁజాటింపించి దిప్పక జ
నుల్ । పురమందెల్లెడలందు ధర్మరతిమై భూపాలకుండిమ్ములన్॥ క. ప
రనారీరతులిచ్చలు । బరగించు దురాత్మువలనబహుజాతులు సం । క
రములగు గాన వానిన్ । బరిమార్పఁగవలయుననిరి ప్రాజ్ఞజనంబుల్॥
క. పరకాంత వేడికొనుటయు । పరితోషముతోడ సురతిబాటించిన క ।
ష్టరతుం బ్రజలందరుఁగన । కరములుదెగనఱుకునది దగఁగ నృపుఁడొగిన్॥
చ. ననుకడునాదరించినది నాతియటంచునలజ్జతో పరాం । గన చరి
తంబు జెప్పికొను కాపురుషాధమునాల్క గోయఁగా । జనుపరకాంతనిచ్చ
మెయిసంతస మారఁగజూచువానిలో । చనములణంగ జేయునది శాస్త్ర
విదుండగు పార్థివుఁడొగిన్॥ ఉ. ఆయమమంచిమిన్న మరియాయమన
న్మువరింప జూచుదా । నాయమనాకుబంటినది యచ్చపుకమ్మనివీడియం
బు నా । కాయమగూడియుండ మనసయ్యెడినంచు పరాంగనారతిన్ ।
బాయక బల్కుదుష్టమతి బట్టివధించుటవశ్యమారయన్॥ క. బలవం
తుడ నాకెదురే । బలహీనుడువాడటంచు బలహీనుసతిన్ । బలిమిర
మించినదుర్మదు । తలదెగ వేయునది నృపుడుతత్క్షణమఱుకన్॥ చ. జ
నములు లేనిచోటనెలజవ్వనియొక్కతె జాలయోపికన్ । పనుపులు
సేయుచుండగని పాడుచునాడుచు విభ్రమీగుచున్ । జనియదియొల్లకుండి
నను సాంత్వనవాక్యములాడుదుర్మతిన్ । జనపతిచంపిపుచ్చునది శాసన
మర్హ్మతమంబుగాదగన్॥ ఉ. లాలనమింపు సేయుము విలాసవతీయనిమ
న్యకాంత స్త్రీ । లోలుడొకండు వల్కనదిలోన భయంబును సిగ్గుజే
ద్వ్యధన్ । గావిడకేగుచుండగని గర్వమునన్వెను వెంటవారు దు । శ్శీలువ
ధించిపుచ్చునది సెప్పినవారలు జూచుచుండగన్॥ క. పరపురుషులతో
నిచ్చలు । బరగింపకనుండసతుల బతులతి జాగ్ర । న్మరతి మెఱపునర
ఘుట్టది యొక । పరమాయత ధర్మమనిరి ప్రాజ్ఞజనంబుల్॥ ఉ. ఫ్రాయ

నిరాగసంపదలు పాటిజెలంగగ ముద్దుముచ్చటల్ । సేయుచు భూషణం
బులును జీరలుకానుకలిచ్చుచుఁ సదా । డాయుచుసచ్చలారగ గడంగు
చు భార్యలభర్తలంచితో । పాయసమగ్రతుష్టిపలుభంగుల రక్షయొన
ర్చుటొప్పగుఁ॥ క ॥వేతనకారులుభిక్షుక । జాతులు దీక్షితులువందిసం
ఘంబులు సం। ప్రీతిగృహస్థులకాంతల । తోతగఁభాషింపనటబతులు
నొల్లనగుఁ॥ సీ॥ పాడియునాడియుఁబ్రదుకుకాంతలతోడ భాషించుటొప్ప
దేపనులులేక, పనులుగల్గిననగు భాషింపబాహ్యస్థలంబులగూడ దు
ల్లాసముమెయి । యేకాంతమున నెవ్వడేకాంతముననట్లుబాసలుసేయు
నృపాలకుండు । వానిదండింపగావలయు నొల్లనికన్యబలిమిఁజేసిరమించు
పాపచిత్తు । వధముసేయుటొప్పు వలపునకన్య వ । రించునేని దగుర
మించనిచ్చు । కన్నెరొల్లకున్న గదసియంగుళములు, బరచుతులువద్రుం
చు భంగిలెస్స॥ వ॥ ఒల్లనికన్నియ నంగుళప్రక్షేపంబు సేయు కష్టరతు
వలన రాజునూరుపణంబులు గొనుటయు నక్కన్నియతల్లిదండ్రులకిన్నూ
రులు శుల్కంబిప్పించుటయు కర్తవ్యధర్మంబు॥ గీ॥ బోడిజేసికుంటిగాడిద
నెక్కించి । పట్టణంబులందుపల్లెలందు । జనులుఁజూడద్రిప్పజనునరనాథుం
డు । కన్నెజెరుపఁజూచుకష్టరతుని. క. ఏయుమపతిపనిచిన పని । జేయక
తనయిచ్చదిరుగు శ్రీకులగుణద । ర్పాయతరతిదాని తనువు । గోయించి
యొసంగవలయు కుక్కలు దినగఁ. క. జనులు పలుప్రరతివేడుక । గ
నకుక్కలచేతదాని గరపింపంగా । జనునసియె మనువుశాస్త్రో । ర్ధనికర
విదుడు బుధజననుతంబుసెలంగఁ. క. పరపురుషుని సాంగత్యము । బర
గించిన కాంతనీతిపథము సెడిసదా । పరసతుల నాసగొను । దుష్పురు
షుఁ బంధించి యనలమున ద్రోయనగుఁ. వ. ఇది కొందరమతంబు
నీచవర్ణుండుత్కృష్టజాతి సతిరక్షింపబడుచుండినను రక్షింపబడకుండినను
రమించునేని వాని సర్వస్వమ్మును బలిమిమెయిగొని వికృతాకారునింజే
సి బహుజనసమూహంబులుజూడ ద్రిప్పించి వధింపవలయు, తనంతన
వలచివచ్చిన బ్రాహ్మణస్త్రీతో రమించిన వైశ్యుని యొక్క సంవత్సరం
బుదనుక చెఱనిడి తలగొరిగించిపుచ్చుటయు శూద్రునివధించుటయు

నృపతికర్మంబులు. క. అపరాధంబులుచేసిన । కుపురుషులం దాఁచిపు
చ్చు గుప్తాయత క । ర్మపరాయణులవలన వే । యిపణంబులు గొనవ
లయు నరేంద్రుండుదగఁ. గీ. బ్రహ్మవిదుఁడు పరమపావనుండగు వాఁడు।
దైవవశము పేర్మితప్పిదములు । సేయునైన నతని శిక్షించుటొప్పదు ।
గనలబలికి యేగుమనుటలెస్స॥ క. అసతీజనంబులతి సా । హసకర్ములు
గ్రులును దురాత్ములుమ్రుచ్చుల్ । వ్యసనపరాయణులును తా । మసు
లు సదారాష్ట్రనష్టమాత్రులరయఁగఁ. క. ఏరాజురాష్ట్రమందున । వా
రలు గనరారు గౌరవముపేర్మిమెయిఁ । నారాజుశక్రసముడన । గా
రెండపలోకమున బొగడ్తకునెక్కుఁ. క. ఏయెడలందును చతురో ।
పాయంబులు వాయకనరపాలనముదగఁ । జేయునరేంద్రుఁడుపడయు చి ।
రాయువు సౌఖ్యార్థ శిద్ధులనిరి మహాత్ముల్. క. యాజకుడు ఋత్విజుని
మరి । యాజకు ఋత్విజుడకారణాశ్రద్ధమెయిఁ । నోజు సెడివిడువదండ
ము । రాజుగొనన్వలయు హితపరాయణులారా. చ. తనయుల నాలి
బాంధవుల తమ్ముల నన్నల తల్లిదండ్రులన్ । తనకనువైన మిత్రుల
వృథాత్యజియించిన లోకనింద్యుచే । గొనునదిషట్ఛతంబులురు కోప
ముతో నరపాలకుండు హు । మ్మనియదలించుచుఁ సభికులందరుగన్గొని
భీతిదూరగఁ॥ గీ. బ్రాహ్మణులకు గృహస్థాశ్రమప్రకార । మందు వా
దంబుగల్గిన నధిపుడఖిల । శాస్త్రమర్యాద జర్చించిజక్కసేయు । వల
యునానడిమేలని వారలరుగ॥ గీ. అర్హుడైనయతని యన్నంబుగుడువని ।
వానిగుడువరానివానియింట। గుడుచువానిపార్థివుడు నిష్ఠురోక్తులు। వలి
కిగొనునదిశతపణములెలమి॥ గీ. గ్రుడ్డివానివలన కుంటివలన వత్స ।
రములు డెబ్బదిచనువిమలువలన । బధిరువలనగాదు పృథివీశ్వరుండు
క । రములుగొనమహాతురమునవైన॥ క. శ్రోత్రియునార్తుఁ శుద్ధచ ।
రిత్రుఁ బాలకువిద్జ్ఞవృద్ధుకులీనుఁ । పాత్రతమునుత్తమసతుల । ధా
త్రీపతిబ్రోచునది మతమువెలయఁగఁ॥ క. ఆరయతనకర్హమగు మ ।
హారత్నంబులు పశువులు నశ్వంబులు బెం । పారంగ తనకుగాకస, దా
రాష్ట్రజనముల కమ్ముదర్పితునురుకఁ. గీ॥ దివిరిదండింపవలయు దంతి

కరులునశ్వ । ములుమహారత్నములు రథంబులునుగల్గు । వాఁడు తనయి చ్ఛనొక్కఁకవేడుకమెయి । మేననిడికొనక నమ్మక హీనవృత్తి॥ క॥ పరరాష్ట్రంబుల నమ్మఁగ । దొరకొనినఁబట్టి దండితుని జేయుటయుఁ । కర మత్యధికము గొనుటయు । నరపతికింజెల్లునది ఘనంబనిరి బుధుల్ ॥ వ॥ తనరాష్ట్రంబు క్షామాదిపీడలఁ దూలిబెంపుసెడి యుండుతఱి స్వరాష్ట్రవాసులగు ధాన్యసంపన్నులు పరరాష్ట్రంబులు ధాన్యాదులు విక్రయంబుసేయునేని యవిదోచుకొనుటయు సువర్ణాముల దూదికొను తులాదులారునెలలకొక్కతఱి రాష్ట్రమెల్లెడల బరీక్షింపించుటయు ధాన్యాదులు పరిమాణంబుసేయు నాఢకాదులు పక్షపక్షంబు బరిశీలింపించుటయు శకటాదులధాన్యంబులిడి విక్రయించుకొను వానివలనపణంబును లొట్టియలగుఱ్ఱంబుల యెద్దులమూపులపైనిడి యమ్ముకొనుచుండు వానివలనయర్ధపణంబును నెత్తినైన భుజంబులనైన మోచికొనిపోయి యందంద వెలసేయుచుండు వానివలన పావుపణంబును కరంబులు గాఁగొనుటయు రెండు నెలలకుమించి గర్భంబుదాల్చిన స్త్రీవలనను భిక్షుకునివలనను బ్రహ్మచారివలనను తపశ్చిహ్నలుగలవానివలనను కర్ణధారకులు వేతనంబులు గొనకుండునట్లాజ్ఞాపించుటయు నౌకాప్రయాణంబు సేయువారలకు దైవవశంబున గాక నావికుల యేమఱుపాటువలన యెంతధననష్టంబుగలుగునంతలు వారివలన వారలకిప్పించుటయు రాజనీతిపథంబులు మరియును. క. ఉత్తములు బ్రహ్మవిదులు మ । హత్తములునునైన బ్రాహ్మణజనంబులలో । కొత్తరమతిమైగొలచి మ । హత్తువడయు శూద్రుఁడతిశయగరిష్ఠాప్తిఁ. క. మేదిని వాణిజ్యమును కు । సీదంబును గృషియు పశువిశిష్టత్వము బెం। పూదినవైశ్యుఁడు సర్వ జ । నాదరణీయుండు ననఘుడగు ఋషులారా. క. బోధానందవిమల వి । ద్యాధారేయులగు బ్రాహ్మణార్యుల సద్గో । ష్ఠీధృతియు శుద్ధచరితము । గాధకలిమిక్షత్రియుఁడు జగత్పూజ్యుఁడగుఁ. క వేదములు జదివిశుద్ధము । లైదగు హోమములుసేయు టతిమాత్రము మ । ర్యాదవహించుట విప్రుఁడు । భూదేవుఁడగుఁ మహాతపోధనులారా. క. ఒరులను సేవించు

చు లో । భరతుండగు విప్రువలన పార్థివుడుగొనఁ । బరగు పణద్వి శతంబులు । పరమాదరణీయవృత్తి పాటింపంగఁ. గీ. బ్రహ్మవిజ్ఞాన ఘనుడగు బ్రాహ్మణునుడి । గములు సేయంగ బుట్టించె విమలమూర్తి। బ్రహ్మశూద్రులగాన వారలవిఘుడిగి । రేనిదండింపవలయు మహీశ్వరుండు. క. పాపాత్ముండగు విప్రుని । యోపిక సేవింపనుడుగుటు త్తమ మనఘు । వ్యాపారముగల శూద్రుడు । కాపురుషులగొల్తురే జగతి పుణ్యమతుల్. క. బ్రహ్మజ్ఞానాధిక్యుడు । బ్రాహ్మణుడది లేనివాడ పాత్రుండు సదా । బ్రహ్మమయుడీశ్వరుండని । బ్రహ్మనుడి వెగాదె లోక పావనులారా. క. పుత్రులభృత్యజనముల క । ళత్రముగురువుల విని ర్మలమతముగలవా । డైత్రోయకనలరింప ని । కృత్రిమమతిదండనం బు నృపునకు వలయుఁ. క. ఏశూద్రుడు శమవృత్తిమ । హాశయుడగు విప్రసేవనాప్తిదగు ధరి । త్రీశుండు వానిపరమ స । దాశుద్ధచరిత్రు వ్రాలె దగురక్షింపఁ. క. ఈరీతివర్ణధర్మము । లారయుచున రేశ్వరుం డనఘు మతముదగం । గారాజ్యముచేసినడయు । నారోగ్యము సత్సద ము చిరాయువు యశముఁ. క. ఆదాయవ్యయములు క । ర్యాదులు కోశంబు బలము నధికారుల ను। ర్వీదయితుడరయుచుండం । గాదగు దినదినము సుప్రకాశము వెలయుఁ. క. శమవృత్తియు చరితంబున । యముగలపతివొరయు నైహికాముష్మిక సౌ । ఖ్యము లెల్లవారు తన పే । రు మూడయుగు తరములవరుస గీర్తింపఁ. వ. అనిచెప్పెనని.

ఉ. మానసపాకభవ్యతర మార్గమయత్వ వినిశ్చలాయత
ధ్యాన గరిష్ఠమాత్ర విదితస్ఫుట చిన్మయతత్వయోగ సం
ధానజితేంద్రియత్వగురుతత్వ పరత్వనిజత్వపావన
స్థానపరాత్పరాతిగుణ సంభవ కారణ పాపవారణా.

క. వేదశ్రుతబహుతత్వమ యా
దేవశిరోమణీ ఘనమణిరుచిభిలా
సోదయ బహువర్ణమృదుల
పాదకమల దేవదేవ భక్తవిశిష్టా.

మాలిని. కలుషతిమిరసాంద్రార్కప్రకాశ ప్రకారా
సలలితకరుణావిస్తార శశ్వద్విచారా
జలనిధి సదృశాంచ త్సత్వ భూమాధ్యశీలా
చలసరహితలీలా సాధులోకానుకూలా.

గద్య.

ఇది శ్రీమత్పరమేశ్వర లీలా విచిత్ర ప్రపంచ సేవాపాత్ర శ్రీమన్యాగపు రెడ్డి
పాపినాయక పుత్ర నిఖిలబుధజనవిధేయ యప్పలనాయక
నామధేయ ప్రణీతంబైన శ్రీమదాంధ్ర మనుధర్మ
శాస్త్రంబునందు నష్టమోధ్యాయమ్
సంపూర్ణమ్.





శ్రీ ర స్తు.

శ్రీమద్రామకృష్ణపరమహంసగురుస్వామి నేనమః.

# శ్రీమదాంధ్ర మనుధర్మశాస్త్రము.

## నవమోధ్యాయప్రారంభః.

శ్రీలాలితసంశ్రితపరి। పాలనలీలావిలాస సభక్త్యతరజగ । న్మూల నిరంజన యోగర। తాలంబనమాత్రచిన్మయాపరమేశా॥ వ. దేవాయవధరింపుమట్లు సావధానులై యున్న ఋషిసమాజంబులతో భృగుమహర్షీంద్రుండిట్లనియె॥ క. సతులును బతులుపరస్పర । మతిశయనిజ ధర్మపథము లందునడచు భ। వ్యతరవిధము లెల్ల మహా । మతులారవినుండు తేటపడనెరిగింతున్॥ వ. అనిచెప్పియిట్లనియె॥ క. పితృవశమున కౌమారము । పతివశమునయౌవ్వనంబు పాటివెలయుగన్ । సుతువశమున

—*సతీధర్మములు.*—

వృద్ధత్వము । సతికిన్ జనులేదొకప్డు స్వాతంత్ర్యమిలన్॥ క. పుత్రుడును పతియులేని క । ళత్రముస్వాతంత్ర్యకర్మ లంపటయైనన్ । బాత్రమగు నిందునందు చ । రిత్రముశుద్ధంబున విపరీతముగాగన్॥ చ. ఋతుమతియైనపిమ్మట వరింపగకూతునొసంగు తండ్రియున్, ఋతుమతియైన భార్య గడునిచ్చలుబొందకనుండి భర్తయున్, మృతపతియైనతల్లిని వరిష్ఠత బ్రోవమిపుత్రుడున్ వినిం, దితులగు రెండులోకముల దెంపరవారల జంపుకై వడిన్॥ వ. ఇదికొందరమతంబు॥ గీ. అంగనాజనముల నల్పప్రసంగంబు । లందునైనగాచు నసువులెస్స। యిచ్చదిరిగిసిగ్గు దెచ్చున

రక్షాప । తులగు కాంత లుభయకులములకును॥ క. బలహీనుండయ్యు నృపతి । వలయున్ రక్షింపశతి నవశ్యమురక్షా । కలనస్థితినుండినసతి । వలనమహాకీర్తి గౌరవంబులువచ్చున్॥ క. తనకులధర్మార్థంబుల, కను వ్రగరక్షణముసేయ నగుసతిబతిసు । ధ్ధనిరతరక్షాపతియగు । వనితసదా ధర్మకార్యపతియనబరగున్॥ క. గౌరవము విశుద్ధత్వము, దారవిభవ శాలితయునుదాత్తపదంబున్ । గోరునతండుసతిర । క్షారతినుండునదినె ల్లకార్యములందున్॥ క. పాపాత్ముడయ్యుయుద్ధన, తీపతిపూజ్యుండగున్ త్రిదివమునననయదీ, క్షాపరుశుద్ధకర్మ, వ్యాపారరతుండు ఘనుడన ఘుడున్ బోలెన్॥ క. ఏయమరక్షాపరతం । త్రాయతనర్తనము సేయు నాయమవారయున్ । పాయకపుణ్యవ్రతములు । సేయువిశుద్ధాత్మ వ్రాలెశిష్టపదంబున్॥ క. పతియింద్రియరూపంబున । సతిగర్భముజొచ్చి పెరిగి జన్మించుతదా । స్త్రీతెరఁగువాయకిచ్చలు, సుతుడైయని రఖిలశాస్త్రసూక్ష్మార్థవిదుల్॥ గీ. ఎట్టిసతివరించునట్టి పుత్రులువుట్టు, గానమంచినుతులుగలుగగోరు । వాడు సేయ నదియవశ్యంబుభార్యాభి । రక్షణంబుపతముదీక్షదవిలి! క. బలవంతంబునరక్షా, కలనముగావింపవల నుగాదుసతినుపా । యలసితతంత్రంబులచే । వలయున్ రక్షింపపతియవశ్యమరయగన్॥ చ. ధనముగ్రహింపనుత్తమ మతంబున దావినియోగభూతిగై । కొనగృహశుద్ధిసేయతనకున్ బరిచర్యలొనర్పనింటిలో । పనుపులు నిర్వహింప రుచిపాక విదగ్ధత జూపబత్నికిన్ । జనువునొసంగుటొప్పగునసంశయబుద్ధివరుండు నిత్యమున్॥ ఉ. ఏయమభర్తసెప్పక యనెంతయు గౌరవసంయుతక్రియల్ । సేయుజగద్వినింద్యమగు సేతలొకప్పుడు సేయకాప్తయై । యాయమలోకమంగళమహామత నాదగు కీర్తిబొందు దా । సేయమమించు నాయ్యఘము నీశ్వరులార మహాపదంబులన్. ఉ. ఏయమభర్త యానతి వహించు శిరంబున నిర్మలాత్మయై । బాయక నింద్యకర్మముల పథ్యమధర్మమ పాత్రధర్మముల్ । సేయక సౌమ్యవర్తనము సిగ్గునుదాలిమియున్ వహింపుచున్ । నాయమ లోకరక్షణ మహానయ దేవతమూర్తి నాదగున్. గీ. హేయరతికల్లు ద్రావుట

యిరుగు పొరుగు । వారియిండ్లవసించుట భూరినిద్ర । సేయుటని జేచ్చ
మై పతిబాయుటిందు । నందుబోవుటసతికి దూష్యంబులైదు. క. దుర్జ
నసంసర్గంబును । భర్జించుట యన్యపురుషు బల్కుటగల యా । దుర్జా
తినసతిభర్త వి । సర్జింపగవలయు నెఱివిషంబును బ్రోలెన్. క. రూపం
బుగలిగియున్న ను । రూపిణియైనందగున్ పరుషభాషణముల్ । కోప
ముచలస్వభావము । రూపింపని సతిని బతియిరుప్రగవరింపన్. క. కూ
రిమిలేని విసర్గము । గౌరవమున్ పుంశ్చలీప్రకారము దుష్కా । ర్యారంభ
ముగల సతిపతి । యారసిరక్షించుచుండుటర్హతమముగున్. క. ఎఱిగిన
పతిమెరుగనిసతి । కెరిగింపగవలయునుతమహిత చరితంబుల్ । గరువ
మును శుచిత్వంబగు । తెరగులును సదాప్తియును ధృతియుసౌమ్యత
యునున్. గీ. సౌమ్యతయును సర్వసంపదలునుగల । యొరులసతుల
జూచియుడుకుటయు న । పారసౌఖ్యగతులు గోరుటయును కాంత ।
లకు స్వభావశిద్ధమొకడుగాక. గీ. సృష్టికాలమందు స్రష్టవిధించె నీ ।
యస్వభావమింతులందుగాన । సతము దివిరి సతుల బతులు రక్షింపగా ।
వలయు నుచితగౌరవంబుపేర్మి. గీ. ప్రకటశయ్యాసనాలంకరణములిచ్చ ।
లీర్ష్యయును కోపముకు చర్యలింతలార్జ । వంబుకపటంబు మాయయు
వనితలందు । కల్పనముచేసె మనుప్రజగన్నుతుండు. క. మంత్రంబుల
వలననధిక । తంత్రంబులవలన శాస్త్రధర్మంబులచే । తంత్రికరణశుద్ధిద
శస్వ । తంత్రముగలనాతికైన దగగల్గదిలన్. క. వేదములింతులుజదు
వం । గాదింతలుగావు మంత్రకళలెట్టునిజం । బైదోచు వారలందున । నా
దరణీయక్రియాఫలాభి రతమతుల్॥ మ. పతివచించి మనంబులోన నిది
పాపంబంచుజింతింపక । వ్రతమైమానములజ్జయున్ విడచి దుర్మార్గంబు
సంధించి నిం । దితకర్మంబునకోపి జారపతిను ద్దేశించి గ్రీడించు దు ।
స్సతికిన్ నిష్కృతిలేదులేదు నిజమాశ్చర్యంబగున్ తత్కథల్॥ క. కూరి
మిసేయకభర్తన । గౌరవముగజూచి యన్యుగలయగనెదలో । నారయు
టయది మనోవ్యభి । చారంబనబరగు దుష్టసతికి సహజమై॥ గీ॥ ఎట్టి
పురుషువరించు దానట్టిదియగు । సతిసవాస్వాధుజలభూతి జనునదీ స ।

మూహములు పెక్కుచోట్ల సముద్రమందు । గలసి తోరరసస్ఫూర్తి వెల
యునట్లు॥ గీ॥ అధమవర్ణమైన యక్షమాలవశిష్ఠు । మందపాలు నధిక
మహిమ చటక । మునువరించి పాత్రములనంగబరగె పూ । ర్వమున
గాన నవ్విధములువలయు॥ క॥ అపకృష్టల నేకులు మరి । యు పరమపా
వనులనంగనొప్పుపతుల బొం । ది పిదపపావనవైరి స । దుపచారము
లాచరించుచుండి రెలంతల్॥ క॥ సతులకు పతులకు నిత్యము । నతిశ
య సౌఖ్యములు మూడునట్టివిధము జెప్పి । తి వెండియును వినుడు స।
త్సుతుల బడయు తెరవులనఘసువ్రతులారా॥ చ॥ తనయులవృద్ధిజేయు
గ మతంబు నుతింపగ నొప్పి దేవతా । ర్చనములు సువ్రతంబులు పరా
యణ తన్నుపంగ లక్ష్మినా । దనరి సమస్తకార్యములు తత్పరతన్వెల
యింప నొప్పునం । గన గృహదీపమై తనమొగంబుగ కీర్తివహించి
నిత్యమున్॥ గీ॥ ఆరయగృహస్థధర్మమపారమగుడు । యోడయును నా
వికుండునా యొప్పి సతియు । బతియు సంసారసాగరమతిసులభము । గాద
రింప సమర్థతగలుగువారు॥ చ॥ కనకముసర్వవస్తువులు గల్గిన సోదరు
లిష్టబాంధవుల్ । తనయులు తల్లిదండ్రులు సదా యెడవాయకనుండు
మిత్రులున్ । తనుభజియింపుచుండిన వృధాయగు సర్వము భార్యలేని
యా । తనికి గృహస్థధర్మముచితంబు సేయగనిచ్చ జేసిరన్॥ క॥ పాత్రత
మంబగు శుద్ధక । ళత్రముతను నెల్లపనులలావితుజేయున్ । బాత్రముగ
నదుపజాలు ప । విత్రగృహస్థాశ్రమంబు వి త్తముడెలమిన్॥ గీ॥ ఓడలేక

—* క్షేత్రబీజసంయోగప్రకారము. *—

పెంపునూది సముద్రంబు । వేచి మైదరింపజూచువాడు । వోలె నెట్లున
దుపబూను సంసారి భా । ర్యావిరహితుడై గృహస్థవృత్తి॥ క॥ ఆర్యు
లనేకులు పూర్వము । భార్యలతోగూడ ధర్మపథము నడచి స । త్కా
ర్యములుచేసి బడసిరి । మర్యాదలు సకలజనసమాజములందున్॥
క॥ పుత్రులకలిమియు, సచ్చారిత్రంబును మేటిచుట్టరికము నతిథి
పూ । జాత్రివిధాప్తియు శుద్ధక । ళత్రమునకు లక్షణములు లక్ష్యార్థం
బుల్॥ గీ॥ అతిథిపూజలుచేసి మర్యాదవడయు । సుతులగని సద్గతులొ

సం॥ పితృసమూహ । ములకు హోమంబులొనరించి మూడుజగము । లందనుపుగానన్ని స్త్రీయుందనిలచు॥ ఉ॥ ఏయమభర్తయానతి వహించు శిరంబుననిత్యమిష్టమై । యాయమబొందునందురు మహా సుకృతంబులు ప్రాజ్ఞులాప్తగా । కేయమభర్త యానతి రహింపదు మోహమున్నెల్ల వారు ఛీ! ఛీయన జచ్చిదుర్గతుల జేర్వదు నాయమ పాపమూలమై. గీ. క్షేత్రభూతంబులంగనల్ పాత్రములును । కరములగు బీజమాత్రులు పురుషులిట్లు । క్షేత్ర బీజ సంయోగవిశిష్టమైన । జంతుకోట్ల జనించు ధీమంతులార॥ గీ॥ బీజమొకచో విశిష్టమై పెంపువెలయు, యోని యొకచో యుత్కృష్టమై నెగడు దో । లంగకాం రెండు సరియైజెలంగు నెందు । నందు శుద్ధప్రసూత మాన్యతరహించు॥ గీ॥ యోనికన్న బీజ మూత్కృష్టమగు బీజ । లక్షణంబులకు సలక్ష్యములుగ । సర్వభూతములును సంభవించుచునుండు । ననిరి కొందరార్యుల నఘులార. గీ. ఎట్టి విత్తు కాలమెరిగి క్షేత్రంబున । నాటవడియె నిజగుణమ్ముపెడక, వట్టి వోల్కె బొలచునది గావునను బీజ । గుణముపెద్దయోని గుణముకన్న. గీ. సర్వభూతములును సంభవింపగయోని । భూత భూమి మాత్రముగ జెలంగు । పుట్టువులకు మూలమును సలక్ష్యంబునై । విత్తువెలయు వేదవేద్యులార॥ గీ. అదను వేచిక్షేత్రమందు కర్షకుడనే । కవిధధాన్యములు నొకడు నొకండు । పలుతెరగుల సతము పండించుగావున, విత్తుమూలమనిరి విదితమతులు. గీ. ఒక్కపొలమునంద జక్కగా పండునా। నేక ధాన్యజాతులింతనిజము । గాన బీజమెట్టిదె నిరూపించు త, ల్లక్షణములయగు సలక్ష్యములుగ. గీ. గానపరసతులందు విజ్ఞాన ఘనులు। పాత్రతములు సయోషుల్యలు భవ్యమతులు । బీజములిడరు కరమవి పెంపువెలయు । నైన తత్ఫల భూతిమాన్యంబుగామి. గీ. మృగము నొకమనుష్యుడేయ బాణమునాటి । యదిదొలంగిపారి యన్యుడొక్క । దురకనేయుపాని కొదనినచాడ్పగు । పరునికాంతబొందు ఫలమునిజము॥ సీ. పృథివీతలంబెల్ల పృథుచక్రవర్తిచే పూర్వంబు సగృహీతంబుగజెలంగి । యతనిపిమ్మట మహీపతులనేకులచేత పాలింపబడియు నిప్పటికివృ

త్తి । పృథుచక్రవర్తిదీప్తిధివిసర్వంబని వారలెరుంగగావరలునైన , నరుదుమొద్దులగొట్టిబరగించు క్షేత్రంబు దానబొందినతద్విధమగుఫలము । గోరిపరసతియందు నెగ్గులుదలంప। కిడినబీజంబువృద్ధిమై నెగడిపిదప। దానిపతికిలభించు యత్నంబులేక । గానసరయంగవలయు ప్రాజ్ఞజనులింత॥ సీ. తనకోడెయొరుని మొదవచూలుసేయంగ తానాఫలంబుజెందనివిధంబు । పెరవాసిపొలమున బీజంబులిడువాడు తత్ఫలశిద్ధిజెలదని గడింది । యగుతానుపరకాంత యందిడుబీజంబు తగవృద్ధిబొందియు తనకుగాక । బీజంబులొక్కడు పెక్కులుతనపొలమందు నాటకజలంబధికమగుడు । జలమువారునపుడు జనియవియొరునిపొ । లంబునందువడిఫలంబుసేయు । నైనమున్నఫలము నాసించినాటెన , వానికేమిఫలము వానివలన॥ క. పరకాంతాసాంగత్యము । బొగించియుతత్ఫలంబు బడయగలేడే । వెరవునసైనంపురుషుం । డరయంగనసర్థమది మహాశయులారా॥ క. సారములసారములు ఫలి । తారూఢతరములు నిష్ఫలాఢ్యములైతెం । పారగలబీజయోనుల । కారణములుజెప్పితిని ప్రకాశముగాగ॥ వ. ఇంకవివిధంబులగు స్త్రీధర్మంబులువన్యసించెద వినుండని యిట్లనియె॥ గీ. అన్నపెండ్లాము గురుసతియగునసుజుని । కన్నకనుజుని

——*వివిధస్త్రీధర్మంబులు*.——

సతికోడలగునుగాన । యగ్రజునిసతితమ్ముండు ననుజుభార్య । నన్నయునుబొందుటవి నింద్యమధమతమము॥ క. అనుజునిపెండ్లామన్నయు । ననుజుండగ్రజునిసతి మహామోహవశం । బునబొంది పతితులగునిజ । మనియెమనువు సర్వజనావాప్తిదగగ॥ గీ. పుత్రహీనమగు కళత్రము పుత్రుని । గోరిగురునియాజ్ఞకులమువాని । తోడనైన మరదితోడనైన రమింప । వచ్చునని కొందరిచ్చలువగ॥ గీ. అన్వయంబుదరుగునను భీతిగదిరిన । విధవవదగుస్మృతా క్త విధిజెలంగి । మౌనమైనిశాసయమున నొక్కని , బొంది వానివలన పుత్రువడయు॥ క. గురువునియోగింపంగా । బరగుమరియునొక్కపుత్రు బడయువిధవకి । ద్వారుసుతులు జనించునసం । తరముపురుషుజూడ బలుకతగదేవసుర్లగ॥ గీ. గురునియోగ

మెట్లగుటసమ్మతంబయ్యె । ననుజుపత్నికోడలట్లయన్న । యన్నభార్య
గురుని యాలియట్లనుజుండు । దలపవలయు నధికమతమువలదు॥
క. వారలటుగాక మోహము । పారముగరహింతురేని బతితులగుగురు।
స్త్రీరతుడుపధూరతుడన । గారెండుజగంబులన్ విగర్హితులగుచున్॥
క. పతిమృతిబొందినసతిగ । ర్హితమనకన్యనిరమింప నెట్లగునుపతి ।
వ్రతయగుసేయ ల్లైన్ । క్షితినని కొందఱతివిశిష్టచరిత్రుల్॥ క. విధి
శూన్యంబు విగర్హిత । మధమమగౌరవము పాత్రమరయంగవృథా ।
మిధునంబు పాపకృత్యము । విధవోద్వాహంబులోక విశ్రుతులా
రా॥ ఉ. వేనుడురాజ్యభారము వివేకతదాల్చిననాటినుండియున్ ।
మానవులందువోయె నసమంజసమై పశుధర్మవృత్తిసం । తానముగోరి
గర్హితమంబులుగొల్చి వితంతువుల్ నిజే । చ్ఛానిరతిన్ జరించు తతిసం
కటపద్ధతిమెల్లమెల్లనన్॥ గీ. అగ్రజన్మవిచ్చలనుజులసతుల న । గ్రజుల
భార్యలన్ ననుజులునిత్య । రతులుసేయ సంకరములురువైధర్మ్య । మ
ణగె వైన్యరాజ్యమందుమున్న॥ వ. నాడుగోలె సంతానసిద్ధికొరకు
విధవల నియోగించుధర్మంబు సమస్తదేశంబులందును గర్హితంబయ్యె
మరియు వాగ్దత్తమాత్రంబున నక్షతయోనియగు కన్నియంజేకొనిన
యగ్రజుండు దైవవశంబున తనకు కాలాసన్నంబగునేని యోగ్యుండగు
తమ్మునిన్ బిలిచి మీవదినెయందు సంతానసిద్ధి జేయవలయుంజుమీ
యనిచెప్పి మృతిబొందినపిదప మోహంబుపెంపుసేయక నయ్యనుజుం
డట్లవశ్యంబు గావించుటధర్మంబని కొందఱమతంబు॥ గీ. కన్నెవాగ్దత్త
మాత్రంబుగాగనొకని । కిచ్చివాడుగతించిన నిచ్చమరియు । నొక్కని
వరింపజేయుదురుద్యముండు । నీచుడుమహాపరాధివి నింద్యతముడు॥
గీ. వాడుబోరయునట్టి వాడగునుసహస్ర । పూరుషానృతుండుబోలె
ఘోర । పాపఫలమువాని బల్కినజూచిన । పాపనిదినిజంబుభవ్యులా
ర॥ క. పరమశిధినైష్ఠికంబుల । పరిగ్రహముజేసియు గదుపాపరతరుగా।
తురసుక్షతయోని నిరా । కరణవిడువవలయుబుధుడు కన్యనెరిగినన్॥
వ. ఇది కొందరమతంబు॥ గీ. ఉన్నరూపెరిగింపక కన్నెదోష । పతివ

రింపంగ నిచ్చునెవ్వాఁడు వాని । యాతలాయితనంబున కనుపడక । దానిఁబుచ్చునది పతికానిదాసిపొలె॥ గీ. భోజనపదార్థములు వస్త్రములుసమగ్ర । ముగ బ్రకల్పించిసతికి భద్రగతిసెప్పి । బరగుదేశాంతరమునకు పతిచనంగ । నట్లుగాకున్ననదిదూష్యమగుటనిజము॥ గీ. వృత్తికర్శితమగుసతి వివిధయత్న । ములుసదాయాచరింపగా దలచికడుపుమండనోరెండధర్మంబు మరచియెవ్వ । యైననునరించుగాన దూష్యమగుటరుదె॥ సీ. పతిధర్మకార్యముల్ బరగింప దేశాంతరమున కేగినవత్సరంబులెనిమి । దియు విద్యయైన కీర్తియైనైన బడయంగనరగిన నారేండ్లునతిశయించి । భోగార్థముచనిన మూడువర్షంబులు సతిప్రతీక్షించివిశ్వాసనిరతి । పాటించి యతడున్నచోటికిజనునది వార్తలువినుచునెవ్వారితోడు । వడకసతిపతితనుకోప పడుచుపితృగృ । హంబుజేరిన వత్సరంబుజూచి । యెల్లదేనియు మున్నుదానునిచినట్టి తొడవులన్నియుగొనిదానివిడువవలయు॥ గీ. మత్తయగుచునైన వృత్తియెరుగకుండి । యైన తీవ్రతరరుగార్తిముగువు । దక్కియుండునైన దాలిమిమూఁడుమా । సములుజూడవలయు సతినిభర్త॥ సీ. పాపరోగాతుర పతితునపుంసకు గ్రూరునున్మత్తు నాచారశూన్యు । పతిసవిశ్వాసంబు బాటింపకేగిన సతివల్లన ధనభూషణములురుక । గొనరానువలవ దట్లనిమందలింపగా వలయునిచ్చలునది వలచి యన్య । పురుషుసాంగత్యంబు బరగించునేని కొనందగుదండించి దండడిమెయి । సొమ్ములన్నియుచెడద్రావి సోలుదాని । నింద్యమగుధాని బ్రతికూలనిష్ఠురోక్తు । లాడుదానినసంగతిగూడుధాని । పతివిడువవలయు దుర్వృత్తిబరగుదాని॥ గీ. వంధ్యనెనిమిది వర్షముల్ వత్సరములు । పదియశిష్టప్రసూత పిభ్రాంతనాడు । బిడ్డలంగనుదాని మూఁరొడ్డుదాని । పదునొకండేండ్ల వీక్షింపఁబతికివలయు॥ క. గౌరవమును బ్రియముసదా । చారముపాటింపకుండు సతిదుశ్శీలన్ । గౌరవనీయుండుసదా । చారుడుఘనుడు భర్తవిడువజనునని బుధుల్॥ క. అనుకూలముశీలంబును । జననుతసువ్రతముగల్గు పతితీరనిరో । గనిరతిబాల్పడనాయుము । యునుమతిపతిపెండ్లియాడ నగునొక

కెన్యఁ॥ ఉ. పాయని రాగసంపదయు భక్తియుశీలము సువ్రతంబుబెం ।
పైయలరారుశుద్ధసతి నల్గివిదూష్యములాడ హీనగా । జేయువృథాప్ర
సంగములు సెప్పగసేయఁగరానికర్మముల్ । సేయఁగబంపభర్తకు విశిష్ఠ
ముగాదొగిగల్గునాపదల్॥ క. విపరీతములగుసేతలు । కపటాచారంబు
బిరుసు గలసతిపతియో , టుపరచి బనుపంజనుదా । ని పితృగృహము
సేరగాననిరి భవ్యతముల్॥ క. ప్రతికూలము లెప్డుపల్కు । సతినప్పుడ
విరచికట్టి జనుపనుపగత । త్పితృగేహమునకుగౌరవ । మతిశయముగ
వెలయుపతి విషాన్నము వ్రోలెఁ॥ క. వెలయంగనాట్యరంగం । బుల
ప్రాణీద్యూతకర్మముల వేడుక గుం । పులుగుంపులుగాపురుషులు । నిల
తురుగావున । జనదువసితలరుగంగఁ॥ ఉ. ఏయమసిగ్గుమాలికడు ని
చ్చలుపూరుషులుండు చోటులఁ । డాయఁగబోవు వేడుక విడంబము
గాబరువెత్తువీథులఁ । నాయమజిక్కఁగట్టి పతియంగడివీథులవిక్రయిం
చుట । న్యాయముగాదు వీథులజనంగలకాంతలు పూజనీయలే॥ చ.
తనకనురాగభూతులుచితంబుగ సేయక నుండునైననే । పనుపులు సేయ
బంచుపతిభక్తిదగఁ సతియోర్చి సేయగా । జనునవిమారువల్కక వ
శంవదయై రొమునరింప దేనినూ । తనిడినరాయివోలె బలుదండడి సంద
డిలేకస్రుక్కఁగుఁ॥ క. పరపురుషులతో నోడక । పరిహాసములాడున
సతిపతిభంజింపఁ ! బరగుననినిభవ్యతములు । పరమప్రాజ్ఞజనములు
సభాసదులారా॥ మ. పతిసేవారతియార్జవంబును సదాప్రాజ్ఞస్వభావం
బువ । ర్జితసంచారవిలాసభాషణ కథానిష్ఠావిశిష్టాదిసు । వ్రతముల్
దానము నార్యగోష్ఠియునిగర్వస్ఫూర్తియుఁ దాల్మియుఁ । సతికత్యం
తపవిత్రకారణము లాచంద్రార్కతారంబులై॥ క. గౌరవనీయతనిజసే ।
వారీతియనుకర్మములును వాటింపనిశ్చం । గారపతినైనసతిపతి । దూ
రమువిడనాడవలయు దుర్గతివోలెఁ॥ వ. విజాతీయాంగన సతిగానైకో
నిదానిచేతనెల్ల పనులుచేయిరచుకొనుచుండు బ్రాహ్మణుండు చండాల
తుల్యుండగు నిక్కిల్లజాతులవారును బతితులగు మరియును॥ గీ. వంశ
మును రూపమును గౌరమును విద్య ! ప్రాయమును సచ్చరిత్రంబు బర

గువరుని, కిచ్చునదికన్యమిక్కిలి యిచ్చలుదగ । బ్రాహ్మ్యవైవాహిక విధిసత్పాత్రతముడు॥ గీ. ఋతుమతియగుకన్య నతిసత్ప్రవర్తన । మేమి లేనివానికిచ్చుకంటె । కామమయ్యుబేర్మి నామరణాంతంబు । దనుక నింటననిడికొనుటయొప్పు॥ క. ఋతుమతియగుకన్నియదగు । బ్రతీక్ష

—ఋతుమతియగు కన్యాదానవిధి—

యొనరజేయ వత్సరత్రయముసదా। ప్రీతెరంగుచరిత్రముమా। న్యతయు సమస్తజనవర్ణితౌరూఢిమెయిన్॥ క. ఋతుమతియైవర్షత్రయ । మతిని యతిన్బుచ్చుకన్య నాప్తచరిత్రన్ । పితృముఖ్యులు పాత్రుండగు। నత నికినీవలయు బుధజనానందముగన్॥ క. మాన్యమునుసువృత్తముగల । కన్యరజమువెడలునైన కామింపదుడా । ర్జన్యరతునిచ్చమెయిసా। మా న్యపథమువట్టి శుద్ధమతమిరువారన్॥ వ. కావున॥ చ. ఋతుమతియైన కన్నియ వరియింపగనిచ్చలుసేయు నెవ్వనిన్ । బితృముఖులెల్ల చుట్టము లుబ్రేముడినాతని కిచ్చుబుచ్చుటు । న్నతమతమింతలేని సుగుణంబులు దాల్మియులేనికన్నికన్ । ఋతుమతియైనయప్పుడ వరింపగజేయుట లె స్సజూడగన్॥ వ. స్వయంవరవివాహవిధిబొవుకన్య తనమేన మున్ను జనకాదులిడిన భూషణంబులువారలకు సమర్పింపవలయు. నీయకజగు గునేని దొంగయునన్బరగి దండనార్హ్వముగు వెండియు॥ క. మాన్యత మము ఋతుమతియగు । కన్యాదానంబనియె జగద్ధితమతిసా । మా న్యపథముగౌరవమును । మాన్యంబుగమనువులోక మానితులారా॥ క. ఋతుమతియగుకన్యలొసగు । పితృముఖ్యులుశుల్కము గొనబెంప గుపాప । ప్రతతులువారలధర్మము । నుతిగొను నరమాంసవిక్రయులు ఋషులారా॥ క. ద్వాదశవర్షంబులు చన । బూదెనిడిన కనకరేఖవ్రా లెవిమలనూ । త్నోదయరూవనరుచిరే । ఖాదులుసౌష్ఠవముకన్య యందు రహించున్॥ క. అరయంగాముప్పదివ । త్సరములు ప్రాపిం చునతడు సమ్మతముదగన్ । పరిణయవిధులొనరింపగ, బరగున్నాక న్యయందపండితులారా॥ క. ఎనిమిదిసంవత్సరములు । జనకనొసగుకన్య యందు జనుపరిణయమో । గ్యనిరతులుసేయనిర్వది । యనునాలుగు

నేండ్లుచనినయువకుండురహిఁ॥ క. అమరుదేవదత్తమైన సతిపతి య । వస్యమధిక గౌరవంబుప్రియము । నార్జవంబుగలిగి యాదరింపగ దాని । వలనప్రియముదేవతలకుమిగులు॥ గీ. ఎఱుకలేకకన్య ని చ్చుటకన్న పి । తౄదులూరకుండుటరయ లెస్స । గాన బుతు మతియగు కన్యనిచ్చుట యుక్త । మంబు భద్రమనియె మనువుదొల్లి॥ గీ. ఎఱుకగలుగుకన్య యిచ్చులెవ్వనిచేయు । వానికిచ్చునది యవశ్యమ నియె । మనువుగాన తెరుపుమరుపును గల కన్య । నీయ జూచు వెట్టి కేమిలెస్స॥ క. ప్రియముగలకన్య మతం । బాయతముగ నిచ్చలును స్వయంవరమైనఁ । శ్రేయస్సంతోషములు చి । రాయుర్భాగ్యములు వురయుననినిరి మహాత్ముల్॥ గీ. ఎఱుకలేనికన్య నిచ్చునెవ్వాడు వా । డధముడనిరి మునుమహార్థవిదులు । గాన యీడురాని కన్యావివాహం బు । లధిక నింద్యతమములయ్యె నుర్వి॥ గీ. కన్యశుల్కంబు గొనియి చ్చుకష్టరతుడ । పాతతము డెవ్వడాశ్చరిత్రుసీచు । నధము నరమాంస విక్రయుండాతతాయి । యనిరి ప్రాజ్ఞజనములు మహాత్ములార॥ క. ధన మెవ్వడధిక మొసగు న । తనికిఁ కన్నియ నొసంగ దలచు ఖలుండే । పనులోనరింపడు పాపం । బన వానికి మంచి నీళులనుటురు వగునే॥ గీ. వేశ్యవోలె నధిక విత్తంబొసంగి దా । గొనిన కన్యయందు మన సుపూర్ణ । రాగభరితముగ నిరంతరంబుచు గౌర । వంబుసేయ డెట్టి వాడునైన॥ క. ధనముగొని యీడుబిడ్డల । నసయము విక్రయముసే యునధముడు వేశ్యాం । గనసతిగా గైకొను టొ । ప్పననిరి మహి తార్థవిదులు మహాత్ముల్॥ గీ. పుట్టినట్టి సుతుల గిట్టించి గూతుల । మాత్రమరసి బ్రోచిమంతనమున । విక్రయించునట్టి విత్తార్జనపరుండు । పాపమనునె యెట్టి పనులనైన॥ క. ధనమొసగి కన్నియం జే । కొను నాతండట్లొసంగు కుటిలాత్ముండుఁ । జనుసర్వపాపములు జే । సినవా రల గతికి పంపుసేయు నతండుఁ॥ క. తనుశుల్కము గొని యిచ్చిన । జనకునినిందించు దొట్టిజరచుచు పతి రో । యునులుకు బాంధవవర్గ ము । గనుగొని కన్నీరు నించుకన్య సతంబుఁ॥ క. అన్యోన్యరాగరసము

లు । మాన్యములుగ దంపతులు సమస్తక్రియలుఁ । ధన్యత్వస్థితి సేయు గ । కన్య నొసగవలయు నెరుక గలిగిన పిదపన్॥ క. సతియును బతియును నిత్యము । నితరేతరరాగరస సమృద్ధి నెగడి యా । యతకర్మంబులు చేసిన । బితృదేవతలాత్మలందు బ్రియమురహింపన్॥ వ. అదిగావున॥ క. ఇతరేతరమనురాగ భ । రితమానసులగుటకున్ వరిష్ఠవయోభా । సితమగు కన్నియ సరియగు । పతికీనగుననిరి పరమ ప్రాజ్ఞజనంబుల్॥ వ. సతీపతుల ధర్మంబులెల్ల జెప్పితి నింక దాయభాగవిధులు తేటపరతు వినుండని యమ్మహర్షీంద్రుండిట్లనియె॥ క. సుతులెట్టి సద్గుణాఢ్యులు । మతిమంతులు గలుగునట్టి మహితపదవు లు । న్నతిమెయి జనకుండు వొరయు । బితృగణములతోడ గూడి బ్రియము రహింపన్॥

—సుపుత్రఫలప్రకారము.—

చ॥ తనయుడు సద్గుణాన్వితుడు ధర్మరతుండగునేని హీను డ । య్యును జనకుండుబొందు మహిమోన్నతి దివ్యపదంబు దాను జే । సిన కలుషంబులన్నియు నశింపగ తత్సుతుడర్థి నాచరిం । చిన సుకృతార్ధ భాగము విశిష్టతగైకొని సమ్మతంబుగన్॥ చ. అనిమిషులున్ జగత్త్రయము నారయనిత్యము ప్రీతిబొందు ధ । ర్మనిరతి పెంపుగైకొన కుమారుడొగిన్ సుకృత క్రియల్ దినం । బును నొనరింపదాన పరిపూర్ణ సుఖోన్నతి వానితండ్రి గై । కొను సురలోకమందు బితృకోటియు తానునుగూడి యిచ్చలున్॥ క. పితృవర్గంబులు దానును । బ్రతిదినమును బ్రియము వడయు భవ్యతదగ స । త్సుతుబడసి తండ్రిగావున । మతిమంతులు దివురు సత్కుమారుల బడయన్॥ క. పాత్రమగు నుత్తముండగు। పుత్రు నిగనినట్టి సతి త్రిభువనంబుల జా । రిత్రము కొరగాకుండియు । మాత్ర పతి విధంబునన్ విమలమతులారా॥ క. వృత్తాంత విశిష్టంబు వి । పత్తులు బొరయమియు నిత్యభవ్యత్వములో। కోత్తరపూజా గౌరవ । ముత్తమపుత్రులగని బడయు సతీజనముల్॥ క. గౌరవనీయుండు సదా । చారఘనుండైన సుతుడు సభ్యతదగ నిం । పారు సుఖంబులువడయు న । నారతము తజ్జనని జనంబులు వొగడన్॥ గీ. ఉత్తమకుమారులన్

గని యెత్తమంపు । పగసులును మధ్యములగని పాత్రములు న । పాత్రములు గాని గతులును బడయుసతులు । బతుల ప్రియములు నంతలై సతమువెలయు॥ క. ఆరయనత్యధములగు కు । మారులగని సతులు శుద్ధమతములు శుద్ధా । చారంబులు పూజ్యతయును । గౌరవమును గోలుపడుజగతి నింద్యములై॥ ఉ. పూతకు భార్యభర్త మృతిబొందిన గర్భిణియయ్యునోపి దాసీతనముఁ వహించి కడుజేడ్వడి యుత్తముడైనపుత్రు గా । రీతకనామధేయుగని వృద్ధదశఁ బహుసౌఖ్యసంపదల్ । బ్రీతిజెలంగ బొంది నడిపించె పురాతనవేళ ధర్మముఁ॥ వ. కావున సత్పుత్ర సంతానసిద్ధి బహుపుణ్యాభాజనం బని చెప్పి దాయభాగవిధులు బోధించువాడై యిట్లనియె॥ క. జననీజనకులు చనిపో । యిన పిదప సమేత్యపుత్రులెల్ల నయము పెం । పునెగడి విభజించికొనగ । జనుననిరి మనుప్రముఖులు శాస్త్రార్థవిదుల్॥ గీ. తండ్రి మృతిబొందునైనను తల్లిబ్రతికి । యుండు కాలంబునం గాదయోగ్యరతి స । మే

—దాయభాగ ప్రకారము.—

త్యులగు నందనులు గీళ్లుమేల్లునరసి । పంచికొనననిరి కొందరు భవ్యతములు॥ క. జనకుండు బ్రతికియుండ న । తని యనుమతి భాగముగొనదగుపుత్రుని కొ । ల్లనని మరువాడు బల్కిన । జనదది దుర్వర్తనంబ శాస్త్రీయమిలఁ॥ క. పుత్రులు పసివారైన క । ళత్రము పతిజచ్చిన న్వెలయు సర్వజన । స్తోత్రప్రవర్తనం బతి । పాత్రతమంబుగ కుటుంబభరము వహింపఁ॥ క. జనకుడు కాలము చేసిన । జను పెద్దకుమారుడతి విశారదమతియై । యనుజులు బాంధవవర్గము । నెనయు కుటుంబభరమున్వహింప సదా ప్తిఁ॥ క. శుభచారిత్రంబును పా । పభీతియు నాప్తినిష్కపట వర్తనముఁ । విభవముగలవాడ కుటుం । బభరంబు వహింపజాల పాత్రుండరయఁ॥ క. ఏపనులు సెప్పనగ్రజు । డోపిక తమ్ములవి సేయుచొగి నతనియెడఁ । కోపము పుట్టింపక నురు । వైపుత్రులువ్రాలెనుండుటర్హత మిలఁ॥ క. ఆరూఢినగ్రజుండు కుమారులు బలెతమ్ములఁ సమతజూచుచు స । ద్గౌరవమతి బోవందగు ।

వారలలిగి నన్నలుగకవశ్యము బేర్మిౕ॥ క॥ జనకుడు ఋణమీగక జ। చ్చిన పెద్దకుమారుడతివిశిష్టత్వము పెం। పున నెగడియదిదీర్చికొనౕ। జను తమ్ములుగూడ పరమ సత్యవ్రతుడై॥ క. జనకుడుచేసిన ఋణమే। తనయుడు దీర్చికొను సమ్మతంబున నాతం। డనఘుండు ధర్మపుత్రుం। డనబడుగారొల్ల మనుదురాత్ములు పుత్రుల్॥ క. తనయులకన్నను బ్రేముడి। ననుజుల సరిజూడవలయు నగ్రజుడు గురుం। డని పాలకుడని జనకుం।డని వారలు తనుభజింప ననుకూలమతిౕ॥ గీ పూజ్యముగ కులము వెలయింప బోలయజేయ। నగ్రజుండసమర్థుండుదగ్రవృత్తి।కూడ దతనికి తమ్ములుగూడ రేని। దానవచ్చున గౌరవత్వంబు సభల॥ క. జననంబుచేత జ్యేష్ఠు। డన బరగడు మూఢచిత్తుడదిగావున ధ। ర్మనిరూఢి నెగడి తమ్ములం। కును బాంధవులకును బ్రియముగూర్పగవలయుౕ॥ క. అనుజులుసంతోషించెడి। యనువున మెలగంగవలయు నగ్రజుడటు వా।రనుకూలింపక పోయిన। తన గౌరవమంతయును వృధాచెడిపోవుౕ॥ వ. ఇంక విభాగప్రకారంబు వినుండు సమస్త ధన సంచయంబునందును జ్యేష్ఠుం డిరువది భాగంబులును మధ్యముండు పదియేను భాగంబులును కనిష్ఠుండు పదిభాగంబులును గొనవలయు మధ్యమునికన్న కనిష్ఠుం డధికంబుగా గొనుటయు సమానాంశంబులలో జ్యేష్ఠునకు మధ్యముండు కొన్ని భాగంబులుచితంబుగా నీగుటయును ధర్మంబని కొందరు జెప్పిరి. మరియు నిట్లు భాగంబులు చన మిగిలిన ధనంబును గృహంబులు పశుశాలాదులు క్షేత్రంబులు తోటలు సమానాంశంబులుగా సోదరులందరును గొనుటయు ఋణబంధనంబులుండునేనియు విభాగకాలంబునకు మున్న దెంచిగొనుటయు సోదరులకు శుభదాయకంబులగు కర్మంబులు వెండియు॥ గీ. మాన్యతముడు భవ్యమార్గ ప్రవర్తనుం। డై కుటుంబభరము నధివహించు। వాడ జ్యేష్ఠుండట్లుగాడేని యగ్ర। భాగములు గైకొనంగగాదు మరియు॥ క. వెలయగ తమతమ భాగం। బులలో మూడేసి భాగములు నురువైసగౕ। వలయుౕ దోబుట్టువుల కొ। రులుదమ మేలనగ సోదరులు నయముద

గన్॥ వ. సంస్కృతలగు నక్కచెల్లెండ్ర కీపద్ధతి కాదని కొందరమతం బు॥ చ. అనుచితమయ్యు నన్న మృతుడైన తదీయసతిన్ రమించి పు। త్రుని గలిగించునేని యపురూపముగాక కనిష్ఠుడీయగా। జనుసమభా గమిచ్చులును సర్వధనంబున పంచి వాని కీ। ననంసమంజసంబయగు నగ్రజభాగమురాదె వానికిన్॥ చ. అనుజుని భార్యయందు దగనన్న యు నగ్రజపత్నియందు దా। ననుజుడు పుత్రులన్ బడయునట్టి తెరం గులుకూడనైన త। త్తనయుల కెట్లు భాగములు ధర్మవు దప్పక నర్థినీ యగా। జనునది యేటిమాట యను సంశయ మెన్నడునైన గూడునే॥ క. ఏగతినైనను దగు। సమభాగంబులు వారలకు కపటవర్జితులై। యీా గుట సోదరులకు నని। రాగమశాస్త్రార్థవేదులైన మహాత్ముల్॥ క. స తియును బుత్రులు జచ్చిన। సతికైన నొసంగవలయు సమభాగము లై। కృతముండు నన్నదమ్ములు। సతమవితమ సోదరునకు సాధ్యము లగుటన్॥ చ. తనపతి జచ్చినన్ నొకవిధంబున పుత్రవిహీనయయ్యు దా। ననిశమునోపియుండు సతికాయమదేవరు లీగుటొప్పు మై। జను సమభాగము ద్దెరవుచాలక దుర్దశనుండు రేని జీ। వనమునకైన మా త్రము నవశ్యమునీయక దిక్కదెందునన్॥ క. ఏనరుడు పుత్రహీనుం। డై నిత్యము గుందుకూతు నాతడు కన్యా। దానముసేయన్ గల్గిన। దాన కుమారునిగనిన పదంబున మించున్॥ క. మాన్యుడగు పుత్రహీ నుడు। కన్యాదానంబుచేసి గౌరవమతి సా। మాన్యమగు తన కులం బతి। ధన్యత్వాస్పదముగాను దారవిభూతిన్॥ గీ. పుత్రులందరు జచ్చి న పుత్రికలను। దారమహిమాస్పదంబుగా దక్షుడొసగి। వృద్ధిబొం దించె కులముపేర్మిమెయి ననగ। వినమె పూర్వపుగాథల ననఘులార॥ వ. అదియెట్లనిన నాదక్షుకుండు తనకుమార్తెలలో ధర్మపురుషునకు ప దుపురను కశ్యపునకు పదమువ్వురను చంద్రుని కిర్వదియేడ్వురను దా నపూర్వంబుగా నొసంగి నిజకులంబు వృద్ధి బొందించుకొనినవాడయ్యె గావున పుత్రరహితుల కవ్విధంబవలయు॥ క. పుత్రరహితుడగు సోద రు। పాత్రములగు సర్వవిత్తభాగంబులు ద। త్పుత్రిక కొసంగవలయు

జ । రిత్రంబెన్నక నయము గరిష్ఠత వెలయన్॥ క. పాత్రతమంబనిరి బుధులు । పుత్రరహితు సర్వభాగములు నిచ్చులు దా । హిత్రుడు మాతామహాంశంబులు । పుత్రికయును జేకొనుట తపోధనులారా॥ క. తామతము పేర్మిమెయి మా । తామహునంత్య క్రియలు సతము నొనరింపం। గా మాన్యుడు దౌహిత్రుడు। భూమిసురలకెల్ల దానములు సేయంగన్॥ క. పుత్రుడు లేక గతించు క । ళత్రము ధనమెల్ల గొనవలయు పతిపేర్మిన్ । పుత్రిక యుండిన గాదని । రత్రియును పులస్త్యుడును మహాశయులారా॥ క. కూతురు పుత్రరహితమగు । మాతృవిభాగంబులు గొను మహితపదము వి । ఖ్యాతము జనకునిపాళ్లు వృ । ధా తొలగక సుతుడుగొను విధంబును బోలెన్॥ గీ. జ్యేష్ఠయయ్యు దాను జెంద పాత్రముగాదు । పుత్రిక దివుటమెయి బుత్రుతోడ । భాగములు సమములుగా గొనసగబాలు । మాత్రము గొనవచ్చు మహితులార॥ గీ. సోదరులు లేని దౌహిత్రి యాదరమతి। దాను మాతామహునకు మాతామహికి స । మస్త శాస్త్రోదితాంత్య కర్మంబులెల్ల । గడపి వారల విత్తంబు గైకొనదగు॥ గీ॥ పాత్రధర్మంబు నడపిన పుత్రువలన । త్రిభువనంబుల జిరకాలమభినుతముగ । పరమపదము నిచ్చులు పౌత్రువలన। బడయు మనుజుండు పూజ్యత భవ్యులార॥ క. తనయుడు జనకుని పున్నా । మనరకమున బడక భవ్యమార్గజయ శ్రీ । దనరగ రక్షించును గా । వున పుత్రుండనియె బ్రహ్మపూర్వమువానిన్॥ క. పౌత్రుడు నుత్తముడగు దా । హిత్రుండును సములు భేదమెనయ దరయ దా । హిత్రుండు పౌత్రునట్ల స । పాత్రక్రియలెల్ల జేయ బరగు సదార్తిన్॥ సీ. దౌహిత్రుడర్థి ప్రథమ మేకపిండంబు మాతకుమరిరెండు మాతృజనకు । నకుమూడు వానిజనకునకు నిడునది పావనసుగుణసంపన్నుడైన । దత్తపుత్రుండు విత్తముసర్వమున్ గొనువాడు వాడయిడంగవలయునర్థి । తను బెంచికొనునట్టి జనకునికొప్పదు జన్మకారణుడైన జనకునికటు । దత్తుడగుటకాదు తనతండ్రిగూర్ప బెం । పైన విత్తమందు నంశముగొన । మరదివలన విటునిమన్ననవలన గ । ల్గిన సుతులకు పా

ళ్లులేవులేవు॥ క. వారలు భాగంబులుగొన । గా ఋణబంధము దీర్వ గానిత్యము పి । తౄరాధనములు సేయం । గారాదని రార్యులతి ప్రబ కాశముగాగ॥ గీ. పతితుడగుటకాదు భాగముల్ గొని ని । క్తయగు దాని పుత్రుడయినవాడు । వానిపాళ్లు గొనవచ్చునౌరసపుత్రు । డర యవాడ పూజ్యుడర్హతముడు॥ క. మృతిబొందినట్టి సోదరు । సతిగూ ర్పగనిచ్చు నర్థసంచయ మతుల్యా । ర్జితముగ జేరిచి తగత । త్సుతుల కొనగవలయు నగ్రజులునసుజన్ముల్॥ గీ. ఏకయోనిజులకు నివ్విధంబా చర । ణీయమఖిలపూర్ణ దాయభాగ । నియతివివిధపుత్రనికరంబునకు జెల్లు । భాగవిధులు తేటపరతువినుడు॥ గీ. బ్రాహ్మణుండనేక వర్ణం బులందు క । న్నియలసతులుగా గ్రహించిబడయు । నట్టిపుత్రకులకు నట్ల వివిధభాగ । ములునొసంగవలయు ముఖ్యసరణి॥ వ. అదియెట్లని

—ద్వాదశవిధపుత్ర భాగప్రకారము—

న జాతీయ కన్యాకుమారునకు మూడు భాగంబులును క్షత్రియకన్యా పుత్రునకు రెండుభాగంబులును వైశ్యకన్యానందనుని కొక్కభాగంబు ను శూద్రకన్యానవయున కర్థభాగంబును విభజించి యొసంగవలయు నిట్లు॥ క. ఉద్యోగపరాయణతయు । విద్యయు గలవాడునైన విప్రుండు వృథా । ర్థద్యోతకమగు బుద్ధి స । ముద్యద్భాగములు గూర్చుటొప్పద రయగ॥ క. పాత్రుండైనను శూద్రీ । పుత్రునకిక పెక్కుభాగములు కాదొసగగ । ధాత్రీసురుండు వానిచ । రిత్రము పండితులకు విపరీ తంబగుటగ॥ వ. ఇది కొందరమతంబు॥ క. భద్రచరిత్రుడు ఘనుడగు। శూద్రసతీపుత్రుడును బశువులును బహుర । త్నద్రవ్యములును కనక ముపద్రవమగు వేళగొనగ బాత్రుండయగుగ॥ వ. శూద్రునకు విజా తీయ కన్యాపరిగ్రహంబు కాదుగావున సజాతీయసతియందు వడసిన నూర్వురు పుత్రులకైనను సమానాశంబులు విభజించి యొసంగవల యు నౌరసక్షేత్రజదత్తకృత్రిమ గూఢోత్పన్నోపవిద్ధులను వారలును కానీనసహోఢ క్రీతకపౌనర్భవ స్వయందత్త శౌద్రకులను వారలును ద్వాదశవిధపుత్రు లనంబరగుదురు వెండియు॥ చ. అనువుమెయిగ మ

నుష్యుఁడు తృణాదివినిర్మితమైనయోడఁ జే । ర్మినెగడి యెక్కియంబుధి దరింపఁగఁజూచు విధంబగుఁ కుపు । త్రనికరభూతిమై యిహపరంబుల సౌఖ్యములొందఁగోరువా । నినడపుగావునఁ సతిగ్రహించు విధంబుల నేకమార్గముల్॥ గీ. ఔరసక్షేత్రకుమార లలరునాత । డైహికాముష్మికసుఖంబు లందనోపు । దృఢతరంబగు నోడ బేర్మిమెయి నెక్కి । మనుజుఁడు సముద్రము దరించు మాడ్కినరయ॥ గీ. పైతృకధనంబు సర్వంబు పాత్రతముఁడు । గానఁగ నౌరసపుత్రకుండనఘులారా । గాన వాఁడవివిధ సూత్రులైనసుతుల । కెల్లనగ్రజుఁడును పూజనీయుఁడునగు॥ గీ. పైతృకంబగు ధనమునపాళ్ళయిదయి । నమరియారైన క్షేత్రజునకును తక్కి । నట్టి దశవిధపుత్రుల కౌరసుఁడు । బ్రదుకుకొలఁదిగ నీఁదగు భవ్యులార॥ చ. అనఘవివాహవిధ్యుచితమారఁగ సంస్కృతమైన భార్యయం । దనయముగల్గినట్టి సుతుఁడౌరసపుత్రుఁడు వాఁడపావనుం । డనిరిసమస్తకర్మములయందును భవ్యతముల్ జగద్ధితం । బు నెగడు శాస్త్రవేదులు సునీజనముఖ్యులు భూనుతంబుగన్॥ ఉ. ఏయమభర్తజచ్చినరహించినియుక్తయు పుత్రకామయుఁ । నైయొకనిఁ రమించిగనునట్టి కుమారుఁడు క్షేత్రజుండనం । గాయుపయుక్తభూతుఁడనగాఁబఁడునాయమ యంతకర్మముల్ । సేయఁగవచ్చు వాఁడతివిశిష్టజనందుల యాజ్ఞపెంపునన్॥ క. పుత్రార్థియశక్తుండుఁ క । ళత్రము నెరుతల్పమున గలయుబస్వదగ । న్మాత్రరతి నుద్భవించిన । పుత్రుఁడు క్షేత్రజుఁడనిరి విబుధసంఘంబుల్॥ వ. ఇట్లు క్షేత్రజులిరుతెఱంగుల వారలైరి॥ గీ. వెఱచియైన బ్రియమువెలయనైన కుమారు । తల్లిదండ్రుఁడు లొసఁగనొల్లనక। వానిబెంచికొనిన వానికివాఁడగు । దత్తపుత్రుఁడన నుదాత్తగరిమ॥ గీ. మంచివాఁడవగుదు మాయయ్యయనుచు నన్యునికుమారువాని జననియుజన । కుండుదాను వేఁడుకొననిచ్చు నట్టి పు । త్రుఁడతనికిని గృత్రిముఁడనగ వెలయు॥ క. తనసతియందొరునివలన జనియించిన పుత్రుఁదాత్మశంకింపనిచో జనుగూఢోత్పన్నసుతుం । డనతండ్రికి వాఁడుమిగుల నధముండుభువిన్॥ గీ. తల్లిదండ్రులైన నెల్లమినెరులైన । విడచిచనిన

శిశువు వేఱ్క బ్రిచుము | వరలబెంచికొనిన వానికి వాడప , విద్ధపుత్రుఁడ
నగ వెలయు మఱియు॥ గీ. పెండ్లి కాకమున్న పితృగృహంబున రహ |
స్యమున బుత్రునిగను నిమతకన్య | నర్థి పెండ్లియాడు నతనికి కానీను |
డనగ నా సుతుండు దనరుచుండు॥ గీ నిజము నెఱుగక గర్భిణియగు కన్ని
య పెండ్లి | యాడినట్టి వానికామె యందు | బుట్టిన సుతుండు డిరువుగొట్టు
సహోఢాత్మ | జుండనంగ వెలయు సుమతులార॥ గీ. సతియుపతియు
పుత్రసంతానరహితులై | పణములిచ్చికొనిన బాలకుండు | కరము వెల
యు క్రీతకకుమారకుండన | వాఁడు పాత్రతము నుగాడె కష్టు: గీ. విధవ
యైనభర్త విడచినయది యైన | పేర్మిమఱియు నొకని పెండ్లియాడి | బడ
యునట్టి సుతుఁడు పౌనర్భవుండన , బరగువాఁడు నిత్యపాపరతుఁడు॥ గీ. త
ల్లిదండ్రులిచ్చలొల్లక స్వయముగా | నీయనైనయు జననియు జనకుఁడు|
లేకనైన నొరుఁడు గైకొని పోషింప | దండవిడక పెరుగుచుండువాఁడు॥
వ. స్వయందత్త పుత్రుండనంబరగు॥ గీ. బ్రాహ్మణుండు శూద్రభామిని
బడయుంగ | జననమైనసుతుఁడు శవమువోలె | నంటరానివాఁడు నల
సుందునగుగాన | పారశవుఁడనంగ బరగువాఁడు॥ గీ. బ్రాహ్మణస్త్రీర
మించిన పాదజుండు | వోలె బ్రాహ్మణుఁడును నీతిమాలిశూద్ర |
కన్యకరమించి బతితుండు కష్టరతుఁడు | నాదగుననువాని జూడగారాదు
బుధులు॥ గీ॥ విప్రకామిని శూద్రుఁడ నతిప్రియంబు | నిచ్చలును జేసి పొంద
నించుపుత్రు | డత్యధమతముఁడు చండాలునట్లవాని | జూచునదియునిరి
పండితుల్ సుమతులార॥ గీ. వివిధనామకర్మ వృత్తజీవనులను | నౌర
సాదిగాకుమారవర్గ | విధములెల్లమీకు వినిపించితింక త | ద్భాగవిధులు
వినుఁడు భవ్యులార॥ గీ. ఔరసుఁడుగాక క్షేత్రజుండాదిగాగ | వెలయు
నేకాదర విధపుత్రులునిజోద | యాద్యకారణులగు వారలట్ల ధర్మ |
పథముననడచి బ్రమకుట పాత్రతమము॥ క. ఏపురుషులు బీజము
లిడ | గాపుట్టిరి వారలట్టికర్మంబుల ని | చ్ఛాపరితుష్టి మెలం
గుచు | దీపింపగవలయు వారిదిసుకరమయ్యా॥ గీ. పెక్కుసోద
రులందుననొక్కనికి కుమారకుండుదయించిన వారలెల్ల | పుత్రులగని

నవారలు బాత్రతములు । ననఘులయగుననియెమున్న మనువుమరి
యు॥ వ. కావున॥ క. అపుత్రుడగొనువాడు మ । మహోపరితుష్టిమె
యితంత్రులందర ధనముల్ । పాపరతుండనబడక స । దాపితృకర్మ
ప్రశిద్ధిదగి ఋషులారా॥ సీ. బహుసోదరులధర్మ పత్నులందఱిలోన నే
యమసుతుగనియె దగంగ । నాయమబొందగానగు భాగములనెల్లపు
త్రునిబడసి తాపాత్రమగుట । నాసుండాదికుమార వర్గంబున పితృకర్మ
ములుసేయ పెంపువెలయు । వారలుశ్రద్ధావిచారులగుట నధికాంశం
బులు గొనంగనర్హాతములు । మరియు సోదరులెల్లకుమారహీను । ల
గుడుయెవ్వడు జచ్చియున్నతనిపాలు । దక్కియుండిన యన్నలుదమ్ము
లుగొన । వచ్చుననిరి ఋషులుగౌరవంబుపేర్మి॥ గీ. తాతతండ్రికి తాతకు
తండ్రికిమరి । యునగుతరములవారికి తనయుడాప్తి । పిండకర్మములొన
రింపబెంపువెలయు । వాడుగావున పాళ్లెల్లవానివియగు॥ సీ. తనయుండు
తండ్రియు తమ్ముండునన్నయు లేనినరునిసొమ్ము వానిభార్య । గొనన
గుకూతురైసననిరి కొందరు వారును లేనిచో వంశభూతు । డైనవాడు
గ్రహింపనర్హుండు వాడును లేనిచో శిష్యుండునైనవాడు । లేనిచో నాచా
ర్యుడైన నాతండును లేనిచో నధికసన్మానభంగి । దగి పురోహితుడైన
నాతడును లేని । చోనృపుండైనగొనునది మానకతని । యంత్యకర్మంబు
లెల్ల సమాచరించి । యనిరిమనువును బ్రహ్మయునఘులార॥ గీ. ఎవ్వ
రును లేకజచ్చిన హీనుధనము । దాగ్రహింపంగవచ్చు నుత్తముడు బ్రా
హ్మ । ణుండు పాత్రతముండుఘనుడు ప్రాజ్ఞు । డమలమతివాని యంత్య
కర్మములు జేసి॥ గీ. పార్థివుండెవ్వరును లేని బ్రాహ్మణుని ధ । నంబుగొ
నుటొప్ప దొప్పదానములుసేయ । నైనగైకొనుచెసగునదాననిరతు ।
లగునితరవర్ణములవారియర్థములను॥ క. పుత్రుడును బతియులేని క । శత్ర
ముగురునాజ్ఞనొసగలసిగాంచిన త । త్పుత్రుడు సామాన్యంబుగ । పాత్రు
తముమాతృతరవిభాగములుగొనగ॥ వ. భర్తసజీవుండైయుండునప్డు
వానివలనబడసిన పుత్రుండును విధవయై యొరునివలనగాంచిన పుత్రు
డును నేననేనయధిక భాగంబులు గొన పాత్రులమని వాదింతురేనియా

కళత్రంబు వారల తండ్రు లెంతలు ధనంబులు వెట్టిగతించె నంత లక్ష్మ-
మారులకొసంగి సమ్మతంబు సెప్పవలయునని గొందరమతంబు॥ క. పు
త్రులును కూతుల్ గొన। పాత్రులగుల్ మాత్రతరవిభాగము లయి
నః। మాత్రవ్యవాప్తిమెయిగల। పుత్రికయగొనంగవలయు భూనుతులా
రా॥ క. మాతామహింభాగము గొన।గాతగు ప్రాయంబురాని కన్యసమ
గ్ర। ప్రీతిమనుమలకుఁ రాదు పు। రాతనధర్మమిది హితపరాయణులా
రా॥ గీ. ఈడువచ్చిన వారలగు నేనికన్య। లందరును పంచుకొనుట మా
న్యంబుకన్య। లెవ్వరునులేనిచో దాగ్రహించుటొప్పు। మనుమడిదిస
ర్వశాస్త్ర సమ్మతపథంబు॥ గీ. పెండ్లికాలమందు ప్రీతిమైయత్తవా।

—స్త్రీధనప్రకారము.—

రింటికనుచు నప్పుడిచ్చులుబిత్తు। ముఖ్యులొప్పవారు ముదుపులిచ్చిన
ధనం। బరయస్త్రీధనంబ యనిరిబుధులు॥ గీ. చుట్టములును తల్లిపు
ట్టింటివారును। తోడిచేడియలును దొట్టిజనని। సోదరీజనములు మోద
మారంగ ని। చ్చినధనంబు నిజముస్త్రీధనంబు॥ గీ. ఊరిలోనిసతులు
గౌరవార్థముగ ని। చ్చినధనంబు వెలయు స్త్రీధనమన। నిట్లుస్త్రీధన
మునయించె నారువిధంబు। లైసమస్తశాస్త్ర వాసితముగ॥ గీ. భర్త
జీవించియుండగా భార్యకాల। వశముబొందినజెందదు వానికరయ।
స్త్రీధనంబు కుమారునిజెందుననిరి। పరమధర్మప్రవీణులు భవ్యులార॥
గీ. బ్రాహ్మమాదిగాగ పంచవివాహకా। లములనైన నంతరమున నై
న। స్త్రీధనంబుపతికి జెందునాయమపుత్ర। హీనమైగతించె నేనిమరి
యు॥ గీ. అసురాదివివాహంబులందునైన। స్త్రీధనముపతికి జెందదుజెం
దుదాని। జనకునకుపుత్ర హీనమైజచ్చెనేని। నుతమహాధర్మపథము స
మ్మతముగాగ॥ గీ. తండ్రియొసగినట్టి ధనమపుత్రపతి నా। దనరుకన్య
కాలధర్మమొంద। పరమవృత్తినొప్పు బ్రాహ్మణస్త్రీగొన। వచ్చుననిరి
లోకవంద్యతములు॥ సీ. ఎలమిసోదరులతో గలసియుండినవాడు కాదు
భార్యకునలంకారములిడ। పతివిత్తమయ్యెను సతిగొనరాదు ప్రేముడిగ
లహాడంచునడుగకెద్ధి। యన్నదమ్ములతోడనున్నయాతనిసతి జచ్చిన

దానిభూషణములిచ్చ । జేసిపుత్రులుగొనజెల్లదు గొనునేని బతితులనం
బడు పతితుడునున । పుంసకుండును వెర్రియు మూగయును జ । డుం
డుగ్రుడ్డియు వికలాంగుడును విభాగ । ములుగొనంగన పాత్రతములు
సతంబు । కూడుగుడ్డయు నొకరీతిగోరవలయు॥ క. ఏడుగడలైతివారలు।
కూడును గుడ్డయును లేక గుందుచు సతము౯ । బోడిమిసెడునెవనివలన।
వాడధముడుకష్టరతుడవని । ఋషులారా॥ గీ వలచినట్టికన్య వరియిం
చియన్యుని । వలననైనబుత్రు గలుగజేసి । కొనునపుంసకాదు లనయం
బు భాగముల్ । గొనగ బాత్రులయగు ననవరతము॥ గీ. విద్యవడయుని
ల్లువెడలనుద్దేశించు । తమ్ముడన్న నడుగ దగుధనంబు । తండ్రిజచ్చెనేని
తండ్రివోలెసతంబు । నగ్రజుండుపూజ్యుడగుటజేసి॥ క. అన్నదమ్ములం
దరైకమత్యంబుగా , నార్జనంబుజేసినట్టిధనము । పంచికుదువవలయు
భాగముల్ సరిగాన । నిర్మహాజనంబులు ఋషులార॥ గీ. విశ్రుతముగ
నొప్పు విద్యవలనభాగ్య । వలననధికగౌరవంబుపేర్మి । బడసినట్టిధనము
భాగంబులీయగా । రాదుతనమతమున సోదరులకు॥ గీ. స్వయముగా
కష్టదశలపాలయిగడించు । నర్థమెవ్వండుపాడ దానుభవించు । వాడు
బ్రతుకుతెరవు లేనివారలయిన । యన్నదమ్ములకొప్పిను యంతకొసగి॥
గీ. తండ్రివలనగాక తానుగడించిన । యర్థముసుతుతోడ నాదరమున
పంచికుడుచునట్టి పద్ధతిలేదని । రఖిలశాస్త్రవేదులైన బుధులు॥ గీ సో
దరులసమేతులై దొట్టిపిమ్మట । కలసిమెలసికొంత కాలమరుగ ।
మరలపంచికొనగ నఱముల్యయగు వార । లైన భాగములు సమాన
ములగు॥ క. ఏయగ్రజుండు కపటము । వాయక నిత్యంబుననుజావం
చించు ధనం । బీయక వాడధముండుగ , తాయుస్సామ్యుండనిరి మ
హామతి మంతుల్॥ క. సోదరులలోన నెవ్వడ , నాదరణీయములు నిం
ద్యమగు కర్మంబుల్ । వేదిప్రట జేయువ్యయము౦ । గాదొడరు౯ ధన
మువాడు గాడనిరి బుధుల్॥ గీ కానిపనులు సేయగా ధనమెవ్వాడు ।
వ్యయముసేయుసతము వాడు భాగ । ములు గొనంగగా డమలమతి
సత్కర్మ । ఘనుడు పాల్గొధికము గొనెడివాడు॥ క. ఆరయ తనతోగూ

డ కు । మారులు కష్టపడిధనము మాన్యతమముగన్ । గూరుచునైన
ను తండ్రియు, దారాంశము లీయగాదు దగునిచ్చుమెయిన్॥ క. పు
త్రులు జనకుడుజచ్చిన, పాత్రతమము పంచికుడువ బరగదుసచ్చా ।
రిత్రముదగి గర్భిణియై । ఛాత్రముమెయి తల్లియుండభాగములుగొనన్॥
క. జననీజనకులు పుత్రుం । దనపత్న్యడు జచ్చినన్ తదంశము లెల్లన్ ।
గొనిసరిపంచి కొనంగా । జనుననియెన్ మనుపుశాస్త్ర సమ్మతముద
గన్॥ గీ. వస్త్రములు పత్రములు నీళ్లువని తలన్న । ములు నలంకార
ములు గురుముఖ్య జనము । లను విభాగించి కొనగూడమినయము దగ।
సదృశములు జేసికొనుట ప్రశస్తతనము॥గీ. ఔరసుండాది గాగ కుమా
రవర్గ । ములకు మాన్యంబులగు భాగముల విధులు స । మస్తమును
జెప్పితింక సన్మాన్యులార । ద్యూతధర్మంబు వినుడుసంతోషమలర॥
క. జూదము సమాహ్వయంబన । గాదగు రెంటును వినాశకారణములు
బెం । పేదియువి యిచ్చసేయు న । నాదరణీయులకు వినుడయమహితు

—*ద్యూతప్రకారము*—

లారా॥ క. ఒరులెరుగకుండ నీరెం । డు రహస్థలములందిడు కొనిప్రియ
ము నై।బరగించువారలుగలరు।నరనాథుడు వారినెరుగునదియత్నమునన్॥
గీ. ప్రాణివర్గంబు దొడరకపన్ని దంబు । జరచుటది జూదమనియు మేష
ములు కుక్కు, టములు మొదలగు ప్రాణిసంఘములు విడచు । టదిస
మాహ్వయ మనియుజెప్పుదురు బుధులు॥ గీ జూదమాడుట యార్యుల
జుక్కజూచు । టాగమంబులు దూషించుట నృతములు వ । చించు
టారులునణంచి జీవించుట గల।వారల పురంబు వెడలింప వలయునృపతి
గీ. కల్లుదాగ్రుట కానిమార్గమున నడచు । టేమియును సేయనొల్లక
సోమరియగు । పెల్లవారల కాదనియిచ్చుమెలగు । టగలవారల వెడ
లింపనగు పురంబు॥ క. ఆరయ నీచెప్పబడిన । వారలు స్వేచ్ఛమెయి
దిరుగు వారమున భయం । బైరాజ్యముసెడు గావున । భూరమణుండు
రుకనణచిపుచ్చగ వలయున్॥ క. జూదమున నోటుపడిన మ । హాద్రై
న్యరసంబు దోచునానసమున బెం । పేదికనకాది నెత్తం । గాదగు

వానికిని లోకగర్హితముదగన్॥ క. ఖేదంబుగల్గుసేయు మ। ర్యాదయు
నార్జవము సుఖపరాయణతా గో। ష్ఠ్యాదులు సంతోషంబును। జూ
దంబున గాదె నుతయశోధనులారా॥ క. భూపతులు భృత్యులగుట మ।
హాపండితు లధములగుట నతిమాత్రులు గో। ష్ఠీపరతంత్రము సెడి దు।
ర్వ్యాపారులగుట దురోదరంబున గాదే॥ క. వేదురులు వ్రాలెనరచె
డి। జూదంబున నోటువడిన శుష్కమతులు మ। ర్యాదసెడియుందు నం
దు మ। హాదీనదశన్ దిరుగుటయవనిన్ గనమే॥ క. మేరునగమెత్త
నోపిన। వారలు జూదముననోటువడి యాకటి పె। ల్లారగ భిక్షాన్న
ముగొను। వారలయిరి మున్ను పెక్కు వర్షములుర్విన్॥ క. గానపరి
హాసమాత్రము। నైనన్ జనగట్టి త్రోవనార్యులరిగిగా। దేనష్టద్రవ్య
పరుం। డైన వ్యాదయుడుజచ్చె నార్తుండగుచున్॥ గీ. బంహ్యాభంగి
నైన ప్రచ్ఛన్నముననైన। జూదమాడుచుండు నేదురాత్ము। డణచికట్టివాని
నధిపుండుదండింప, వలయునోరులుచూచితొలగి చనగ॥ వ. జూదమాడు
నట్టివారల ద్రవ్యరూపంబగు దండముననురువణంగింపవలయు ద్రవ్యదం
డనంబునకు పాత్రులుగారేని హీనకర్మంబులు సేయించి పుచ్చవలయు
గీ. బ్రాహ్మణుడు జూదమాడిన పార్థివుండు। హీనకర్మంబు లొనరింప
నెన్నడును బ। నుపవలపదర్థ మాత్రంబును గొనవలయు। ననిరి కొం
దరు సర్వలోకనుతులార॥ గీ. వేదురులు బాలురంగనల్ వృద్ధులును
రు, జాతురులు జూదమాడిన నధిపుడపుడ॥ త్రాడయిన సూక్ష్మమగు
వేణుదండమయిన। కొనిజనంబులు సూడంగకొట్టవలయు॥ క. కపట
ము గర్వమునధి కా। రపదమునన్ బొల్చువాడు రహిజెందుచు త్రు।
ళ్లిపడంగ వానిసర్వా। ర్థపరిభ్రష్టునిగ జేయదగు నృపుడురుకన్॥ క. అ
రయునే యధికారియ। గౌరవముగ జూచుబుధుల గర్వించిధరి, త్రీరమ
ణుడు వానియురము। పైరెండు పదంబులిడి సభన్ ద్రొక్కదగున్॥
క. బీదజనంబుల నతిదు। ర్వాదంబుల పాలుజేసి వరలుదురాత్మున్।
భూదయితుడు శిక్షింపం। గాదగు చెరసాలనిడి జగన్నుతముదగన్॥
గీ. శుల్కములనుగొని బహువుబోలెనే యధి। కారిపరమధర్మ గౌరవం

బు। లుడిగి ప్రజలనేచుచుండు నా కష్టాత్ము। నాల్కగోసి పుచ్చువది
నృపుండు॥ గీ. ప్రజలసందగ తనుఁగోలెపరమ గౌర, వమతిజూడని వా
డుశవంబు నిజము। గాననట్టిదయిన యధికారిచూడ, దగదునృపతి
యు సభ్యులుధర్మను తులు॥ క. ఏయధికారి యహంకృతి, వాయకచె
డనాడు గౌరవముగల సుగుణ, శ్రీయుతులవానితనువుఁ, గోయవల
యు మాంసమేర్చి కుక్కలుదినఁగ॥ గీ. స్త్రీలబాలుర విప్రులవృద్ధజను
ల। వధముజేసిన వారల వరపికూట। శాసనముఁ వ్రాయు వారలజంప
వలయు। పార్థివుండు విమలధర్మపథముబట్టి॥ సీ. ధర్మాధికారియు బేర్మి
నెమ్మదిగల మంత్రియుకాని కర్మములుసేయు। వారగునేని మహీరమ
ణుండు సహస్రపణములు గొనంగవలయు। సర్వార్థములుగొని శాసిం
పు టొప్పగుననిరి కొందరు మహాజనములిచ్చ। కల్లుద్రావుటసేయగడ
గుట బ్రహ్మవధంబుసేయుట గురుతల్పమందు। వలపుసేయుట దొడరిన
వారితనువు। లుక్కసెడగొట్టి చెరసాలనునిచి సర్వ। విత్తసంచయము
లు గొనియుత్తములగు। బ్రాహ్మణుల కవియీనగుపార్థివుండు॥ గీ. గు
రుసతిరమించినట్టి కష్టగతుఫాల। తలమునందు జ్వాలాగ్నిసంతప్తలోహ।
పిండము బఱపిగురుతులు బెట్టవలయు, యోనివోలెగృపాలుండు మహా
నుబార॥ వ. కల్లుద్రాగిన వానినుదుట సురాధ్వజాకారంబుగను బ్ర

—రాజు మహాపాతకుల శిక్షించి గురుతులిడు విధము.—

హ్మఘ్నుని కబంధంబున పురుషాకారంబుగను ముచ్చిలువానికఫాలం
బున కుక్కపాదంబు పోలికను తప్తాయఃపిండంబు బఱపిచిహ్నలిడ
వలయునిట్లు॥ గీ. కానిభోజనములు కానివివాహముల్। కానికర్మ
ములును కానిచదువు। లెవ్వరాచరింతు రెరుగమిన్నైన దం। డింప
వలయు నృపుఁడొనుచినవాండ్ర॥ వ. బ్రహ్మవధయు సురాపానంబు
ను గురుసతీరతంబును జౌర్యవృత్తియు గలవారును వారలహితులును
మహాపాతకు లనంబడుదురు వారలతో గలసి మెలసి దిరుగుటయు
దినుటయు సంబంధంబులు కల్పించుకొనుటయు నెవ్వరికిని గావుమఱియు
ను॥ గీ. ఎఱుకజాలక సేయుదానింత లెవ్వ। డెరిగి వానినిసేయనిదొరు

గల్గ | పార్థివుఁడు పోమ్మనవలయు భవ్యులారా | వానితన యుంతవా
డను వానిఁగాఁగ॥ క. ఆరయఁగల్గియు దుష్క | ర్మారంభము సేయువా
ని నధిపుం డుగ్ర | స్ఫార ప్రచండ శాసన | తాపాప గ్రస్తుసేయ దగు
ననిరిబుధుల్॥ క. జ్ఞానంబజ్ఞానంబన | గానగు రెండింట నెద్దిఘనతరమగు
న | ద్దానసుకృత దుష్కృతములు | మానవు డొనరించునదియ మత
మై వెలయున్॥ క. తగునిదియని యవ్వఁడు సే | యఁగడగు దుష్కర్మము
లు మనఃపూర్ణము గా | జగతీపతి సెప్పవలయు | తగవానికి యిరుతె
రంగుల ధర్మపదంబుల్॥ క. ఆయుతమతంబు గల్గియు | రోయక దుష్కృ
తము లేనరుడు పొపుమెయిన్ | సేయునరుక వాని మహీ | నాయకు
డు చెరనిడవలయు నరులెల్లగనన్॥ క. ఒరులను వంచింపగజే | యు
రహస్యక్రియలోగిఁ మనుజుడెవ్వఁడు వాని రహస్యస్థానంబున నరపతి
దండించు నదిమహామతులారా॥ క. పాపాత్ముల దండించుమ | హీపతి
పూజ్యుండు ఘనుడనియె మనువతిదీ | క్షాపరతంత్రుడై గో | ష్ఠీపరిచయ
ముఁ గలుగు శిష్టుమవోలెన్॥ క. పాపాత్ములవిత్తంబులు | భూపతి
గొనిదాచి కొనఁగ బోవల దవి గరి | ష్ఠాపరుడయ్యును దన్నుమ |
హా పాతకు జేయు నిక్కమనిరి మహాత్ముల్॥ గీ. పాపకర్ముల
విత్తముల్ బ్రాహ్మణులకు | పేదవారల కర్థినిప్పింప వలయు | దానప్ర
జలెల్ల బొరయు నిత్యముచిరాయు | వర్థసంశుద్ధి గౌరవంబార్యులారా
గీ. బ్రహ్మతేజోమయుండగు బ్రాహ్మణుని క | పాయమొరింపజూచు
పాపరతు శూద్రు | కాయమింతలు మాంసపు ఖండములిల | బడవధ
ము సేయ వలయు నృపాలకుండు॥ క. ఏదేశంబున రాజుస | మాదరమతి
పాపరతుల యర్థములెల్లన్ | బీదలకిచ్చు గరిష్ఠత | నాదేశము పూజనీ
యముగు ననఘులకున్॥ క. పాపరతుల దండింపమి | భూపతితనకైన
పాపముల బాపికొనున్, పాపమిది పుణ్యమిదియని, రూపించుచు దండన
ముపరువముగ జేయున్॥ క. నరనాథుడు పటుకోప | స్ఫురితాననుడగు
చు బ్రహ్మభూతుండనగా | బరగని బ్రాహ్మణుఁ ఛీయని | పరమార్థము
బోల తేట బరుపగవలయున్॥ క. ఈపగిదిన రేంద్రుమ | హీపాలనమూర్థ

నేయునేని బొరయును । ద్దీపితతనురుచులురుల మ । హాపదముమర గణ
ములు నయంబునగొలువర్॥ వ. మరియును॥ గీ. ప్రజలనందర సంతో
ష పరుపకాచి । బలివిశేషంబులు గొనసుపాయమరయు । పార్థివుండె
ల్లవారలు పగఱుగాగ । జిక్కదుర్గతిగూలి గృశించు నిజము॥ గీ. ప్రజల
నందర పరమధర్మ పథమున ప । రాయణావాప్తి నడచువారలుగజేయు,
మాననీయుండు నృపతిసమస్తలోక । ములు భరించినఘనుడన వెలయు
సతము॥ క. పాపములకు హేతువులగు, కాపురుషశ్రేణి మస్తకంబులు
బలిగా । భూపతి ధర్మపురుషునే । వాపరిచయ మర్థిసేయవలయు దివుట
మై॥ గీ. విద్యారాష్ట్రమందు వెలయించివైద్య స । హాయమెల్లయెడల
యందునిలిపి । బీదసాదజనుల బ్రోదిసేయంగవ । లయునృపుడునిష్కళం
కవృత్తి॥ క. ఆరయభూపాలకుడె । వ్వారలుకొనియాడకుండువాడగునైనన్ ।
ప్రారంభింపగ వలయును ! దారతమెయి పాతకుల వధముసేయంగన్॥
గీ॥ నీరదినదినంబు నించినమొలక మ । హాతరువగు చాడ్పుననృపుడల్ప ।
మాతుడియ్యులోక మాన్యాధికుండగు । పాలనంబు ధర్మ బద్ధమైన॥
క. చారులనుకనులుగిచ్చి మ । హీరమణుండు రాష్ట్రమందునెల్లెడలను
పా । పారంభశీలురంగను, జారులచోరులసమస్త జనసంఘములన్॥
గీ॥ కపటవర్తనమెనయు నంగడియొనర్చు । చుండువాడుబహిష్కరుం
డుబెట్టు । నురకనైన నొదిగియైన యొరులధనము । లపహరించువాడంత
శ్చోరుడండ్రుబుధులు॥ క. ఎరుగనివారలకింతలు । గరపి ధనములుగొ
నువాడు కాపురుషుండున్ । గరువంబు చెడినవైద్యుడు । నురికియొరు
లనఃచి వదరుచుండునరుండున్॥ గీ. జూదరియు వారకాంతలు జుల్క
నాడి, యొలరువంచించువాడు నెవ్వరికిగాని । వాడు దబ్బరలాడెడి వాడు
మరియు । నాతతాయిబహిశ్చోరులనగబరగు॥ గీ. చారచక్షువగు మహీ
రమణుండు వా । రలనెరింగి నిష్ఠురముగశాస । నంబుచేసి సజ్జనంబులు
నడచు మా । ర్గంబుదొట్టి ఘనతరంబుసేయు॥ క. చారులవలన సమస్త
ము । భూరమణుండెరిగి దండముబరపిడగుదీ । ఘోరతిప్రజలంబ్రోవం ।
గా రాజ్యముపూజ్యమగు జగన్నుతులారా॥ క. పాపరతులైన వారల ।

భూపతి దండింపడేసి బుట్టుభయము గు। ర్వార్యపారము లధికములై। యేపరరాష్ట్రంబునందు నెల్లెడనరయున్॥ వ. సభలయందును జలదాన గృహంబులందును సత్రంబులందును భక్ష్యాది విక్రయస్థానంబులందు ను పణ్యస్త్రీల యిండ్లయందును మద్యమాంసంబులు నన్నము ధాన్య జాతులు నమ్మునట్టి నియలంబులందును చతుష్పథంబులందును ప్రఖ్యా త వృక్షమూలంబులందును శిథిల దేవాలయంబులందును జనసమూ హంబులందును జీర్ణవాటికలందు నడవులందు తోటలందు విపణవీధు లందు నింక ననేకప్రదేశంబులందు చోరుల నరయుచారులనియమించి వారలవలన నృపాలుండు సర్వంబును గనుంగొనుచుండవలయును॥ క. చోరోపకరణములుగల। వారలదండించుటయు నవశ్యంబును ని। శ్చోరోపకరణయుతులగు। వారలరక్షించుటయును వలయునృపతికిన్॥ క. తారువ్రేడిచినట్లు సదా। చోరుల దండించుటయు నసూయాపరు లై। వారలవీరల పగగొను। వారల శిక్షించుటయు నవశ్యమువతికిన్॥ క. చోరుల కుపకరణంబు ల। పారంబుగ నిచ్చుచుండు పాపరతులను। ధీరమణుడు శిక్షింపగ। నారంభము సేత ముఖ్యమనిరి మహాత్ముల్॥ గీ. ఇతడుదొంగయనుచు నెరిగియు సెప్పని। వానిదోరు డెక్కియైన నీ య। గొనినవాని ముచ్చు గుప్తలబుగాగ ర। క్షించువాని శిక్ష సేయ వలయు॥ క. ధర్మపథము శాశ్వతమగు। కర్మంబులు సేయకతివిగర్హి తులై దు। ష్కర్మము లొనర్చువారల। దుర్మదులన్వలయు దండితు లుగా జేయున్॥ ఉ. గ్రామములందు తస్కరుల కట్టడిసేయక సేతువుల్ మహా। రామములున్ జలాశయవరంబులు పాడొనరించువారలన్। ప్రేముడి సెప్పకింతలు తపించెడి దీనులగోలదీర్చకే। లా కుహితాధికా రము దొలంగక సేయగ నీచజాతికిన్॥ క. అధికారము బడసినవా। డ ధముండై కానిమార్గమందు చనిన వా। నిధనంబంతయుగొనిద్రో। చి ధరిత్రీశుండు బుద్ధి సెప్పగ వలయున్॥ గీ. కోశమపహరించు కుత్సితు ప్రతికూల। వచను దనకుగాని వర్తనంబు, సేయుచుండువాని శిక్షిం చి పణసహ। స్రములుగొనవలయు ధరావిభుండు॥ గీ. రాత్రిముచ్చి

లింప రహిం జొక్కుగుడుపోం । సంధి తెరిపిసేయు సత్వరముగ । యేనమం
డుదివిరి వానిచేతులు రెండు । నఱకి పుచ్చవలయు నుఱుక నృపతి॥ గీ.
అగ్నిదైన గరళము మిళితాన్నమైన । జలములైన నొసగి యొరుచల
ముపట్టి । యూరక వధించుపాపాత్మునురుక గట్టి । వధము సేయంగ వ
లయు భూవల్లభుండు॥ గీ. కత్తిగొని యూరకన్యుని నెత్తివేసి । వధ
ము చేసిన క్రూరుని వధముసేయ । వలయు నరనాథుఁడొకవాఁడి వాలు
బెరికి । వైచి వానిచుట్టంబులు జూచుచుండ॥ సీ. గ్రంథివిభేదంబు గా
వించువాని యంగుళములు దెగనేయువలయు చెరువు । కట్ట గూల్చిన
మహాకష్టచరిత్రుని జలముల ద్రోయించి చంపవలయు । భేదించియు
నుకట్టబెంపు చేసెదననువాని దండితు సేయవలయు దేవ । తాలయం
బులు నాయుధాగారములు కోష్ఠనిలయముల్ భేదించు నీచునేను ।
గులను గుర్రంబులునురథంబులు హరించు । హీనువధియింప వలయు
జుమ్మానరేంద్ర । యనియెమును మనువుప్రభృతికీర్తి యనగ పెంపు ।
వెలయు నొకదొడ్డరాజుతో విమలులార॥ క. హేయంబగు కెవ్వండన ।
పాయస్థితిమలమురాజ పథమున విడచుఁ । రోయుచు నదిశుద్ధంబుగ ।
జేయింపగవలయు వానిచే నృపతి దగఁ॥ వ. రెండు కార్షాపణంబులు
దండంబుగొని యట్లువానిచే శుద్ధి చేయించవలయునని కొందఱ మతం
బు. మూత్రంబు విడుచువానివలన తదర్థంబుగొనివిడిచి పుచ్చవలయు.
మరియును. గీ. వృద్ధుడును బాలకుండు గర్భిణియురోగి । యు మలమొ
కవేళ రాజమార్గమున విడువ । శుద్ధిసేయింప వలయును బుద్ధిజెప్పి ।
వారిచేతననృపుడు భవ్యమతులార ॥ గీ. ఎఱుగక యవైద్యమొనరించు
నెవ్వఁడెఱిగి । యును కపటవర్తనంబున నెనయు నెవ్వ । డెరుగకయ కుము
న్నధనముగ్రహియించు నెవ్వ । డుఱుకవారలదండించు టొప్పునృపతి।
గీ. సంక్రమమువిగ్రహంబు ధ్వజంబుయష్టి । ద్రుంచునేక్రూర చరితులు
పంచశతప। ణంబులు గ్రహించి మరి పొమ్మనవలయునున్న । పాలకుఁడు
వారలను దొట్టిభవ్యులార॥ గీ. కరముదూషితములు గానిద్రవ్యంబులు।
దూషితములుసేయు దుష్టచిత్తు । దగ్ధణంబుసేయు టగువానిమూల్య ।

ధనంబులవిగలుగు జనంబులకును॥ వ. ఈపద్ధతి సమస్త రత్నాదులయం దును వర్తించునిట్లు॥ గీ. తానుజెరచినట్టి ద్రవ్యంబులకు నను। వైన మూల్యధనము లర్పణం బు। సేయకుండువాని శిక్షింపవలయు నృ। పాలుడతడుయోగ్య పథమునడువ॥ సీ. రాజమార్గములందు రమ్యంబుల గుగృహంబులు సౌధములు సత్రములు సమంచి। తావరణంబులు పా వనశాలలు కోటలుమిద్దెలు కోవెలలు న। కారణంబునగూల్ప గడగువా రును నగడ్డలుపూడ్వ దివురువారలునుగోలు। కోసకిచ్చు తనరాష్ట్ర మునుండ కీడగుగావున వెడలింపగాదగు నర। పాలునకు పావనముల గు పనులుసేయు। వానిదూషించునెవ్వాడు వానివలన। ద్విశతపణము లుగొనుటయు దీనులకు। తదర్థమిచ్చుటయును భవ్యమైనపథము॥ సీ. ఒత్తిసారములేని విత్తులునమ్మించి విక్రయించినవాడు విత్తులధిక। తరములు నీచమాత్రంబులుగాజేసి యమ్మినవాడు మర్యాదజేయ, కొ రునినీచునిజేయ నుద్యమించినవాడు నరులగిట్టివధింప నరయువాడు। జనకంటకులనంగ జనుగానవారల వధముసేయునదియవశ్యము నర। నాయకుండు కర్షణక్రియ కగుసామ్ము నౌషధములు విత్తులపహరించు। నేనరుండుదివిరివాని దండితుజేసి। బుద్ధిసెప్పి విడచిపుచ్చవలయు॥ గీ. రాజమంత్రిలు పురమునురాష్ట్రకోశ, దండములు మిత్రవర్గంబు దన రురాజ్య, మునకుసప్తాంగములు వానివెనుక వృద్ధి। గోరమునుమున్న న డపుట సారవథము॥ గీ. ఉత్తరోత్తమాంగంబుల త్యుత్తమముగ। వృద్ధి వెలయించి మధ్యమ విస్తరాంగ। మతులభూతి త్రిదండంబునట్లబెంపు, వెలయజేయునదినృపుకు వివేక గరిమ॥ క. ఏయంగంబేకార్యము। నే

—*రాజు శాత్రవరాజుల జయించు నుపాయము*—

యగలుగునవ్విధంబుచింతించి మహో। పాయగతి నట్లు జేర్చుట। భూయిష్ఠతరాజ్యమెల్ల పూజ్యతమమగున్॥ క. శాత్రవనరపాలురచా। రిత్రంబులు బలములు గరీయసభూతుల్, పాత్రులగు చారులవలన, ధాత్రీశుండెఱుగు తద్విధము మేలరయన్॥ క. త్రిజగన్నుతవిఖ్యాతిమె। ఋజనాధిపుడతివినయము నెరపిదివిరియు। కృజమగు బలములుగలుగు

మ । నుజపతిసఖ్యంబుదగగొనుట లెస్సయగుఁ॥ క. జగతీపతితాదుర్బ
లు । డగునెప్పుడు మురువుసెడక నప్పుడు హితమొ । ప్పగ సంధిజేసి
కొనునది । సగౌరవమడకువ దగశత్రు నృపతితోఁ॥ వ. మఱియును॥
క. ఆరంభింపగవలయు మ । హీరమణుడుబలసమృద్ధి నెగడిరిపులగంభీ
రత్వదశలు జెరుప వృ । ధారతులఁ జెలగిదుర్మదము బోవగొగిఁ॥
క. నాలుగుయుగములనంగన్ । పాలురచే స్థితములకును పాత్రతమ
మగుఁ । నీలోకముగానమహీ । పాలురయుగవిభజనప్రభావము గాం
చుఁ॥ వ. అజ్ఞానాల స్యాదులకు వశుండై యెంతదనుక రాజుద్యోగం
బువాటింపకుండు నంతదనుక కలియుగంబనియు శక్తియు విజ్ఞానంబును
గలిగియునెంతదనుక నిరుద్యముండై యుపేక్షించియుండు నంతదనుక
ద్వాపరంబనియును నెంతదనుక స్వకర్మంబు లాచరించుచు నుడుగుచుం
డు నంతదనుక త్రేతాయుగంబనియు నెంతదనుక శాస్త్రీయంబులగు
కార్యంబులుసేయుచుండు నంతదనుక కృతయుగంబనియు పెద్దలుసెప్పు
దురు గావున యుగంబులు రాజాధీనంబులై చనుచుండు వెండియు
నింద్రార్క పవన యమవరుణ చంద్రపావక పృథివ్యాదుల తేజోంశం
బులు నరేంద్రునియందవెలయుచుండు నదియెట్లనిన॥ గీ. శ్రావణాదుల
గునాల్గు మాసంబులందు । గురియజేయుసస్యంబులు బరగనింద్రు ।
డెట్లుధనములుగురిపించి యట్లబ్రోచు । వాడుదీనజనముల భూవల్లభుం
డు॥ గీ. మార్గశీర్షాదులగు నష్టమాసముల జ । లములుగొను సూర్యు
డెట్లుకరములుబరపి । యసదుగ్రబతాపమలరించి యట్లనృపతి । కర
ములుగ్రహించువాడు జగన్నుతముగ॥ గీ. వాయువుసమస్తచే తనవర్గ
ముల స । తంబువర్తించునెట్లు నిత్యంబునట్ల । రాష్ట్రమందెల్లయెడల
చారగణములు జ । రించివర్తింపజేయు నుర్వీశ్వరుండు॥ గీ. శత్రుమి
త్రులందు సమబుద్ధిగలిగి కా । లంబువేచియెట్లు లయముసేయు ! య
ముడుజంతుకోట్ల నట్లపరాధుల । వధముసేయుచుండు వాడునృపతి॥
చ. వరుణునిపాశబంధ నమవారణమై మెడజుట్టినట్టి య । ప్పురుషుని
ఛాడ్పునఁ కలుషపూర్వకవృత్తి జరించుచుండు పా । పరతులగిట్టిపార్థి

వృకు పాశములన్ మెడఁజుట్టి రయించునని । వ్వరునట దేరి చూడఁగలవార లుగాకదొలంగి పారగన్॥ క. పరిపూర్ణచంద్రబింబ। స్ఫురణముగని జను లు తుష్టిబొరయుపగిదిభూ । వరుడుతనుజూచియెల్లరు । పరమానందం బుబొందుభంగిరహించున్॥ క. పాపాత్ములదండింప ప్ర । తాపము తే జంబు బరగదాల్చి విశుద్ధ । వ్యాపారరతుండైన మ । హీపతియనలంబు ప్రాలె నెగడుసతంబున్॥ క. వెలయంగ సకలభూతం, బులభూమిధ రించునెట్లు భూపాలుడు ని । ర్మలమతి సమస్తచేతన, ముల దివ్రుట ధరించునట్లు భూనుతముదగన్॥ వ. ఇట్లుప్రవర్తించు నరేంద్రుండిప్పాకు జెప్పిన యింద్రార్క వాయ్వాదుల వ్రతంబులు నడిపినవాడగు మరియు ను॥ ఉ. పాయకసంతతంబును నుపాయములెల్లనెరింఁగి సంతత । స్తేయు రతుల్ నికృష్టులసజ్జల్లు దురాత్ములనుక్రమించి య, న్యాయపథంబు లందు బ్రజలాప్తిమెయిన్ మెలగంగనీక శు, ద్ధాయతమూర్తియై యముని యట్లనృపాలుడుబొల్పుటొప్పగున్॥ క. ఆపదలుగల్గునైనను। పాపరతులు గాకనొప్పు బ్రాహ్మణుల, ధరి। త్రీపాలుడగౌరవమతి। కోపింగరాదుదాన కులహానియగున్॥ గీ. భూనుతచరిత్రులాత్మజ్ఞానులునగు। బాహ్మణుల కు కడుకోపము బెం, పై నెగడునేని బలములు, తానుకులమునృపుడు దె గునతము బుధులారా॥ గీ. సర్వభక్షకుడయ్యెవైశ్వానరుండు। ద్రాగవ డియె మహాసముద్రముజలములు। క్షయమువృద్ధియుదాగనె చందురుం డు । బ్రాహ్మణులకోపవశమున భవ్యులార॥ క. వెలయంగలోకపాలు ర । వెలయింపగ పెంపుసెరుప విప్రులుభవ్యా । త్ములుసామర్థ్యము గలవా, రలు దివ్యజ్ఞాన రతపరాయణులరయన్॥ ఉ. వేదములున్ తి దంగములు విష్ణువురుద్రుడు పంకజాసనుం । డాదిగదేవదానవచయం బులు సర్వజగంబులంబుధుల్ । నేదివిజాంశసంభవుల నెప్పుడునాశ్రయ ముందియుండు బెం । పైదగనట్టి బ్రాహ్మణజనార్యులు పూజ్యులుగారె యెల్లెడన్॥ క. జ్ఞానమునకుపాదితడన । గానెగడి సమస్తభూతగణము లయుంద । త్యానందము హితవునుగల । వానిన్ సద్బ్రాహ్మణుడని ప లుకుదురార్యుల్॥ గీ. అధికుడధమునిచ్చు లాశ్రయించుటనధ, ముం

దనంగ బరగుచుండునట్లు । బ్రాహ్మ్యమధముఁడైన వానియందధమంబు। నై వెలయుసతంబు సూర్యులార॥ క. బ్రహ్మజ్ఞానాధిక్యుడు । బ్రహ్మ విదుడు శుద్ధకర్మపారగుడతుల । బ్రహ్మసముడు నిర్మలమతి । బ్రాహ్మణుడు సమస్తలోక భవ్యుండరయన్॥ క. బ్రాహ్మణుల కెగ్గుచేసిన । బ్రహ్మదులకైననగునపాయముశుద్ధ । బ్రాహ్మణుడు సర్వకర్తయు, బ్రహ్మము బ్రహ్మజ్ఞుడుననబరగున్ శ్రుతులన్॥ గీ. బ్రాహ్మణోత్తముడు నృపాలునిశాసించు, వాడుపార్థివుండుగాడు బ్రాహ్మ । ణోత్తముల సతంబునొత్తిలిశాసింప । నట్లుసేయునేని యణగునిజము॥ గీ. జలము లందునగ్నిక్షాత్రంబు బ్రాహ్మణు । లందు లోహము శిలలందుపుట్టి। గానపుట్టువులకు కారణములునగు । వానియందునవి యవశ్యమణగు॥ గీ. బ్రాహ్మణుండులేక పార్థివుండునునర । పాలకుండులేక బ్రాహ్మణుం డు । వృద్ధిబొరయనేర రెల్లినగావున, వారివారికురుప వలయునుర్వి॥ గీ. బ్రాహ్మణులకు ధనమపారంబుగానీగి । రాజ్యభరముధర్మ రతిజెలంగు । పుత్రునందునిల్పి భూపతియుద్ధంబు । చేసిచచ్చిసుగతి జెందవలయు॥ క. కాదేనినిర్మలాత్ముం । డైదగ పరమేశ్వ రార్చనాదులవిజ్ఞా । నోదయ విస్ఫూర్తిబొలచి । భూదయితుడు పరమపదము బొందగవలయున్॥ క. శుద్ధజ్ఞానముధర్మ స । మృద్ధియు గౌరవము పెంపుమించి సతంబున్ । వృద్ధుడగుపార్థివుండు స । మిద్ధమహిమబొందుటొప్పు నీశ్వరపదమున్॥ గీ. పార్థివుండుప్రజల పాలించువిధములు, వలికితింకనర్థి వైశ్యశూద్ర జనములెట్లు నడువగనగు శుభంబులా। వధములెల్ల తేట పరతునిపుడు॥ వ. వినుండని యిట్లనియె॥ గీ. వైశ్యుడుపనయన వివాహాది సంస్కార । గౌరవమునెగడి దగంగకృషియు । బశుగణములు బ్రోచు పాటియుపరమ ధ । ర్మములుగాగనడుపుటమలమతము॥ గీ. పశుగణంబులుపుట్టించి పాలనంబు । సేయువైశ్యులకొసగె నత్యాయత

—వైశ్యశూద్ర జనావశ్యానుష్ఠేయకర్మ ప్రకారము.—

మతి । బ్రహ్మదేవుండు మున్నెల్లప్రజల బ్రాహ్మ । ణులు నృపులుబ్రో

వనొసగినట్లలఘుగరిమ॥ గీ. గోగణములఁబ్రోచు కోరిక లేదునా । కను చుకాని సేత లాచరించు । నట్టివైశ్యునకు మహాపదల్ దినదిన, మగు విహితులట్లగోయు॥ గీ. మణులకును రత్నములకు సామాన్యమయిన । లోహములకు రసద్రవ్య లోష్టములకు। నర్హమగు వెలల విధములనరసి వైశ్యుడధిక తృష్ణనెగడక బెంపాగవలయు॥ క. సారములివి కావివియని । యారయునది బీజగుణము లనయము గ్రోణా । గౌరవతులాధికంబుల । పారంబులుగాకధర్మ పథమిగు వారల ॥ వ. ద్రవ్యవిశేషంబుల నిదిమంచిది కాదనియు నక్కడ బహుమూల్య వ్యవహారంబులగుల గావనునట్టియు వితర్కంబు సేయుట నానాభాష లభ్యసించుటయు కూలివాండ్రకు యోగ్యంబుగా కూలియిచ్చుటయు ద్రవ్యస్థాన యోగ్యాయోగ్యంబు లెరుంగుటయు క్రయవిక్రయంబుల నతిజాగరూకత కలిగియుండుటయు వైశ్యునికవశ్యంబులు, మరియును॥ గీ. ధర్మమార్గంబుదప్పక ధనము గూర్పు। దలచుటయు నిత్యమన్నాది దానములు స । మాచరించుటయును బ్రజలందరాప్తు । లుగ బ్రవర్తించుటయును మేలగు తెరవులు॥ గీ. బ్రహ్మసదృశులైన బ్రాహ్మణోత్తములకు । శ్రూష సేయుటొకటి శూద్రునకు మ । హాతపంబు ధర్మమనిరి పెద్దలు దాన । పరమపదము వాడు బడయగలడు॥ గీ. వినయమును విద్యయునుగల్గి విప్రవరుల ॥ సేవయొనరించునే శూద్రుడేవలేక । వాడుయజ్ఞశతము సేయునాడు బొరయు । నట్టి సౌఖ్యపదమున మాన్యతముడగును॥ గీ. బ్రాహ్మణోత్తముల కృపాపాత్రతముడగు । మాలశైనబొరయు మహితపదము । సర్వలోకములును సర్వపదంబులు । విప్రమయములనుచు వినమెశ్రుతుల॥ వ. అనిచెప్పెనని.

ఉ. యోగసమాధిశిద్ధి సులభోన్నతభవ్య పదప్రకారదీ
భోగరమావతార స్వరస ప్రవిశిష్ట నిరస్తయోగమా
యాగురుపాదసేవన సముంచితసువ్రత మాత్రబోధనా
త్యాగవివేకశుద్ధ పరతత్త్వమయప్రచురార్థ భాసితా॥

క. సుమతాఢ్యరామ కృష్ణప,
రమహంస గురూత్తమ స్థిరసమాధిసమ
గ్రమయమహాపండితకృ
ష్ణమూర్తికవిస్తుత ప్రణవమయమూర్తీ.

మాలినీ. త్రిగుణరహితతత్త్వాధిష్ఠభావ్యస్మహత్వా
దిగురుమహితనామా దేవలోకస్తుతా మా
న్యగుణభరితబోధా నందపూర్ణత్వలీలా
విగతవిపులమోహాద్వేల హృత్కాంతిమూలా॥

గద్య.

ఇది శ్రీమత్పరమేశ్వర లీలా విచిత్ర ప్రపంచ సేవాపాత్ర శ్రీమద్వారపురెడ్డి
పాపినాయక పుత్ర నిఖిలబుధజనవిధేయ యప్పలనాయక
నామధేయ ప్రణీతంబైన శ్రీమదాంధ్ర మనుధర్మ
శాస్త్రంబునందు నవమోధ్యాయమ్
సంపూర్ణమ్.





శ్రీ ర స్తు.

శ్రీమద్ద్వితీయ రామకృష్ణపరమహంసగురుస్వామి నే నమః.

# శ్రీమదాంధ్ర మనుధర్మశాస్త్రము.

## దశమోధ్యాయ ప్రారంభః.

శ్రీయోగవిమలతత్త్వ । శ్రేయస్సంపాదన ప్రశిద్ధబహుత్వ । ప్రా
యఫలాఫలనిశ్చల । మాయాధికసర్వలోకమయపరమేశా॥ వ. దేవా
యవధరింపుమట్లు సావధానులై యున్న ఋషిసమాజంబులతో భృగు
మహర్షి యిట్లనియె॥ గీ. బ్రాహ్మణత్వశిద్ధి బహుదుర్లభముమహా ।

—బ్రాహ్మణత్వశిద్ధి ప్రకారము.—

సారవంతమార్య సమ్మతంబు । మృత్యుభయము లేని నిత్యసౌఖ్యపదం
బు । వినుడు తేటపఱతు సనఘులార॥ క. వేదములుచదివి సారం ।
బూదిపలుకనేర్చి పరులయొప్పుదవిలినన్ । రాదువినిర్మల బ్రాహ్మణ ।
తాదశ శమ రహితుడగునతని కెంతైనన్॥ క. వేదములు తదంగముల ।
త్యాదరణీయములుకూడ దనరారు ప్రశాం । తోదయరతికట్లలవడ । గా
దోచున్ బ్రాహ్మ్యమతిప్రకాశము వెలయన్॥ క. విశ్రుతచరితంబుసమ।
స్తశ్రుతివేదిత్వమును ప్రశాంతియు నయసౌ । మ్యశ్రద్ధావినయములు
మ। హాశ్రయములు బ్రాహ్మ్యమున కనఘమూలంబుల్॥ క. వేదంబు
లవలనను మ । ర్యాదవలన నిష్టవలనగాదు విమలత । త్త్వోదయము
వూలె బ్రాహ్మణ । తాదశశ్రద్ధాగరిష్ఠత దొరగునేనిన్॥ క. విమలం
బగు బ్రాహ్మ్యముమం । త్రములవలన నెన్నటను బొరయజాలరు భ ।

వ్యమతులు పరిశుద్ధజ్ఞా । నమున బడసినట్లొరులు మహామతులారా॥ క. జ్ఞానమయుడీశ్వరుండు త। పోనిధులును బొరయరవ్విపులపదమది తే। జోనూనము భంగంబగు । నేని మతభ్రష్టులగు మహితమతులైనన్॥ క. వేదంబుల గలసారము । పాదుసదాశమసుఖంబు భవ్యులదియత । త్త్వోదయకారణముగ నెర । వ్వాదుదురాఘనుల బ్రాహ్మణోత్తముల రయన్॥ క. వేదంబులసారాంశము । తాదెలిసినపువక దుర్మతము బొల్చిన పా । పాదృతకర్ముడు బ్రాహ్మణ । తాదశబెంపొంద బాత్రతము డెయురయగన్॥ క. వేదంబుచదివినంతన । రాదు కుమతియగు నతనికి బ్రాహ్మ్యమటులబెం । పేదిఖరము పరిమళద్ర । వ్యాదులు మోచికొనిపోవునట్టి విధమగున్॥ క. శాంతమయంబగు శుద్ధ । స్వాంతమహింస్రావతంబు సత్యంబును వి । శ్రాంతియుగలమానవు డ। త్యంతవిమల మూర్తి బ్రాహ్మణార్యుండుర్విన్॥ క. బోధానందమయంబు ని । రాధిభయక్లేశ మోహమతిమాత్రము బ్ర । హ్మాధిగమము బ్రాహ్మ్యంబు మ । హాధనసంచయము శమసుఖాతిశయులకున్॥ సీ. వేదంబుచదువక విప్రుండుగాడు బ్రహ్మజ్ఞానిగాక బ్రాహ్మణుడుగాడు । నిత్యకర్మ విశుద్ధినెరపకన గ్రజన్ముడుగాడు మంత్రంబువడయకున్న । ద్విజుడుగాడధిక శాంతియుగరిష్ఠతయు నిష్ఠారతుల్ లేక బాడబుడుగాడు। సర్వంబు నేనను సరణి వర్తిల్లక కాదు భూదేవుండు కరమునరుడు। వాయకివియొక్కటొక్కటి వరపునేని । తద్విధాఖ్యాతములకు పాత్రతముడగు దొ । లంగ కన్నియునతి నిర్మలదశనడపు । వాడయిన కాడు మనుజుడీశ్వరుడు నిజము. గీ. వేదములుజదివియును క్రూరవృత్తినెరుల । వంచనముసేయుచుండు నెవ్వాడు గౌర । వంబు సచ్చరితము నార్జవంబులేక । బ్రాహ్మణుడుగాడు వాడుద్విపాదపశువు॥ గీ. జాతివలనలేదు సద్బ్రాహ్మణత్వంబు । వచ్చువిమలమతము వలనజాతి । బ్రాహ్మణుండు పాపరతుడు మూఢతముండు బ్రాహ్మణ బ్రువనగ బరగు నుర్వి॥ క. పరిపూర్ణశుద్ధతత్త్వ । స్ఫురితంబగు నాత్మయందు భూనుతయోగ । స్థిరశమ సౌఖ్యవిలీలా । పరాయణత బ్రాహ్మణత్వ భావము దెచ్చున్॥ క. బోధానం

దకశాఢ్య । శ్రీధుర్యంబైన యాత్మజీవాత్మమయ । త్వాధిష్ఠానత జే
ర్చుమహాధీరుడు బ్రాహ్మణుండనఘమతులారా॥ క. శాశ్వతయోగం
బునపర । మేశ్వరులో జూడ్కి గనుచు నింద్రియములనం । తశ్వ్యాసం
బుల దూలిచి । విశ్వంబుభరించువాడు విభుడెల్లరకుఁ॥ గీ. చిత్తశుద్ధి
యెంత జెలగుమంత్రవిశుద్ధి । యంతయధికమై మహామహిమకు । పాదు
నాగబరగు బ్రాహ్మణతాదశ।వచ్చునది ధరించువాని కరయ॥ గీ. మూల
మైనమంత్ర మహిమంబుపేరిమి । జూడనేర్చుబ్రహ్మనీడఫ్రాక । నాత్మ
యందు బ్రాహ్మణాఖ్యాగరిష్ఠుడై । యింద్రియముల గెలిచి యెల్లయెడ
ల॥ క. పరమేశ్వరుడు విమల మం। త్రరహశ్యనిగూఢ మార్గరతుడగుట
నమో । ఘరహస్యార్థ విదులుస। త్పరాయణత దివ్యమాత్రభవ్యతము
లగుఁ॥ క. సారవిచారంబున హిం । సారతియును శమము దమము
్రము బుధగో । ష్ఠి రోచతయును గల్గిన । పూరుషుడిల బ్రాహ్మ
ణుడు తపోధనులారా॥ గీ. ఈశ్వరుండువిమల శాశ్వతవిజ్ఞాన । మ
యుడు శుద్ధమంత్రమహిమ గాన । రాడు తెలివిలేని వాడేమతంబులు।
గొలిచిననుసదానిగూఢుడగుచు॥ గీ. ఎఱుకగలుగు పురుషుడెఱుగు
నీశ్వరు నీశ్వ । రుండువాని నెరుగు నొండుగాక । నీశ్వరుండు ప్రేరయు
నెవ్వాని బ్రహ్మతే । జోమయుండువాడజూడనుర్వి॥ క. వేదాంతసార
మీశ్వర । తాదశయది ప్రేరయగలయతండు మహామా । త్రోదయుడు
ఘనుండు సకల । వేదమయుండనిరి మున్ను వేదార్థవిధుల్॥ క. వేద
మయుడు బ్రాహ్మణుడని । రాది ఋషులు పలువురీమహార్థమరసి ని ।
ష్ఠాదశ యప్పదమునకుఁ, కాదువిమలతరము సేయగా మూలంబై॥
క. మమకారము హింసారతి । విమలంబుగ నాత్మదివిచి విడచుపరమ
త । త్వము గొల్చి బుధుండాతడ । యమేయుడు బ్రాహ్మణుండ య
మహితులారా॥ క. ఈశ్వరుడెవ్వడునే న। సదాశ్వ్ర శేయములు జంతు
తతుల కిడుదు లీ । లాశ్వర మహిమనను బుధుడు । శాశ్వతుడును బ్రా
హ్మణుడును సత్తముడు నగుఁ॥ క. శ్రద్ధాభరితము సూక్ష్మము । శుద్ధ
ము నిస్సంశయ ప్రచురమునగు మనం । బిద్ధమ హిమపరమేశ్వర । బ

ద్ధంబుగ నెగడువాడు బ్రాహ్మణుడరయన్॥ మ. పరిశుద్ధంబగు నాత్మ యందు విమలబ్రహ్మంబు యోగాసన ।. స్థిరమాత్రంబుగనిల్పి యింద్రి యములన్ జిక్కించియంతర్ముఖ । స్ఫురణోద్యోగము పెంపుబొందిన జ గత్పూజ్యుండు దివ్యక్రియా। భరితుండర్హుడు బ్రాహ్మణోత్తముడు సం భావ్యుండు జర్చింపగన్॥ క. ఏమనుజుం డింద్రియార్థము । లేమియుని చ్ఛలును జేయడీశ్వర బద్ధం । బైమనసు బ్రకాశింపగ । నామహితుడు బ్రాహ్మణుండనఘ మూర్తిభువిన్॥ క. శ్రుతమును స్వాధ్యాయమును। స్నత తనుశుద్ధియును బ్రాహ్మణత్వమునకు హే । తుతరంబులుగావు జగ । న్నుత వర్తనమైనయట్లనుప మానములై॥ క. ఏనరునియందు స త్యము । దానము శీలంబు సమ్మతము వెలయన్బ్ర । జ్ఞానిధులాతని బ్రాహ్మణు । గానెరుగుదురర్థిమై జగన్నుతులారా॥ క. శాంతము దివ్య జ్ఞానము । సంతోషము నార్జవంబు శ్రద్ధయు గలధీ । మంతుని బ్రా హ్మణుడనిరి య। నంత తపోధనులు ఋషులనఘ తరమూర్తుల్॥ క. త నుదూషించిన భూషిం । చిన సరిగాజూచుచున్ విశిష్టతదదియే । జన ములకు గీడుగోరని । యనఘతముడు బ్రాహ్మణుడు మహాశయులారా॥

క. అజ్ఞానముశూద్రత్వము । సుజ్ఞానము బాహ్మణత్వ శుద్ధదశ సదా । ర్ధజ్ఞానము మధ్యమమని । ప్రాజ్ఞులు మునుచాటి రెల్లరకు హితముద గన్॥ వ. ఇవి వేదమతంబులగు సుభాషితంబులింక సామాన్య విశేషం బులు వినుండని యిట్లనియె॥ గీ. బ్రాహ్మణుడు క్షత్రియుండును వై శ్యుడునెగి । వేదములు జదువపాత్రులు విప్రవరులు । సెప్పకయె వే

—ద్విజాతి ప్రకారము—

దముపఠించు టొప్పుగాదు । క్షత్రియునకు వైశ్యునకును సాధులార॥ క. వేదములు సదివితగుమ । ర్యాదన్ క్షత్రియు నకార్యునకు నవిసె ప్పం । గాదగు విప్రుడు వారలు । నాదరమున గొల్వవలయు నాతని సతమున్॥ గీ. బ్రాహ్మణులనడిగి సర్వవర్ణముల వార। లర్హమగువృత్తి ధర్మంబులాచరింప । వలయు విప్రవరుండు భవ్యతముడర్హుడెల్ల వారల పూజలునిచ్చలుగొన॥క. ఏయవిధర్మాస్పదములు।గాయెుప్పున్ విప్రుడాసు

కర్మములుదగ। సేయననుజ్ఞయొసంగుట। భూయిష్టంబెల్ల వర్ణముల వారలకు॥ గీ. బ్రాహ్మణులు క్షత్రియులు మరివైశ్యులునన। జనినవర్ణ త్రయంబు ద్విజాతులనియు। నాలుగవకులము శూద్రజనములుపంచ। మంబు నాస్తికులమని శాస్త్రంబుసెప్పు॥ వ. అక్షతయోనులగు సర్వ వర్ణంబుల సతులందునను లోమప్రకారంబున జనించిన సుతులు జా త్యులనంబరగుదురిట్లు॥ గీ. బ్రాహ్మణునిచేననంతర వర్ణయైన। వనితయం దు జనించినవాడు జనక। సదృశుడెట్లగు మాతృదోషంబుపేర్మి। హీ నుడగుగాక పరమఋషీంద్రులార॥ గీ. అరయవైశ్యకన్యయందు బ్రా హ్మణుని వలనజనించినట్టి తనయుడుగ్రుడత్యధముడువా డయంబష్ఠనా మధే యమునబొలచు నన్వయంబులేదు॥ గీ. అట్లుశూద్రకన్యయందుజ నించిన। పుత్రుడత్యధము డపాత్రతముడు। పారశవుడు దుష్కథారోచ

—నానావిధ సంకరజాతిక్రమము.—

కుండు ని। పాదుడంద్రువాని శాస్త్రవిధులు॥ గీ. క్షత్రియునివలనకరము నపాత్రగరిమ। శూద్రసతియందు బుట్టినసుతుడుసాధు। భయదుడు గ్రా హ్వాయంబున బరగువాడు। రాచకార్యంబులందు పరాఙ్ముఖుండు॥ వ. బ్రాహ్మణునివలన క్షత్రియవైశ్యశూద్ర కన్యలయందును క్షత్రియు నివలన వైశ్యశూద్ర కన్యలయందును వైశ్యునివలన శూద్రకన్యయందు జనించిన షడ్విధపుత్రులు సర్వకర్మంబులందును నికృష్టులు మఱియును, ప్రతిలోమప్రకారంబున బుట్టినపుత్రుల ప్రకారంబువినుండని యిట్లని యె॥ గీ. క్షత్రియునివలన బ్రాహ్మణకన్యయందు। సంభవించినపుత్రుం డ సభ్యరతుడు। సూతుడనుపేరవెలయు వైశ్యునివలన జ। ననమయి నసుతుడు వైదేహుడనగబరగు॥ వ. క్షత్రియకన్యయందు వైశ్యునివలన జన్మించినవాడు మాగధుండననొప్పు శూద్రునివలన బ్రాహ్మణ క్షత్రి య వైశ్యకన్యలయందు పుట్టినసుతులు ఛండాలసత్తాయోగవ సమా హ్వాయంబుల వెలయు మరియు బ్రాహ్మణునివలన నుగ్రకన్యయందు పుట్టిన వాడామృత నామధేయంబునను నంబష్ఠాయోగవ కన్యలందు పుట్టిన వాంధ్రాభీర ధిగ్వణాఖ్యలను బెంపొంది చండాలసదృశులగు

దురిట్లు॥ క. పాదభవకన్యయందు ని। పాదునివలనన్ జనించిసంతత మును బెం। పైదగు పుత్రుండరయన। నాదరణీయుండు వుల్కసాఖ్య జెలంగున్॥ గీ. పాదజునివలన నిషాదకన్యకయందు। బుట్టినట్టిసుతుడు బొలచుకుక్కు। టకసమాహ్వాయమున నొకడొక్కడట్లుసం। కరము లయ్యె బహుముఖములుబోలె॥ గీ. క్షత్తువలన నుగ్రకన్యకయందుపు। ట్టినసుతుడు స్వపాకుడనగ బొలచు। వేణునామమునను వెలయునం బష్ఠక। న్యకు విదేహువలన నైనకొడుకు॥ వ. ద్విజాతులకు సజాతీయలైన కన్యలందు జనించినపుత్రులు సంస్కార రహితులగునేని వ్రాత్యులనంబరగు దురా బ్రాహ్మణవ్రాత్యులవలన సజాతీయలైన కన్యలందు పుట్టిన కొడుకులు భూర్జకంటకావంత్య వాటధాన పుష్పధ శైఖాహ్వాయంబులను క్షత్రియ వ్రాత్యులవలన సంభవించిన సుతులు ఝల్లమల్లనిచ్ఛి విరేవణటకరణఖసద్రవిడ నామంబులను వైశ్య వ్రాత్యులవలన నుదయమైనకుమారులు సుధన్వాచార్య కారూశవిజన్మ మైత్ర సాత్వతాఖ్యలను బెంపొందుదురీపేర్లు దేశభేదంబులందు వర్తించునని యెరుంగవలయు॥ గీ. బ్రాహ్మణులుమొదలు నాల్గువర్ణముల, వార। లు చితమగు నైజకర్మంబులుడుగుటను వి। జాతిసంబంధులగు నట్టినాతులను వ। రించుటనువర్ణసంకర వృద్ధివెలసె॥ వ. మరియుసంకీర్ణయోనిజాతులు ప్రతిలోమానులోమజులునగు వారల వృత్త్యుద్యోగాదులు సంక్షేపించి చెప్పెదవినుండని యిట్లనియె. శూతవైదేహకచండాల మాగధక్షత్తాయోగవ నామంబులవెలయు నారువర్ణంబులవారు ను మాత్రభావప్రకారంబుల నొప్పువారలగునిట్లు॥ గీ. పాదజన్మువలన బ్రాహ్మణియందు జ। నించినట్టి పుత్రుడెట్లు పతితు। డట్లు నీచజాతులందు బాహ్యులగు ప। రస్పరాంగనాని రతిరహించి॥ క. ప్రతికూల వర్తమాన, స్థితిబాహ్యాబాహ్యతర విశిష్టనికృష్టా। యతరతులపంచదశ వ। ర్ణతురీయములయ్యె సంకరములిట్లురువై॥ గీ. వాగురావృత్తియును బ్రసేవనముదాస। జీవనంబునై రంధ్రస్వభావమును వి। నయమువిద్యయుదగు నతిశయముపేర్మి। సూతదస్యురయోగవ వ్రాతము

లకు॥ గీ. మాన్యులారయయోగవ కన్యయందు । నిచ్ఛవైదేహువలన
జనించినట్టి । పుత్రకుఁడుమైత్రేయుండన బొలచువాడ ఘంటవాయించు
చుండుదగంగసతము॥ గీ. సూతకన్యయందు బ్రీతినిషాదుని । వలనబు
ట్టినట్టివాఁడుసతము । నావలంఘుబూలచి జీవించుజాలరి । యండ్రువాని
నెల్లరార్యులార॥ గీ. క్రూరమెంగిలి కూళులుగుఁడుపుగలయ । యోగవ
వధూజనములందు నుదయమైన । పుత్రకులు భిన్నజాతీయులైత్రివిధ
ము । లలరువారు మాత్రామాత్రులండ్రు బుధులు॥ క. వైదేహకన్య
యందు ని । షాదువలననైనసుతుఁడు జర్మంబులు వి । చ్ఛేదంబుచేసి
బ్రదుకుఁ । దాదొగి కారావరుడనదగి నిత్యంబుఁ॥ వ. చండాలుని
వలన వైదేహకన్యయందు పుట్టినవాడు పాండుసోపాక నామంబునందగి
వేణువ్యవహారంబున జీవించునట్లు పుల్కసాంగనయందు జన్మించినవాడు
సోపాకుండనందగి సజ్జనగర్హితుండై మారణక్రియలాచరించుచు జీవిం
చుచుండు నిషాదస్త్రీయందు చండాలునివలన బుట్టినతనూభవుండు దృ
ష్టగోచరుండనంబడి రాజాజ్ఞఁ శ్మశానంబులుగాచుచు బ్రదుకునిట్లు॥
క. అనులోమగతిజనించిన । తనయులు తమతమ జనకులధర్మంబులు
సే। యునది ప్రతిలోమసంభవు। లనర్హులట్లునడుచుటనిరి మహాత్ముల్॥
క. బీజప్రభావమునను త । పోజఃపరిణామమునను యుగయుగము
ల వి । భ్రాజములగు వర్ణములు మ । హాజననముల జననములు న
నగధరిత్రిఁ॥ గీ. కర్మలోపంబువలనను జేర్మిసెడి ద్వి । జాతులధములు
శూద్రులునాతగుఁ స । దామహితమార్గవర్తనుడై మతముజె । లం
గుశూద్రుడుకడు నిర్మలతవహించుఁ॥ వ. పౌండ్రకోఢ్రద్రవిడకాంభో
జ యవనశక పారశవాహ్లవ చీనా కిరాతాదిదేశవాసులు క్రియాలోపం
బున శూద్రునికన్న నీచతములు మరియును క్రియాలోపంబున బ్రా
హ్మణ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణంబులలో నేపురుషులు ప్రవర్తింతు
రువారు యవనశకదేశ వాసులుంబోలె ధన్యులనంబరగుదురిట్లు॥ సీ.
మాగధులతిశుద్ధ మతములుపేర్మి వణిక్పథవృత్తిమై నెగడువార । లశ్వ
సారథ్యంబు లారూఢిజేయుచు లలిమించు సూతకులములవార। లంతః

పురంబులయందు వైదేహకులరయుచు జీవించునట్టివార । లంబష్ఠజన
ము వైద్యంబుసేయుచు నెడ్లనెదవివింతలుసెప్పి బ్రతుకువారు । మరి
యును నిషాదజాతులు మత్స్యఘాత । కులు నయోగవవర్ణులు గోఘ్ను
లుబిల । వాస మృగపక్షిగణముల వధముసేయు । వారుక్షుత్త్రుగ్ర
పుల్కసుల్ క్రూరమతులు॥ గీ. వేణులకుఘటాది వివిధవాద్యంబులు।
దిగ్వణులకు జంతుత్వగ్విరతము । వీరలెల్లపితృవనారణ్య పర్వతా । దు
లవసించియుండుదురు సతంబు॥ గీ. శ్వపచచండాలజాతులు సతము గ్రా
మ । బాహ్యదేశంబులందు శుభ్రతరములగు । గుడిసెలనుగట్టికొని
యందుకూడుకూర । లను భవింపుచు జీవించునట్టివారు॥ గీ. వలదు
లోహపాత్రములు భాండములు కన । కమయభూషణములు విమల
వస్త్ర । ములు సుగంధపుష్పములు చూర్ణకుంతల । వాసనాదివిధులు
వాండ్రకరయు॥ గీ. పశుధనంబునుకాదు గోపాలవృత్తి । వలదు శున
కంబులును గాడిదలును మరణ । వస్త్రములు మంటిపాత్రలు వాండ్ర
కొప్పు।లోహమయభూషణచయంబులును ధరింప॥ క. వారలితరేతరం
బతి।గౌరవముదగ సముచితకర్మంబులు గో।ష్ఠీరతులు వివాహంబులు।
కూరిమిసంబంధములు దగ చేసికొనగ॥ గీ. మానుషాధములనుట
సామాన్యమయ్యు । వారలు వినయవిద్యయు గౌరవంబు । భూతదయ
యును సత్యంబునీతియు దగి । కించిదుత్కృష్ణు లనబడు కేవలంబు॥ క.
వారలుతమకెగ్గగునే । కారణములుగల్గినను తగదు చరియింపం । గా
రాత్రిసమయమున జో । ర్వారంభులనంగ దగుదురట్లునడచిన॥
గీ. పగటివేళలందుదగు చరింపంగ కా । ర్యార్ధమధిపునాజ్ఞ ననుమతిం
చి । యెవరులేనినరుని శవముగ్రామము వెడ । లించువారు వారలంచి
తముగ॥ గీ. ఎవ్వనివధింప నృపుడాజ్ఞయిచ్చునపుడ । వానిగొనిపోయి
చంపి తద్వస్త్రములును । భూషణంబులుగొనివారు పోవలయున । రేం
ద్రునకుసెప్పి సెవ్వనెట్లుగనుక॥ క. పాపరతులగుట వాండ్రును । వాపు
రుషులు దిట్టనేజనములంటకచీ। ఛీపోయన నీ చపుపను । లోపికనొన
రింపవలసె నుడుకగసతము॥ క. క్రౌర్యంబును జడభావము । నార్యత్వ

ము పరుషభాష ణాదులు నతిదుష్కార్యములు సేయుటయునున । మ
ర్యాదయు గలుగుజనులు మాలల కుసముల్॥ క. మాతాపితాచార్య
స । మేతులయిన సంకరులురమింతుర ధర్మ । ద్యూతాదిగ దుష్కర్మ ।
ప్రీతివిబుధ గణములటు జరింపక నాగుణ॥ క. జననీజనకుల ధర్మం ।
బనువుగదనుగాంచి నట్టియాచారంబుణ । జనదిలసంకరునకు గా । వున
నార్యులు నడచెడి తెరువున జనుటొప్పన్॥ క. జనకునియాచారము
కా । దనక నడుపవలయుపుత్రుడత్యాప్తిమెయిణ । నని రొకకొందరు
విశ్వా । సనీయముగాదు తద్విషయ మూహింపక॥ క. క్రూరుండగు
జనకునియా । చారముదానడపు నే ప్రశస్తమతియు । సద్గారవ నీ
యుండైన కు : మారుడు నడపిన జనములు మాన్యుండనునే॥ వ. కా
వున సమస్తజనంబులకును సదాచారంబువలయు॥ క. ఏరాష్ట్రంబున
నురువగు । నారయ సంకరములుణ దురాచారంబుల్ । నారాష్ట్రము
చెడుగావున । వారింపగవలయున్నృపుడవశ్యము వానిణ॥ గీ. పశువులకు
బ్రాహ్మణులకును బాలకులకు । స్త్రీలకును వృద్ధులకుగీడు జెందునప్పు
డోపిరక్షింప ప్రాణంబువాపికొనిన । వాడు సంకీర్ణుడయ్యు భవ్యగతి వొ
రయు॥ గీ. సత్యమును శౌచమును నహింసారతియు జి । తేంద్రియ
త్వంబున స్తేయమెల్ల జనుల । కధిక ధర్మాస్పదం బగుననియె మున్ను ।
మనువులోక హితంబుగా మాన్యులార॥ గీ. బ్రాహ్మణుండు శూద్రభా
మిని పత్నిగా । బడసికనిన సుతుడు భవ్యుడయ్యు । కాడు బ్రాహ్మణు
డు జంగంబున మాతృదోషంబు జన్మకారణంబుగాన॥ గీ. పాదజన్ము
డిచ్చు బ్రాహ్మణాంగనయుందు । గాంచినట్టిసుతుడు కాడు బ్రాహ్మ ।
ణుండు లోకగర్హితుండధముండు న । పాత్రతముడు వర్ణపతితుడయగు॥
గీ. పాదభవభామినింబొంది బ్రాహ్మణుండు బ్రాహ్మణస్త్రీసురతిజొక్క
పాదజుండు । పతితులగుగాననట్టి యాపదలు గల్గు । నైనవారలు తద్ర
తుల్ మానవలయు॥ గీ. ఉత్తమ క్షేమమునమంచి విత్తులిడిన ఫలము
సతము సమృద్ధిమెబరగునెట్లు । పరమసంస్కారవతి యతియగు పణతి
యందు । పురుషుడిడిన బీజము వృద్ధిబొరయునట్లు॥ గీ. బీజము నుతింత్రు

కొందరాయోజక్షేత్ర । మెన్నుదురు కొంద రారెండు సన్నుతింతు ।
రర్థి మెకొందరిట్లు మాన్యతరములున । భేదములు నయ్యె నారెండు పెం
పు నెగడి॥ గీ. ఉత్తమము శోభనం బైన విత్తుచవిటి । నేననిడిన నశించు
వర్ణితముగాక । విత్తుతోడ్పడకుండిన రిత్తనేల । నిష్ఫలాభ్యుదయంబగు
నిపుణులార॥ క. ఆర్యులు విజ్ఞాన కళా । ధుర్యులనంబరగి రుర్వి తొల్లి
మహాత్ముల్ । తిర్యగ్యోనిజులైన మ । హార్యాదుడు ఋష్యశృంగుడాదిగ
ననఘుల్॥ వ. కావున బీజప్రభావంబధి కంబని కొందరు పెద్దలు సె
ప్పెదురు. గీ. బ్రాహ్మణుండు దివిరి పాదజు కర్మంబు । లాచరించు నేని
యట్టిడయగు । బ్రాహ్మణుండుగాడు బ్రాహ్మణక్రియ లోన । రించు
నైన శూద్రుడెందు నేని॥ గీ. పరమపదముగోరు బ్రాహ్మణుండారు క ।
ర్మములు సేయ నలయు విమల వృత్తి । నట్లుగాక కాని యన్యకర్మము
లాచ । రించు నేని దెగనశించునిజము॥ వ. అధ్యాపనాధ్యయన యజన
యాజన దానప్రతిగ్రహంబులను నారుకర్మంబులు బ్రాహ్మణునికాచర
ణీయంబులిందు యాజనాధ్యాపన శుద్ధప్రతిగ్రహంబులను మూడు నడపి
జీవించుట భవ్యతమంబు॥ గీ అధ్యయనము యాగముదానమనెడిమూ
డు। కర్మములు పాత్రతమములు క్షత్రియునకు। వైశ్యులకు శూద్రులకు
లోకవంద్యులైన । బ్రాహ్మణులసేవయొక్కటి భద్రకరము॥ గీ. అస్త్ర
ములు శస్త్రములు దాల్చియధిక వీర। వృత్తిమెయి క్షత్రియుండును గృ
షియుబశుగ । ణముల రక్షించుటయును బేరములు నడిపి । పాటిసెలగి
వైశ్యుండును బ్రదుకుటొప్పు॥ గీ. బ్రాహ్మణునకు వేదపాఠకలనమును।
క్షత్రియునకు ప్రజల గాచుటయును । వైశ్యునకు సధర్మవాణి జ్యమును
పర । మార్థ కర్మములుమహాత్ములార॥ గీ. యాజనాదులుచేసి బ్రాహ్మ
ణుడు సకల। గ్రామపరిపాలన మొనర్చి క్షత్రియుండు । కృషియువాణి
జ్య మొనరించి కేవలంబు । వైశ్యుడును బొరయునమృతతత్త్వమగు పద
ము॥ గీ. బ్రాహ్మణుడుక్షత్రియుండు నాపదలుగలుగు । నపుడు వాణి
జ్యకర్మంబులాచరించు। టొప్పు ధర్మంబుసెడకనొ। కప్పుడును గృషి
యునుపరజనముల కొల్వు సేయరాదు॥ క. హాలములు కుద్దాలంబులు।

జలగించుచు పొలముదున్ని చీమలకీటం । బుల లెక్కలేని ప్రాణుల । మల
యించు కృషిక్రియలు సుమాన్యతరము లే॥ క. కష్టతరంబత్యధికని । కృ
ష్టముహింసామయంబు కృషికర్మంబు । తృష్టమని సేయునెవ్వడు । క
ష్టరతుడువాడు పాతకజనంబులలో॥ క. న్యాయంబు సెడని తెరవున । జే
యుండగ యేనరుడు కుశీదముభువిదీ । ర్ఘాయుర్విద్యాభోగ । శ్రేయస్సం
శిద్ధులతడు జెందుసతంబుర్॥ గీ. అన్నమును లవణమును తిలలాలయ
ములు । నరులబశువుల జీర్ణపర్ణములు నశ్మ । సారములు విక్రయింపగా
జనదనిరి మ । హాజనంబులు ధర్మశాస్త్రార్థవిదులు॥ సీ. ఫలములుపూవు
లు పత్రంబులును రోమముల నేయబడు వస్త్రములును శస్త్ర । ములు
ను మాంసము విషంబులు పాలు పెరుగు నేయియు నపాయకరముల
యి దనర్చు । వస్తుసంచయములు వర్ణంబు రక్తంబు గాని మూతాప
ధోత్కరములుసుర । జలములు మైనంబు జలచరంబులు భక్ష్యములగు
మృగములు పక్షులును లక్క । పుస్తకంబులు మొలకలు పూపములు
ను । కాదువిక్రయమొనరింప కర్షకుండు । విత్తులును తిలలుతనయిచ్ఛ
నత్తియమ్ము । కొననగునపాయమగు వేళధనముగోరి॥ గీ. భోజనా
భ్యంగనాది ప్రయోజనములు । గాకతిలలన్యములకు విక్రయముసే
యు । వాడు తనమున్నయగు పితృవర్గములను । గూడి క్రిములై మలం
బులుగుడుచుచుండు। గీ. లక్కయూమిషంబు లవణంబునమ్మిన । య
పుడపతితుడగు ధరామరుండు । క్షీరవిక్రయంబుచేసి శూద్రుండగు ।
వాసరత్రయమునవాసిదక్కి॥ ఉ. అన్యపదార్థముల్ దివుటనమ్మినసత్తది
నంబులందుసా । మాన్యపు వైశ్యు వ్రాలెగరిమంబు సెదుర్ రసముల్
విషంబుల । నోన్యవిరుద్ధవస్తువులు నన్నము కల్లును విక్రయించి దా,
ర్జన్యరతుండువ్రాలె జనసంఘములంటగ రానివాడగుర్॥ క. ఏనరుడులో
భవశమున । హీనక్రియలాచరించు నిర్మలతరవి । జ్ఞానపథముబోవకను।
ర్వీనాధుడు వానినుఱుక వెడలింపజనుర్॥ చ. తమకుచితంబు లుత్తమ
మతప్రచురార్థము లైనపుణ్యక । ర్మములొనరించు వారల సవిభూతి
సుఖంత్రతు దేవలో । కమున రహింజెలంగి యటుగాక వి నిందిత కార్య

సంగత । క్రమమున బొల్తుతేని నరకంబున గూలుదురా క్తిదూలుచుర్॥ గీ. జాతివలన లేదు నీతివలనగల । దుత్తమమగు పదము యోగ్యభం గి । గానహీనజాతులైనవారలు భవ్య , లనబరగిరి సత్క్రియా ప్తిదవి లి॥ గీ. బ్రహ్మసములైన యుత్తమబ్రాహ్మణజన। సేవనముసేయ నిశ్శ క్తిజెందుశూద్రు । డర్మిలిని సూపకారాది కర్మములుఘ । టింపు చును బ్రదుకవలయు నూడిగములుడిగి॥ క. బ్రహ్మజ్ఞానాతీతుడు । బ్రహ్మస ముడు కర్మరతుడు భవ్యుడు శుద్ధ । బ్రహ్మర్థ వేదియనదగు । బ్రాహ్మ ణుడనదేవుడనధరాస్థలివేరే॥ గీ. గానశూద్రుడట్టి ఘనులనుపాశించి। వా గలెట్టిపదమువడయువాడు । నదియుబడయు బ్రాహ్మడాగ్యుల మహిమ వ । ర్ణింప గొలదిగాదనిరి విబుధులు॥ గీ. గౌరవాగౌరవంబులు గానశె ల్ల । యెడల దానంబులుగ్రహించునే ద్విజుండు । వాడు చండాలుడును ఫ్రొలె జూడనంట , రానివాడగుననిరి పూర్వఋషివరులు॥ క. ఆపద లుమూడు తరిన । ధ్యాపనదానప్రతి గ్రహాదుల విప్రుం । డోపికజీవిం పవలయు , పాపములేదందుననిరి పండిత వర్యుల్॥ క. జలబింబితమగు గగనము । జలాంతర కర్దమము నెసగని పగిది నా , కులుడగు విప్రుం డెట్టిప । నులు గావించినను జనడనువమాఘముల ర్॥ క. ఒనరంగన జీగర్తుం । డను ఋషితనపుత్రునొరులకమ్మి వధముసే । యనుపక్రమిం చెనాకులు । డును యజ్ఞారంభ శీలుడు నయిసదాప్తి ॥ గీ. పరమధర్మ వేది ప్రాజ్ఞుండు నగువామ । దేవుడను ఋషీంద్రుడేవలేక । కుక్క మాంసము దిన మిక్కిలి యత్నించె । కడుపుమండ నుసురుగాచికొనగ॥ క. అభినుతులగు పుత్రులతో । డభరద్వాజుండు మున్నొడంబడి యె దుర । ర్థభరితుడగు వృధుచేతన । కభిమతపగు గోవునుగొనవాతుగు డుబలేక॥ క. విశ్వామిత్రతుండాతురు । డైశ్వానామిషముదినియె యు నుకంపముపెం , పైశ్వపచుడొసగననఘుడు । శాశ్వతవిఖ్యాత నీయచ రితుండెలమిక్ ॥ గీ. గానబ్రాహ్మణుడాపద గల్గునెడల , ప్రాణముర్ గాచికొనగ నేపనులునైన । నాచరించికొనగవచ్చు నీచతముడు । గా డుదాననవిరిబుధుల్ కర్మవిదులు॥ క. నీచజనంబులనోడక। యాచింపగ

నైనయఘము లణగించికొనుః, శౌచతదగివిప్రుడుదా, నాచరణం
బున మహాజనార్చనవిధులల్॥ గీ అధములిచ్చిన దానంబులాసగొనిన।
పాపములు బాపికొనవచ్చు బ్రాహ్మణుండు। నీచగతిగాక హోమం
బులాచరించి। మంత్రముజపించి కడునియమంబుబొలచి॥ వ. ఇది కొం
దరమతంబు॥ గీ. బ్రతుకులేకగుండు బ్రాహ్మణుండుంఛంబు, శిలయున
ర్ధియొరుల వలనగొనుట। యు నవిగూర్చుకొనుటయును శాస్త్రములనిరి।
పరమధర్మవిదులు భవ్యులార॥ క. నరపాలుండత్యాదర, భరితాత్ముం
డుగుచుదన్న బహుధనధాన్యో। త్కరసుస్థితుజేసిన భూ। సురుడిచ్చ
లుబ్రదుకు వడువు సుపథంబయగుః॥ గీ. బ్రాహ్మణుండు పరమపాత్ర
దానంబులు, క్షత్రియుండు సమరజయధనములు, వైశ్యుడధికధర్మ
వాణిజ్యవిత్తంబు। లిచ్చెలును సదాగ్రహింపవచ్చు॥ గీ. భైక్షికములు
దినుచు బ్రతుకుటొప్పుగుగాని, పరులసేవనంబు బ్రాహ్మణునకు। క్ష
త్రియునకుగాద పాత్రతములు ద్విపా। దపశువులనబరగు దానవారు॥
గీ. యుద్ధమొనరించి పరులచేయోడిపారి। వచ్చునైనను కాదు భూవల్ల
భుండు। రక్షణముసేయ కధికకరంబులుగొన, జూచుటల్లైన శవము
నాజూచుప్రజలు॥ వ. వైశ్యులకెట్టి యుపాయంబులును బొరయనీయక
రక్షించుచుండు నరేంద్రుండు వారివలన ధాన్యంబు లెనిమిదిభాగంబు
లలో నొకభాగంబును కార్షాపణంబు లిరువదిపాళ్ళలో నొక్కటియు
ను హిరణ్యాదులు పంచదశాంశంబులలో నొక్కటియు శుల్కంబుగా
గ్రహించుచుండవలయు॥ గీ. ఐహికాముష్మికసుఖంబు లందగోరు, శూ
ద్రుడువిశుద్ధగరిమ శుశ్రూషలాచ। రించునది పరమవిజ్ఞానవృద్ధులైన।
బ్రాహ్మణోత్తములలర నిరంతరంబు॥ గీ. బ్రాహ్మణులసేవ పరమధర్మం
బుశూద్ర। జనములకు దానిమించిన సత్ఫలంబు। లన్యములు లేవువా
రల కనిరిమున్న, మనువును విధాతయును లోకమాన్యులార॥ గీ.
బ్రాహ్మణుండితండు భవ్యుండునాదగు। వానిసేవనంబు వలయుధర్మ।
మొకటగోరుశూద్రునకుగాదు బాహ్మణ। బ్రువునికొల్వులుదాన బొరయు

నఘము॥ గీ॥ నిర్మలుండు పరమధర్మజ్ఞుడగుశూద్రు। డాశ్రయింపవలయు విశ్రుతమతి। బ్రాహ్మణోత్తముని నపార విజ్ఞానస్వ। రూపు సత్యరతు నపాపచరితు॥ క. విమలజ్ఞానధనము స, త్యము విశ్రాంతియు పదంబు నలరెడి శూద్రుం। డు మతంబుభవ్యముగ పం। చమఖంబులు దినదినంబు సలుపగవచ్చున్॥ క. ఏయాచారమునడపు స। దా యోగ్యత శూద్రుడవ్విధంబగుపదమున్। బాయకవారయుంగలడని। రాయతమతశుద్ధి వెలయునట్టి ఋషీంద్రుల్॥ క. అమలిన తత్వంబోంకా। రము సర్వజగన్మయము పురాణపురుషుఁడూ। పము సచ్చిదాత్మకము దే, వ మానసీయంబులోక వందితులారా॥ వ. అనిచెప్పినని,

ఉ. శ్రీమహిమావతార పరిశిష్టగుణాత్మక నిర్వికల్పమా
యామయ పూర్ణతత్వ గరిమాఢ్యమహాత్పదవీ సమగ్రధి
ష్ట్యామిత యోగిపుంగవ హృదంబురుహస్థిత రాజహంస శు
ద్ధామృత బోధనాఘన నిరంజన దుర్మద దైత్యభంజనా॥

క. అకలంకమూర్తి శ్రీరా
మకృష్ణ పరమహంసమానితగురుయో
గకళానందమయ విని
ర్వికల్పవిశ్వాత్మ దేవ విశ్వాధిపతీ.

మాలిని. చిదమలగురుమార్గ శ్రేయసోదాత్తదుర్గా
త్రిగుణరహిత వస్త్వోద్దేశమాత్రప్రకారా
ర్థగరిమ సుహృదాంత ర్ధ్యానగమ్య ప్రశస్తా
నిగమ వినుత లీలా నిశ్చలానందములా,

గద్య.

ఇది శ్రీమత్పరమేశ్వర లీలా విచిత్ర ప్రపంచ సేవాపాత్ర శ్రీమద్వారపురెడ్డి
పాపినాయక పుత్ర నిఖిలబుధజనవిధేయ యప్పలనాయక
నామధేయ ప్రణీతంబైన శ్రీమదాంధ్ర మనుధర్మ
శాస్త్రంబునందు దశమోధ్యాయమ్
సంపూర్ణమ్.



శ్రీ ర స్తు.

శ్రీమద్ద్వితీయరామకృష్ణ పరమహంసగురుస్వామినే నమః.

# శ్రీ మదాంధ్ర మను ధర్మశాస్త్రము.

## ఏకాదశాధ్యాయము.

శ్రీవిజ్ఞానకళాశో । భావాసవముఖ్య దేవ వందితపదరా । జీవస హాసముఖజగ। త్పావన లీలాప్రపంచపర పరమేశా॥ వ. దేవాయవధరింపుమట్లు సావధానులై యున్న ఋషిసమాజంబులతో భృగుమహర్షి ంద్రుండిట్లనియె॥ క. ప్రణవంబుజగన్మయము స । గుణనిర్గుణరహితమతి

—*ఓంకారమహిమ*—

నిగూఢార్థము స । త్పణీతాస్పదంబుహరా । యణభవ్యతరంబు వినుడ యమహితులారా॥ క. ఓకారంరమాదిబుట్టె క, ళంకరహితమవ్యయము కళామహితము త । త్వాంకితముసై బుధులకు శు, భంకరమై బ్రాహ్మణులకు పరమపదంబై॥ క. ఆదిమపూరుషురూపము, గాదలతురు ప్రణవముగా జగతినెల్లెడలగా । మేదురవిజ్ఞానకళా । శ్రీదయితులు పరమఋషులు శిష్టజనంబుల్॥ క. వేదములకు మంత్రములకు । పాదోంకారంబుతద్విభవ పదమెవ్వా । డూదుపవిత్రోంకారమ, యాదిమతత్వంబువడయునతడనిరి బుధుల్॥ క. పరమంబునిత్యశుద్ధము। పురాణము నిశ్చలార్థము జగస్థితభా । స్వరపదమోంకారము ను, స్థిరమతులుభజింతురవ్వి శిష్టార్థంబుగా॥ క. పరమేశ్వరు డోంకార । స్వరూపుడు వినుడతని ప్రశాంతికలిమి గా, ధరుచిజగంబులు మూడును, నిరంతరముగా వెలయుననిరి పూర్వఋషుల్॥ క. మూడక్షరములు జేరిక ।గూ

డగనోంకారమయ్యె గూఢార్థంబై । మూఁడుజగంబులుదానఁ । బోడిమి
నెడకుండ వెలయు భూనుతులారా॥ క. ఆరయమంత్రము లెల్లెడ, సార
ములగుటెల్ల ప్రణవసంభృతపదగం । భీరములనియూరసికా । దేఋషు
లాయర్థముఁ నుతింతురు సతముఁ॥ క. ఏపురుషుఁడోంకారము। దీపి
తవిజ్ఞానమయమతి దివ్యటనిలుపుఁ । పాపరహితుండతండును । హాపండి
తుడుఁ జగత్రయమందుండు నగుఁ॥ ర. శాశ్వతుడాదిమ పురుషుండీశ్వ
గుడోంకారమూర్తి యిద్ధసుమతులా। విశ్వేశ్వరు సేవించుచు । శాశ్వతు
లగుచున్న వారు సంయములారా॥ క ఆదేవుని మంత్రార్థము । సాదర
మతినుపుటఁ ప్రశస్తమతులు బెం । పైదివ్యమైసనాతన, మైదగు
పదమున వసింతురమృతులు వారల్॥ చ. అమృతము దివ్య తత్వమన
నయ్యెడిదెద్ది యొకండుశుద్ధత । త్వముప్రణవంబుగాక దివివారలుభూస్థ
లివారలే మహా । ర్థముపరమేశ్వరాత్మకము దాత్తముగాగ భజించిపూ
ర్ణత । త్వముగనుచుందురా పరమతత్వము తాపసులారనిల్పుడీ॥ క. ఓ
మనుత్ర్యక్షరకూటము । సామాన్యముగా సమస్తశక్తి మయమును
త్యామృతతత్వము దానిమ, హామతులు ధరింపుడరు భయసుఖాపే
క్షఁ॥ క. వేదములకు మూలంబన । గాదగునోంకారము నెరుగండే
మనుజుం । డాదటనరుండుగాడు ద్వి । పాదపశువు జుండువాడుపండితు
లారా॥ క. జ్ఞానంబెవ్వనిదెలియం । గానగుసాధనము తజ్జగద్గురురూపం।
బైనెగడుఁ ప్రణవంబది, గాననదిభజించునది జగతిశుద్ధమతుల్॥ క. ఏ
తేజమునిత్యంబుపు । రాతనము జగంబులకు పరమశుద్ధము వ, ర్ణాతీత
మక్షరపదం, బాతత్వముప్రణవమ ఋషులారయురయుగఁ॥ ఉ. వాయు
నిభక్తిజేసి ప్రణవంబుజగన్మయుడైన యాదినా । రాయణ రూపమక్ష
యతరంబనినమ్మి జపించు నేనరుం, డాయననిత్యముక్తుడు మహాపద సు
స్థిరుడవ్యయుండుతే । జోయుతు డాద్యతత్వుడు విశుద్ధుడు సర్వజగన్మ
యుండగుఁ॥ గీ. ఇంద్రియగ్రామనుమ నురినెయిదిబడక ।- యెరుకయను
గ్రంధమురహించి యొసగు । హృదయపద్మమున సతము క్రీడించుప
రమహంస । ప్రణవమనిమీరు దెలియుడీ భవ్యులార॥ క. ఏమంత్రంబోం

కారము । త్రోమూర్తిభవముగాదు దుష్పురుని గో । ష్ఠీమహిమవ్రా
లె నదిని। ర్చ్యామము నిస్సారమాత్రము నగునరయగ॥ క. జ్ఞానం
బోంకారము పా । దానిర్మలదశ సదామహాత్ములు భగవ । ధ్యా
నోపయోగకరిమము । గానొనరింపుచుననంతు గలయుదురుతుదిన్॥
క. నారాయణుడోంకారము । నారెండు తెరంగులన్ మనము జేర్చి
యహం । కారమడిగి ప్రాజ్ఞులు కబు । ధారాధనమైన పదమునందు
దురుతుదిన్. క. ఏయదియెట్లున్నను నా । రాయణునోంకారజపపరా
యణతాప్తిన్ । ధీయుతులారాధించి మ । నోయజ్ఞములాచరింత్రను వు
గసతంబున్॥ క. వేదములకు మూలంబన । గాదగుప్రణవార్థమెరుగగల
మనుజుడు బెం । పొందిసతతంబునుసకల । వేదములు పఠించినట్టి విమ
లుండయగున్. క. త్రివిధములగు యజ్ఞంబుల । కు విశిష్టపదంబు మం
త్రగుప్తము పరమా । త్మ విభాస్వద్రూపంబు ప్ర । ణవమది యార
యగగల్గినం జాలునిలన్॥ క. జీవాత్మయు పరమాత్మప । దావేశితు డ
గుదుహంసు డనదగితనలో। దావెలుగు న్దద్యోగ । శ్రీ వెలసి ప్రణవమున
పుడశిద్ధింబొగయున్॥ క. ఇదికొందఱ పెద్దలమత । ముదివిజ భువిజాది
సర్వ భూతంబు లదో । చుదనంత తానమరిదో, చదుప్రణ వంబంత
రాత్మశక్తిమయంబై॥ గీ. పరమహంసు డోంకారంబు సిరతమాశ్ర ।
యించునాతని నదియాశ్రయించు పుర్వ్వనాదయు నువ్రాలెనయ్యూభ య
పదములకి । భేదమనిరి మహామహులాదిఋషులు॥ క. ఏయదియమల
మనంతమ । మేయముసచ్చిత్కళాస మేతముపూజ్యం, బాయుప గోరి
నపురుషుడు । వాయకసతత మాప్రణవ జపము సేయదగున్॥ క. పాపం
బులెల్లవాయు మ । హాపదమభిరామమైమనంబునదోచున్। దీపించు
బుద్ధిప్రణవం। బేపురుషుడు జపము సేయు నీశుడతడగున్॥ మ. విషయో
ద్భవృత్తిమనంబునం దణచి సంపత్ప్రాప్తిబాటించు ఖిం । చిషడాతీత ప
దంబు మూటినెలమిన్ సేవించి నిత్యంబువి । ద్విష భావంబు వహింప
కాత్మగతు నుద్దేశించి యోంకార మూ । ర్తిషడాంతర్గతు జేయునాత
డు జగచ్ఛ్రేయస్కరుండౌరయున్॥ గీ. సూర్యుడును చంద్రుడగ్నియు

సోమపులుమ । సోహానుండాది గానవ్యయ చరగణము । లుర్వీయును

—*ప్రణవజపవిశిష్టత్వము*—

సాగరంబులు పర్వతములు । ప్రణవ సంరక్షితంబులు భవ్యులార॥ క. అచ్ఛముసర్వాతీతము । విచ్ఛిన్నము సత్కళాప్రవృద్ధము ప్రణవం । బచ్ఛిద్రంబమృతపదము । స్వచ్ఛజ్ఞాన ప్రకాశ సారంబరయన్॥ క. దివ్యులు పూర్వఋషీంద్రులు । భవ్యతములు భూమిసురలు ప్రణవార్థము సం । స్తవ్యమతులెఱిగి కాదే । యవ్యయతత్త్వంబు వడసి రనుకూలమున్॥ క. ప్రణవము దెలియుట నారా । యణు దెలియుటయగు నతం డనంతుడతని భా । షణ సత్కథారతులు బ్రా । హ్మణజనములకు న్విశిష్ట పాత్రములుర్విన్॥ క వేదంబులెల్లజదివియు । నాదిన్ ప్రణవార్థ మెరుగనట్టినరుని పెం । పేది యతనిచదువంతయు । బూదెనిడిన శిద్ధరసము వ్రాలె వెఱయగున్॥ క విమల మతము బాగుగది । వ్యముపాపహారంబు శుద్ధమగుమంత్రము దీ । క్షమెయి జపించునరుండు ప । రమ శక్తిన్ బొరయు నక్షరబ్రహ్మంబున్॥ క. భూతప్రేతపిశాచ । వ్రాతంబులు సకలదేవ వర్గంబులు సం । ప్రీతి నతులు సేయు ప్రణవ । భూతిబ్రకాశించు ననఘు బొడగని నంతన్॥ క. ఏయనఘుండోంకారము, ధీయుతుడు భజించు దగ పృథివ్యప్తేజో । వాయుర్గగనములతనిచి । రాయుష్మన్ భవయటంచు నాశీస్సులిడున్॥ గీ. పరమ తేజోధికుని జేయు భాస్కరుండు । సౌమ్యవిశ్రుతుగా జేయు చందురుండు । పావనవదశాసితుని జేయుపావకుండు । ప్రణవ నిష్ఠారతి జెలంగు భవ్యతముని। క. ఆరయభూతాత్ముండగు । నారాయణు రూపమగు ప్రణవమరయు మహా । పూరుషసత్తము గన్గొని । భోరుననుతి సేయుసర్వ భూతచయంబుల్॥ గీ. అగ్నివడినట్టితూల చయంబువోలె । ప్రణవనిష్ఠాగరిష్ఠు డపాయవేళ । నాచరించిన పాపంబులణగునతని । యాత్మశుద్ధి జగన్నుత మట్లుగాన॥ క. ప్రణవార్థగరిష్ఠుడు కా । రణమూర్తుడు గాడతని చరములచరంబుల్ । గణుతింపరానిచేతన । గణములునిత్యాశ్రయములుగా రహించొలచున్॥ గీ. బ్రాహ్మ్యకారణంబు ప్రణవంబుదానియ । ర్థంబెఱుం

శుభవ్రతముడు బ్రాహ్మ। ణోత్తముండు కాడనుపమ వేదాభ్యాస। పారగుం
డుదీక్షుబరగునైన॥ క. విమలంబగు ప్రణవంబు। త్తమమును మధ్యమము
మఱియధమమగు నిజసా। రమహితభంగుల పరిశు। ద్ధము నక్షరమ
య్యు తద్విధ జనములందున్॥ క. పరమాయుశ్శాంతిసుఖ స్ఫురణము
లోంకారము హిమబుధులు బొరయుచుం। గురునిత్యశ్రద్ధా త। త్పర
సుమనోనియతి మెయి సతము ఋషులారా॥ సీ. రౌద్రతగినిసి సముద్రం
బు లింకింప నగితొంటియట్ల బెంపలరజేయ। గగనంబు గ్రహతారక
ములతో మాయింప నధినిర్మలారూఢి బొదలజేయ। సూర్యచంద్రాన
ల స్ఫురణముల్ దొలగింప నధిక తేజము నెలయుంగ జేయ। సురలనుయ
క్షకిన్నర గణంబులపద భ్రష్టులజేయ నుత్కృష్టతగదు। వారుగాబేర్మి
నొనరింపవాసవాది। సకలదేవప్రశంసా ప్రశస్తమూర్తి। ప్రణవనిష్ఠాగ
రిష్ఠుండుభవ్రతముడు। కలితమహిమ సామర్థ్యంబు గలుగువాడు॥
క. విమలప్రణవంబు భజిం। చుమహాత్ముని. కలుకపుట్టుచోటు ప్రళ
యకాలమువోలె దహింపంబడు। సమస్తశరీరిణ ప్రసంఘుంబులతోన్॥
క. భూనుతప్రణవార్థపరి। జ్ఞానకళావృద్ధి బొలచు ఘనునిసతతమే। మా
నవుడు గొలుచువాడుస। దానందమయమగు పదమునందు సుఖించున్॥
క. మేదిని ప్రణవార్థ భరితు। పాదరజముసోకి సకల ప్రాణితతులు తే।
జోదయగతు నారాయణు। నాదిమపూరుషు బొరయు మహానందము
తోన్॥ గీ. నిశ్చయప్రణవార్థమహిమ జెలంగు। భవ్యతముడు భూదే
వుండు బ్రాహ్మణుండు। పండితుండాతనికి కర్మబంధనంబు। లేదతండు
నిరాశ్రయ లీలబొలచు॥ వ. మఱియును॥ క. పరిశుద్ధజ్ఞానానం। దరసని
మగ్నాత్ముడై యతడు ప్రణవార్థ। స్ఫురితమహా యోగాప్తిన్। పర
మేశ్వరు పరమహంసు బరగగన్గొనున్॥ క. అష్టాక్షర మంత్రము వి।
స్పష్ట ప్రణవార్థమయ ప్రశస్తి బొలచియు। త్కృష్టపదమునన్ జేర్చున।
కష్టరతులనిత్యమునెఱుక గలజనములన్॥ క. కేవలమును పరమాత్మన।
మానేశాప్తిదగి యింద్రియములనణచుబెం। పై విమలప్రణవార్థము। జీవా
త్ముని బంధనంపుచిక్కులు వాయున్॥ క. పరిపూర్ణతత్త్వమైదగు। పరమజ్యో

తియుదియ సదపారము ఋషి వే|ద్యరహస్యార్థము ప్రణవము|నిరతంబు
జపించుడది మహిత మతులారా॥ క. నాయది యిదియనుభావము| పా
య కరంబత్తెరంగు బాటింపనిభ|వ్యాయత మహామనస్కులు |భూయి

—*ప్రణవ జపపాత్ర జనని రూపణము*—

ష్ఠోంకార పాత్రములు కారుపరుల్॥ క. ఒకులనుదానంటకద|న్యొరులం
టక పరమనియతినుండుపునులు వే|దరహస్యార్థమయంబన |బరగు ప్ర
ణవముఁ జపించుభవ్యమనస్కుల్॥ క. స్త్రీ పూయము పురుషుండిత
డోయను భావంబులేక నుత్తమతరవి|ద్యాయోగస్థితిదగునిర|పాయరతు
లు ప్రణవనిష్ఠబరగు జనంబుల్॥ క. వేదములుపురాణంబులు| నాదిమ
పూరుషునిచిన్మయములని నియతం|బూదియవియరయగల వి|ద్యాదయి
తులు ప్రణవనిష్ఠ దవిలిన ధన్యుల్॥ గీ. ఈశ్వరాధీనవృత్తుల నెపుడు చ
విలి | యున్నయవి సకల జంతువుల్ నన్నుబోలె | ననుచు సౌహృద
మతి వాని నరయుచుండు | నాతడోంకారము జపింప నర్హతముడు॥
క. జలములజరించు మత్స్యం | బులు నుర్విజరించు జంతువులు గ
గనమునం | దెలమిజరించు ఖగంబులు, తులప్రణవార్థ విదులగు బు
ధుల కెల్లెడలన్॥ క. శాంతసుఖావాప్తివెలసి | యంతర్దృష్టి దగిపరమ
హంసు నచలునే | కాంతము హృత్పద్మాసను | నెంతయుగనుహారుప్ర
ణవమెరిగిన ధన్యుల్॥ క. అయమహితుడు శుదక్షా | నయుజ్ఞము సేయ
నేర్చు నరవర్యుడు బెం | పయి వెలసినయోంకారా | శ్రయునిగ నెరు
గుదురు విభుదజనములు సతముఁ॥ క. అరయ నిర్ద్వంద్వుల హం|కార
రహిత భవ్యమత ప్రకాశులు భూతి | శ్రీరమ్యమాన్యతము లోం |
కారవిదులు పరమవిబుధ గణ్యా చరిత్రుల్॥ క. నియతేంద్రియు లత్యం|
తవి | నయవిద్యాధికులు సజ్జనంబులుభూత | ప్రియులు ప్రణవవేదులు
వా | రియెడలకడు భక్తిమెజరింపగవలయున్॥ క. ప్రాప్తములగు సర్థం
బుల | దృష్టివారయుచుఁ సదావితృష్ణగరిమలో | కాప్తుండగు ధన్యుం
డు సం | ప్రాప్తప్రణవార్థభూతి భవ్యుండరయన్॥ క. జ్ఞానంబుగలిగి
యుదియు|జ్ఞానులకుఁ పరమకరుణ గరపుబుధుడు వి|ద్యానిధియమ్మహా

నీయుడ, భూనుత ప్రణవార్థవిత్తముడు మునులారా॥ గీ. బ్రాహ్మణో
త్తముడు సధర్మమనస్కులు । ప్రణవమతిని యతిజపంబు చేసి।
గర్మబాధనమున గలగకనమృత ప । దంబువొరయుదుగా ముదంబు
పేర్మి॥ క. పరమప్రమాణములు వే । దరహస్యార్థంబులిపుడు దాత్త
ప్రతిభ । స్ఫురితంబుగ నెరిగించితి । పరమర్షి శ్రేష్ఠులార బహుపుం
డెదలన్॥ క. ఈయర్థము లతిగోప్యము । లాయతమతులైన బ్రాహ్మ
ణావలగు విని । స్థాయుతులనెరిగి గరపుం । లేయడల తదితరు
లువిన నెంతయు జెడున్॥ గీ. గాఢని యతిజెలంగిన క్షత్రియుం
డు । భక్తిజేసినదెలుపుడ పారనియతి । వరలుచుండిన వారయ్యవైశ్య
శూద్ర। జనములు పఠింపవినగాను సాధులారా॥ గీ. పాపవర్తనుండు బ్రా
హ్మణుండునుకాయ । శుచితవ్రాత్రమున బొలచిపఠింప । పాత్రతముడు
గాడుపరమగుహ్యము లీవు । హార్థములు మహాఫలాభితుల॥ క. ఈ
యర్థములతిపవిత్రములి । మైరే బ్రాహ్మణుడు జనువుమాన్యుడతడు దీ ।
ర్ఘాయుర్విద్యాతేజ । శ్రేయఃఫలములు బొరయు నశించునఘంబుల్॥
గీ. వేదసారంబులు త్రిలోకవిశ్రుతంబు। లీమహార్థంబులు భజించునేద్విజుం
డు, వేదములుజదివి సభలందు దమూను । వారలకు పెద్దయతడు ది
వ్యశమయుతుడు॥ క. అని తేటపరచిన భృగువ । చనములు వీనులజొ
నిపి ప్రశస్తచరితుల । మ్మునివర్గంబులు దగని । ట్లనిరి నతులుచేసిమరి
యు నాతనితోడన్॥ క. విపులాత్మతమంబగు బ్ర । హ్మపదప్రాప్తికిని
సాధనములెయ్యవితే । టపరపు మవిమాకనవుం । డపరిమితానంద
మగ్నుడై యతడనియెన్॥ క. రాగద్వేషమదంబులు । యోగిజనంబు

—*బ్రహ్మపదప్రాప్తి సాధనంబులు*—

లకు బంధనోజ్వలములు నుః । ఖాగతములవి యుడిగినను । ధిగణ్యు
లుబ్రహ్మపద ప్రతిష్ఠాతిశయుల్॥ క. పరులెల్ల దన్నువలెన్ ।
నగయుచు హింసయుడిగి పరమాత్మునెరుగు స । త్పురుషుండు
శాశ్వతంబుగ । పరమబ్రహ్మపదమర్థి బడయుగనోపున్॥ క. పర
ముండను తేజము పెం । పు రూపరదవిలిరోను నెపుడు నింద్రియ

ములే । పరమనియతినవియుడగిన । పురుషుమనము బ్రహ్మముగను
బోధామయమై॥ క. జ్ఞానస్వరూపుడును ని । త్యానందమయుండునచ
లుడమలుడుపరముం । డానిర్మలతత్త్వముగను । వానికి బ్రహ్మపదమాట
వట్టగునరయన్॥ క. భూతాత్ముండతడపరం । జ్యోతిర్మయుడెఱుక నవి
శుద్ధపరమ త । త్త్వాతీతులోనగనుగొను । నాతడు బ్రహ్మపదవాసుడ
నఘుండరయన్॥ గీ. జ్ఞానమను తేజమణగించు గాఢమోహ । తమము
పెద్దల సంసేవనమునదాని । మెల్లమెల్లనమాయించి యుల్లమునియ ।
తిమెయి వెలయించునతడు సుధీవరుండు॥ క. వినుమునవద్వారపురం ।
బున నిత్యానందలీలబొలచి వెలయుచుం । డునమేయపరమహంసన్ ।
గనుగొనువైరాగ్యపరుడుగాఢనియతిమై॥ గీ. పరమహంసుడు ప్రణవా
ర్థభరితమూర్తి । యై నవద్వారపురమునగానవచ్చు । జ్ఞానదీపంబుగైకొ
ని గాఢమోహ । తమమునణచిచూడగనేర్చు విమలమతికి॥ క. నియ
తంబగు మనసున నిం । ద్రియములు గుదియించి బుద్ధిదీపించి పరం ।
బయిన వెలుగుహంసునిగ దె । లియుదురు బుధులామెయిక జలింపక
నిలచున్॥ గీ. జ్ఞాననేత్రంబువిచ్చి జగన్మయాత్మ । కుండునై యెయ్యది
యు గాక గూఢముగవె । లుంగు వెలుగను హంసుగనుంగొను బుధు ।
డేల ప్రకృతికర్మంబుల జోలిబోవు॥ క. మనసున యింద్రియములు నది ।
తనలో గుదియించి పరమ తత్త్వమయతబే । ర్చి నిరంజనత్వసిద్ధిన్ ।
గనుయోగియమృతపద ప్రకాశము జేయున్॥ క. జ్ఞానముపూర్ణంబగు
వా । జ్మానస నియతిమెయినది సమగ్రంబైనన్ । దానదరగు మోహ
తమము । దానపరబ్రహ్మమయపదము బడయునగున్॥ క. మానితపరి
శుద్ధతర । జ్ఞానంబున దొరకొనున్ బ్రశాంతియదితిరం । బైనెగడునేని
ఘనబో । ధానందము బొలచుపరమహంసమయుంబై॥ గీ. రాగపంకం
బులోభతీరంబు నింద్రి । యార్థవారిప్రవాహంబునై బొలచు న । సార
సంసారనది నతిశాంతమయమ । నక్కడు బడండు గను నాయనఘుడు
హంసు॥ క. ఏతేజము విశ్వాత్మక । మై తోచియు దోచకుండునందగల
యున । త్యాతతశుద్ధజ్ఞానా । తీతుడు వాడతురుండధికుడెల్లరకున్॥

గీ. పరమహంసు డోంకారంబుపట్టితండ । జ్ఞానచక్షుర్గతుడు తత్ప్ర కాశమయము । లెల్లజగములు బ్రహ్మాదులింతగాన । వదలకాతనిగను ట సర్వంబుగనుట॥ ఉ. అంతర్యజ్ఞరతులతి బ । శాంతిగలుగు భవ్యులా ప్రశస్తమతులకే । శాంతమునగానవచ్చు స । దాంతర్యామియగు దేవు డారూఢిమెయిన్॥ గీ. అరయనింద్రియములు గృశమగుచుమనసు । న ణగునపుడ ప్రశాంతిమైయాత్మధామ । విరహితంబగు దీపంబుకరణివె లుగు । గలిగిపరమాత్మునందు నైక్యతరహించు॥ క. విదితంబుగనా త్ముడు పెం । పుదగివెలయునే నిబంధములజిక్కకది । వ్యధశాస్తివె లుగుచు స । చ్చిదతీతంబయిన యోగసిద్ధిన్ బొరయున్॥ క. మౌనంబు యోగరతమన । గానగునే సచ్చిదాత్మకజ్యోతిపరం । బై నెగడకనది శిద్ధం । బైన యతనియోగియందు రార్యజనంబుల్॥ క. శమసంపదవి నుడెల్లను । ఖములకు పెద్దయది కరముగలపూరుషుడు , త్తముడాతడు మరమార్థమ । హిమ శిద్ధంబొరయు ఘనుడనిరి పూర్వగురుషుల్॥ క. ఏ పండితుడింద్రియముల । నోపి మనముగుదియజేర్చి యుఱుగుపరమ త్వ। ష్టాపరతయతండు జగ । ద్వ్యాపక బ్రహ్మంబువొరయునతి సులభగతిన్॥ క. శాంతియు దృఢవ్రతము వే । దాంతజనంబుల కవశ్యమవిగల్గి యత , స్వాంతము జేర్చినవారల । నంతుపరబ్రహ్మమున్ దయామయు బొరయున్॥ క. వేదాంతమతము సతార్క్యము । గాదదిసుజ్ఞానమయము కర్మము శమసం । పాదకులు దానజేసిమ । హాదివ్యపథంబు జొత్తురన ఘులువారల్॥ క. అనియిట్లుభృగుమహాముని , వినిపించినసారవచన విభవంబుముదం , బునవీనులలరగొనియి , ట్లనిరాతాపసగణంబులాతని తోడన్॥ క. జ్ఞానముదొరకొనుస్రశ । ద్ధానిరతిసనిరి మహాబుధజనము లదియే । పూనికనలవడునసునకు । దాని తెరంగుబలుకు మననతండిట్లని యోన్॥ క. వినుడుఋషులార బనిగొని మనసునిరతమేమరక సమగ్రతమై బెం। పునెగడియింద్రియములనరు । డనుబంధించుట యశ్రద్ధయనిరిమహా

—*శ్రద్ధాలక్షణము*—

త్ముల్॥ గీ. ఎసగిమెల్లెడలకు బారునింద్రియముల । మనసుతో గుది

యించి సమగ్రనిష్ఠ । మేఘనవిగది యించు నమే యనియతి । యుత్తమ
శ్రద్ధగా దెలియుండుమీరు॥ క. శ్రద్ధవలన నత్యంత వి । శుద్ధజ్ఞానంబు
గలుగు జుండదికరమై । బుద్ధివెలుగునేనియును స । మృద్ధానందమయు
దశరమింపగవచ్చున్॥ గీ. శ్రద్ధలేని నెగడు సంశయంబదియ జ్ఞా । నం
బులేమి సంశయమునబొలచు । వాడు నిజముగొరయలేడై హీనాము
ష్మి । కను ఖములు జగద్వ్యగర్హితమగు క. జ్ఞానంబు శ్రద్ధవలనన్ । దా
నివలన శాంతిశాంతదశవలన పరం । బైనమహాతత్వంబును । దానివల
న బుధుడు ముక్తతయు తగబొందున్॥ గీ. ఇంద్రియార్థముల రహించి
మనంబు ద । లంచు బుద్ధిని శ్చలతజెలంగు । సాక్షిభూతుడై సదాత్మ
యస్ఫూర్తిజ్ఞే । తజ్ఞుడొప్పచుండు ప్రాజ్ఞులార. గీ. అంతరాత్ముండు
నాదగునతనివలన । సత్వమురజంబుతమమనుసాంఖ్యకములు । త్రిగుణ
ములు మెరయు నవియు నొదిగిననెదుగు । నింద్రియములట్లయినగను
నీశుబుధుడు. క. త్రిగుణములురువైన విషయగణంబులు సెలగునంత
రాత్మనినవిలీ । లగుదియజేర్చిన మనసు న । ణగునద్దశయోగిజిద్ఘన
త జెంపొందున్. వ. సత్వరజస్తమోగుణంబులయందు సత్వగుణంబు
మాన్యతమంబు మరియును. క. త్రిగుణంబుల నెక్కుడు స । త్వగుణం
బడివెలయునేని దక్కక నారెం । దు గుణంబులణంగునవి య । ణగి
న బడయనచ్చు మోక్షణ దశాస్ఫూర్తుల్. గీ. సంశయాస్పదమైన య
జ్ఞానతరువు । జ్ఞానమను కత్తినరికి శంకాభయములు । గాక పరిశుద్ధ
మైన యోగపథమున బు । ధుండు నడచియమృత ఫలతుష్టి వెలయు॥
గీ. అచిరములు సుఖదుఃఖంబుల శుచముతను । వశ్వరంబులు సకల
పదార్థములు స । మగ్రబంధనభయము కర్మముల భంగి । యనిదృఢ
జ్ఞానమూని నఘనుడుఘనుడు॥ గీ. ఎఱుకగలుగు పురుషుడెరుగు నీశ్వరు
నీశ్వ । రుండతని నెరుంగునొందు తెరవు । గాకనీశ్వరుండగమ్యుండెఱింగిన ।
విశ్రుతుండు బొరయు విశ్వమయత॥ క. ఏవిబుధుడు శాంతమయుడ ।
హావిద్యావైభవంబు నలరు నతని తే । జోవిలసితంబులై భూ । తావ
లిచరియించుచుండ నఘనుతులారా॥ గీ. కూర్మమంగకములు గుదియిం

చు నట్లు మ । నంబులోన నింద్రియంబులెల్ల । జిక్కఁబట్టి యోగశిద్ధుండ నంతటే । జోమయుండమృతుడ సూత్ముఁడునగు॥ క. జగమెల్ల నతివిచి త్రం । బుగ జూచుగ యోగనిష్ఠబూనిన ప్రాజ్ఞుం । డు గదల డతండు కర్మర । తిగడగి యెందేని యిచ్చదిరుగుచు నుండుగ॥ క. దేహము దేహియు వేరని । యూహించుబుధుండు విడచును జ్వలతర స । మ్మోహంబాయుడుపున సం । దేహామృతపదవి జిక్కదేర్చు ఘనంబై॥ గీ. కామరతినధిక తృష్ణావికాశమడగు । తృష్ణవలన సమ్మోహంబు దివురు మోహ । మగ్నమానసుడగునట్టి మనుజువేచి । మృత్యువుపహరించి గొనిపోవు మెదపి మెదపి॥ గీ. పెచ్చుపెరగు నింద్రియముల విచ్చలవిడి । యెచ్చటికి నేనియును జననిచ్చుపురుషు । డెద్దియుదుఃఖంబు బొరయుదానింతవట్టు । నరసి బుధుడవి మనసుననాగినిలుపు॥ క. జ్ఞానోదయంబు పరమ ప । దానందకరంబుశ్రద్ధ యులవడునేనిగ । దానికి నిర్మలదశయున । గానగు నాకలిమిమోక్షకారణ మరయగ॥ క. జ్ఞానంబును నిర్మల వి । జ్ఞానంబును రెండుమోక్ష కారణములు ని । త్యానందపదము మోక్షము । నానుతిసేయుదురు బుధజనంబులు సతముగ॥

—*యోగాభ్యాసప్రకారము.*—

క. యోగమునకు కారణము వి । రాగము విజితేంద్రియతపరాయణమున గో । ష్ఠీగతియు నిస్పృహయును వి । రాగము మూలముల నిరి పరమయోగివరుల్॥ క. యోగంబేకాంతరతుల । కేగాదు జితేంద్రియతదగిలి శమమునహింసాగరిమమునుగల సద్వి । ద్యాగురుమూర్తులకు సులభతరమూహింపగ॥ క. వినుడొల్లమియును కోరిక । యును మనమున లేక భవ్యయోగాభ్యాస । త్వనిరూఢి వెలయుపురుషుడు , గను ముక్తత్వదశయచిరకాలములోనగ॥ క. జన్మమాదిగా మృత్యువు పులి చందమున న । రుని తనుపునంబ్రతిష్ఠత నెనయుగాన । నెల్లియనక యోగాభ్యాసమెద్దియదవిలి । జాగ్రతదగి బ్రవర్తింప జనుబుధుండు॥ క. భోగేచ్ఛయుడిగినంత న । యోగము శిద్ధించెనాకనుట గాదది దీ । ర్ఘాగతియు శమము నెరుకయు । రాగ విముకతయు లేక రాదెవ్వారి

కీ॥ క. వెంగలిరాక సతము స । త్సాంగత్యము సేయవలయుదాన
బడయు ని । స్సంగత్వము నిర్మోహ త్వాంగీ కారంబులవి మహా
దశజేర్చు॥ క. వెలయుంగపద్మదళగత । జలబిందువుభోలె దేహసత
ముతనుస్రవం । దొలయక నంటియునంటక । వెలుగు నతనిచంద
ముగను విత్తములుదగ॥ క. ద్వారములుజిక్కమూసి శ । రీరము
నిక్కించి యోగదృష్టినతుల తే, జోరాజితపరమాత్మ క । శారూప
ము గాంచుయోగి లక్ష్యంబెలమి॥ క. హృదయంబున నింద్రియ
ములు । గుదియించిపరమయిన వెలుగుగనుగొనుచు జో, క్కుదివియు
భువియు వెలయు యో । గదృష్టికలిమి యోగిగదలకనియతి॥ గీ. ప
రమహంసుండు క్రీడించుపట్టుదెలసి । నియతచిత్తుండు నధికశాంతియు
తుడై వి । రాగియగుబుధుడుయోగపరాయణతని। రంజనత్వసుశిద్ధియే
ననకబౌరయు॥ గీ. ఆత్మధారణంబనఘ శిద్ధికరమింద్రి । యములుపేరు
గ్రుచ్చినట్లుగుదియు । దాననదియవశ్య మేనరుడతిసిద్ధి । గోరువాని
కధిక గూఢతరము॥ గీ. ఇచ్ఛవచ్చినట్లు లింద్రియవర్గంబు । మెలగవ
చ్చునేని మిగులకష్ట । సాధ్యములగుపిదప సజ్జనగోష్ఠిసే । యంగదివ్వురు
నప్పుడనఘులారి॥ గీ జ్యోతియాత్మయందు సూక్ష్మమైయున్నదా । వె
లుగుజూడ నేర్పుగలబుధుండు । నిర్జితేంద్రియుండనిన వింతగాదా ఘ ।
నుండు ముక్తరతుడుజుండరయగ॥ క. తమలోవెలిగెడి పరమా । త్మమ
హిమగనలేక జడమతులుపల్వురు దూ, రముచనుచుందురు గుడిపా।
దముమెట్టగ వారికదినృధాశ్రమకాదే॥ క. విమలప్రణవవ్యాప్త ప, ర
మహంసకళామయములు బ్రహ్మాదిసమ, స్తమహితచేతనకోట్లు జ ।
గములవ్విభుగర్భమని నిగమములవినమే॥ క. ఇదిగానకదుర్మతులి। చ్చది
రుగుదురు విగ్రహములుసాధింపగలో । కదయామయుడీశ్వరుడా।క్కదె
స్ప్రబవర్తించునే నిగమవిదులారా॥ క. జీవాత్మైక్యతయత్రిలో। కావాస
మునమృతపదము నంతముయోగ । ప్రావీణ్యులకది సులభము । గావు
న తన్నిష్ఠదగు జగతినెల్లరకును॥ క. పరమేశ్వరమయము చరా । చరా
త్మకమైవెలుంగు జగమీయర్థం । బరయగలుగునే పురుషుడు । వరసి

ద్ధిఁ బొరసినట్టి వాఁడయతఁడగుఁ॥ గీ. జ్ఞానయోగంబుకన్నను కర్మయోగ। మతివిశిష్టంబుగాన మహాజనములు। శాశ్వతజ్ఞాన యోగంబసాధనంబుగాఁగఁ దలఁతురొలిసంసారసాగరంబు॥ గీ. జ్ఞానయోగ సిద్ధిగలుగువిద్వాంసులు, చేసియెయ్యదియును సేయునట్టి। వారువొలెదగులు వాటింపకుందురు। గానవారువ్వైరయు ఘనులుముక్తి॥ గీ. పురుషుఁడెప్డుమోహభూయిష్టతమమగు। కలతయుకుగునప్డుకర్మబంధ। నాప్తిదొలఁగఁజేయు నత్యంత నిర్మల। జ్ఞానయోగశిద్ధిగలుగు నిజము॥ గీ తగమనోగతంబులగు సర్వకామంబు। లెప్డువిడచి మోదమెసఁగమెసఁగ। నాత్మతనకు దానయలరునప్పుడు స్థిర। ప్రజ్ఞశిద్ధి వొరయుప్రాజ్ఞులార॥ గీ॥ ఆప్తిఁజెందక ప్రాప్తించునట్టి శుభము। లశుభములు సరిజూచుచు నాత్మఁగలఁగ। కుండు నేఘనుఁడప్పండితుండు బుధుఁడు। సుస్థిరప్రజ్ఞుఁడందురు సూరిజనులు॥

గీ. ఇంద్రియములు దుఃఖమునకు నిరువుగాన, వానిమునుమున్న గుదియించి మానసంబు। నియతముగ సుజ్ఞానంబు నెరిసమాశ్ర। యించుబుధుఁడని బంధనుండెల్ల పనుల॥ గీ. ఏనుపరముండ నెరులు నాకెవ్వరనుచు। మోహమించుకయును లేక మొనసియెయ్య। దియును వానంటకెవ్వాఁడు దిరుగువెట్టి। వ్వాఁడె నాయోగశిద్ధుండు పూర్ణుఁడరయ॥ క. తినుటయు బల్కుటయును గను। గొనుటయు నడచుటయు నిద్రగూరుటయు నెరుం। గని వాఁడు వ్వాఁడెగావిం। చు నిశ్చలయోగశిద్ధిఁ జొక్కుఘనుఁడిలఁ॥ గీ. ఎద్దియేనియు గుడుచునెందేనియు జను। నెట్లునోబలుకు జగముదానెరుఁగడఁపుల। యోగవిద్యామయుండాఘనుని కరస్థ। ములు జగంబులన్నియు ఋషిముఖ్యులార॥ క. తనువును సర్వేంద్రియములు। మనసును శుచితఁ జెలంగు మానితమగు యో। గనిరతినయ్యానంద ప। దనిశ్చలావాప్తిమెయి బుధజనములు దగుఁ॥

క. వాయువులు నిరోధించుట। పాయకరము దానసగునె బ్రహ్మమయత ప్ర। జ్ఞా యోగంబునగాక సు। ధీయుతులీమతమనన్ను తింపుదురు గదుఁ॥ గీ. సారవంతంబులును యోగశాస్త్రమతము। లైన యర్థంబు

లెరిగించి తతిగరిష్ఠ । శీలురగువారల బిలచిసెప్పండారు । కేస్నడును గామఙుఁడు ఋషీంద్రులార॥ న అనిచెప్పెనని॥

ఉ. యోగకళాప్రతిష్ఠ మహిమోజ్జ్వల సారమయత్వభవ్య దీ
క్షాగురుతత్వ సంభృత జగన్మయ సత్ప్రణవార్థ భాసిత
శ్రీగరిమాఢ్యమంత్రపది శిష్టనిరంజన నిర్వికల్ప దే
వాగహనాతిమాత్ర బుధవందితపాద త్రిలోకపావనా।

క. శమదమసంపన్నులయ ప
రమపదతేజోవిలాస రమ్యతరపరా
ర్ధమయశుధరామకృష్ట ప
రమహంసగురూత్తమ స్థిరసమాధినిధీ.

మాలిని. నియతపరమశిక్షా నిర్మలత్వప్రదీపా
భయవిరహితయోగప్రాభవార్ధస్వరూపా
యయమహిత విశిష్టానంత పూర్ణత్వభావా
న్వయనిరుపమ తత్వావాప్తమోక్షైకలీలా॥

గద్య.

ఇది శ్రీమత్పరమేశ్వర లీలా విచిత్ర ప్రపంచ సేవాపాత్ర శ్రీమన్నారపురెడ్డి
పాపినాయక పుత్ర నిఖిలబుధజనవిధేయ యప్పలనాయక
నామధేయ ప్రణీతంబైన శ్రీమదాంధ్ర మనుధర్మ
శాస్త్రంబునందు నేకాదశోధ్యాయమ్
సంపూర్ణమ్.





శ్రీ ర స్తు.

శ్రీమద్ద్వితీయరామకృష్ణపరమహంసగురుస్వామినే నమః.

# శ్రీమదాంధ్ర మనుధర్మశాస్త్రము.

## ద్వా ద శా ధ్యా య ము.

శ్రీ మత్ప్రణవార్థమయ । త్వామృతలీలావినోద యక్షరభూత
స్తోమాంతర్గత భాసని, రామయనిస్సంగ తత్వరత పరమేశా॥ వ. దే
వాయవధరింపుమట్లు సావధానులై యున్న ఋషిసమాజంబులతో భృ
గుమహర్షీంద్రుండిట్లనియె॥ క. సక్తత కామము కోపము । ముక్తికివై

### —మోక్షత్వ మార్గానుసరణి ప్రకారము.—

రులు బుధుండు మూఢవిప్రజ్ఞా । శక్తిగుదియించినిశ్చల । శక్తిమయం
బగుపదమున సౌఖ్యము గాంచుఁ॥ క. ఆరంభంబు పరిగ్రహాక । కార
ణమది విడచుబుధుడు గదలడువిషయో । త్సారమున దాన నెరుక
య । పారంబగు నపుడమోక్షపదముఁ బడయుఁ॥ క. ఏయువియు
నెట్టివారును । నాయువినావారు కారనంగల జనముల్, మాయాతీత
ముశాశ్వత । మైయొప్పు మహాపథంబునందు సుఖించుఁ॥ గీ. ఇంద్రి
యంబులు మనసుమహితసమైక । భావముగనంత రాత్మతో బరగునె
ప్డు । సర్వసంగపరిత్యాగ సమ్మతంబు । భవ్యమగునప్డు బుధునకుప్రా
జ్ఞులారా॥ గీ. లింగదేహమెపుడు భంగమగునుమోక్ష । వాచకంబు
నిజముదోచునప్డు, గానికర్మవృత్తి గలుగదాయర్థంబు, గలిగనేనిము
క్తిజులకగాదె॥ క. ఏకాంతికులే తేజము । లోకనుగొనుచుందురా వెలు

గుసూక్ష్మము ని । ర్వ్యాకులము నిశ్చలంబు ని, రాకరమది బొరయు
దురు మహాతత్త్వవిధుల్॥ గీ. పంచవింశతికుండు దుష్ప్రాప్తుకతడ । పర
మహంసుడందురు తత్త్వపరులు విబుధు । లతని కెందును దగులు లేదత
కుండు । వానిబొందుడుమీరు తత్త్వమయత దగి॥ క. ఏకాంతికధర్మంబు
ని । రాకులగతి నడుపనేర్చునాతడు ప్రణవ । స్వీకారంబుగనీశ్వరు ।
లోకనుగొను వాడొ కులుతులువలాతనికిన్॥ క. శాంతముగలవారల కే ।
కాంతికధర్మంబు కరతలామలకము జుం । డింతలనరాదది సదా । సం
తోషము పాదుబుధుడు జనునాత్రోవన్॥ క. మాయామయము జగ
మునరు । డాయుప్రదరుగకయ పెరుగు నాతడువ్రాలెన్ । జేయుఫలము
గోరి జడుం । డైయదియతదీయ హేతువారసిచూడన్॥ గీ. దీపమన్య
వస్తువులను తేజరిల్ల । జేయునట్లుసమగ్ర బోధాయతిమగు । జ్యోతిమ
నసు నింద్రియముల సూక్ష్మభంగి । వెలయజేయు తదన్యములవిబుధు
లారా॥ క. మృత్యువు మోక్షము రెండును నిత్యంబు శరీరమందనిలచు
మహార్య । సత్యజ్ఞానముపేరిమి । సత్యాశ్రయుడగుటమేలు సజ్జనుడుద
గన్॥ క. ఆరంభింపక నెద తృ । ష్ణారతియుడిగించి పరమసత్యజ్ఞానా ।
ధారముగొనియమృతపదము । పారకళావేదిబొరయ పాత్రతముడగున్॥
గీ. జగతినేవస్తువందును దగులు లేక । ప్రాప్తసుఖదుఃఖములనొక్క భం
గిగనుచు, నోపియోగసమాధిమై యుండుపురుడు । పరముడన్నింటి
యందును భవ్యులార॥ క. మమకారముతృష్ణవలన । నమేయమునైద
గి । హృదయము నింద్రియముల్ । క్రమమునలోగొనునాచం । దము
ఘుర్గతిపాలు దక్కడబడునే॥ క. నాయదియిదియను భావం । బాయు
వ్రుదరుగని పదస్థునట్లసతంబున్ । జేయునరాధముడు పశు । ప్రా
యుడుబడు ఘోరనరకపంకమునందున్॥ గీ. ఎరుకలేనినరుని తృష్ణయొ
సగునెడలు, ముదియునైన ముదియదదివదలదు సురు । వెడలునందాక
మరియును వెలయుచుండు । దానినణగించిన యతండతత్త్వవేది॥ క. జగ
మెల్ల నాక్రమించియె, సగుతృష్ణంబోనణచి ప్రశాంతిమయ సమా ।
ధిగరిష్ఠత బొల్చుపురుడ । జగదంతర్యామిజుండు సన్మునులారా,

—*తృష్ణాప్రకారము.*—

గీ. మేను గావాప్తి జగమెల్ల మ్రింగుచున్న । తృష్ణయను బ్రాహ్మణి పిశాచ మెఱుకగలిగి । పరమహంస సమావేశభవ్యమాత్ర । శక్తిదోలిన విబుధుడీశ్వరుడు నిజము॥ క. అశ్వరమగు దేహాదులు । శాశ్వతమని దలచు వెఱ్ఱిచందము తృష్ణా । శశ్వత్ప్రకారమది పర । మేశ్వరమాయాప్రచుర మహిమ దలపోయఁ॥ గీ. నారపురుషసతంబు బ్రయాసమోపి । తావు విషవకెం దేసియు బోవకంద । సుడిసిచచ్చినపగిది బ్రాజ్ఞుండుగాని । వాడు తనసుఖము దలపోయు వాడుగాడు॥ క. ఆయువు దుష్ప్రాప్తంబది । బాయక దుష్కర్మరతుల పాల్వడు చుజను । డే యెడలగాడు సుస్థిరు । డాయుర్వేదులదిజేయు ననఘుతరముగఁ॥ క. వినుడెరుకగలుగు ననఘుడు । మనసున వాక్కాయక ప్రమాదంబున జిక్కునె జిక్కియున్న వారల । గని దయచేయం దలంచుగాక నరయఁగఁ॥ క. క్షరతత్త్వమయాది బహుళ । పరిస్ఫుటార్థంబులెరుగు పండితుడు దిగం॥ బరుడతని వీక్షణంబులు । పరాత్పరసామ్యములు శుభవ్యక్తంబుల్॥ క. ఏయనఘుడు సాక్షాత్ క్షర । భూయిష్ఠంబైన మర్మము నెఱుంగునతండాయువు నాయువు జేర్చిన । మాయతమహిమాతిశయుడనఘమతులారా॥ క. కేవలములింగతత్త్వం । బావేశంబగునె యింద్రియంబులనవి చే । తోవిద్యగుదియనణపం । గా వెరవెరుగని యతనికగమ్యంబగుచుఁ॥ క. మాయాశక్తిసమన్విత । మై యేతత్త్వంబు బుధజనావళి కాత్మ । శ్రేయస్సిద్ధికరంబగు । నాయనుభవతత్త్మ మెరుక నగు సాధింపఁ॥ క. ఆధివ్యాధులు డిగిదీ । ఱూఢారేయుం డుశమ సుఖము మరగి మహా । బోధానందమయుండై । సాధించు నిరంజనున్న చలు విశ్వాత్ముల్॥ క. ఏకాగ్రమైన మనమా । లోకింపంగలుగు లో వెలుంగు మనీషా । శ్రీకమైయాచూపెని । రాకులము నిరాశ్రయము నిరంజనమరయఁ॥ క. గగనాంతరమగు మఱిదీ । పగురువిలాసంబు చడనిపట్టది నిత్యం । బుగరిష్ఠాయతయోగము । నెగడు ఘనులు నిల్చునడనిరి భవ్యమతుల్॥ క. నియుతి సెడకడగ సర్వేం । ద్రియములు మానసమునఁ గుదియనణచి పరం । బయి

న పదంబుగనుండవి। స్వయంశక్తి సహితంబశక్యము వలుకన్॥ క. మా
యాగగనము విజ్ఞా। నాయత సూర్యరుచి జేర్చి యందతిసూక్ష్మం।
బై యున్న యమృతమర్ధము। హా యోగగరిష్ఠుడు గను ననిరి మహా
త్ముల్॥ గీ. పంచవింశతి కునికన్న పరమ తత్త్వ। మెందు లేమినదియ
గోరుచుండుదు బుధు। లక్షరుండు నిరంజనుండవ్యయుండ। మేయుడా
తత్త్వమయ తర మించుచుండు॥ క. ఆ యషడ్వింశతికుడ పారమనంతం
బు ఘన మభావ్యమునై పెం। పారిన మాయాసహితుం। డై రుచిలీ
లాకళామయత బేర్మిదగున్॥ క. మాయాశక్తి సమన్వితు। డైయా
యన సృష్టిజేయునణగించు రహిన్। వాయక జగములు పరముం।
డైయెందునుదగుల కొక్కడై యక్షుడై॥ క. అమృత పదంబాతత్త్వమ।
యము పెద్దలకది సదాశ్రయము సద్విజ్ఞా। నము దానిమూల మా
మూ। లము శ్రద్ధాయోగ నిష్కళంకం బరయన్॥ క. ఈశ్వరు డెం
దును దగులడు, శాశ్వతుడక్షరుడు ఘనుడచలుడతని పరం। బై శ్వే
న్నమైదగిఁనమ్ము। శశ్వద్బోధామృత ప్రశస్తినెలకొనున్॥ క. కారణ
ము లేదొకప్పుడు। వైరాగ్యంబునకు బుద్ధివశతమనసు సు। స్వారంబై
యెందుజనక। నారూఢిన్ బొలచునే నియది సులభమగున్॥ క. తా
నెందును దగులకని। త్యానందముతో రమించు హంసునమలవి। జ్ఞా
నము పేరిమి కన్గన। గానేరడు జుండయోగ కలితుండెప్పుడున్॥
గీ. గోచిమానినేల గూర్చుని కన్నులు। మూసియోగనియతి మౌన
యునైన। కానలేడుయోగి మానితశ్రద్ధాస। మన్వితుండుగాక మా
న్యులారా॥ క. శాశ్వతమజరమనంతం। బీశ్వర తత్త్వంబు నిక్కమెరు

—*స్వయం జ్యోతిర్విలాస ప్రకాశము.*—

గను సద్యో। గైశ్వర్య పరాయణుడును। విశ్వమయుడు తానుగాక
వేరేమిటికిన్॥ గీ. పంచవింశతి తత్త్వంబు భరితమైన। యోగమచల
మమేయమైయొప్పుచుండు। దానషడ్వింశతియగు తత్త్వంబుపూర్ణ।
భావమున్ బొరయునది మోక్షపదముజుండు॥ క. అక్షరతత్త్వముసకల

ము । ముక్తజనంబులకు మేలు మూటినణచియా, త్మక్షోభముడిగి
నెలకొను । దీక్షాపరులందానది బ్రదీపించుదగన్॥ క. జగములు సమ
స్తభూతము । లుగుచులఘుత్వాప్తి నేవెలుంగు మయములై । నెగడు
వినుండా తేజం । బగోచర ముక్తురము మహోఘునమరయున్॥ క. పరమా
ర్థ పరిజ్ఞాన । స్ఫూర్తింబగు వెలుగు సర్వభూతములందున్ । దిరమదివ్యా
ప్తమగుదున। పునితత్త్వము మోక్ష హేతుకంబై దోచున్॥ క. ఆ తేజంబ
వ్యక్తము । తీతముని ప్రాకారము పృథ్వ్యాదిమహా । భూతంబుల కా
శ్రయమును । నాతనమది బొంచుచిన్మయమనో తి శయుల్॥ క. శాశ్వ
తమగునా తేజమ । విశ్వాత్మక మెరుక గలుగు విబుధు లదియయా ।
త్మేశ్వరుగా ధ్యానింతురు । శశ్వచ్ఛ్రద్ధాగరిష్ఠ సంయమము దగన్॥
క. మాయామయు డీశ్వరుడుని। రాయామ వి శిష్టును నిరంజనుడు మ
యుం । డేయుద్యోగము సేయుడు । సేయు మరియు జిక్కడొకట జిక్కు
తెనంతన్॥ క. తానెల్ల యెడల గల్గియు। నే ననడే కాకిదగుల డెందుమ
హామా, యానిరసనతత్త్వమయుడ । దీనుడు పరమేశ్వరుండధికు డన్ని
టికిన్॥ క. తోచుతనంతన గగనము । దోచనుదన్నెరుగగల బుధు ల
నిత్యంబున్ । జూచుమరి చూడడురుమా । యాచక్రమునడుపు నణగ
డవ్యయశక్తిన్॥ క. ఎరుకగలవారి సందర । నెరుగు నెరుక తన్మయం
బయిన లో వెలుగై । యురువగు మోహతమము రూ । పర జేయున్
హంసుడనగ పరముండగున్॥ క శ్రద్ధాసమేతమునుపరి, శుద్ధంబగు
నాత్మదోచుచును మాయాసం। శుద్ధుండై దోచకదగ। బుద్ధినణగియుండు
వెలుగుభూమిష్ఠముగన్॥ గీ. జ్యోతిమైయాత్మయందు సద్యోగగరిమ। వెలు
గు సాంఖ్యదర్శనమున వేయి వత్స । రములు వెదకిన గానరాడమలు డీ
శ్వ । రుండుబుషులార లోకమయుండతండు॥ క. పరమేశ్వరునకు రూ
పము । జరామరణములు లేవు శాశ్వతుడుపరా । త్పరుడతని లీలవెల
యున్ । జరాచర సర్వజంతు జాలములు గడున్॥ క. రూప రహితుడ
య్యును బహు । రూపంబుల గానబడు నరుండిచ్చలునే । రూపంబర్థిగొ
లచునా । రూపము వాడగు పరాత్పరుడు బుషులారా॥ క. ఏవస్తువు

నీశ్వరుడని, భావించుచు మానవుండు పాసించు జగ । ద్భావనుడా వ
స్తుప్రసం । దావేశము బొందిదానయై వెలుఁగొందుర్॥ గీ. సూర్యచం
ద్రాగ్ను లతనితేజోమయములు । జగము లగ్నియు నేతత్ప్రసన్న మ
హిమ, వెలయుచుండు నెన్నండును వేదములతో దీనుమాయా విలా
సంబు లెరుగరాదు॥ స. దేవుండు గలడని తెలియుట కన్న మంత్రంబు
జపించు చందంబుమేలు । మంత్రజపముకన్న మతము పేరిమి విగ్రహా
రాధనముసేయుటరయ లెస్స । విగ్రహారాధన విశ్వాసమునకన్న సాం
సుండు గ్రీడించు నట్టిచోటు। దెలిసి యోగసమాధి వెలయు టత్యుత్తమ
మేమతంబునుదాని కీడుగాదు । యోగము సాధించి విశ్వమయుండు శ
మను । ఖాధికుండు నిరాశ్రయుఁడైన వాఁడు । భవ్యతము డమృతాత్మ
నిపరముడీశ్వ। రుండు తను జేర్చుకొనుచిల నుండునతఁడు॥ ఉ. అక్షరతత్త్వ
మీశ్వర చిదాత్మకమాతని దివ్యశక్తివృ । ద్ధిక్షయమాత్రమున త్రిజగతీ
మయభూతి జెలంగు ప్రాజ్ఞులే । డక్షరముల్ గుణించి పరమార్థమ
యం బొకడందుజేర్చి త్రి । ధాక్షమమూర్తిమంతముగ దాల్చు దురా
త్మ పదస్థితంబుగన్॥ క. ఏశక్తిజగన్మయమవి । నాశనమచ్ఛేదమవ్య
యంబదిపరమా । గాశయము దానిబేర్చెను । హాశము సుఖశీలుఁడొం
దు నక్షరపదముర్॥ మ. జగముల్ గర్భమునందు దాల్చి సుమహాచ్ఛ
క్తిన్ విజృంభించిపా । రగదీశాంతరతుల్లైన వారలకు మార్గంబై నిరాలం
బనా । త్రిగుణాతీతుడు నిత్యముక్తుడు మహాతేజోమయుండై ప్రపం । చ
గురుండై పరమేశ్వరుండు వెలయున్ జ్ఞానస్వరూపుండునై॥ గీ. నిత్యమ
వ్యయం బనిరి తత్త్వ విదులుమ । న్నాదు లీశ్వరుని మయమగుతత్త్వ ।
మదివహించ శక్తు డనరాదు పరమేష్ఠి । నైన నెరులు పెద్ద లనగనెం
త॥ క, ఏమత సంసిద్ధులయిన । ధీమహితా వాప్తిమై ప్రదీపించుచు తే।

## —*పరమేశ్వరోపాసనక్రమము.*—

జోమయునెరిగి బడయుదుర । సామాన్యా మృతపదంబు శాశ్వతలీలన్॥
క. వినుడు పరమేశ్వరోపా । సనపరులకు యోగసిద్ధి సౌలభ్యముదా ।

న ని రంజనత్వపదముఁ । గనువారలు మేలుదాని కన్నను గలదే॥ గీ. ఎల్లవారును తమ తమ యిచ్ఛలు దగి । ప్రతిదినంబును పరమేశ్వర ప్రణుతులు । జేసి శక్తికొలంది భజింపవలయు ; నట్లుజేయనివాడు గాడరయనరుడు॥ వ. ద్విపాదపశువనంబరగు॥ క. పాపంబులణగు మోగము । దీపించుఁ బంధనములు దెగుదెగు నీశ్వర సే , వాపరులకువారలెబహు । రూపముల జరింపుచుందురు పరమ పదవిఁ॥ క. విమల మతులు బుధు లీశ్వర । నమస్కరణ స్తుతార్చనముల మహానం । దమయంబు శాశ్వతమగు ప । రమపదమూర్జితముగా బొరయు చుంద్రు దగఁ॥ గీ. పరమపావనంబు భుక్తిమయంబు నా । నందపూర్ణమవ్యయమగు నీశ్వ । రప్రణుత సమార్చన ప్రస్తుతి తెరంగు । తేటపరతు వినుడు ధీరులారా॥ గీ. బుద్ధివెలయించి యింద్రియములు మనమున । గుదియనణచి పూర్వాభిముఖుండునై బు । ధుండు పద్మాసనమున గూర్చుండిదృష్టి । నిలిపి పరమాత్ముని భజింపవలయు నియతి॥ వ. అదియెట్లనిన॥ క. పరమప్రధానతత్వ । స్ఫురితంబై యోగశక్తి పూర్ణతగని య । క్షరమగు నదియే తేజము । భరితశ్రద్ధారతి నదిబాటింతు నెదఁ॥ క. మాయామయమైగగన। చ్ఛాయవిధంబున సమస్తజంతువులందుఁ బాయకదోచు వెలుగున న। పాయపదముబడయగోరి ప్రణుతింతుదగఁ॥ క. ఏయవ్యయ తత్వము నా । రాయణపరమాద్య మక్షరము' సర్వజగ ద్ధ్యేయస్కరమా తేజమ । నాయాసము నిర్మలము మహా ప్తిదలంతుఁ॥ క. విశ్వమయంబగు తేజము । శాశ్వతలీలాప్తి దాల్చి సమ్యగ్జ్ఞానా । ర్థశ్విన్నిగూఢరతుడగు । నీశ్వరు శమసుఖముగోరి నే భజియింతుఁ॥ క. ఏయుద్యమమును బొందక । చేయక పరిపూర్ణ తత్వ సిద్ధివెలయునా । రాయణు నక్షరు నవ్యయు । మాయామయు నీశ్వరుఁ

విమలు సేవింతుర్॥ క. అమల వ్యాప్తంబైన ప। రమతత్త్వము గొని బు
ధులు నిరంతర మెవ్వ। నియత గ్రీడింతురతని । నమస్కారణములు
జేసి నమ్రుడనగుదుర్॥ క. హింసయుడిగి సత్యము వి। ద్వాంసులు ప
రమాత్ముడనియు తత్త్వమనియు నే । హంస స్వరూపు నియతిమె
యిం సాధింతురతని పరమేశ్వరు గొలుతుర్॥ క. వైరాగ్య సమన్వితు
లగు । వారలకుర్ పగుదుగాక వశుద్రైఘున తే। జోరమ్యత గన్పడుమా।
యారచను సన్నిశ్వగు స్నానఘు నుతిజేతుర్॥ క. ఏయెడల జిక్కకెందు
ను । వాయకనే శాక్తైయె యపరిమిత తత్త్వ । శ్రేయఃప్రశిద్ధు డగు నా
రాయణు నర్చించెదర్ శరణ్యన మేయుర్॥ క. అనియిట్లనేకవిధముల।
సనాతను నీశ్వరుర్ బ్రశస్తి ని యతిపే। ర్మి నుతింపుచు మ్రొక్కుచు
మె । ల్లన నిశ్చల యోగ రతిజెలంగగ వలయుర్॥ వ. అని చెప్పి మరి
యు నిట్లనియె॥ క. ఆయతమతినేజెప్పిన, యీయర్థంబులు మహా మ
హిమ బెంపొందర్ । జేయగల వేదసారము । లాయుర్వృద్ధికరములు
మహాబుధులారా॥ గీ. నిర్మలుండగు విప్రుండు ధర్మపరుడు । క్షత్రి
యుండు నీయర్థముల్ బాత్రతములు । జదువవినిపింప కాదు వైశ్యప
దజాతు । లింతవట్లు తెల్లంబుగ నెరుగుదుదగ॥ వ, అనిచెప్పెనని॥

చ. ప్రణవ మయాదితత్త్వ పరిపాక మహోజ్వల దివ్య యోగ ధా
రణ విమలప్రకార బుధరంజిత సచ్చిదతీతభక్తపో
షణ నిరతాభిలాష రత సంయమ భావపరిస్ఫుటార్థకా
రణ జగదంతరస్థిత పరాయణ శాశ్వత మోక్షదాయకా॥

క. అకలంక యోగ రత రా
మకృష్ణ పరమ హంస మానితగురు భ

వ్యక్తానందమయు సమ
స్తకారణ మాత్రశాశ్వత విలాసగతీ॥

మాలిని విమలపరమయోగా వేశసచ్చిన్మయత్వా
దిమహితగురు సేవా తీర్థ భవ్యప్రసాదా
సుమహిత తరబోధా సూక్ష్మ మార్గాను కూలా
సమదదనుజ హంతా సమ్య గార్థ ప్రశాంతా॥

ఇది శ్రీమత్పరమేశ్వర లీలా విచిత్ర ప్రపంచ సేవాపాత్ర శ్రీమద్వారపు రెడ్డి
పాపినాయక పుత్ర నిఖిలబుధజనవిధేయ యప్పలనాయక
నామధేయ ప్రణీతంబైన శ్రీమదాంధ్ర మనుధర్మ
శాస్త్రంబునందు ద్వాదశాధ్యాయమ్
సంపూర్ణమ్.

క. కుమతులు మున్నీ యాధ్యా
యము కొందరు కొంత యణచిరని చెప్ప మహా
ర్థమహితుడు రామకృష్ణప
రమ హంస గురూత్తముండరయు నది విబుధుల్॥





శ్రీ ర స్తు.

శ్రీమద్వితీయరామకృష్ణ పరమ హంస గురుస్వామి నేనమః

# శ్రీమదాంధ్ర మనుధర్మశాస్త్రము.

## త్ర యో ద శా ధ్యా య ము.

శ్రీ యోగ విలీనార్ధ ము । హాయోగి జనస్తుతాన్వ యస్థిరగు రుత । త్వాయత నిరూఢతరనా । రాయణ విశ్వాది హేతురతప రమేశా॥ వ. దేవా యనవధరింపుమట్లు సావధానులైయున్న ఋషిసమా జంబులతో భృగు మహర్షీంద్రుండిట్లనియె॥ క. ప్రాయశ్చిత్తవిధులు ప ర । మాయుర్వర్ధన కరంబు లఘహరణ సుఖ । శ్రేయస్కాంతి ప్రద ములు । భూయిష్టము లవివినుండు బోధింతు తగన్॥ చ పరమపవి

### *బలవద్దానాది ప్రకారము*

త్రులుత్తములు బ్రహ్మ విదుల్ సుకర క్రియారతుల్ । భరితగుణావ లంబనులు ప్రాజ్ఞులు భవ్యకళావిశారదుల్ । గురుసములత్యుదారనయ కోవిదులైన ధరామరుల్ ప్రమో । దరస నిమగ్నచిత్తులుగ దానము లీదగు నెల్లవారలున్॥ క. అంతర్వేదికశుద్ధ । స్వాంతముతో నన్నమి డగ జనువిప్రులక । శ్రాంతంబు బహిర్వేదిక । నెంతయును తదన్య జ నుల కిడునది గరిమన్॥ క. వేదవిదులు నత్యుత్తము । లైదగు విప్రుల కు నృపుడు యజ్ఞంబుల న । త్యాదరమున మణులును ర । త్నాదులు

నొసగునది దక్షిణలుగా బేర్మిన్॥ మ. పరదారాభి రతాభి లాషియగు నప్పాపాత్ము డత్యంతలో । భరతావాప్తి గహించు నీచుదును పాపంబ న్నశంకింపకె । వ్వరి నైనంతుదిమోస పుచ్చు ఖలుడున్ వధ్యుండు దుష్టక్రియా । పరుడున్ గారతి దానముల్ గొన ఘనుల్ పాత్రుల్ మహీదేవతల్॥ క. ధనములు శక్తికి ఘ్రాలిన । యనువున బ్రాహ్మణులకీగునాదరమున నే । జనుడాతండు విశుద్ధం । బును భూతిదమున గు లోకమున సుఖముందున్॥ చ. తనయుల్ సోదరుల్ సతులు తల్లియుతండ్రిగురుండు బాంధవుల్ । మానములు కందిరోయ తను మాన్యు డితండని యెల్లవారలున్ । వినుతియొనర్ప గోరి యొక వేడుకదానము లిచ్చునెవ్వడా । తనికి ఫలంబులేదనిరి ధర్మవిదుల్ కదు డాంబికంబగున్॥ క. తను డాంబికుడని యెల్లరు । జనములు నిందింపకీర్తి సమకూరుటకై । యనుచితమగు దానము లి । చ్చునతడు గౌరవము సెడి పశుప్రాయు డగున్॥ చ. ధనమధికంబుగూరిచి సతంబును యజ్ఞము లిష్టదానముల్। జననుత పుణ్యకర్మములు సల్పని వైశ్యుని యింటజొచ్చి త । ద్ధనము గ్రహించుటొప్పు వినుత వ్రతశీలుడు యజ్ఞ దీక్షితుం । డునగు మహీసురుండు నృపుడున్ కృతపుణ్యులు వారుగావునన్॥ వ. లోభియగు క్షత్రియుని వలనను యజ్ఞారంభసమయంబున స్వతంత్రించి విప్రుండు ధనంబు గొనువాడు మరియును॥ క. బలిమిమెయి నయిన మరి దొంగిలి యైనన్ గొనుటయొప్పు కేవలముధనా । ఢుల నత్యుత్కృష్టుండై । బొలచిన శూద్రుని ధనంబు భూసుర ముఖ్యుల్॥ గీ. ఆహితాగ్ని గోశతాగ్ని వంతుండు, మఖము సహస్రగోగణములు గలిగి । యున్న వాడు సేయకుండు రేనియుబల్మి । బ్రాహ్మణుండు గొనగపాత్రతముడు॥ క. ఏనరు డర్థము గలిగియు । దానంబులు సేయడత్యు దాత్తమతమునన్ । వానినణచి తద్ధనమున్ । భూనుత యజ్ఞరతుడు గొను భూసురుడుగురున్॥ క. పరమార్థవంతుడై లో । భరతి బ్రవర్తించునీచు బలిమినణచి భూ । సురుడు ధనము గొనునేనియు । దురితంభగు గాన

సత్క్రియలు నడుప కగుఁ॥ వ. అదియెట్లనిన॥ గీ. మూఁడు రాత్రులు ను
పవాసమునగ్రహించి । నాల్గవ దినంబు నందుదయమున లేచి । దాన
మొనరింప కుండునాతని ధనంబు । నపహరించు నది భూసురుండ దను
వేచి॥ గీ. కళ్ళములయందు పొలముల కడలయందు, నిండ్లయందు నెం
దైన మహీసురుండు । చెప్పి ధాన్యంబులు గ్రహించు టొప్పు యజ్ఞ
సమయమందనిరి సద్ధర్మ శాస్త్రవిదులు॥ గీ. వత్సరత్రయంబు వాంఛా,
సమృద్ధిగా । గుడువజాలు ధనము గూర్చినట్టి, వాఁడు సోమముఖమువ
శ్యంబు నాచరిం । పంగ వలయు పరము బ్రాహ్మణుండు। క. అయినన
సత్యర్థంబు గ, లయతుండు ద్వ్యగి యైపలమగోరి మహా। వ్యయ భా
గమొాపి డగ సో । మయాగము సేయరాదమల మతులారా॥ క. స్వజ
నముల బ్రోవక క్షపరజనంబులకిచ్చుకష్టరతు దానములు। క్రజమయ్యు
నుఫలనంతములు జగన్నుతములునుగావు లోపంబుబలెఁ॥ గీ. బ్రాహ్మ
ణుని ధనంబు రాజు గ్రహింప పా, త్రుండుగాడు బల్మిదొడరి యడిగి,
కొనవలయు నృపాలకుని కాపదలుగల్గు । వేళసీయవలయు విప్రవరులు॥
క. ఏనరు దక్షిణార్థంబులు, హీనుని బల్మిమెయి నణచి యిచ్చు నధిక
ధి, ప్రానిరతి కమరాంగ, శ్రీనిధుల కతండు గడు విశిష్టుండ యగుఁ॥
గీ. యజ్ఞశీలుని సొమ్ము దేవార్థమనియు । యజ్ఞములు సేయకుండు దు
రాత్మధనము, రాక్షసస్వమనియును పరమబుధులు క ళావిశారదు లె
న్నిరి పావనముగ॥ గీ. యజ్ఞమునకు బల్మి నైన దొంగిలినైన । బ్రా
హ్మణోత్తముండు పగుల ధనము గొనుటయెరిగి నృపుడు జనదు దండిం
ప స । ర్వాధికార మతని యందగలదు॥ గీ. బ్రాహ్మణుండు పేదవడి
క్లేశించుటజూచి । యాదరించియతని కనకధనము । లొసగి మంచివృ
త్తి నొనరింపవలయు నృ । పాలకుండు దానభవ్యతగను॥ గీ. కడుపు
మండ నృత్తి కర్శితుడగు విప్రు । డదియైన సేయు నిచ్చగించు । దాన
బ్రాహ్మణము సెడుగాన సంతేలు పుట్టకుండ రాజు బ్రోచుచుండవలయు॥
గీ. అట్లు బ్రోచుచుండు నృపుండు బ్రాహ్మణు, లాచరించుధర్మ మం
దు సగము । పాలుపొరయుదాన భవ్యతె నొప్పునా । విప్రులతని యం

ద వెలయుచుండు॥ క. నీచులకు శూద్రజాతుల । యాచించి మఖంబు
చేసి యధముండగుదే। వాచాట్యాఢ్యుఁడైనగావున। యాచదురుమహీసురులక
సర్వాంబయగుఁ॥ గీ. యజ్ఞమాచరింపనడగి కూర్చినధనం । బందు లేశ
మైన నాశఁజేసి । గుడుచునట్టి బ్రాహ్మణుఁడు కాకి యైపుట్టు నపరజన్మ
మున మహాత్ములారా॥ క. అనయము దేవబ్రాహ్మణ । ధనము లను
భవించునే యధర్మ రతుఁడు ఘోర । నరకమున గృధ్రంబులు । తను
వొలిచిదినంగ వాఁడుత్తరము పడుఁ॥ క. ఆపదలత్యధికంబుగ । ప్రా
పించిన బ్రాహ్మణుండు పరువము సెడినే । రూపున నేయవి చేసియు ।
పాపంబులు బొరయఁడనిరి ప్రాజ్ఞజనంబుల్॥ క. భూసురు డాపదపాప
ము, చేసియు వాపికొననేర్చు శిష్టమతంబ । భ్యాసించి గానవింతలు,
చేసియతని గినిసి వల్కఁ జెల్లదొరులకుఁ॥ చ. అనఘుఁడు బ్రాహ్మణుం
డు ఘనుఁడాపదలం బడియున్నవాఁడు గా। వునదగ బ్రోవఁగావలయు బ్రో
వక దక్కిన నీచకర్మముల్ । వొనరుచు దాన బ్రాహ్మ్యమతి లోపము
గున్ననుచుఁ దదార్తిఁ జే । సిన నృపుఁడుత్తముండన విశిష్టుఁడనందగు న
ట్లుగా గొరుల్॥ గీ. వృత్తిఁగూర్చి తన్ను వెలయించు నరపాలు । డెట్టి
దైన నింద్యుఁ డితడటంచు । సభలఁజెప్పునట్టి యభిమాన శూన్యుండు ।
బ్రాహ్మణుండు సెడు నుభయ పదములు॥ క. తనకపకారము జేసిన
జనునరపతి కెరుగఁ జెప్ప జనదరుక మెయిఁ । గినిసి శపింపఁగ మరివా ।
ని నెదిరి శాసించునది మహీసురుఁడు దగఁ॥ క. తనమంత్రశక్తియురువై ।
జను నెల్లవిధముల నృపుని సామర్థ్యము క । న్నను గాన యెగ్గు జేసి న ।
జనునిఁ బ్రాహ్మణుఁడిపుడు శాసింపఁ దగుఁ॥ క. వెలసిన నాల్గవ వేద
ము । కలయంగా జదివి మంత్ర కలితములగు వా । క్కులను మహాస్త్రం
బులచే। బొలయింపఁగ వలయురిపుల భూసురముఖ్యుల్॥ గీ. పరమ జప
హోమములు చేసి బ్రాహ్మణుండు। బాహువీర్యత నెరపి భూపాలకుండు।
ధనము లొసగి నార్చి వైశ్య శూద్రజనములు మ । హాపదలు వాపికొను
వారలార్యులార॥ గీ. చెలఁగి యెల్లరు ధర్మంబు సేయునట్లు । బోధసే
యంగ బుట్టించె భూమిసురుల । బ్రహ్మదేవుండు పూర్వమా పరమప

ధము । నడువ లేని యాపాత్రులై పెడుదురర్థి॥ క. జగతిగలయెల్లవా

—*యజ్ఞకర్మ ప్రకారాది వివరము.*—

రల । దగఁబోధింపంగ జాలుధర్మ మయులు...। క గురులు విప్రులు
శుష్కము । లగు వాక్యములాడి పెడుదు రష్టరమ గతుల్॥ సీ. కన్య
యును యువతియును జనమాన్యతము షు , గాని వారును హీనవిద్యా
నిరతుడు । నాగ్నుడును హోమ కర్మంబు లాచరించు నట్టివారలు గార
సిరార్య జనులు॥ గీ. వారలట్లుసేయు వారలైన మహోత్రగ । నరకమం
దు గూలుదురు ఫలంబు , గోరిసేయుచను లపారదుఃఖాస్పద । ముల
గు తగని వారిత్రమోలనిట్లు॥ క. విమల ప్రాజాపత్యము, ఖము దానము లీ
యకయు తగదు సేయగన । శ్రేమొసంగి వాపికోను దా । నములీయ
క నదియొనర్చ నరుడయ్యఘుముర్ణ॥ క. నియతేంద్రియుండు భక్ష్యం
డయుమహీతాత్ముండు తీర్థయాత్రాభిరతా । ప్తి యుతుండైనను ఘన
మఖ । ము నొనర్పంగాదు దానములు సేయకొగక॥ వ. అల్పదక్షిణ
లొసంగి యాగంబులు సేయంగాదు. మరియును॥ క. శ్రీయును
పుత్రులు కీర్తియు । నాయువు తేజోబలములు ననిశము జెను బెం । పే
యది దక్షిణ లల్పము । గా యొనరించిన మహామఖము నిష్ఫలమై॥
క. హోమంబు లుభయ సంధ్యల । భూమిసురుడు సేయకొక్క పోక
దిరుగువా । డైమాసమొకటి నిర్మల । తామతి చాంద్రాయణ వ్రతి
ము సేయ దగుణ॥ క. వేదము లెరుగని విప్రుడు । కాదు సదాయ
గ్ని హోత్ర కర్మంబులు బెం । పేది యొనరింప దివురుట । పాద
జునకు సరియతండు పండితు లారా॥ క. వేదంబులు చదువని శూద్రా
దులు హోమములు సేయు టత్యంతము పా । పోదయ కారణములగున
వి । వేదాత్మకములు మహా పవిత్రములగుటన్॥ క. తా నడుపందగు
కర్మము । లే నరుడు పరిత్యజించి హీనంబుల ని । స్థా నిచయములగు సే
తలు । బూనునొనర్పంగ వాడు భువి పతితు డగున్॥ క. కోరక చేసిన
యఘముల । పారములైనను దొలంగు ప్రాయశ్చిత్తే । దారవిధుల నో
క తెరగున , కోరిక నొనరించునవియు గూడ నయుమగున్॥ క. ప్రాయ

శ్చిత్తఘనవిధుల । వాయునరయగోరి సేయు పాపములధిక । ప్రాయ

—*ప్రాయశ్చిత్త విధులు.*—

ములయ్యును జీకటి । తోయజ మిత్రోదయమున దొలగి చనుగతిన్ ।
క. అగయన్ ప్రాయశ్చిత్తవి । ధరూపము జేసి యత్యోగ్రనియతిమై ।
నరుడోడక పాపికొనన్ । పురాకృత ఘోరపాప పుంజములైనన్॥
గీ. ఇహము నందు జేయు నిర్పాపంబుల । వలన కొందరును మిగుల
పురా కృ । త ములవలన కొందరుమహినెల్లెడనరు । లాకృతుల విపర్య
యములు బొందు॥ సీ. కల్లుద్రాగినవాడు కనకంబు ముచ్చిలువాడు గొ
గ్గులు వ్రాయి వచ్చుదంతి । ములును నఖంబులు గలిగి యెల్లరు నవ్వ
చరియించువారు దగ్గరును తీట।మూడిన చర్మంబు వాడగు గురుతల్ప
కుండు సద్బ్రాహ్మణు గోశ్రీశువు । జంపినవారలు కంపు శరీరంబు క్ష
యరోగమును బాలిశత్వమును బొ । లచిన వారలగు పిలాసంబు వి
ద్యయు । కలిమియును బలంబు గలిగియెట్టి । వార్త్తైన దూరపలుకు
వారలుతను । హృదయ భూరిసత్త్వ హీనులగును॥ గీ గట్టముపహ
రించి కుంటివాడగు గోవు । గాచి మూగియగు మహాజనముల । పలు
కు లుత్తజేసి బధిరుండగు పరాంగ । నాతి దృష్టిజేసి యంధుడగును॥
క. ఈరీతి సకలవికృత శ । రీరుల వికలాంగులన్ బరీక్షించుచు నె ।
వ్వారికి నెగ్గులు సేయకు । దారిపథమునందు నరుడు దగ నడుపంగన్॥
గీ. పూర్వజన్మమందు బుద్ధిపూర్వకముగా । నాచరించినట్టి యఘ
చయములు । వాపికొనగవలయు పరమప్రాయశ్చిత్త। విధులు నడిపిలో
కవిశ్రుతముగ॥ సీ. బ్రహ్మహత్యయు సురాపానంబు చౌర్యంబు గు
రుసతీ సంగమంబరయ ఘోర । పాపంబులుత్కృష్ట బాటించి పలికిన య
నృతంబు నృపుపంచనాభి రతియు । గురుని కప్రియముగా నెరపిన మా
టలు బ్రహ్మహత్యకుసరి బ్రహ్మవర్గ । సంబునుకూట సాక్ష్యంబు మిత్ర
వధయు వేదంబునిందించు వాదములును । కుడువరానిదాని గుడుచు
టయును మల । మూత్రములు నదులన పాత్రభంగి । విడుచుటయును
నంగవెలయు పాపములారు । మద్యమానుటకు సమానములగు॥ క. వ

రుసన్ నిక్షేపహరా । శ్వరజతగురు రత్న తామ్ర వజ్రకుసుమ భూ । శర
ములు ముచ్చిలుట భువిన్ । సరియగు బుధులార కనక చౌర్యంబున
కున్॥ గీ. మాతలెతల సోదరులను కుమార్తెలను కు । మారకుల భార్య
లను మిత్రదారలను న్న । పాలసతులను నిత్యంబు కేరి గొనుట । గురు
సతీ సంగమము నకుసరి మరియును॥ వ. గోవధయు కాని యాగంబు
లును పరస్త్రీగమనంబు నాత్మవిక్రయంబు మాతాపితా గురు శుశ్రూ
షానిరాకరణంబును బ్రహ్మ యజ్ఞ విచ్ఛిన్నంబును హోమాది పరాఙ్ము
ఖ భావంబును పుత్రునిసంస్కారరహితునిగా జేయుటయు నన్నసంస్కా
ర హీనుండై తమ్ముడు సర్వసంస్కృతి స్థాలు వడయుటయు సంకీ
ప్రక్షేపాదుల కన్యను దూషితగా జేయుటయు దూష్య వ్రతంబులను
వ్రత హీనతయు జెఱువులు తోటలు భార్యాపుత్రాదులను విక్రయిం
చుటయునియమిత కాలంబున సంస్కార పరుండు గాకుండుటయు పితృ
వ్యాదులనను కూలియీకుండుటయు కూలిగొని వేదంబులు జెప్పుటయు
విక్రయించుటయు విక్రయింపరాని తిలాదులమ్ముటయు బంగారపు గ
నులు మొదలగు వానియందధికారము వడయుటయు మహా యంత్ర
కర్తుండగుటయు హింసాపరుండగుటయు వైద్యవృత్తి నవలంబించుటయు
శస్త్రజీవనంబును వ్యభిచారంబును భార్యాదులను వేశ్యలుగా జేసి జీ
వించుటయు కట్టెలనిమిత్తము జీవించి యుండు వృక్షంబుల నరుకుట
యు దూష్యాన్నంబు గుడుచుటయు ఋణబంధనంబు వాపికొనకుండుట
యు కానిశాస్త్రంబు లభ్యసించుటయు పాడియు నాడియు బ్రదుకుట
యు ధాన్యంబులు పశువులు లోహాదులు ముచ్చిలుటయు కల్లుద్రాగు
సంగనతో రమించుటయు మద్యాదులాఘ్రాణించుటయు పురుషముఖం
బుగలవనితతో గూడుటయు మొదలగు దుష్కర్మంబులు సేయువార
లు పతితులగుంగావున సముచిత ప్రాయశ్చిత్త విధులాచరించి కొనవల
యు నది యెట్లనిన॥ గీ. పదియురెండు వర్షంబులు బ్రహ్మహత్య । చేసి
న ఖలుండరణ్యా నివాసుడగుచు । దానువధియించినట్టి యాతని కపా
ల । కర్పరము గొనిదగు భైక్షికములు గుడుచు॥ గీ. పదియు రెండు వ

ర్ణంబులు బ్రాహ్మణుండు । ద్విగుణము నృపుండు వైశ్యుండు త్రిగుణములు చ । తుర్గుణంబులు పరమ శూద్రుండు బ్రహ్మ, హత్య చేసి మహాపథుల్ నడుపవలయు॥ గీ ఆహవంబున దెగినైన నగ్నిహోత్ర। సంస్కృతాహాప్తి జనినైన క్ష్మత్రియుండు । దాత్తతరథంగి నశ్వమేధం చేసి । నైన నొగి బ్రహ్మ హత్య దానగాప గలుగు॥ వ. అశ్వమేధంబు చేసినైన స్వర్జితములగు గోగణంబులు చేచ్చి గోయాగంబుచేసియైన నభిజిద్విశ్వజిదాదులు నడిపి నైన నియతేంద్రియాహారుండై వేదంబుజపించుచు నూరుయోజనంబులు నడిచినైన వైశ్యుండు బ్రహ్మహత్య దోషంబు వాపికొనుచు డు వెండియు॥ గీ- బ్రాహ్మణుండు జాతిమాత్రుడై బరగు బ్రా । హ్మణుని వధముచేస తనస్వధనము లుత్త। ముండు వేదార్థ వేదియు పండితుడగు । బ్రాహ్మణుని కొసగి వాయు నఘాతకంబు॥ వ. జాతిమాత్రబ్రాహ్మణ వధము చేసిన బ్రాహ్మణుండు హవిరన్నంబు గుడుచుచు వేదమంత్రంబులు జపించుచు వశీకృత సర్వేంద్రియుండై ప్రవాహాను గమనంబుగా సరస్వతీనది నడుపవలయు నని కొందర మతంబు॥ గీ. పదియు రెండు వర్షంబులు బ్రాహ్మణుండు । వనమునవశించి పిదప భవ్యగతిలూర । కుంతల శ్మశ్రుఁన ఖరుడై గోష్ఠమునందు । నైన శిరుమూల మందైన నగుచసి షి॥ క. అణువును జెదరక గో । బ్రాహ్మణు లకు నాపదలు గలుగనప్పుడు తద్ర । క్షణ మాచరింప నేగి మ । రణముఁ బొందిన నరుడు దొరగు పాపములన్॥ గీ. బ్రాహ్మణుల కెల్ల ధనములు పంచిపెట్టి । బ్రాహ్మణ సహస్రముల్ల భక్తిగొలచి బ్రహ్మవిజ్ఞాన రతిమేనవాయగల్గి బ్రహ్మహత్య దోషము వాయు పండితుండు॥ క. ఈ తెరవున సువ్రత ని ష్ఠాతిశయతపదియు రెండు నబ్దంబులు వి । ఖ్యాతిమెయిన్ గడపి మహా । పాతకములు వాయుద్విజుడు పండితులారా॥ గీ అవబృథస్నాన మొనరించు టశ్వమేధ । మాచరించుట పుణ్యాత్ములైనవార, లిచ్చలు సమాగతులు గారపించుట నర, పాలకుడు బ్రహ్మ హత్యపాపంబు వాయు॥ గీ. ధర్మమునకు హేతువు లత్యుదాత్త మహిమ । గలుగు వారలు విప్రులు

గాన వార । లాశ్రిదనుగొల్చుచుండు నరాధమ్ఁడు బ్రహ్మహత్య దోషంబును బాయఁ డరుదె॥ క. వేదవిదులు నుత్తములగు । భూదేవులు సర్వలోకముల పూజ్యులనం । గాదగు వారలగొల్చు న్బ । పాదులు పాపములు వాయు ననుటరుదగునే॥ గీ. సేయుడివి యెల్ల వారును సేయకుడివి । యనుచు శాసింపుచుండు మహామహుండు, బ్రాహ్మణుండెట్లు జేసియు పాపభయము । బొరయఁడసిరి కౌండిన్య ఘనుల్ పూర్వ ఋషులు॥ ఎల్ల వారలకును విధు లెరుగ జెప్పి, బ్రాహ్మణుని యుత్తమ బ్రాహ్మణుండు । బ్రహ్మహత్యాది సకల పాపములు దొంగు । నిమిషమాత్రంబు చనక ననిరి విబుధులు॥ క. పాయకగర్భస్థుతయా । త్రేయ వధయు బ్రాహ్మణుని వధించుట కధక । ప్రాయములు బ్రహ్మహత్యకు । జేయునదియు విధులు వాని సేయగ నలయుక్॥ క. ప్రతికూలము లాడికురు ని, మతి వొప్పించుటయు సమాలి యొరునితో । వితధములు సెప్పిపుచ్చుట । యుతెగిన బ్రహ్మఘ్న దోష మొదవుక్ దారక్ ॥ గీ. స్త్రీసుహృద్వధయును నిక్షేపధనము । ద్రుచ్చిలుటయు మహాజనంబుల మనములు । నొవ్వబల్కుటయును గానను చితిములవి, బ్రహ్మహత్య దోషమునకు సంభవ్యులౌర॥ గీ. బ్రాహ్మణుడు కల్లుద్రావిన పాతకంబు । వాయు సత్యుజ్వలతరాగ్ని సన్నిభమైన । కల్లు ద్రావిశరీరంబు గ్రాగుదాన । గాని నదియు విశుద్ధంబు భూనుతంబు॥ గీ. మణిణ పర్యంతిమును గోమయరసమైన । నేయియైన పాలైనను నీళులయిన । హీనతనమగు గోమూత్రమైన ద్రావి । బాయవచ్చు సురాపాన పాతకంబు॥ గీ జటియుధ్వజియును వాలవాసప్రకృతియు । నైకణాన్నములైన పిణ్యాకమైన । రాత్రినొకసారి దినుచు వర్షంబాకండు । గడుపకల్లు ద్రావిన పాపమడగు నిజము॥ గీ. అన్నములలోన మలముగా నెన్నగబడు।కల్లు పాతకములకది కారణంబు।గాన నెల్లరుమలమనికల్లు రోయు, వలయు నంటిన పాపముల్ పులిమిబుచ్చు॥ గీ. గౌడియనమాధ్వయన పౌష్టికంబనంగ । కల్లుమూడు తెరంగులు కడము వెలయు । వానిలోనెద్ది యేనియు నానినను స । మానపాతక మయ

గుణ్య మంతులార॥ క. మద్యంబులు రుచిచూచిన । హృద్యంబులు గాగ
దోచు హేయములయ్యె । సద్యస్సారము లగుటన । విద్యోదయ
కారణముల వియదుగ వలయు॥ గీ॥ యక్షరక్షః పిశాచాన్న మరయ
మద్య । మధమమెల్ల పదార్థంబు లందుగాన । బ్రాహ్మణాదులు ద్రా
వరు పాతకములు । లీనమైదాన నుండుట మానులార॥ క. ఏవిప్రుండి
చ్ఛలుసు । ద్రాక్షావిమల బ్రాహ్మ్య మొకవెరవున సేసిన వా । డై
వాడు శూద్రుడగు మరి । లేవు వినుడు వానికెందు లింగత్వదశల్॥
వ. మద్యము సేవించినవాడు చేసికొనవలయు ప్రాయశ్చిత్తవిధులు
మున్నెరింగించితి నింక జౌర్యంబునకగు విధులు వినుండని యిట్లనియె॥
ఉ. స్తేయమొనర్చినట్టి జగతీసురు డాత్మగలంగి దీనుడై । పోయి నృపా
లుతోడ తనపోయిన పోకలు జెప్పిదండనం । బాయతబుద్ధి సేయుమను
టంచిత ధర్మపథంబు పాపముల్ । హాయుసతంబు దాన కుశలరబగు
జిత్తము పాకభూతమై॥ గీ. స్తేయమొనరించి కరము లజ్జించియొరుల ।
జెప్ప కే కాకియైపోయి గొప్పయడవి । జొచ్చిఘోరతపముచేసి శుద్ధుడ
గును । హీనురుడు పాత్రతముడై యనిరి విబుధులు॥ క. ఏవిధులు
బ్రహ్మహత్యకు । పావన కారణముల వియపారాప్తి మహీ । దేవుసుచౌ
ర్య క్రియలకు, గావుంపగవలయు దానగను శుద్ధదశల్॥ గీ. గురుసతీ
తల్ప కుండగు కుటిలబుద్ధి । తప్త లోహమయంబగు తల్పమందు । ప
వ్వళించినవాయు నప్పాతకంబు । గాయుమంతయు నొకతరి ప్రాలికమర
గీ. తప్తలోహమయంబగు తరుణివిగ్ర । హంబునాలింగనము చేసియైన
వాయు । గురుసతీగ మనంబున పరిహరించి । నట్టి దుష్కారి పాతికం బా
ర్యులార॥ వ. ఇదిమన్వాదుల మతంబింక మరికొందరు బుధులసారాభి
ప్రాయంబులు వినుండని యిట్లనియె॥ గీ. స్వయముగా వృషణములు
శిశ్నము ను గోసి । వైచిప్రాంజలియగుచు తీవ్రమగు వేగ । నాధికంబో
సినైరృతిదిశాభిముఖుడు । నైయతిశయత్వ రస్ఫూర్తి నాగకరెగి॥ గీ. భూ
రి కేశన ఖట్వాంగ ధారియును స । మాహితుండును ఖట్వాంగుడఖక
జీర్ణ । వాసుడువిని యతాత్మండునై సలుపని । లయు ప్రజాపతి

యజ్ఞంబులాతిగాక॥ వ. ఫలమూలంబులైన హావిస్సులైన నియతంబు
గా భుజించుచు నింద్రియ వికారంబులణపికొని శుద్ధుండై మూడుమా
సంబు లడవియందు చాంద్రాయణ వ్రతంబు నడుపవలయు ననియు
పెద్దలుజెప్పి రివ్విధులన్నియు గురుసతీ గమనదోషంబు నివారించుకొను
సాధనంబు లిల్లు బ్రహ్మహత్యస్తేయ సురాపాన గుర్వంగనా గమన
దోషంబులు శాంతిజేసి కొనువిధులు జెప్పితినింక సమస్త పాపంబులు
ను నాపికొను ప్రాయశ్చిత్త విశేషంబు లెరింగింతు వినుండని యిట్లని
యె॥ చ. అమలిన గోవ్రజం పిన దురాత్ముడు గోష్ఠమునందుకొక్క మా।

—గోహత్యాతి పాపనివారణ ప్రాయశ్చిత్త విశేషము లు—

సము నివసింపగా వలయు సాధువు నిర్మదమత్సరుండు సం। యమియు
నునై జెలంగక భయంబును దోపక నర్థిగోవు మూ। త్రము కడుపార
ద్రావుచు పరాయణ తాప్రవత నైష్ఠికంబునక॥ క. గోచర్మమంబరముగా
దోచును హావిరన్నములు వెనురు ధ్యానంబుక। యాచించి కొనిన
కూడును। నీచంబన కరి రెండు నెలలుగుడుచుచుక॥ క. గోరజము మే
నుగప్పం। గా రేపునుమాపు గోవుకడ నిద్రా ని। ష్ఠాగతుల నుండు
టిదియొక। సారపథము సర్వశాస్త్రసమ్మత ముర్విక॥ క. గోమూత్ర
ముగొని స్నానం। బేమరక నొనర్చుచుక మహినిష్ఠ దగం। గామాస
యుగము బుచ్చుట। క్షేమహితులు సువ్రతంబదియనిరి పేర్మిక॥ క. గో
రజముక ద్రావి నమ। స్కారంబులు జేయుచుక బగలెదురు చను
గొ, న్నొనక గోగణములకు న। పారంబగు భక్తివాయు పాపచయం
బుల్॥ సీ. గోవుశరీరంబు గోకుచు మాటికి నతులొనర్చుచు సహాయ
త్వె బుద్ధి। గోవు పరుండిన కూర్చుండుటయునది నడచిన దాకునునడ
చుటయును। బరువెత్తి పోయిన పరువిడుటయు నిచ్చలును మేయబ
చ్చికయును జలములు। ద్రావ నిచ్చుటయును దగుగోవునకు నపాయం
బైన తనశక్తి నెనదనుక। రక్షణంబు సేయు దీక్షయువలయు నె। వ్వా
రిసస్యమైన బారిగోవు। మేయు చుండజూచి పోయిచెప్పక యెసం।
గని విధంబుననుండ గలుగుటొప్పు॥ క. క్రేపు చనియావుపాలు మ।

హోపరి తుష్టిమెయిగుడువ నదిగన్గొనిదా । నాపుటయును సెప్పటయు
ను । పాపంబగు వలవదట్టిపను లెవ్వరికిన్॥ క. గోవుల పైవిశ్వాసముగా
వించుచునిట్లు మెలగగా నేర్చిన వా । డేవిధులు సేయకుండియు । గోవధ
పాపంబు వాపి కొనువాడ యగున్॥ గీ. పదునొకడు వృషభముల ని
చ్చు బాడివిడచి । బ్రాహ్మణోత్తములకు మహార్ఘంబు లొసగి, యావు
నెరుగక జంపిన యఘము వాపి, కొనునగుడు దీనులకు బ్రీతిగూర్చినత
ము॥ క. పాయక నియతిమెయిన్ చాం, ద్రాయణమునడిపి సమస్త
ధనములు భవ్య। శ్రేయస్కరులగు విప్రుల, కాయతమతి నీగుటొక్క
యనుచనిరి బుధుల్॥ గీ. రాత్రివేళ నిర్జర ప్రకరంబు సం । తోషమం
దనాల్గు త్రోవలకట । గూడుచోట కూడు కూరలు వండిపి । సర్జనం
బు సేయ జదూరును దగు॥ క. గోవధ యించుక యెరుగక । గావించి
న వారలీ ప్రకారములు సదా । పావనతాంశ సేయం । గావలయున్
సేయ రేని కడుపాపులగున్॥ క. ఎలమి ప్రతస్థులు చేత । స్ఖలనంబున
మున్నుదారు గావించిన యా । త్యల్పఘు మహాస్వవ్రతముల । ఫలము
ను తేజమును గోలుపడుదు రరయగన్॥ గీ. వ్రతము జెరచి కొనినవార
ల శుద్ధితే । జంబు వాయుదేవు శక్రుదేవ । గురుహుతాశనులను బొ
రయుగావున వ్రత । స్థులకు జాల నియతినలయుచున్వ॥ గీ. స్పృహజెలం
గకేడు గృహములదగు భిక్ష । లాచరించి లబ్ధమైన యన్న । మొక్క
పూటగుడుచు చొకరోడు త్రిషవణ । ములు నొనర్చి శుద్ధి బొరయు
వారు॥ గీ వ్రతము జెరచుకొనినవాడు గర్ధభయాగ । మాచరించి గ
ర్ధభాజినంబు । చీరగాగ నాత్మ చేష్టితములు జెప్పి । కొనుచు భైక్షిక
ములు గుడువవలయు॥ గీ. సాంతపన కృచ్ఛ్రము సదుప జనుకులంబు ।
జెరుప గల్గు కర్మంబులు సేయునెవ్వ । డాతడెలమి ప్రాజాపత్య మాత్మ
గోర । కెగ్గమెయి నేయుడేని నశించు నిజము॥ గీ సంకరాపాత్రకృ
త్యముల్ సలుపువాడు । బాయక నియతి పేర్మి చాంద్రాయణంబు । న
డుపవలయు యవాదులు గాచుచు నొక । మాసము సమస్త శాస్త్ర
సమ్మతము పేర్మి॥ గీ. బ్రాహ్మణుండు పత్సరంబులు నాలుగు । నడుప

వలయు వ్రతముకడు వినియతి । క్షత్రియుని వధింప గానగు పాపంబు। వాపికొనుట కిచ్చు నరగిమరియు॥ వ. వైశ్యుని వధించి పదునెనిమిది మాసంబులును శూద్రుని వధించి తొమ్మిది నెలలును వ్రతంబు నడపి బ్రాహ్మణుండు పాపవిముక్తుండగు॥ గీ వృషభ మొక్కటి గోవులు వే యియును మ । హాత్ములకు నీగి శుద్ధి బ్రాహ్మణుడు వొరయు । కాను మించుకయును లేక క్షత్రియుని వ । ధంచు పాపవిముక్తుడై తేజమెసగ॥ గీ వృక్షమూలనివాసుండు విమలమతియు । జటియునై బ్రాహ్మణుం డిచ్ఛజనకమూడు । వత్సరంబులు నడుపగా వలయు వ్రతము । లోపి బ్రాహ్మణవధనైన పాపముగ॥ గీ. వైశ్యునేయిచ్చయును లేక వధము జేసినూరుగోవులు శూద్రునినురుము జేసి పదియునొక్కడువృషభముల్ మొదవలన్ని । యును నొసగి బ్రాహ్మణుడుశుద్ధి గనునగంగ॥ గీ. గూ బలను ముంగిసల మరి కుర్కురముల । కాకముల గోధికముల మం డూకముల బి । డాలముల వధముచేసి గడంకశూద్ర । వధమునైన వి ధులుసేయ వలయుద్విజుడు॥ గీ. మూడుదినములుజపసిష్ఠ మొనస్వినైన, క్షీరమును ద్రాపియైన నపారయోజ । నంబులు నడచియైన జలంబు లాడి । యైనత త్ప్రకములు వాయంగవలయు॥ వ. పా యువధించి తీక్ష్ణా గ్ర లోహదండంబును నపుంసకుని జంపి లాలభారసీస మాషకంబును సూకరంబు హతంబుచేసి ఘృతభాండంబును తి త్తిరిందెగటార్చి జతురా షక ప్రమాణతిలలును జిలుకనణంచి రెండుసంవత్సరంబులు వయసుగల దూడను క్రౌంచంబు ద్రుంచి మూడేండ్ల పడ్డను హంసలను బలాకం బులను బకంబులను మయూరంబులను కోతులను డేగలను భాసంబు లనుసమయించి గోవును గుఱ్ఱంబును గూల్చి వస్త్రంబును యేనుగును గ్గాడినల్లనివర్ణంబుగల యైనుకోడెలును గొఱ్ఱెయును మేకను జాక్కాడి యొక్క గిత్తయును గాడిద బీచమణచి యారుమాంసంబులు వయసు గల్గకేపును దానంబు సేయవలయు॥ గీ. అమరుక్రవ్యాదములగు మృగ ములజంపి । పాలధిక మిచ్చు గోవును పొషవత్స । మైన యాపుమాం సాదులర్థిదినని । మెకముల వధియించి యీనగు నకుటిలమతి॥ గీ॥ కన

కకృష్ణలమీనగు గినిసి యొంటె । సమదము చేసి యంగనజంపి చర్మ ।
పుట ధనుశ్ఛాగములు వర్ణములకు నాల్గు । నకు దగంగ నొసంగుట న
ఘనతరంబు॥ క. దానము లీయగ శక్తుఁడు గాని మనుష్యుండు సేయగా
దగు వ్రతముల్ । నానావిధముల తనకను । నైనను గాకున్న శుద్ధియ
లవడ నెలమిన్॥ వ. అస్థి మతంబులు వేయు ననస్థి మతంబులు వేయును
సత్వంబులు జంపినవాడు శూద్రుని వధించి శుద్ధి బొరయ జేసికొను
విధులు గావింపవలయు నస్థి మతం బొక్కటి జంపి యొక్క పణంబు
దానంబు సేయుటయు ననస్థిమతంబు వధించి ప్రాణాయామంబు సేయు
టయు నవశ్యంబు॥ క. ఫలదానములగు వృక్షం । బులు గుల్మలతా స
మూహములు నిత్యము బెం । పెలమి నరికి జంపిన వా । డలఘుని యు
తి జపముసేయ నగు మంత్రంబుల్॥ వ. నూరుమార్లు జపించుట ము
ఖ్యము॥ గీ. పెలయునన్నాదులును రసంబులును పండ్లు । పుష్పములు
నొసగు తరువుల పొదల లతల । నరికి చంపినవాడు బొసగ సేయు ।
దగు ఘృతప్రాశనము విశోధనము దివుట॥ వ. ఇది కొందర మతంబు॥
క. ఎలమిమెయి కర్షసక్రియ । మొలచిన యోషధులు విపినములబుట్టి
నము । జ్వాలములగు నవియును వృథా । బొలియించిన దుష్టుడు నడు
పునది వ్రతంబుల్॥ వ. పాలుద్రావి గోవువెంట నొక్కదినం బరిగనల
యునని కొందఱ మతంబు హింసారతినగు పాపవిముక్తి కొఱకు సేయ
నగు విధులిట్లు సెప్పం బడియె నింక నభక్ష్యంబు లెఱింగియైన యెఱుం
గకైనదిని చేసికొననగు ప్రాయశ్చిత్త విధులు వినుండని యిట్లనియె॥

## —*అభక్ష్యభక్షణ ప్రాయశ్చిత్తవిధులు.*—

గీ. హృద్యమనుచు నెరుంగక మద్యమాని। పరమ సంస్కారములశుద్ధి
బొరయు నరుడు, బుద్ధి పూర్వకముగ ద్రావి బొలచునేస । బాయదె
న్ని విధులను తత్పాతకంబు॥ క. అతిభంగి మద్యభాండ । స్థితజలములు
ద్రావునెవడు దెలియక నతడిం । పుతగంగ శంఖపుష్ప । శ్రిత జలము
లు ద్రావునది నిశీపంచకముగా॥ గీ. కల్లుసంటిన నిచ్చిన గైకొనిన మ
హీసురుడు మూడు దినములుల్లాసము సెడి । దర్భసంభృతి జలములు

ద్రావవలయు । జపము సేయుచు నిర్జన స్థలము నిలచి॥ వ. శూద్రుని
యెంగిలి జలంబు లెఱుంగక ద్రావిన బ్రాహ్మణుని కిష్వ్రధియ యవ
శ్యంబు॥ క. సోమమఖంబును ప్రాణా । యామంబులు సేయుచున్
దినత్రయము విశి । ష్టామృతము ద్రావలయు వృ । థా మద్యముద్రా
విగొనిన ధాత్రీసురుడున్॥ క. అమరగమల మూత్ర పారి । శ్యము మ
ద్యము నంటుటయు నెసగిన ద్విజాతుల్ । క్రమముదగ పునస్సంస్కా ।
రములొనరించికొనునది పరాయణతాప్తిన్॥ గీ. వ్రతములును భైక్ష్యచ
ర్యంబువపనమేఖ । లములుదండంబును ధరించు క్రమముగాదు । సంస్కృ
తావాప్తి వెలయు నాసమయమందు । మూడుజాతులవారున మోఘనియ
తి॥ గీ. స్త్రీలుశూద్రులు నెంగిలి జేసియుడిన । యన్నములభక్షణీయంబు
లామిషంబు । దినిన బ్రాహ్మణుడోగి యేడు దినములుయవ । మిశ్రిత
జలంబు ద్రావుచు మెలగవలయు॥ గీ. అనయము నజీర్ణతరములై యెన
యురసప । దార్థములు గుడువనవిజీర్ణతములుగాక । కడుపులో నెంత
కాలంబు గడలకుండు । నశుచియగు నంతసేపు ధరామరుండు॥ గీ. ఊ
రబందుల నక్కల యుష్ట్రగర్ధ । భాదులకరటగృధ్ర పికాక్షికముల ।
మూత్రమలము లెఱుంకగ పాత్రభంగి । గుడిచి చాంద్రాయణాదులు
నడుపవలయు॥ గీ. భూమములు కవకములును నభక్ష్యమాంస, ము
లును సూనస్థమగు శాకములును గుడిచి । బ్రాహ్మణుండు చాంద్రా
యణవ్రతమును నుప । వలయు నియతియుదాల్మియు నెమిబొలచి॥
సీ. క్రవ్యాదసూకర రోష్ట్రభర కుక్కుటకాక నర్భజలపక్షిగణముల మాం
స । మాష్టిమైగుడిచిన తప్తకృచ్ఛ్రము లొప్ప బ్రహ్మచారి జెలంగి మాసి
కాన్న । ములు భుజించి దివసంబులమూడు నుపవాసమున బుచ్చుట
యు నొక్కదినము నియతి । నుదకంబు ద్రావుటయు దగు నెల్కలును మా
ర్జాలంబులును వాయసములు ముంగి । సలును గూబలు కుక్కుటములును
గుక్క । లంటికొనిన యన్నంబు మృతాన్నములును । కేశకీటాదిదూ
షితాప్రాశితాన్న । ములును దినువాడు సద్విధుల్ సలుపవలయు॥
వ. బ్రహ్మసచ్చల క్వథితజలంబులు ద్రావుటయు వానికి ముఖ్య ప్రాయ

శ్చిత్తవిధియెయుండు॥ క. తెలియక నభక్ష్యయోం, బులగు పదార్థము
లు నన్నములుగుడిచిన వా । డలఘునియతిమొయిక్కృచ్ఛ్రం । బులునడపి
విశుద్ధిబొందయు భూనుతులారా॥ వ. అభక్ష్యంబులగు నన్నాదులుగుడిచి
చేసికొనవలయు ప్రాయశ్చిత్తవిధులు జెప్పితినింక ముచ్చిలుట వలన
నయిన దోషంబులు వాపికొన నడుపవలయు విధులు తేటపరతు వినుం
డని యిట్లనియె॥ క. తగదొసఁగెడి కడు సజాతీ । యు గృహంబుల ధాన్య
జాతులన్నంబులు వే । చిగొనిన బ్రాహ్మణుడొక డే । డు గడగి కృ

—*చౌర్య కర్మ ప్రాయశ్చిత్తవిధులు.*—

చ్ఛంబులఁ నడుపఁగావలయుఁ॥ క. జలములు గృహములు క్షేత్రం ।
బులు పురుషుల నంగనలను ముచ్చిలిన ఖలుం । డలఘునియతి నడు
పంగా । వలయుఁ జాంద్రాయణం బవశ్యముపేర్మిఁ॥ గీ. అల్పసారం
బులైన ద్రవ్యంబు లొరుల । మందిరాదుల ముచ్చిలు మానవుండు ।
సాంతపన కృచ్ఛ్రము నడుప జను వినియతి । దాన శుద్ధుండగుఁ మ
హామహాసులార॥ గీ. భక్ష్యభోజ్యంబులును మూలపర్ణకుసుమ, యానశ
య్యాసనంబులు నపహరించి । పంచగవ్య విశోధన భవ్యవిధులు । నడపి
పరిశుద్ధుడగు మానవుడు ధరిత్రి॥ గీ. తరుఫలలును కాష్ఠతృణములు తం
డులాదు । లామిషంబును చర్మంబు లపహరించి, మూడు దినములు
నియతిమై కూరుకూర । లుడిగి మానవుడొక చోటనుండు టొప్పు॥
గీ. మణులు ముత్యంబులును విద్రుమములు తామ్ర, రజత కాంస్యలో
హంబులు రాలు నపహ । రించిన మనుష్యుడోపి పండ్రెండు దినము ।
లమర నుండంగ దగుతండులములు దినుచు॥ గీ. తాళ్లుగంధంబులును
నౌషధములు పక్షు, లేకశఫములు ద్విఖురంబు లేకతంబ । కోశ
ముల కీటకంబుల గోయలనగు । వస్త్రములు ముచ్చిలించినవాడు
దిరిపి॥ వ. పాలు ద్రావుచు మూడు దినంబు లుపవసింపవలయునిట్లుచౌ
ర్యంబునకగు విధులుజెప్పితి నింకమున్ను జెప్పినవైనను మరికొన్ని విధులు
తేటపరతు వినుండనియిట్లనియె॥ గీ. కొడుకుభార్యయందు కూతునందు
నుమిత్రపత్నియందునాత్మ భగినియందు। మాలదానియందు లీలనిం

ద్రియమిడ । నలయుగురునిపత్ని గలయువాడు॥ క. ఈయంగనలరమిం పగ । బోయినమనుజుండు పూర్వపుణ్యంబులు నో, గ్గొయినరికంబునం బడు । వాయకనదిగా నయుట్లు వలసెనతనికిన్॥ గీ. పగలకాంతలందు బడబాదులందు జ । లంబులను గజస్వలయగునింతి । యందు నీర్క మిడినయధముండు సాంతప । న వ్రతములు నియతినడుపవలయు॥ గీ యానములయందు శకటాదులందు సూతి । మెచ్చుగలవాడుపగల ర మించువాడు । పురుషరతిసేయువాడు నంబరముతోడ , నీటమును గంగవలయు ముమ్మాటుదివిరి॥ వ. అంటగూడని దానియందు నాత్మీయ స్త్రీయందు దుష్టవనితయందు శుక్లంబిడినవాడు పంద్రెండు వత్సరంబు లు చాంద్రాయణాది కృఛ్రంబులు నడుపవలయు॥ గీ. ఏద్విజుండు శూ ద్రునింతిరమించువా । డలఘు నియతినొరుల నంటకోపి । వత్సరత్ర

——*పతితసంసర్గజనంబులు చేసికొనవలయు విధులు.*——

యంబవశ్యంబు సన్మంత్ర । జపవిశిష్టవిధులు జరుపవలయు॥ వ ఇంక పతితులకు వారల సంసర్గంబు సేయువారలాచరించి కొనవలయు విధు లు జెప్పెదు వినుండని యిట్లనియె॥ గీ పతితునకు దానితో యిచ్చుబర గియెన్న । డాచరించును సాంగత్యమట్టివాడ । యగుచు తండాతడధిక ప్రయాసమోపి । పిదవ శుద్ధిబొందయువిధుల్ పెంపునడపి॥ గీ. పతితు డైనవాడు బరగింపవలయు వ్ర । తము సేయునది యతండుదివిరి , పతి తునంటవలుక పాపంబగుననియె । మనువులోకహితము మానితముగ॥ గీ. పతితుడైనవాడు బరగించునది సపిం । డీకరణము బయుల ప్రాకటము గ । నవమినాడు తనగురువుల పురోహిత । జ్ఞాతిబుధద్విజాఖ్య జనములె దుట॥ గీ దక్షిణాదిముఖంబుగా దనరెయుదక । పూర్ణఘటము పదం బునబోర్లగించి , తగసపిండీకరణముపూర్తింబుచేసి , వొకయ హోరా త్రమశుచియై యుండవలయు॥ గీ. వాడుపితృకర్మమొనరించు వాడగుతరి , వానితో మాటలాడగావచ్చు నెల్ల । వారలదిగడచినపిదపగోరియుంట , పలుకగాదని రార్యులు పలుపురుషులు॥ గీ. జ్యేష్ఠుడయ్యును పతితుండు జ్యేష్ఠభాగ । ములు గొనంగ వపాత్రతముండువృత్తిబరగుచుండు కనిష్ఠు

శాభాగములు స । మస్తమును గొనువాఁడు ధీమంతులార॥ గీ. పదము
చే బొగ్గంగిన భాండము గొని । వాఁడుశుద్ధ జలంబుల నాడిపిదప । తన
గృహము జేరి యధిక తత్పరత జెలఁగి । జ్ఞాతికార్యంబు లొనరింప గడఁగ
వలయు॥ క. పతితయగు నంగనయు స । మ్మతిని విధులాచరింప బరగు
నె మి త । త్పతి యాయమను బ్రవృత్తి ని । రత జేయుటయుఁ దగుఁ
పరమబుధులారా॥ క. ప్రాయశ్చిత్తవిధులు నిర । పాయస్థితి నడుప
కుండు పాపరతునితో । సేయఁజనదు సంసర్గము । పాయంబగు వాని వ
లన ప్రజలకునెల్లన్॥ గీ. అంగనల బాలురను శరణాగతుల వ । ధించి
న ఖలుండును తనకు దివిరి మేలు । సేయువానికి నపకృతిసేయు వాఁడు
సధము లనబరగువారల నంటరాదు॥ క. ప్రాయశ్చిత్తాది విధులు । సే
యునయిన వారలను విశిష్టచరిత్రుల్ । డాయఁజనదు పాపంబు న । పా
యంబును గలుగుగాన పండితులారా॥ క. వేదంబులు జదువక శూ ।
ద్రాదుల సాంగత్యము తనకనుకూలముగా । మోదించు ద్విజుఁడు నను
పం । గాదగు సద్విధులు లోక గర్హితుఁడగుటన్॥ క. అమరనిషేధము
లగు దా । నములుగొనిన విప్రుఁడా ధనములన్నియు ను । త్తములకు
నిగిజపంబు త । పము చేసి విశుద్ధిఁబొరయు బహుకాలమునన్॥ వ. కా
నిదానంబులు గొనినవాఁడు సావిత్రీత్రయము వేయిమార్లు జపించుచు
క్షీరాహారుండై గోష్ఠంబుల వసించి పరిశుద్ధుండగు వెండియు॥ గీ. పా
లుమాత్రము ద్రావుచు బ్రాహ్మణుండు । తను మతి గ్రహింప నాలనుం
దలు వసించు । చోటనివసించి యొరులతో మాటలాడ । కుండునదియు
నిరి కొందరు యోగ్యతములు॥ గీ. ఇంకనిట్టిదానంబులే నెన్నఁడుగొన ।
ననుచు శపథంబు చేసి నయంబుమెరయ । నావులకు గడ్డి నొసగి మా
న్యమతి వినతు । లాచరించునది యాబ్రాహ్మణాధముండు॥ గీ. వ్రా
త్యయాగంబు లభిచారవర్తనంబు । కానిసేతలు నిందితేచ్ఛానిరతియు ।
నాచరించిన బ్రాహ్మణుండరయ మూఁడు కృచ్ఛ్రములు నడపిపరిశుద్ధ
వృద్ధిఁబొరయు॥ క. శరణాగత సంరక్షణ । మరయక వేదములు జదువ
కడరుధరిత్రీ । సురుఁడు పరిశుద్ధుఁడగు వ । త్సరమొక్కటి యవలుదిను

చు చరియించితగన్॥ గీ ఖరతురంగోష్ట్ర ఫేరుకుర్కురబిడాల, విడ్వరా
హాదిదష్టుడై విప్రుడర్ధి । బొలచివాయు నిరోధంబు సలిపిశుద్ధి । బొరయు
ననిరి మహాత్ములు భూనుతముగ॥ గీ ఆదరమునపంక్తి కర్హూతములుగా
ని । వారితోడ కూడు నిరునంటి । భూసురాధముండు మాసంబుజపము
సే । యునది యన్నముడిగి యొక్కచోట॥ క. కామించి యుష్ట్రిఖర
యా । నామోదముజెలగి విప్రుడతిశయప్రాణా , యామములు నడు
పవలయు ని । రామయ నీరంబులన్ దిగంబరుడగుచున్॥ క. మల
మూత్రస్ఫాయాదులు । జలముల విడచిననరుండు సమ్యగ్భక్తిన్ । వల
నుజెలగి స్నానముచే । సిలాలితగోస్న సంస్పృశింపగ నలయున్॥ క. వే
దోదితకర్మముల । త్యాదరమున సేయకుండునాతడు వ్రతసి । ప్రాను
లుడిగిన ఖలుండు స । దాదుఃఖితమతియు సేయదగు భవ్యవిధుల్॥
క. హుంకారము విప్రునిపై । త్వంకారంబధికవిద్య దగునాతనిపై ,
శంకింపకగావింపజ। నుంకర్మవిశుద్ధి వారనువుగానియెడన్॥ గీ బ్రాహ్మ
ణుండెంత కర్మలోపమునునుండు । నైనదండింపగాదు నరాధిపుండు ।
కర్మలోపంబుజేసి దుర్గతులగూలు । గాన వానికి నదియశిక్షాక్రమంబు॥
గీ. బ్రాహ్మణునిజంప యత్నంబు బరగజేయు । వాడు నరకంబునంబడు
వత్సర శత , మురుకదండించి వధసేయ నుద్యమించు । వాడునుడియు
ను వేయిసంవత్సరములు॥ గీ బ్రాహ్మణుని శోణితంబెన్ని పాంశుకణ
ము । లవనిదడుపు దొలంగక నన్నివేలు । వత్సరంబులు దుర్గతి వడు
గడంగి , ప్రహరణం బొనరించిన పాపరతుడు॥ గీ. ఉత్తమ ద్విజు వధ
సేయ నుద్యమించి । కృచ్ఛ్రములు మరియు నుజ్వల కృచ్ఛ్రశతము । దం
డనముచేసి కృచ్ఛ్రశతంబులు నతి । కృచ్ఛ్రములు నడుపవలయు బిట్టే
సియుణచి॥ క. జ్ఞానాజ్ఞానవశంబుల । దానొనరించిన మహాఘుశితులు
నరుడాగిన్ । బోనణచి కొనసమర్థుం । డై నెగడున్ కృచ్ఛ్రములు
నియతినడపిభువిన్॥ వ. మూడుదినంబులు ప్రాతస్సమయంబులను
మూడు దినంబులు సాయంతన వేళలను మూడుదినంబు లయాచితంబు

—*ప్రాజాపత్యాది మహావ్రతముల తెరంగు*—

గనుగుడుచు మూడుదినంబులు నిరాహారుండై యుపవసించుచు నుం డునట్టివిధి ప్రాజాపత్యంబనియును గోమూత్రంబును గోమయంబును పాలును పెరుగును నేయియు కుశోదకంబు ననంబరగు నీయారు ర సంబు లారుదినంబులు దినంబున కొక్కటి చొప్పున ప్రాతస్సమయం బులఁ ద్రావుచు నేడవదినంబుపవశించి యుండుట సాంతపనంబనియు ను ప్రాతస్సాయంసమయంబుల నయాచితంబుగా నేకైక గ్రాసంబు గొనుచు మున్నుజెప్పిన సామాన్య కృచ్ఛ్రంబు తెరంగున నడపుట య తికృచ్ఛ్రంబనియును మూడుదినంబు లుష్ణోదకంబును మూడుదినంబు లుష్ణక్షీరంబును మూడు దినంబు లుష్ణఘృతంబును మూడుదినంబులుష్ణ వాయువు నాహరించుచు నేకవార స్నాననియతినుండుట తప్తకృచ్ఛ్రంబ నియును నియతేంద్రియుండును పరిశుద్ధుండునగుచు ద్వాదశాహంబులు నిరాహారుండై యుండుట పరాకనామక కృచ్ఛ్రంబనియును ప్రతిదినంబును సాయంప్రాతర్మధ్యాహ్న స్నానంబులు జేయుచు పౌర్ణమియందు పంచ దశగ్రాస వ్రతంబుబూని కృష్ణ ప్రతిపదాదిగా నొక్కడుచొప్పున గ్రా సంబుడుగుచు నమావాస్యయం దుపవసింపుచుశుక్ల ప్రతిపదాదిగా నొ క్కొక్కడుగ్రాసంబు వృద్ధిబొరయించుచు నియతుండై యుండుట జాం ద్రాయణంబనియు నియతాత్ముండును హవిరన్న ప్రియుండునై ప్రతి దినంబును మధ్యాహ్నసమయంబున నష్టగ్రాసంబు గొనుట యతిచాం ద్రాయణంబనియును ప్రాతస్సమయంబున నాలుగు గ్రాసంబులు సా యంతంబున నాలుగును గుడుచుచుండుట శిశు చాంద్రాయణం బని యును జెప్పంబడు మరియును॥ క. వెలయు హవిరన్న పిండం । బులు గుడుచుచు నొక్కమాసము నియతి గడుపఁ । గలిగిన పురుషుడు దు రితం । బులణచి దగ చంద్రలోకమున సుఖముండుఁ॥ క. వసురుద్రా దిత్యమహ । ర్షి సమాజము లీవ్రతములుచేసి బడసి రు । ల్ల సమా రదివ్య పదవులు, ప్రసారముగాగ తొల్లిపండితులారా॥ క. ఆయతమతి కడునియతుం । డై యెవ్వండీ వ్రతముల నలరు నతడు దీ । ర్ఘాయువ

గుపాపపుంజము। బాయునటచి వాడభవ్యపదవి సుఖించుఁ॥ గీ. విద్య
యు నహింసయును శాంతస్వాంతయును స। మార్జవంబును హోమక్రి
యలును నీతి। యును జెలంగిన మనుజుండు యోగ్యతముడు। వాడ
వారయు సద్గతులెల్ల నీడఁ బ్రాఁక॥ గీ. మూఁడు పగటివేళ మూఁడు రాతిరి
యందు। స్నానములు సవిత్రసంభృతముగ। సేయుటొక్క తెఱఁగు
సిద్ధించు దాన వి। శుద్ధి గరిమ లేదు శోచనంబు॥ గీ. బ్రహ్మచారి నేల
పవళించుచు వధూ ప్రసంగమాభిలాష జనకగురు మ। హీసురులకు
పూజలిచ్చుచు నియతేంద్రి। యుండు సముడు నగుచు నుండ వలయు॥
క. పాత్రతమను బుధమాన్య ప। విత్రంబు సమస్తపాప విదళన ఘన
చా। రిత్రంబు భవ్యమగు సా। విత్రి జపించుచు విశుద్ధివెలయఁగ వల
యుఁ॥ ఎఱుఁగదగిన పాపంబుల నిట్లు విధుల। నాగి బాలియించి యెఱు
గంగ నలవిగాని। పాతకంబులు మంత్రహోమాంతత క్రి। యాదుల జ
యింపవలయు ధరామరుండు॥ గీ. ఏల చేసితి పాపంబు లింతలనుచు।
మనుజుడను తాపదందహ్యమాన చిత్తు। డైన నక్కల్మషంబులుభూను
తముగ। వాయువాడగు ననిరి నిష్పాపమతులు॥ క. ఏ నరుడు పాతకం
బులు। తా నెఱుఁగక చేసి యెఱిగి తగునే సేయం। గా నాకింతలనుచు
ధృతి। మాని వలుకు నాతడఘ సమాజము వాయుఁ॥ క. మానిత త
పంబు జపమును। దానములు పరోపకార తాత్పర్యంబుఁ। మానస
శుద్ధియు గలిగిన। మానవులు జయింతురఘ సమాజములు గడుఁ॥
గీ. పాములోలు విడచి పాటిజెలంగు న। ట్లఘముమును దొలంగునరయ
ఘోర। పాతకముల భయము బాగ నోరులు విన। జెప్పికొనినయంత
శిష్టుఁడుబలె॥ క. పాపములొనరిచి పశ్చా। త్తాప మనస్కుఁడగు నరుని
తనువు వెలసియు। దీపించుఁ భూతాత్ముడు। పూప వ్రత శుద్ధి బార
యు పూరుషుఁడుబలెఁ॥ గీ. పాపములు చేసియేల నీపనులుజేసి, తింక
నెన్నండు నొనరింప నింతలనుచు। నిశ్చలంబగు మనసున నిశ్చయించు।
కొనిన పురుషు డత్యుత్తముడనగ బరగు॥ క. విపరీతంబులుగా కి। ట్టి
పనులు యత్నములు నరుడుడిగి పెంపుమెయిఁ। విపులాప్తి మనోవా

ళ్కా । య పరిశుచిత్వ దశ సేయునది ధర్మంబుర్ ॥ క. ఎఱుగకయున
నిచ్చలు దగి । యెఱిగి యుఱున సేయు పాపబృందంబులు బెం । పఱు
వాయనుద్యమించుట । తెర వేమిటి శాశ్వతము సుధీవరులారా॥ గీ. హీ
నమైన సేతలెంతలు సేయు నం । తలు నొనర్పవలయు తద్విముక్తి ।
గోరి శుద్ధ విధులు పూరుషుడాత్మ సం । తసము గలుగు నంత దనుక
దివిరి॥ గీ॥ దైవమానుష సుఖము లుదాత్తగౌర । వంబు పాత్రత్వమును
శుచిత్వదశ సర్వ । మర్థితపమున బడయు మహాజనుండు । పూజ్యులము
దు త్రిలోకైక పూజ్యులారా॥ గీ. బ్రాహ్మణునకు విజ్ఞానంబును పార్థివు
నకు । రక్షణంబును భవ్యవార్తాక్రమంబు । వైశ్యునకు పాదజునకు సేవ
నము తపము । లన బరగు ననిరి మున్ను మహార్యజనులు॥ చ॥ ఎనసిన
భవ్యచిత్తులు ఋషీంద్రులు మూలఫలానిలాశనుల్ । ఘనులు తపః ప్ర
భావమున గాదె సమస్త చరాచర ప్రచే । తన బహుళంబులై సతము
దాత్తత నొప్పు త్రిలోకముల్ గనుం । గొనగ సమర్థులైరి తమకుం గడు
మాన్యములై జెలంగుటర్ ॥ క. జ్ఞానము నౌషధములును మ । హాను
భవజ్ఞతయు తపమునందు బ్రసిద్ధ । శ్రీనిలయములై జెల్వగు । వాని కది
షదాశ్రయం బవశ్యమునగుటర్ ॥ ఉ. ఏయది దుస్తరంబు వినుడేయది
దుర్భరమెద్ది దుర్గమం । బేయది దుర్లభాద్యమవి యెల్లను భవ్యతప
ప్రభావ మ । త్యాయతమై జెలంగిన మహా జనుడారయబొందనోపు
నా । రాయణపాదసేవన పరాయణ తాదశసిద్ధి బొందగన్ ॥ క. ఓషివ్ర
ధాగాక మహా । పాపరతుండై సనుత తపఃపరిశుద్ధ । శ్రీ పెంపొరది ద్రో
లగు నానా । పాతకబంధనం బనఘ చిత్తుండై ॥ గీ. పాములును పక్షు
లును శలభంబులు క్రిమి । జాతులును స్థావరంబులు సర్వమును త ।
పోబలంబున సుగతికి బోవనోపు । ననిరి భవ్యతపోదృష్టి నలరుఘనులు॥
క. నరులు నిజఘోర పాప । స్ఫురణములణగించికొను తపోబలమున
నీ । శ్వర సూక్ష్మ సత్తనాదులు । బరికింపగనోపి లోకబాంధవులారా॥
క. వేదపదములైన బ్రాహ్మణు । లాదరణీయులు తపోధనాఢ్యు లొనగు
హా । వ్యాధులు గైకొని వారల । కాదరమునగూర్తు రభిమతార్థముల

మఘముల్॥ క. వేదము సృజించి యొసగె స । మాదరమున బ్రహ్మదేవు
డతిశయ మంత్రో । త్పాదముగ దాని జేకొని, కాదే ఋషులు ము
నుతపముగావించి రిలన్॥ క. ఏయదిగోరి బుధుండ । త్యాయతమతి త
పము సేయు నస్ఖలితముగా । బాయక నతడవి బొందం । గా యోగ్య
తముండగున్ జగదున్నతము దగన్॥ క. వేదములు పఠించుట య ।
జ్ఞాదులు సేయుట ప్రశాంతి యాత్మ నలవడం । గా నిపురుట బుధుడు

—*రహస్య ప్రాయశ్చిత్త విధులు.*—

గెలుచు । మేదిని బహుపాతకములమేయ స్వార్తిన్॥ క. జ్ఞానాగ్నిపే
ర్మి గాల్పం । గా నోపున్ పాపములు తగంగ బుధుడు వి । జ్ఞానధను
లార యగ్ని యు । హీనంబై కాష్ఠములు దహించు వడువునన్॥
క. ప్రాయశ్చిత్తాది విధులు । బాయక నెరింగి చితింత పాపశుయ మా ।
ర్గాయతరహస్య మాత్ర । ప్రాయశ్చిత్తవిధి ఏనుడు బలికెద దెలియన్॥
క. రేచకపూరక కుంభక । భూచక్ర విశిష్టగతులు బోలచి విమల వి ।
ద్యా చతురుడొక్క మాసం । బాచి యఘములందొలగు మహా ప్రణ
వాప్తిన్॥ గీ కల్లుద్రాగిన వాడును కౌత్సకము ప । చము నా శిష్ట
మాహాత్మ్య సారమంత్ర । ములు జపించుచు నొక మాసము నియతిని
జె । లంగి పరిశుద్ధుడగు నిష్కళంక గరిమ॥ క శివసంకల్పాదిక మం ।
త్రవిధులు దినదినము నడపి తాత్పర్యము శాం । తి నెలయు నొక మా
సంబున । పవిత్రుడగున్ కనక విభవహారుండున్॥ క. పౌరుషసూక్త
ము సంక । ల్పారాధన విధులు పదియునారు నధిక ని । ష్ఠారతిజపించి
గురుభా । ర్యారతుడును శుద్ధిబొరయుననిరి మహాత్ముల్॥ చ. అరయ
న వేత్సృజంబును మహార్ధ పరిస్ఫుట దివ్యమంత్రముల్ । వెపుగగాక
నిత్యముజపించుచు శాంతవిభూతి నొక్క వ । త్సరము జపించుపూరుషుడు
ధన్యుడగున్ బహుపాపసంఘముల్ । దొరగివిశుద్ధి స్ఫురణదోపగ సర్వ
జగన్నుతంబుగన్॥ క. మనుజుండురుచత్రయమతి । వినియతిమూడుదివస
ములువిమలాప్తిజపించి । న పరిశుద్ధుండగుగా । డనిదానములన్నములుగడ
కగొనిమరియున్॥ క. సోమారౌద్రాది గుచము । లామెయి నొక నెల

నడపి నయముగ మహాఘ । స్తోమములు వాయునవగా । హామ్మృతసం
సిద్ధినరుడ యమహితులారా॥ గీ. అరయుగ నైంద్రాదిగ స । ప్తరుచ
ములారు నెలలునుచితంబుగ జపియిం । చిరహస్యకృతాఘములన్ ।
నరుడుదొరగునియతి తనమనంబునదోపన్॥ క. చాకలమహామ్యాదిగ
మం । త్రాకలనము పేర్మి నొక్క యబ్దములోనన్ । బోకార్పగలుగు
నరుడు మ, హాకలుషములనిరి భవ్యులగువిద్వాంసుల్॥ క. భిక్షాశనుం
డు నిష్ఠా । పేక్షయునైగోవు వెంటనేగుచు నొకదే । డక్షీణవ్రతము
లు కడు, దీక్షనడపి వాయునరుడతికలుష చయముల్॥ క. వారత్రయ
మతిశయ ని । ష్ఠారతిసన్మంత్ర జపము సలుపుచు కలుష । స్ఫారభయ
ము వాపికొనున్ । పూరుషుడు వినియతిమెయి తపోధనులారా॥
గీ, త్రిదివసములు పరమత్రిషవణంబులు నియ । మమున భవ్యత నఘ
మర్షణంబు, లాచరించి వాయునఖిల పాపంబులు । పురుషు డరయ
లోక పూజ్యులారా॥ గీ అశ్వమేధంబుచేసి మహాఘతతులు । వాయు
నాతండువోలె భవ్యతమెయినఘ । మర్షంబాచరించిన మనుజుడెల్ల ।
పాపములుబాసి పరిశుద్ధి పరిఢవిల్లు॥ గీ హింససేయునైన నింద్యంబు
లగుకూడు । కూరలిచ్చుచేసి కుడుచునైన । పాతకంబు లేదు
బ్రాహ్మణునందు ఋ । గ్వేదదీక్షునతడు దివ్యుగునేని॥ గీ. ఋగ్యజు
స్సామ వేదముల్ యోగ్యభంగి । నభ్యసించుచు వాగ్త్రయంబు నియ
తి । బరగి యిచ్చజెలంగని బ్రాహ్మణుండు । సర్వపాతకములు వాయు
సాధులార॥ గీ. మరియును మహాహ్రదంబున మంటిగడ్డ । బడివిశీర్ణంబు
నై రూపుసెడిన భంగి । సర్వపాతక సంఘముల్ సమయు వేద । మం
దసిరి తొంటిఋషులు మహాత్ములార॥ గీ. ఋగ్యజుస్సామములనంగ నెన
యుమూడు । వేదములు జదిసియర్థంబు విప్పిసెప్పు । గలుగునే నరుడా
తండ ఘనుడ వేద । మూర్తినిష్కల్మష వ్రతముఖ్యతముడు॥ గీ. మొద
లనే యక్షరంబులు మూడుమూడు । వేదములకు మూలంబుగా విధి
సృజించె । నవియెరుంగ గలిగిన మహాశయుండు । వేదవిదుడన బరగు
జగద్విశ్రుతముగ॥ వ. అని చెప్పెనని॥

చ. అయమహితాత్మ సంభృతమహా స్తవనీయ బహుప్రధాన చి
న్మయపరతత్వ సంగత నిరంజన సర్వజగత్ప్రదీప భూ
తి యుతవిజృంభణా సకల దేవగణార్చిత పాదపంకజ
ద్వయ నిఖిలేంద్రియార్ధ రతనంచిత మార్గనిరంకుశ వ్రతా.

క. నారాయణ సర్వమయ శ
రీర శరీరార్ధ మతసమృద్ధ పరత్వా
న్వారాయత నిఖిలబుధ స
మారాధన కౌతుకాన్వయ ప్రకటనిధీ.

మాలిని. ప్రకటవిదిత వేదార్ధ ప్రశిష్టాభి వాదా
సకల రతవినోదాంచత్కటాక్షా పాదా
వికచహృదయ పద్మావేశ నిర్ద్వంద్వ సద్మా
యకలుషిత మతస్థా మోదాత్మ తత్వ ప్రసాదా.

గద్య.

ఇది శ్రీమత్పరమేశ్వర లీలా విచిత్ర ప్రపంచ సేవాపాత్ర శ్రీమద్భాగపురెడ్డి
పాపినాయక పుత్ర నిఖిలబుధజనవిధేయ యప్పలనాయక
నామధేయ ప్రణీతంబైన శ్రీమదాంధ్ర మనుధర్మ
శాస్త్రంబునందు త్రయోదశాధ్యాయమ్

సంపూర్ణమ్.





శ్రీ ర స్తు.

శ్రీమదద్వితీయ రామకృష్ణ పరమహంస గురుస్వామినే నమః

# శ్రీమదాంధ్ర మనుధర్మశాస్త్రము.

## చతుర్థాధ్యాయము.

శ్రీ గురుచరణాంబుజ సే। వాగౌరవనీయ విబుధ వక్త్రవిశి
ష్ట। వ్యాగాయతరత నిత్యవి। రాగజనిత తత్త్వమయ పరమ పరమేశా,
వ. దేవా యవధరింపుము ట్లు సావధానులై యున్న ఋషిసమాజంబులు
భృగుమహర్షీంద్రుని తో నిట్లనిరి॥ క. చాతుర్వర్ణ్యములకు విప, రీతం

—*జీవాత్మ ప్రకారము*—.

బులుగాక వెలయు కృత్యవిశేషులు భవ్యాతతమతి జెప్పితివ మ। హా
తాపసవర్య యవి ఘనములై దోచె॥ గీ. కర్మఫలనివృత్తి బేర్మిమై వి
నుపింపు। మింకననిన మనుమునీశ్వరుండు। వారలాత్మలం దపార సంతో
షమిం। పెనయబొంద నెలమి నిట్టులనియె॥ క. వెలయ మనోవాక్కా
యం। బులనగు కర్మముల సౌఖ్యమును దుఃఖమునా, గలఫలములు
రెండును మను। జులకగు త్రివిధంబులై యశోనిధులారా॥ త్రివిధములగు
కర్మముల క। ను వగ నధిష్ఠానమునై వినుతభంగి మనం। బు వెల
యు దశలక్షణమౌ। త్రవిధవృత్తిగాక కర్మగత సిద్ధమునై॥

గీ. పరధనాహరణధ్యాన పాటవంబు । పాపచింతయు నాస్తిక్యభావము
నను । మూఁడు మానసరతకర్మములుగ దెలియ । బలికిరి పురాతన
పురుషుల్ ప్రాజ్ఞులార॥ క. అనయగ వాఙ్మయంబులు, పారుష్యా
సత్యములును పైశున్యము నె । వ్వారలు నొల్లనిమాటలు । దానము
గాఁగ చతుర్విధములై యొప్పున్॥ క. త్యాగంబు లేమిహింసయు ।
రాగంబత్యధికముగ పరస్త్రీజన సం । యోగము సేయుటయును
మూ । ఁడాగమవిదులార కాయికార్థంబులిలన్॥ గీ. వాఙ్మనఃకాయికం
బులై వరలు కర్మ । ముల శుభాశుభఫలములు బొరయునరుఁడు । వాఙ్మ
నఃకాయముల నార్జవంబునునది । లేమియును నివ్విధంబచలించుటయు
ను॥ గీ. వాఙ్మనఃకాయదండముల్ వరలునెవని । బుద్ధియందునతండు
ప్రబుద్ధులైన । భవ్యతములుత్రిదండినా బరగుననిరి, పరమసమ్యఙ్మ
హాతపోనిరతులార॥ గీ. ఈత్రిదండంబులనుడిగి పాత్రగరిమ । కామము
ను క్రోధమును రెంటు గలయబుచ్చి । సర్వభూతహితుండనై జనినపు
రుషు, డమృతపదసిద్ధిబొరయు మహాత్ములార॥ గీ. ఏనరుండాత్మసతము
వృథానెడపక । తగనడుపునులతండు క్షేత్రజ్ఞుడనియు । నేజనుడు
కర్మములుసేయ నిచ్చనతడు । పరమభూతాత్ముడనియు జెప్పబడుశ్రు
తుల॥ క. జీవుండయంతరాత్ముడు । దేహమనుష్యాది సర్వదేహాతతు
లదా, నావేళ మొంది బొరయుస, దావిధి సుఖదుఃఖములు మతంబు
ధ్రువముగన్॥ క. జీవుడక్షేత్రజ్ఞుడు భూ, తావలివెలుగొందునంటి
యుంటకసదన । ద్భావాతీత మచింత్యము । పావనమూతని విలాస
భాసంబరయన్॥ క. అభిమానియగుడునాతడు, శుభాశుభఫలములం
దు సుడియువెలియగున్ । ప్రభవించువెలయునగక, త్రిభువలములు
నిచ్చజేసి ద్రిమ్మరువరుసన్॥ గీ. కర్మబాధనమున గలగిననాతండు ।
బొరయు పెక్కుజన్మములు నిరంజ, నత్వశిద్ధివెలయు తత్వమయతదగు ।
నంతకునుసతంబు నార్యులార ॥ గీ. యాతనంబునందు పాతకులకు
పంచ । భూతములవలన నమోఘశక్తి, తనువులగు సమున్నతముగ
జరాయుక । తత్వరహితముగ నుదాత్తములయి॥ గీ. యాతనముల

బొంది యలవడుపాపజీ । వాత్మలెల్ల నాత్మలలవడంగ , భూతపంచక మున బొరయులీనవిభాగ, ములయియిది యుపర్వమునకు దెరవు॥ గీ. ఇం ద్రియార్థములరహించు జీవాత్మయూ । తనములందు వడియు దాత్తభంగి। యధికవీర్య భూతులందైన పరమాత్మ । యందునైననాశ్రయంబుబొం దు॥ గీ. పరమసుకృతములగు పనులాచరించిన । జీవుడెందునైనజెడక పం చ । భూతకల్పితము సనాతనమగు మేను । జొచ్చి పరసుఖంబు లిచ్చ వడయు॥ క. జీవుడు పాపక్రియలగ్ । గావించి నరకమున బడి గ్రాలు పరమభూ । తావేశమగు శరీరము । తోడ విద్యాశూన్యుడై మధువు బొక్కుగతిగ్॥ క. యాతనల బొందిజీవుడు । పీత కలుషుడై తదీయ వి ధిదగనానా । చేతనముల బుట్టుచునను । వైతుని జన్మించు మనుజుడై ఋషులారా॥ క. ధర్మా ధర్మార్థములగు । కర్మంబులుజేసి సత్సుఖమును దుఃఖంబుగ్, పేర్మిబొరయుగావున స। ద్ధర్మ పరాయణతవలదె ధరవాను జునకుగ్॥ గీ. సత్వము తమంబురజమన జనినమూడు । మానసగుణంబు

—*సత్వరజస్తమో గుణత్రయప్రకారము.*—

లివియుసమస్తభూత। కోటులందు నిజంబుగా కూటమి దగి, యైనమరియ ట్లు గాకైన నలరుచుండు। క. వెలయుగ నీమూడు గుణం । బుల లో నేయది శరీరమున నధికంబై । యలరుగ్ తదీయగతులు బ । హుళమ గు ననిరాత్మ తత్వయుక్తులగు బుధుల్॥ క. అమలజ్ఞానము సత్వము , తమమజ్ఞానంబు రజము దాత్తంబుగ రా । రాగము మరియుగ్ ద్వేషం బన । నమరు గుణత్రయము తనువులందిట్లొప్పుగ్॥ క. ఏయది శాంత మునకు పా, దైయాత్మవెలుంగ జేయునది కానంద । శ్రీయాస్పదమా సత్వమ । పాయము బొరయక నరుండుపాసింప దగుగ్॥ క. ఏయది నిత్యము దుఃఖ స । మాయత్తంబై జెలంగిమనసున కధికా । పాయం బుజేయు నారజ । మాయుతగతి నుడుగుటకు ప్రయత్నింపజనుగ్॥ గీ. అప్రతర్క్యమవిజ్ఞేయ మధికమోహ । యుక్తమధమంబు నఖలేంద్రి యోపభోగ । వాంఛితంబగు నెద్దియువశ్యమూత । మంబుదొలగించి కొనునది మానవుండు॥ గీ. అయమహితులార యీగుణత్రయము వల

న । నమను నుత్తను మధ్య మాధమతరంబు । లే ఫలములగునవి యె ల్లయెరుగబలుకు । దు వినుడని యిట్లుపలసియె నా ప్రవిమలముని॥ క. మానితజితేంద్రియత్వము, జ్ఞానము సద్ధర్మపథము శౌచము వేదా । ర్థానుభవంబు తపంబన । గనగునవి పరమసాత్త్విక గుణంబులగుర॥ క. ఆరంభంబున ధైర్యమ । గౌరవమును కాని పనులు గర్వము విష యే । ద్చాపరతియు నీతిసెడుటయు । నారయ రాజసగుణంబులగు ఋషు లారా॥ గీ. అడిగికొనుట ప్రమాదంబున ధృతియును । విభిన్నవృత్తియు లోభంబు పెంపు క్రౌర్య మిార్ష్య । నాస్తిక్యమును కర్మ హేయతయు ను, తామసగుణంబు లివియత్యధమములుర్వి॥ క. కాలత్రయ మంద త్యను । కూలములై వెలయుమూడు గుణముల తెరవుల్ । మూలా ర్థంబులు సంక్షిప్తా । లోచన గరిమ దెలియనగు ఘనులారా॥ గీ, ఆర రంబున నేకర్మ మాదిదొడగె । సేయగాబూని మఱిచేసి జెందులజ్జ । మనుజుడదియు తామస గుణ మనుచు బుధులు । తేటపరచిరి మునుజ గద్విశ్రుతముగ॥ గీ. ఫలము గోరి సేయుపని నిష్ఫలంబైన । ధా చ స్తాగ దుఃఖిత మతిగాక, పురుషుడుండుటది తపోధనులార రా । జస నపథంబు మధ్యమ సుకరంబు॥ క. ఏయది యెఱింగి సేయున । పాయం బుఖలేక సిగ్గుబరగక సంతో । షాయతముగ నాపని చను । రై యొ ప్పుర సత్త్వగుణమయము భద్రమునై॥ క. తామస గుణలక్షణమిల । కామంబు రజోగుణప్రకారం బర్థ । స్తోమంబు సాత్త్వికగుణ మ, హా మాన్యము ధర్మసిద్ధియునిః మహాత్ముల్॥ వ. అని చెప్పి మఱియునిట్లనియె॥ సీ. దేవత్వ మబ్బు సాత్త్విక గుణాధికమున రాజసంబునను నరత్వమెనయు । తిర్యక్త్వమగు సముద్దీపిత తామసంబున నిట్లు త్రిత్వముల్ దనరుచుండు । త్రివిధగతుల నయ్యానుపులొప్ప నుత్తమమధ్యమాధమఫల మహితము । నీమూడుగుణములలో మాన్యమగునది దీపించునాతండు ధీరవ । స్థావరంబులు క్రిమికీటజాతులును ఝష, పనులు సర్పంబులును పములు పశువులు । గాదులును నీచతమము లత్యధమతామ, సీగ గ నార్యులు జెప్పిరిమునులు॥ క. తురగంబులు నేనుంగులు, వ

రాహములుఁ విశాలవదనంబులు నీ। చరతిదగు మనుష్యాదులు, న రయుగ మధ్యమపు తామసాయతమూర్తుల్॥ క. చారణులు సుపర్ణా దులు, క్రూరాత్ములు శఠులు డాంబికులు రక్షోదు। ష్టారంభమూర్తు లెల్లరు। సారంబగుభవ్యతామస గతశరీరుల్॥ క. వెలయంగ శస్త్ర వృత్తిఁ, బలిమినెసగువారు మద్యపానాసక్తుల్। తులువలు ఝల్లామ ల్లా। దులు నధమపురాజసీగతులు ఋషులారా॥ సీ. గంధర్వులును గృహ్యకగణంబును యక్షుల మరానుచరతతులప్సరసలు। నగు నుత్త మపు రాజసగతులుతాపసుల్ బ్రాహ్మణోత్తములు వైమానికులును। పృథుఋత్విజులు దైత్యుల ధమసాత్త్విక గతుల్ యజ్ఞశీలురు ఋషు లమరులాగ। మంబులు సాధ్యులు మహితపిత్రాద్యాదులు సజ్జనుల్ మధ్య మసాత్త్వికగ। తులు జతుర్ముఖుడును ధర్మమలఘు విశ్వ, సృజులు యో గులు పరమగరిష్ఠరతులు। సచ్చిదానందవేదులు సతముభవ్య। సా త్త్వికీగతులు శుద్ధమహాత్మమయులు॥ క. అమరంగ మనోవాక్కా। యు ములఁ త్రిగుణములపేర్మి నగునవ్యతరో। త్తమమధ్యమాధమాదిఫ। లము లెరిగించితివచో విలాసంబుదగఁ॥ గీ. ఇంద్రియార్థంబులందు హించిధర్మ। సేవనంబెన్నడును లేక జీవితంబు। పాపసంసార మో లంపటవృత్తవిలి। నడపుపురుషాధముడుబడు నరకశతము॥ క. నరులే పాపములొనరిచి బొరయుఁ కష్టతరములగు పుట్టువులవి సు। స్థిరమతి జెప్పెద శ్రద్ధా। భరితహృదయులగుచు వినుడు పండితులారా॥ క. న రుడు మహాపాపంబులు। బరగించి గతించివాడు బహుకోటులు వ। త్సరములు మహానరకములు। వొరసిజగతి నీచవృత్తి బుట్టుచునుండుఁ॥ క. ఖరగోష్ట్రావి శునక భీ। కరమృగఖగపుల్క సాను గండకనీచో త్కరయోనుల జన్మించుఁ। పురుషుడు బ్రహ్మఘ్నుడై న భూసుతు లారా॥ సీ. క్రిమికీటకపతంగ సముదయామేధ్య మాంసగ్రాసఖగ గసత్త్వయోను। లందుజన్మించు హైన్యతకు నోడక కల్లుద్రాగినవ లూతాసరటతి। రశ్చాదుల భయంకరత రాంబు చర పిశాచా యోనులయందు పుట్టు। బ్రాహ్మణార్థంబు ల పహరించిన దురా

తృణగుల్మలతా వితతులనాను । పాశనంబులు దంష్ట్రప్రకాశ తమము । లధిక హింసాకరంబులు నైన గృధ్ర । కేసరీవ్యాఘ్రముల బుట్టు వా సిదక్క । గురుసతిని రమియించిన కుత్సితుండు॥ క. వెలివాండ్ర కాంతనిచ్చలు । గలయునరుడు ప్రేతమగు జగతినెంతయు నిం । దలు బడినవాడు ప్రమాతులు । దొలచుపురువగును ననిరి బుధులు పేర్మిమెయిన్॥ క. తినరాని పదార్థంబులు । తినినయతడు పురువగును నతిశయత మాంసా । శనమృగజాతులబుట్టున్ । వినుడిల హింసారతుండ నేక యుగంబుల్॥ గీ. పతిత సంసర్గియగు వాడుపరునికాంత । నంటిన దురాత్ముడును బ్రాహ్మణార్థములు హ । రించిన ఖలుండు ఖలుని సేవించువాడు । బ్రహ్మరాక్షసులగు జుండు భవ్యులార॥ గీ. మణులుపవడంబులును శుద్ధమౌక్తికములు । రత్నములు నధిక లోభ పరాయణాప్తి నపహరించిన క్రూరాత్ముడధమతిముఖు । హేమకారకయోని జన్మించు నిజము॥ సీ॥ ధాన్యముల్ కాంస్యంబు మాన్య జలములు తేనెయు పాలురసములు నేయియపహ । రించిన దుర్మార్గు లెలుకలు హంసలు ప్లవములు దంశముల్ వాయసములు । నకులంబులై పుట్టు నంజూడియు వపబు తైలంబు లవణంబు దధియు ముచ్చి । లించినఖలులుజన్మించు గ్రద్దలును మద్గులు తైలపాయికంబులును చీరి। వాకములును బలాకంబులై కరంబు । వెలయు కౌశేయ కక్షౌమములను గొనిన । తిత్తిరంబులు కప్పలై రయి త్తడిబకు । చుండు నెందేనియును కృశాయుర్విభూతి ॥ వ. కార్పాసంబును గుడంబును గంధాదులును పత్రశాఖవివిధాన్నంబులును హరించినవాండ్రు క్రౌంచవాగుద చుచుందరి బర్హి శల్యకంబుల యందు జన్మించు వెండియు॥ గీ. అగ్నియు గృహోపకరణంబులమలరక్త । వాసములు ముచ్చిలించిన వారలుబక । పక్ష కీటకచకోర పక్షిజాతు । లందుబుట్టుదురుర్వి మాన్యతములార॥ పసుగైన మృగంబైన హింససేయు । వాడువృకమగు గుర్రంబువగ యు । వాడు పులియగు నెలుకగు వనితజంపి । నట్టివాడొంటె యానాపహారి॥ గీ. ఆవుజంపినవాడ జమగుపరుల సొ దార్థ

